# మధురకవితలు





రచన:

## "ఎల్లోరా"

విజయ పబ్లిషింగ్ కంపెనీ
విజయవాడ-2.

# విషయసూచిక

# తొలి పలుకు

బ్రతుకునుంచి బాహిరిల్లేది జానపదగేయం. దాని రచన కలంతో కాదు, సిరాతో కాదు, కాగితాలపై కాదు. కన్నీటితో, కవోష్ణరక్తంతో, వలపుతో, విరహంతో, నవ్వుతో, నిట్టూర్పుతో, ఆశతో, ఆవేదనతో, కవ్వింపుతో, కౌగిలింతతో, చిన్మయానందంతో గుండెలలోనే దాని రచన. అందువల్లనే అది పచ్చిగానూ వుంటుంది; వెచ్చగానూ వుంటుంది. భాషావిషయాలలో ఛాందసులైనవారికి నచ్చకపోయినా, అది అరవిచ్చిన మొగ్గలోని పచ్చితనం; సాహిత్య విషయాలలో శ్రోత్రియులైనవారు మెచ్చలేకపోయినా, అది ఉచ్ఛ్వాస నిశ్వాసాలలోని వెచ్చదనం.

లయబద్ధమైనది జీవితం. జీవితంలో పెనవేసుకొని వుండే జానపదగేయంకూడా లయబద్ధమైనదే. భాషానియమాలను అది పాటించకపోవచ్చు; వ్యాకరణ నిబంధనలను అతిక్రమించవచ్చు; కాని, లయ మాత్రం తప్పదు. అందువల్లనే సాహిత్యపు విలువలు తక్కువైన సందర్భాలలో కూడా దానిలో

సంగీత మాధుర్యం తొణికిసలాడుతుంది. అది శాస్త్రీయసంగీతం కాకపోవచ్చు; స్వరబద్ధమైనది కాకపోవచ్చు; రాగప్రస్తారానికి అనువైనది కాక పోవచ్చు. అయినా అది సంగీతమే – కోకిలసంగీతం, సెలయేటి సంగీతం, ఓరుగాలి సంగీతం, కడలి సంగీతం. సంగీతశాస్త్రం ఔనన్నా, కాదన్నా, అది మధురిమను మనకు పంచిపెడుతుంది. అందువల్లనే లాక్షణికులుకూడా జానపద సాహిత్యాన్ని "మధుర కవిత"గా గుర్తించక తప్పలేదు.

జానపద సాహిత్యంలోని మాధుర్యాన్ని వివ రించడానికి "ఎల్లోరా" చేసిన ప్రయత్న ఫలితమే "మధురకవితలు" అనే ఈగ్రంథం. ఈయన ఉద్దండ పండితుడు కాకపోవచ్చుగాని భావుకుడు, కావ్యా లంకార వ్యాకరణాది శాస్త్రాలను కూలంకషంగా మథించినవాడు కాకపోవచ్చుగాని రసజ్ఞుడు. అందువల్లనే జానపద సాహిత్యంలోని మాధు ర్యాన్ని ఈయన ఆస్వాదించగలిగాడు, ఈ గ్రంథాన్ని రచించగలిగాడు.

ఈనాటిదా, నిన్నటిదా జానపద సాహిత్యం పట్ల "ఎల్లోరా" ప్రగాఢాభిమానం ? దాదాపు

రెండు దశాబ్దాలుగా ఈయన పల్లెపదాలను సేకరిస్తున్నాడు. శ్రీ నేదునూరి గంగాధరంగారి తర్వాత హెచ్చుగా ఈ పాటలను సేకరించింది ఈయనే; డాక్టర్ బి. రామరాజుగారి తర్వాత విస్తృతంగా వాటిని గురించి పరిశోధనలు చేసిందికూడా ఈయనే కావచ్చు. ఏలపాటలు, జోలపాటలు, లాలిపాటలు, సువ్వాల పాటలు, రాటం పాటలు, కోలాటం పాటలు, పంటకాపుపాటలు, పల్లెకారి పాటలు – ఎన్నని చెప్పడం ? అన్నిరకాలపాటలను వందలాదిగా ఈయన సేకరించాడు. తాను సేకరించిన వాటిలోనుంచి కొన్నింటిని కూర్చి, తీర్చి, "జానపదగేయాలు" అనే పేరుతో ఈయన రెండు సంపుటాలను ప్రచురించాడు. కేవలం జానపదగేయాల సంకలన కర్తగానే సంతృప్తి చెందక జానపద సాహిత్యంపై వ్యాఖ్యాతగా "ఎల్లోరా" ప్రచురిస్తున్న గ్రంథ మిది.

విప్పిచూపినా, విడమర్చి చెప్పినా, జానపద గేయ సాహిత్య సౌందర్యాన్ని ఎందరు హర్షించగలరనే సందేహం నా మట్టుకు నాకు లేకపోలేదు. 'కొయ్యబొమ్మల మెచ్చుకళ్ళకు కోమలుల సౌరెక్కునా ?" అనే ప్రశ్న గురజాడ అప్పారావుగారి

తోనే పుట్టలేదు; జానపద సాహిత్యంతోనే అది పుట్టిందని అనవచ్చునేమో! ఏమైనా "ఎల్లోరా" ఈ సాహిత్య ప్రచారాన్నే తన జీవితలక్ష్యంగా పెట్టుకొన్నందున ఈయనకు ఆశతప్ప ఆశాభంగం లేదు; ప్రయత్నమేతప్ప ప్రతిఫలాపేక్షలేదు. పది, పదిహేను సంవత్సరాలుగా ఈయన కృషిని ఆసక్తితో గమనిస్తున్న నేను ఈయన దీక్షను ఆది నుంచీ హర్షిస్తున్నాను; ఇప్పుడు ఈ "తొలిపలుకు" రూపంలో ఆశీర్వదిస్తున్నాను.

—నార్ల వెంకటేశ్వరరావు

"ఆంధ్రజ్యోతి"
విజయవాడ.

# శ్రీ 'ఎల్లోరా' పరిచయం



"వికసించినపువ్వు నా జీవితం
అభ్యుదయంకోరు నా జాతకం
నాస్నేహం వికసించిన పువ్వు
నాభావం తొలకరి నవ్వు"

తన భావాలపల్లవినీ, తన ఆశయాల అనువల్లవినీ ఏకంగా మేళవించి-శృతిమీటి గీతంలా వినిపించాడు 'ఎల్లోరా'.

పాతను కాదనడు – కొత్తని పరుగులుపెట్టడు – నిన్ననీ, నేడునీ ఒకచోటేర్చి రేపటి ఉషఃకిరణాల మేలుకొలుపుల్లో తన నమ్మకాలని నిండుగా చూసి – తన ఆశయాల పల్లకీలో ఊరేగుతూ సన్నాయిగీతంతో కంఠంఎత్తి గానంచేస్తాడు.

ఈ రచయితను గురించి – భావాలను గురించి, జీవితం మీాదా – ప్రజా, ప్రపంచంమీాదా – వీరికున్న నమ్మకాన్ని గురించి చెప్పడానికి పైన పేర్కొన్న 'ఎల్లోరా' స్వీయకవితలోని పంక్తులు చాలు!!

పూర్తిపేరు గొడవర్తి భాస్కరరావు.

జానపద గేయసాహిత్య పరిశోధకుడుగా, సంకలన కర్తగా, సుప్రసిద్ధ పత్రికా రచయితగా, బహు గ్రంథకర్తగా "ఎల్లోరా" పేరుతో ఆంధ్ర ప్రజానీకానికి సుపరిచితులు. అన్ని సాహితీ విభాగాలను స్పృశించి తరించిన యువ రచయిత.

స్నేహపాత్రుడు, మోతాదుమించని హాస్యరసంకూడా మేళవిస్తూ వినేవారిని గంటలకొద్దీ ఆకట్టుకోగలిగిన సంభాషణా చతురుడు.

సనాతన కవులతోపాటు ఆధునిక, అభ్యుదయ రచయితలతో కలసిమెలసి తిరిగే సహృదయత, ఒకసారి పరిచయమైతే దాన్ని ఆత్మీయతగా పెంపొందించే నిండుహృదయం.

బాలసాహిత్యంనుంచి ప్రపంచసాహిత్యంవరకు అన్ని తరహాల రచనలనుచేసి పరిచయమైన ఉత్సాహవంతుడు– అభ్యుదయవాది.

మైలు రాళ్ళు :

1951 లో యువజన రాజకీయాలలో విరామమెరుగని నాయకత్వం. అదేసంవత్సరం ఆఖరులో మద్రాసుకు ప్రయాణం. ఒక దినపత్రికలో ప్రవేశం.

1952 లో చిన్న చిన్న పత్రికలను అజ్ఞాతంగా ఎడిట్ చేస్తూండడం.

1954 లో మద్రాసులో "ట్రిప్లికేన్ సోషియల్ అండ్ కల్చరల్ అసోసియేషన్"కు అధ్యక్షుడుగా ఎన్నిక.

ప్రసంగాలు, నాటికలు, బుర్రకథలు, గేయాలు మున్నగు వివిధసాహితీ విభాగాల రచయితగా 1951 నుంచి 1960 వరకూ ఆలిండియా రేడియోతో (మద్రాసు) సంబంధం

1958 లో తెలుగు చలనచిత్ర రంగంతో సంబంధం–పొన్నలూరి వారు నిర్మించిన "శోభ" చిత్రానికి పాటల రచన!

1959 లో మద్రాసు యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్‌లో ప్రముఖపాత్ర.

1960 జనవరిలో ఆంధ్ర ఫిలిం జర్నలిస్టుల అసోసియేషన్ కార్యవర్గ సభ్యుడుగా ఎన్నిక.

1959 డిశెంబరు నుంచి "సినీప్రభ" పత్రిక సంపాదకత్వం.

ప్రస్తుతం "ఆంధ్రజ్యోతి"లో సబ్–ఎడిటర్.

ఈ రచయితకు "నిన్న" పై నిరాశ, నిరసన లేవు. అలా గని నేటిని మరచిపోలేదు. నిన్న-నేడుల సమన్వయంతో "రేపు" ని కలగంటాడు.

తెలుగు సారస్వత క్షేత్రంలో మేలుబంతులు వికశించాలని ఆశ – అందుకై తపన-కృషి!!

## "ఎల్లోరా" ముద్రిత రచనలు

మనప్రాచీన కళలు – పుట్టుపూర్వోత్తరాలు.
జానపదగేయాలు – (ప్రథమసంపుటి)
గుడిగంటలు – (నవల)
చంద్రవదన – (నవల)
జానపదగేయాలు (ద్వితీయసంపుటి)
కదలిపోయిన రైలుబండి (కథానికలు)
పూవులు – మొగ్గలు
విచిత్ర కథలు
పాపాయి పాటలు
డాక్టర్ కోకిల
పండుగల పాటలు
సరాగాలు

—మరి యితరములు

## అచ్చులో

పరిసరాలు - ప్రభావాలు (స్వతంత్ర సాంఘిక నవల)
హృదయవీణ (భావగేయాలు)
సాహిత్య సమారాధన (సాహిత్యసంక్షిప్త పరిశీలన)
ప్రజల పాటలు
దేశిపదాలు
వెన్నెల రాత్రులు (శ్రవ్య నాటికలు)
వేసవి సెలవులు (బాలనాటికలు)
మందారాలు (బాలల నవల)
ఆంధ్రచరిత్ర-సంస్కృతీవికాసం (సంక్షిప్తవ్యాసగ్రంథం)
అరుణ కిరణాలు (అభ్యుదయ కవిత)
పండితరాయలు (బుర్రకథ)
చంద్రముఖి (నవల)
మాయచిలుక (నవల)
బాలగేయకథలు
బంతిపూలు
చిన్నారి కథలు

ఇట్లు,

—ప్రకాశకులు

# ఒ క మా ట

"తదేవరమ్యం రుచిరం నవంనవం" – అన్నట్టు కొంగొత్త రీతులను, క్రొత్త క్రొత్త రీతులను, కమ్మ కమ్మని ధ్వనిని, సరికొత్త రుచులను కూర్చుకుంటూ, నాటినుండి నేటివరకు ప్రజలనోళ్ళల్లో– ప్రజల ప్రేమాభిమానాల మధ్య వుండి దేశి సారస్వత సౌరభం ఏమాత్రం తొలగలేదు సరికదా – నేడది ప్రధానభాషాశాఖగా నిలిచింది.

అన్నివిధాలా మనిషికి అందుబాటులో వుండి పనికివచ్చే ఏకవిత అయినా ప్రజాకవితగానే గుర్తించవచ్చు. నీతిప్రబోధం కానివ్వండి, శాంతిప్రబోధం కానివ్వండి, ఆనందపూరితం కానివ్వండి–హాయినిచ్చి సేద తీర్చేది కవిత లనండి – దానినే ప్రజాకవిత్వమంటున్నాం, దానినే జానపద గేయాలంటున్నాం, పల్లెపాటలంటున్నాం, ప్రజలపాటలంటున్నాం, దేశిపదాలంటున్నాం, అన్నింటిని చేర్చి "మధురకవిత" లంటున్నాము!!

అందరికీ దగ్గరగావుండే భాషలో, దగ్గరకు ఆకర్షించుకో గలిగిన శైలిలో–ఆకట్టుకొనే చావతో కవ్వించి మురిపించే భావాలతో నిండుతనపు ఒయ్యారంతో అన్నితరహాల ప్రజానీకంచేత గౌరవింపబడి–సారస్వత రంగంలో ప్రధానస్థానం అలంకరించుకుంటూంది.

ప్రజా కవితోద్యమంలో భాగంగా రంగురంగుల పద్మాలు వందలు వేలుగా వికశిస్తాయి – వికశిస్తూనే వుంటాయి. నవ్వులు చిందిస్తూ – సరికొత్త గుబాళింపులను విరజిమ్ముతూ – నిత్య నూతనమైన కాంతులీనుతూ నవకవితా

వాటికలో సింహాసనం అధిష్టించింది — దేశి సారస్వతం నేడు !!

"మధురకవితలు" జానపద వాఙ్మయ సమీక్షాగ్రంథం. పెద్దలెందరో నా కృషికి ఇచ్చిన సలహాల, సహకారాల బలంతో – ధైర్యంచేసి – దిఙ్మాత్రంగానైనా జానపదవాఙ్మయ మందలి యింపులను, సొంపులను – రకరకాల విషయ విభాగాల క్రింద పరిచయం చేయడానికి ప్రయత్నించానని మనవి చేస్తున్నాను.

సాహిత్య రచనకు పూనుకొనడంలోవున్న సాధక బాధకాలు సహృదయులకు తెలియని విషయంకాదు. ధైర్యంచేసి కవిమిత్రుల, పండిత శ్రేయోభిలాషుల, జానపద వాఙ్మయ రక్షణోద్యమ సహచరుల – ప్రోత్సాహ ప్రోద్బలాలతో ఈ గ్రంథ రచనకు పూనుకున్నాను. ఇందులో ఎన్నోపద్యాలు స్వయంగా సేకరించినవికాక, మిత్రులు అనేక జిల్లాలనుంచి నాయందు అభిమానం వుంచి అందించినవి, మరికొన్ని పత్రికలలో పొందుపరచినవికూడా, ప్రజలకు ఒకచో అందించాలనే సదుద్దేశ్యంతోకూడా పరిచయం చేసినవి. ఇందు ఏమాత్రమైనా గొప్పతనం వున్న అది ఈ "మధురకవితలు" లో వున్న గొప్పతనానికే దక్కవలసి వుంటుందని విన్నవిస్తున్నాను.

రచనలో పొరపాట్లు దొర్లడం సహజం. అటువంటి లోటుపాట్లు ఏమైనావున్న పఠితలు, పండితులు, విమర్శకులు

మన్నించి సహృదయతతో నాకృషికి చేయూతనిస్తారని ఆశిస్తున్నాను.

నాసేకరణలలో పోయినవిపోగా - మిగిలినవాటినైనా - "విజయపబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ-2" వారు అన్నింటినీ వరుసగా ఆంధ్రపాఠకలోకానికి అందివ్వబూనుకున్నారు. వారికి నా వందనాలు.

గత పది, పదిహేనేండ్లుగా జానపద వాఙ్మయంలో నేను చేస్తున్నకృషినిచూసి, అనేకవిధాల నన్ను ప్రోత్సహించడమే కాక, ఈనాడు "మధురకవితలు" అను నా యీ జానపద వాఙ్మయ సమీక్షా గ్రంథానికి ఆశీర్వాచనంగా 'తొలిపలుకు' వ్రాసి ప్రోత్సహించిన సుప్రసిద్ధ పత్రికాసంపాదకులు, రాజ్య సభ సభ్యులు, గురుతుల్యులు అయిన శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారికి నా హృదయపూర్వక నమోవాకాలు !

ఈ "మధుర కవితలు" రచనకు నన్ను ప్రోత్సహించిన మిత్రులకూ పెద్దలకూ నా వందనాలు.

కొత్తపాటలు, కొత్తమాటలు - ఆటలు, ఆశలు, ఆశయాలు, సరికొత్త బాటలు, తెలుగు వెలుగుతోటలో సరికొత్తగ గుత్తిగ విరబూసిన పూగుత్తులు - గుత్తకొన్న ప్రజల వేదం - జానపద కవితలు - "మధురకవితలు".

కొత్తరంగు — కొత్తసువాసన — కొత్తరుచి, కొత్త భావం, కొత్తధ్వని - యివ్వకపోతే ఎలాగ ? అందుకే ఈ గ్రంథ సాక్షాత్కారం - అందాలి మీ సహకారం ! ! అందరికీ అభివందనం!!!

'61 సెప్టెంబరు
విజయవాడ

భవదీయుడు
—ఎల్లోరా

పద్ధతి సృష్టించుకొని ఆ కళ ద్వారా, ఆ విజ్ఞానంద్వారా ఆనందాన్ని అనుభవిస్తూండేవారు.

అలా ఆ జాతి, తెగలలో వారి నాగరకత, విజ్ఞానం, కళారీతులు, అభిరుచులు పెరుగుతూ ప్రచారం పొందుతూ వచ్చాయి. ఈ దశల క్రిందనే అనేక జానపద కళాఖండాలు, జానపద నృత్యాలు, జానపద కళలు ప్రచారంలోకి వచ్చాయి. ఇవే తోలుబొమ్మలు, సుద్దులు, జంగం కథలు, పంబకథలు లాంటివి. వీటితో బాటే గేయాలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ గేయాలను — స్త్రీ సాహితని, గ్రామిక సాహితని, గృహకృత్య సారస్వతమని, పౌరాణికములని, తత్వాలని, కథలని, గాథలని, శృంగారపద గేయాలని, భక్తి గేయాలని - బాలసాహితి క్రిందను, ఆటపాటల రూపంలో వుండే పాటల క్రిందను వీర రసప్రధానాలక్రిందనూ రకరకాలుగా విభాగించుకోవచ్చును.

## ఏది జానపద సాహిత్యం ?

తెలుగు నాడున తెలుగు పండితులు అనేక తరహాలలో వీటికి నామకరణం చేశారు.

ప్రజా వాఙ్మయము, పద వాఙ్మయము, అనాదృత వాఙ్మయము, తిరస్కృతాంధ్ర వాఙ్మయము, గేయ రచనలు, మధుర కవితలు, దేశి సారస్వతము అని వేరు వేరుగా నామములు పెట్టి నా నుంచి మిగిలిన మరెందరో జానపద సాహిత్య పునరుద్ధరణ కర్తలు జానపద గేయాలనే పిలవడం- ముఖ్యంగా అదే ఎక్కువ ప్రచారంలో వుండడం - ప్రచారమందడం జరుగుతూంది.

పైన పేర్కొన్న పేర్లు అన్నీ ఈ వాఙ్మయానికి సరిగా అతకవు సరికదా వ్యతిరిక్తార్థమిస్తాయేమోకూడా.

ఆంధ్రులచేత తిరస్కరించబడిన వాఙ్మయమని అర్థమిస్తోంది. ఆంధ్రుల తిరస్కృతివుంటే యిన్ని యేళ్ళుగా యింత సాహిత్యం వృద్ధిపొంది - ప్రచారమై ఎలాగుంటుంది? కనుక - కొంతమందిచేత అనాదరించబడినంతమాత్రాన అనాదరణ వాఙ్మయమనో, తిరస్కృతాంధ్ర వాఙ్మయమనో పిలుచుకోడం - ఈ వాఙ్మయ ఉద్యమానికే ప్రమాణార్థం, ఫలితం కలుగవచ్చు.

పద కవిత్వమనుమాట జానపద కవితలకే సరిపడుతుంది - ప్రజా కవిత్వమని మాత్రం ఎందుకనగూడదు? పండితులుపీకనొక్కి, ఛాందసులు ఉరిశిక్ష విధించడానికి ప్రయత్నించిన పరిస్థితులలో తమ పదాలని, పాటలని, సాహిత్యాన్ని, లేదా వాఙ్మయాన్ని నోళ్ళల్లో దాచుకొని, కాపాడుకుని, రక్షించుకొని, సంరక్షించుకొన్నది ప్రజలు—వారిచే సృష్టించబడి - వారిచే ప్రచారమంది, వారిమధ్యనే మసిలి, వారిచే తనే పోషించబడి - వారి కవితలుగానే నిలబడింది - ప్రజా కవిత్వమే - ప్రజా వాఙ్మయమే, ఈ పాటలు ప్రజలపాటలే అనుకుందాం - అనాలికూడా!

*"సార్థకమగు నొక పేరుపెట్టుటకు పూనుకొనవలయునన్నచో నా విషయము యొక్క ప్రధాన తత్వమును పరిశీలించవలయును. తత్వము లక్షణములుకూడ విస్ఫురించునట్టిదేయైనను ఒక్కొక్క లక్షణమునకన్న దానిపరిధి విస్తృత

* జానపద సాహిత్యము - చూ: పేజీ 4

మని ఎరుగుట యత్యావశ్యకము. ఒక విషయమునకున్న ముఖలక్షణమునుబట్టి దానికి నామకరణము చేయవలెనన్న నొక్కొక్క సమయమున వివాదము లేర్పడును. ఒకరొక లక్షణము నంగీకరించిన మరొకరింకొక లక్షణమునకు ప్రాధాన్య మొసంగెదరు. రెండుమూడు ముఖ్యలక్షణములు సమాన ప్రాధాన్యము కలిగినచో నప్పుడింతకన్న గొప్ప చిక్కు సంభవించును. తత్వమందా చిక్కులుండవు. కనుక వస్తుతత్వము నాధారముగా గైకొందురేని సులభముగా నా వస్తువునకును, తదితరములకును గల భేదము తెలిసిపోవును. ఆ దృష్టితో చూచిన కవిత్వమంతటిని రెండు పెద్ద భాగములుగా చేయ వచ్చును. ఒకటి:— చేతనాకృతము, రెండవది: — అచేతనాకృతము. ఈ రెండును పరస్పర భిన్నములు. ఒకటి: భావుకుడైన ఒక కళాకారుని ప్రయత్నమున దిద్ది తీర్చబడినది. రెండవది: జానపదసృష్టి. మరియు నప్రయత్నముగా నొక నోటి నుండి వెడలి తనకుతానే రూపు దిద్దుకొన్నట్టిది. ఒకటి కళాత్మక కవిత్వము, ఏకకర్తృకము. రెండవది ప్రావృట్కాల పయోద ప్రదమోదబంధు సంసిక్త మందమంద వృద్ధిగంధ బంధురము. కనుక నిట్టి తత్వమునుబట్టి నామకరణము చేయ వలయునన్నచో జానపదశబ్దమే సార్థకముగా తోచును"— అని రామరాజుగారు చేప్పొన్నారు.

నిజంగాకూడా అంతే! దేనికైనా ఒకపేరు, ఒక నియమం నిర్ణయించడం చాలా అవసరం—ఆవిధంగా ఆలోచించినా - ఏవిధంగా చూసినా -'జానపద' శబ్దమే ప్రచారమందిందె—తగియుందికూడా!

* ఇంకొక పండితుని అభిప్రాయం పరికిద్దాం— "దక్షిణభారత జానపదగీతాలు (పల్లెపాటలు) చారిత్రిక, సాంఘిక సమాచారానికి కోశాగారాలు. సాముద్రికానికి, జ్యోతిషానికి, మూలికా వైద్యానికి సంబంధించిన పాటలు ప్రత్యేక ప్రయోజనం కలవి.

దక్షిణ భారతంలో మానవజీవితంలో ఎదురయే ప్రతి ప్రముఖ సంఘటనకూ తగిన పాటలున్నవి. ఈ పాటల బాణీలు చాలమంది శాస్త్రీయ సంగీత రచయితలనుకూడా ఆకర్షించాయి. త్యాగరాజు, గోపాలకృష్ణభారతి వంటి ప్రముఖ వాగ్గేయకారులు కొన్ని పల్లె పాటల ఫణితులలో స్వయంగా కీర్తనలు రచించారు.........కొంత నాజూకు తనంగల...పాటలు చాలవరకు పున్నాగవరాళి, నాదనామ క్రియ, ఆనందభైరవి, సైంధవి, సెంజురుట్టి, కురంజి, నవరోజ్, నీలాంబరి మొదలైన రాగాలలో పాడారు. ఈ పాటలలో చాలాభాగం ఆది, రూపక, చాపు తాళాలలోవున్నవి. ఎక్కువగా త్రిశ్రగతిలో వున్నట్లు కనిపిస్తుంది.

మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ పి. సాంబమూర్తిగారి అభిప్రాయం ఇలావుంటే - ఆచార్యశిరోమణి వేదాలతిరువెంగళాచార్యులుగారుఅంటున్న మాటలు పరికిద్దాం:—

♦ "ఏదేశంలోనైనా వాఙ్మయం పాడుకోవడానికీ, ఊరికే చదువుకోవడానికీ వీలుగా ఉండడం మామూలు.

---

* చూ-తెనుగు పల్లెపాటలలో పి. సాంబమూర్తిగారి ఉపోద్ఘాతం.

♦ చూ:- "కృష్ణశ్రీ" పల్లెపదాలకు ముందుమాటలో శ్రీ వేదాల తిరువెంగళాచార్యులుగారు.

యింతమాత్రానికే గేయ వాఙ్మయమనీ, జానపద వాఙ్మయమనీ పెద్ద పేర్లుపెట్టినా, ఎన్నివిధాల మార్పులూ, చేర్పులూ చేసినా యివన్నీకూడా దాన్ని ఉపయోగించుకునేవాళ్ళను బట్టి వచ్చేవేకాని ఆ వస్తువులలోమాత్రం ఏ తేడా కన్పించదు" —

* "ప్రబంధాల్లోను, పాతపాటల్లోను గొప్ప ప్లాషెస్ ఆఫ్ బ్యూటీ వున్నాయి. కొందరు ముసలమ్మల చిరునవ్వుల్లో మల్లే రెండు సెంటిమెంట్లు పుట్టలు. ప్రబంధాలలో సెంటిమెంట్లు అసహజం, అబద్ధం. ఆప్పుడప్పుడు అసహ్యం.

ఈ పాటల్లో అందాలన్నీ సెంటిమెంట్లతో అల్లుకుని హృదయాన్ని సమీపిస్తాయి........ఈ పాటలన్నీ వినడం తటస్థించినప్పుడల్లా వాటిల్లోని రసాన్ని గురించి అసలు తెలుగు భాషా, భాషామార్దవమూ, కవిత్వ లక్షణమూ వీటిల్లోనే ఉందని గ్రహించి వాటి పునరుద్ధరణకోసం...తహ తహ పడ్డారు. ఏ కఠిన పదజాలాన్నో, కావ్యాలంకారాన్నో, అసహజ పాండిత్యాన్నో ఎరువు తెచ్చుకోక హృదయంలోంచి వచ్చే ప్రేమకీ, అందానికీ రంగులు పూయక స్వచ్ఛంగా సూటిగా పాడిన ఈ పాటలకన్న కవిత్వం ఎక్కడ వుంటుంది? ఎప్పుడూ నా నిశ్చితాభిప్రాయం ఏదంటే—సులభమైనభాషలో చెప్ప డానికి శక్తిలేనివాడే కష్టమైనభాష ఉపయోగిస్తాడని, వచనంలో చెప్పలేనివాడు పద్యం రాస్తాడు.

"ఈ పాతపాటలు తాళపత్రాలలో లేవు. వీటికోసమై ఒక ఆఫీసు తెరచి, పెద్ద జీతాలిచ్చి పండితుల్ని నియమించి

* 'ప్రజా వాఙ్మయము' గ్రంథానికి చలం రాసిన ప్రస్తావన.

ఏడాదికి నాలుగు పేజీలు ఓ పత్రికలో ముద్రించే ఏర్పాటు ఎవరూ చెయ్యలేదు. ఈ పాత భాండాగారమంతా స్త్రీహృదయంలోనే నిలిచిపోయింది... ఈ పాటలు ఒక కవిగాని, కవయిత్రిగాని ఒకనాడు రాసినవి కావు. దశాబ్దంనుంచి దశాబ్దం వరకు మామూలు అక్షరజ్ఞానంలేని స్త్రీల నోళ్ళలోపడి వాళ్ళ అనుభవాలు కొత్తపాటల్లోనూ, పదజాలంలోనూ, వాతావరణంలోనూ మార్పులు చెంది నిలిచిపోయినాయి. వీటినోసారి పోగొట్టుకుందా మళ్ళీ పిలుచుకోగలదా దేశం?

పోనీ కాలంలో నిలిచి ప్రచారంలోకి వచ్చిన ఈ గానాల్ని వాఙ్మయంలో కలిపివేసి వాటికో స్థానం కల్పిద్దామంటే ఈ పండితులు అంగీకరించరు. ఈ పాటల్లో అందం వుందని అంగీకరిస్తే, భాషనుకూడా అంగీకరించాల్సివస్తుందేమో. వీటికి గౌరవమిస్తే తమ గౌరవమెక్కడ పోతుందోననే భయంతో వీటిని స్త్రీల, పిల్లల, పామరుల పాటలని తోసేశారు...... అందువల్ల యిప్పుడు చెయ్యవలసినదేమిటంటే ఈవాఙ్మయాన్నంతా తెలుగు సారస్వతంలో కలిపి వెయ్యడం"—

భారతదేశంలో నలుమూలలా తిరిగి—జానపద సేకరణకర్తలను కలుసుకుని - వారితో చర్చించి - అనేక భాషల లోని పాటలను అనువదించి ప్రచురించడం జరిగింది— దేవేంద్ర సత్యార్థివంటి ప్రముఖులద్వారా.

ఆంధ్ర విశారద—ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు— అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రధానాచార్యులూనగు శ్రీ తాపీ

ధర్మారావుగారు 'జానపదగేయాలు' పై యిచ్చిన అభిప్రాయమును యిక్కడ పొందుపరుస్తున్నాను:

*"సిసలైన జాతిజీవనం చూడాలంటేపల్లెలకే పోవాలి. పట్టణాలతో వుండే సంపర్కదోషాలు అక్కడ అంతగా ఉండవు. ఆచారాలూ వ్యవహారాలూ కల్తీలేకుండా-అంటే-చాలావరకూ సుమండీ-వుంటాయి. కల్లాకపటం లేని బ్రతుకులతో పరస్పరం సాయంచేసుకునే బుద్ధులతో అన్నా, మామా, వదినా, అత్తా అన్నవరుసలతో - పల్లెఅంతా ఒక్క కుటుంబంగా కనబడుతుంది. ఆటోపంలేని ఆటలూ, పాటలూ, ఆడంబరంలేని అలంకరణలూ, అసత్యాలకు పాల్పడని మాటలూ- అన్నీ మన పట్టణవాసులకెంతో ఆశ్చర్యంగా వుంటాయి. పల్లెప్రజల హాస్యాలూ సరసాలూ, ప్రోత్సాహాలూ అన్నీ అమాయక ధోరణిలో ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తూ వుంటాయి. ఈ విషయాలన్నీ పల్లెపాటలలో ప్రత్యక్షంగా కనిపిస్తాయి: టీకమకలు లేనివరుసలతో సులభంగా బోధపడే భాషలో, అందరికీ అందుబాటులోవుండే భావాలతో ఒక చక్కని సహజధోరణిలో వుంటాయి ఈ పల్లె పాటలు.

---

*"జానపద గేయాలు" (1954 ప్రథమసంపుటి) సేకరణ. 'ఎల్లోరా'-ప్రచురణ విశాలాంధ్ర ప్రచురణాలయం. ఆ గ్రంథంపై శ్రీ తాపీ ధర్మారావుగారు ఆలిండియా రేడియోలో యిచ్చిన సమీక్షను గమనించ కోరెదను.

"అటువంటివాటిని చాలావరకు సేకరించి శ్రీ 'ఎల్లోరా' ఒక్క సంపుటాన్ని తయారుచేశారు.

"వీణామృదంగాది పరికరాలు లేకపోయినా–పాడేవారి పెదవులనుంచి–వినేవారి హృదయాలలోనికి ఒక రసప్రవాహం ఏర్పడుతుంది. ఎందుకంటే కష్టమైనమాట వుండదు. అనుభవంలేని సన్నివేశం వుండదు. పరిచయంలేని భావం వుండదు. అందుబాటులోలేని వరుస వుండదు. ఇంతా హృదయాలను హత్తుకోనడంలో ఆశ్చర్యమేముంది?"

అని అంటూనే శ్రీ ధర్మారావుగారు పేరునుగురించి ఏమంటున్నారో చూడండి.

"అటువంటి పాటలన్నీ గల ఈ పుస్తకానికి ("జానపద గేయాలు") అనాయాసంగా బోధపడేపేరు—"పల్లెపాటలు" అన్నట్లు పెట్టకుండా 'జానపద గేయాలు' అని పెద్దపేరు పెట్టడం కొంత అన్యాయమే..." అని విన్నవించారు.

అయితే జానపద వాఙ్మయానికి సంబంధించి కొన్ని వ్యాసాలు వ్రాసిన డాక్టరు గిడుగు సీతాపతిగారు ఏమంటున్నారోకూడా చూద్దాం!

*"జానపద జీవితాన్ని ప్రతిఫలింపజేసే వాఙ్మయంలో జానపదగేయాలు ఉన్నతస్థానాన్ని పొందగినది. అందులో జానపదుల నిత్యకృత్యాలే ఎక్కువగా కనపడుతున్నా అవి రసవంతంగాను, హృదయరంజకంగాను రచితములైనవి.

* "జానపదగేయాలు" (రెండవ సంపుటి 1959) సేకరణ: 'ఎల్లోరా' ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం. ఈ గ్రంథానికి తొలి పలుకు రాస్తూ డాక్టర్ సీతాపతిగారు నుడివిన పలుకులు యివి.

మాయామర్మ మెరుగని వారి జీవితాలు సహజసిద్ధములైన రాగద్వేషాలకు లోనైనా ఉదాత్తములైన భావాలతోనూ, అవ్యాజములైన ఆశయాలతోనూ-మృదుమధురములైన పలుకులతోనూ, సరళమైన నడవడితోనూ,నదులలోని నిర్మలోదకములవలె ఎట్లు సాగుతూ వుంటవో "జానపద గేయాలు" తెలియజేస్తూ వుంటవి...సంఘజీవిత మెట్లుండవలెనో నవ నాగరికులకు బోధింపగలవు. ఈ సద్గుణములన్నీ జానపద గేయాలలో ప్రతిబింబితము లవుతూ వుంటవి.

"జానపద గేయాలను భాషాలక్షణానికి లక్ష్యంగా లక్షణజ్ఞలు గ్రహించలేదు. వారి భాషాను శాసనము ప్రబంధాది కావ్యరచనకు వర్తింపచేసినట్లు ఈ జానపద గేయాలకు వర్తింపజేయక ఈ గేయాలయెడల పండితులు ఉదాసీనులై ఉండడంవల్ల మేలే కలిగినది. ఆ పండితులు ఈ శబ్దాను శాసనాలకు ఈ జానపదగేయాలనుబంధించివుంటే యివి కావ్యాలవలెనే ఏ విక్రుత కృతక భాషలోనో రచితములై యుండును. అట్టి దుస్థితి కలుగలేదు. కనుకనే ఇవి సరళమైన శయ్యతో సాగుతూ వచ్చినవి.

—ఆదినుండి నేటివరకు రచితములవుతూ వచ్చిన జానపదగేయాలు, సామెతలు-మొదలయినవి నిలచివుంటే సంఘజీవితము, భాష ఎట్లు పరిణమిస్తూ వచ్చినదో లెస్సగా గ్రహించగలుగుదుము. అట్టి సద్భాగ్యము మనకు లభింపలేదు.

జానపదగేయాలలో గ్రహించుటకు యోగ్యమైన పిశిష్ట లక్షణము ఎక్కువగా యున్నది. కనుకనే వాటి సంగ్ర

హాణమునకు విలువ హెచ్చినది. అట్టి జానపద గేయాలను కాలగర్భంలో మడిసిపోయినవి పోగా నేటికింకా పల్లెలలో జానపదుల పెదవులపై తాండవిస్తూ వీనులవిందుగా విన బడుతూన్న వాటినైనా సేకరించడం, సంస్కృతిగలవార మనుకొన్న మనకు విహితధర్మం—ఆ ధర్మమును నిశ్చల భక్తితో నెరవేర్చుటకు దీక్షవహించి, శక్తివంచనలేక తీవ్ర మైన కృషిచేసి కృతకృత్యులయిన 'ఎల్లోరా'గారికి నా అభి వందనాలు.

—జానపదగేయాల సేకరణ ఒకరిద్దరివల్ల పూర్తి కానేరదు. అమెరికావంటి దేశాలలో యీపనికి ప్రత్యేక సంస్థలు ఏర్పడి వున్నవి. ఇందుకు కావలసిన పత్రికలున్నవి. జానపద వాఙ్మయగ్రంథాలు, కథలు, గేయాలు, సామెతలు మొదలయిన శాఖలకు చెందినవి వందలకొలదిగా ఉన్నవి. ఈ పనికి ప్రభుత్వంవారు విశ్వవిద్యాలయములు, ఇతర విద్యాసంస్థలు పూనుకొనవలెను—"అంటూ తెలవిచ్చారు.

ఈ వాఙ్మయమును జానపద వాఙ్మయము, జానపద సాహిత్యము (ఫోక్ లిటరేచర్, ఫోక్‌లోర్ అన్న అర్థం లోనే) అనే వాడివుండడం గమనించడం అవసరం.

పాశ్చాత్య దేశములలో జానపదవాఙ్మయ పునరుద్ధ రణకోసం కృషిచేసిన పెద్దలెందరో-ఎందరో మహానుభావు లున్నారు. అందులో చైల్డ్‌హిండర్‌సన్, సేగర్, లాన్మన్, గమ్మెర్, మిల్లర్, గ్రిమ్, యగర్టి మొదలగువారు-అలాగే భారతదేశమున ముఖ్యంగా టెంపుల్, గోవర్, ఎలివన్,

క్రూక్ర్రే,బోయల్, హెమెండార్ఫ్, బ్రౌన్ మొదలగువారు ముఖ్యులు.

జానపదాలలో పుట్టి పెరిగి అనుశృతంగా వస్తూన్న సాహిత్యానికి జానపద సాహిత్య మంటున్నాము. వారిభాషలో వారి కర్థమయ్యే శైలిలో కృత్రిమం లేకుండా, వ్యాకరణపు బిగులూ, చందస్సు గోడల పట్టింపులు లేకుండా, హాయిగా పాడుకోడానికి చక్కని వాపి వరుసా కలిగిన పాటలనే జానపద గేయాలనడం సహజం. వీటినే పల్లెపదాలని, జానపద గీతాలని, పాతపాటలని వ్యవహరిస్తున్నారు. కాని పాటలు వేరు పదాలు వేరు

"హిమాలయ శిఖరాగ్రమందున పుట్టి వివిధ ప్రదేశాలను దాటుకుంటూ, కొండగుట్టలను చుట్టుకొని రకరకాలుగా ప్రవహించిన గంగవలెనే-ఆదిమానవుని అమాయక హృదయంలో పుట్టి, ఆనోటా ఆనోటా పల్లెలకి ఎగబ్రాకి-ఆ ప్రయాణంలో ఆయా మాండలిక పదాలను తనలోలీనంచేసుకుంటూ-ఎక్కడో పుట్టి ఎక్కడికో ప్రయాణం సాగించింది ఈ జానపదగేయ వాఙ్మయ స్రవంతి."

ఆంధ్ర జానపదగేయ వాఙ్మయ స్రవంతి ప్రవాహానికి కాలువలు త్రవ్వి గట్లుపోసి, ప్రతిచోటుకీ-నేలనాలుగు చెరగులకు ప్రవహింపజేసినవారు ఎవరంటే వారిపేరు చెప్పడం కష్టం. వీటికి ఒక రచయిత అంటూ లేడు.

ఈ విషయాన్ని గురించి "ది సైన్స్ ఆఫ్ ఫోక్ లోర్" అన్న గ్రంథంలో జానపదగేయాలను గురించి పేర్కొంటూ అలెగ్జాండర్ హాగర్తీ క్రాప్ఫీ ఇలా పేర్కొన్నాడు:

"ఇది ఎవరి సొమ్మూ కాదు—గాలిమీదా, నీటిమీదా మానవునికివున్న హక్కే ఈ సాహిత్యమీద కూడా వుంది.

"మానవుడు గాలినీ, నీటినీ ఉపయోగించుకొన్నట్లు గ్రామీణ—జానపదగేయ కళాఖండాలనుకూడా ఉపయోగించుకొని వుండివుంటే, మొదటినుంచీ శ్రద్ధ తీసుకొనివుంటే— ఈనాడు ఎంతో జానపదసాహిత్యి మనకు కనుమరుగై పోయిందని బాధపడవలసినపని వుండేదికాదు."

ఈ సంస్కృతిలో యిమిడివున్న నాగరికతా విలువలూ సందేశాలు, సాహిత్యపటిమ - గుర్తించే రోజు, విలువకట్టే సమయం యిప్పటికి ఆసన్నమయింది.

ఆంధ్రుల ప్రాచీన ఆచారాలు, నాగరికతలు. కట్టుబొట్లు, నమ్మకాలు, కథలు, గాథలు, వింతలు విశేషాలూ, ఎప్పుడు తెలుసుకోవాలన్నా, ఈసాహిత్య సంపదను పునరుద్ధరించవలసిన అగత్యమూ అవసరమూ కలుగకతీరదు-కలిగి తీరుతుంది.

జానపదగేయాలను చూసి ఫలానాకాలం అని వాటికి వయసుకట్టడం చాలా కష్టమయినపని—సాధ్యంకానిపనికూడా. కాని,రచనలోని విషయం ఏనాటిదో తెలిస్తే కవికాలంఅర్థమవుతుంది. చరిత్రలోగాని, మాండలికముచ్చట్లతోగానిసంబంధం గల పాటలు - ఆ ముచ్చట్లు జరిగిన కాలంలోగాని, దాని తర్వాతగాని. ఆ మండలంలోని వారే వ్రాసి వుండవచ్చునని—వుంటారని ఊహింపనగును.

ఫలానాపాట ఫలానా మండలానిది అని చెప్పడంలో

మాండలికపదాలు చాలా ప్రయోగపడతాయి. అలాగని ఈ సూత్రమే శరణ్యమంటే మాత్రం చిక్కువస్తుంది.

ఉదాహరణము:- విశాఖలో వాడుకలోవున్న గుంట శబ్దం—తూర్పు గోదావరిజిల్లాలోనూ వాడుకలో వుంది. ఈ గుంటపదానికి రెండు అర్థాలు చెప్పవచ్చును. ఒకటి-పడుచు. రెండు-నీటితోనిండిన చిన్న పల్లపు ప్రదేశం.

"చక్కని గుంట
నీ సరసను కూకుంట
ఏతంట లేకపోతె
నాయంట రాయే
చక్కాని గుంటా..."

ఈ పాట ఎక్కడిదీ అన్నచర్చకు మనం ఏమి చెప్పకోవలసి వుంటుంది? ఇటువంటి సమస్యలు కొన్ని యీ పాట ఫలానా ప్రాంతానిదే అని నిర్ణయించే సమయమందు ఎదురై తీరుతుంది. ఈ విషయం పెద్దలయిన విమర్శకులకే వదిలేద్దాము.

ప్రాంత నిర్ణయానికి ఉపకరించే పాట—చూడండి...

"తుంగభద్ర ఒడ్డున
దొంగలున్నారు
సీతమ్మ దాచుకోకుంటేను
దోచుకుంటారు"—

ఈ పాటను సరిగా చూస్తే మనకు బోధపడేది ఏమిటి? ఆ ప్రాంతాలలో - ఆ రోజులలో దొంగతనాలు ఎక్కువని

అర్థమవుతూంది. ఈ పాట ఫలానా ప్రాంతానిదే అనడానికి తుంగభద్ర అనేపదం ఆధారం.

అలాగే ఒకేపాట అనేక ప్రదేశాలలో వాడుకలో వుండడమనేది కూడా వుంటుంది - అందుకు ఒక చిన్న ఉదాహరణ పేర్కొంటాను.

"శ్రీ సూర్యనారాయణా
మేలుకో......
హరి సూర్యనారాయణా
మేలుకో..."—

అన్న పాట ఆంధ్ర, తెలంగాణాలరెండింటా ప్రచారంలో వుందని - జానపద వాఙ్మయ పరిశోధకులు, తెలంగాణా కవిమిత్రులు శ్రీ బి. రామరాజుగారు ఒకచోట పేర్కొని ఉన్నారు. ఇది గమనార్హం.

అంటే దీనినిబట్టి మనకు ఒకవిషయం బోధపడుతుంది. ఒకచోట చాలాకాలం కాపురం చేసిన వ్యక్తి ఒకపాటని అక్కడ నేర్చుకుంటాడు. తదుపరి మరో మండలానికి వచ్చి స్థిరపడడం జరుగుతుంది. ఇదేపాటను ఇక్కడ పాడుకుంటాడు. అలా ఒక మండలంలో నేర్చుకొన్న యీపాట ఒక నోటి నుంచి ఒకనోటికి ప్రాకి ప్రచారమయి బలపడుతుంది. అలా ఆనోటా ఆనోటా—ఆయా మండలాలు మారుతున్నప్పుడు ఒక కొత్త మాండలికాన్ని తనలో కలుపుకుంటూ మార్పు చెందడంకూడా సహజం.

మానవునిలో కవితాలత ఎలా చిగురించిందీ అనేదికూడా చూడడం అవసరం. "పక్షుల కిలకిలారావాలు, పకపకలు

మూలమై వుండొచ్చు. పిల్లపక్షిని తల్లిపక్షి చేరి ఆదరించడం, మొగపక్షిని చూసిన ఆడపక్షి స్వాగతం పలకడం చూస్తూనే వుంటాము. ఈదృశ్యములే మానవునిలో ప్రేమను నూరిపోశాయేమో అనుకోవాలి"— అన్న అలెగ్జాండర్ యాంగ్రట్ కాఫ్రే పలుకులు పరికించండి.

ఒక కవిమిత్రుడు పేర్కొన్నట్లు"...వెన్నెల వెలుగుల్లో పొందే ఆనందం, కోరలుచాచి భూంకరించే చీకటిలో అనుభవించే భయం, హోరున కురిసే వర్షంలోతడిసి శుష్కించిన శరీరం, చలిలో వడిగాకొట్టుకు పిడచకట్టుకుపోయే గుండెలు. చక్కిలిగింతలమధ్య మధుర స్వప్నాలమధ్య మత్తెక్కించేవసంతకాలం, కూర్రుకలనుంచి బాధ, అక్కసులు బాధబ్రతుకులూ......" ఇవే కవితారచనకు మూలము, ప్రోత్సాహమూ అయివుండాలి!

ఇదీ యథార్థమేమరి! జానపద కవితలలోకష్టమయగాథలు ఇతివృత్తంగా గలపాటలు, బరువు బ్రతుకుల జీవితాలకుసంబంధించిన శ్రామిక గీతాలు, మధుర వసంతగీతాలనబడే శృంగార గీతాలు, ఆచారాలు, కట్టుబాట్లూ ప్రతిధ్వనించే కథలు, అన్యాయాన్ని పాటల్లో ఋమిడ్చి ఎదిరించిన వీరరస గాథలు - ఎన్నో వున్నాయి ఈ జానపదగేయ వాఙ్మయ వల్లరిలో. మచ్చుకు కొన్ని పేర్లు యిస్తాను:

బాలనాగు కథ, ధర్మాంగద, గంగావివాహం, కాంభోజిరాజుకథ, లంకాయాగం, కుశలవులయుద్ధం, బొబ్బిలి

కథ, కాకమ్మకథ, కాటమరాజుకథలు, గేయాలు - అన్నీ వీటిక్రిందకే వస్తాయి.

బాలపాటలు, దంపుపదాలు, శ్రామికగేయాలు (రోడ్డు వేస్తూ, పడవ లాగుతూ, గడ్డికోస్తూ పాడేలాంటివి) శృంగారపదాలు (కందకుండమాస్తానె కడగదిలో కొస్తావ పిల్లా ఓ పిల్లా అనే పాటలు లాంటివి,) తత్వాలు (చేతిలో బెల్లం వున్నంతవరకె కాకిబలగమంతా — ఆ చేతిలోబెల్లం అయిపోగానే ఎవరు రారువెంట-లాంటి తత్వ ప్రబోధితము లయిన పాటలు) యివన్నీ జానపద సాహితిక్రిందకే వస్తాయి.

ఏలపాటలు, తుమ్మెదపదాలు, ప్రభాతపదాలు, ఆనంద పదాలు, నివాళిపదాలు, గొబ్బిపదాలు, మేలుకొలుపులు, వెన్నెలపదాలు - మొదలగునవన్నీ జానపదగేయాలే.

ఇవన్నీ ఆదరణలేక, విమర్శావిమర్శల మధ్య నలగి పోతున్నా-జానపదుల నోటిలో గూడుకట్టుకొని, తమ ప్రత్యే కతను నిలబెట్టుకుంటూనే వున్నాయి. ఈ తరహా పాటల్లో — అంటే జానపదగేయాలలో ఛందస్సులోపాలు, పండిత మన్యుల కావ్యనిబంధనలలోపాలు — వున్నా, రసపుష్టికీ, భావగాంభీర్యానికీ వెలితి వుండదు. కాని, అక్కడక్కడ కొన్ని బూతుపదాలు, మోటుపదాలు, వాడబడినమాట నిజమే- వీటినిచూసి, 'నన్నుముట్టుకోకు నామాలకాకి' అని ఊరు కోక, క్షీరనీరన్యాయంగా అటువంటివాటిని వదిలి, మంచివా టినే యేరి, కూర్చి, చేబట్టడం అవసరం — మంచిది.

జానపద గేయాలలో తల్లి కడుపున పాప జన్మించింది మొదలు—ఆఖరిదశవరకూ జరిగే యావత్తు చర్యలూ యీ గేయాలలో కూర్చబడి, వర్ణించబడి వున్నాయి.

ఈ జానపద గేయాలనే అనేక పేర్లతో పిలుస్తున్నారు. జానపదగేయాలని, పల్లెపదాలని, పాతపాటలని— వాడుకలో వుంది. హిందీలో 'గ్రాం గీత్' అని, 'లోక్ గీత్' అని వ్యవహరిస్తున్నారు. వీటినే ఇంగ్లీషులో 'ఫోక్ సాంగ్స్' అంటారు. ఈ సాహిత్యంమీద చక్కని విమర్శనాత్మక గ్రంథాలు ఎక్కువగా వెలువడినది ఇంగ్లీషులోనే.

దేశి కవితలుగా ముఖ్యమయినవి - ద్విపదలు, రగడలు, యక్షగానాలు—పేర్కొవాలి. ఈ దేశి కవితను తొలుత పాల్కురికి సోమనాథుడు ప్రారంభించినట్లు మనకు కొన్ని ఆధారాలు వున్నాయి.

ద్విపదలు, ఏలలు, దరువులు, ధవళములు, మంగళహారతులు మొదలగున వేకాక, ఇంకనూ రాగ, తాళ యుక్తములయినవి వీటియందు కానవస్తున్నవి. లాక్షణికులూ, ప్రబంధకవులూ కూడా వీటిని అంతగా పట్టించుకో లేదు, అయినా సామాన్య జనులనోళ్ళలో పాడుకొనే పాటలుగా మాత్రం నిలిచిపోయి వున్నవి. యక్షగానాలను ప్రబంధములని పేర్కొనకపోలేదు.

దేశి రచనలు రెండు విధములు. ఒకటి—పాటలు, రెండు—పదములు అని పదములు:— తుమ్మెద, ప్రభాత

(మేలుకొలుపులు) వెన్నెల (చందమామ) కోవెల, చిలుక, కిరాళి, గొబ్బి, నివాళి (హారతులు, మంగళములు) మువ్వ గోపాల, హరిహరీ పదాలు - కావచ్చును. ఇక పాటలు:— లాలి, జోల, ఏల, సువ్వి, ఉయ్యాల, జాజరి, ఐరేని, అప్ప గింతలు, శ్రావణశుక్రవారం, అక్కల, శోభనం, ధవళ ములు, చద్దులు, సుద్దులు, చిందులు, కీర్తనలు, సంవా దాలు-గా చెప్పవచ్చును.

స్త్రీల పాటలలో చాలారకాలున్నాయి. వారు పాడు తూంటే, అవి వింటూంటే, నిర్మలంగా నిండుగా ప్రవహించే నదీప్రవాహంలాగా వుంటుంది. అసలు ఈ వాఙ్మయంఅంతా వారినోటినే చోటుచేసుకుందాఅనిపిస్తుంది. స్త్రీ సాహిత్యాన్ని మధ్యతరగతి సాహిత్యమంటే బాగా వుంటుందేమో!

బాలసాహిత్యం క్రిందనూ చాలారకముల గేయాలు మనకు నిత్యము వినిపిస్తూనే వుంటాయి. ఆటలరూపంలో కొన్ని, పాటలుగా వుండేవి కొన్ని, వైద్య విజ్ఞానములకు సంబం ధించి కొన్ని-ఇలా రకరకములుగా ఎన్నో వుంటాయి. బాల సాహితికి సంబంధించిన ఈ గేయాన్ని వినండి.

"కాళ్ళాగజ్జ
కంకాలమ్మా
వేగులచుక్కా
వెలగామొగ్గా..."

ఈ రచన ఒకవిధమైన అయుర్వేద వైద్యప్రబోధ మయిన ఆటపాట. ఎంతవరకూ దీనిని పాటగా పాడడానికి

వీలుగా వుంటుందంటే పిల్లలను ఆడించడం వరకే. అలాగే ఈ క్రిందిగేయం.

"ఏం కర్ర?
జీలకర్ర,
ఏం జీల?
......"

ఈ పాటను సరదాగా ఎనిమిది, పది వయస్సు బాలురు కాలక్షేపంకోసం వరుసతప్పకుండా ఈరకం పదజాలంతో పాడతారు. ఇది ఒక విధంగా ఆట. అది అంతవరకూనే అందం. వీటిలో కొన్ని కొన్ని పలుకులు చాలా విలువయినవీ, అవసరమైనవీ దొర్లుతుంటాయి. అటువంటి పదములను త్రోసి వేయకూడదు.

కొన్ని పదాలు మంచివి అనడంలో నా ఉద్దేశ్యం - మచ్చుకు ఈ క్రింది పాటను పరికించండి.

ఒక పశువుల కుర్రవాడు ఒకనాటి ఉదయ సమయమున సారంగధర మెట్టవద్ద పాడుతున్నాడు ఈపాటని. (ఈ సారంగధర మెట్ట తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి లోనిది) ఈ పాట నాకేమంత బాగా వినిపించనూలేదు కనిపించనూ లేదనుకోండి. కాని, అందులో ఒకమాట - నన్ను ముగ్ధుడిని చేసింది.

"ఎద్దు కొమ్ముల మీద
పొద్దు పొడిచింది....."

అన్న చరణం. ఈ మాటలో ఎంతటి భావనావిలువ, కవితామాధురీ వుందంటారు? సాధారణంగా ఎద్దుకొమ్ములు నిలువుగా వుంటాయి. వాటిమీదికి పొద్దురావడమంటే - సరిగా పన్నెండు గంటలు అయిందన్నమాట. ఈ పాటలోని మాట కవితావిలువకు సానమీదకత్తేగాని, చెవులకు ఇంపుగా వుండదీ పాట.

అలాగే మరొక పాటను కూడా పరిశీద్దాము. ఇది రాయలసీమలోనిది అనుకుంటాను - నేను వెళ్ళివస్తా అని భర్తతో చెబుతూ భార్య...

"మొగలి డొంకల్లోన
ముడుచుకొని కూర్చున్న
ఓ మొగలి రేకా......"

అని భర్తను సంబోధించి - ఫలానాతీర్థం వెడుతున్నాను, అడ్డుచెప్పకు - యిష్టపడు అని అడగడం- మొత్తం మీద సరే వెళ్ళు-మరి ఎప్పుడు వస్తావు? అని భర్త అడగడం ఈ ప్రశ్నకు సమాధానంగా భార్య ఇలా అంటుంది :

"రాతిబసవేశ్వరుడు
రంకె వేసే వేళ
రాతిమీద రాజనాల్
పంట పండే వేళ......"

నేను తిరిగొస్తానని ఎంతటి చమత్కృతితో సమాధానం యిస్తూందో! ఈ పాటలో పదగుంభనం ఎంతటి

పటుతరంగా పొదిగాడో జానపదకవి. ఇటువంటి జానపద కవితలు అనుకోకుండా జానపదుల నోటినుంచి వెలువడ్డాయంటే - ఆశ్చర్యం కాదూ మరి.

రాతిమీద రాజనాలు పండడమూ వృత్తిదే, రాతి బసవయ్య రంకెలు వేయడమూ కలలోనిమాటే. అటువంటి పరిస్థితిలో తిరిగి వస్తానన్న పడుచూ తిరిగిరావడం నమ్మకంలేని వాస్తవమే. కాని,

"రాచూరు దగ్గరా
రాతిబసవడున్నాడు
రంకె లేసే కాల
మొస్తుందిరా......"

అని బ్రహ్మంగారు తన తత్వంలోకూడా చెప్పారు. ఏమో, ఏం కానుందో. ఇటువంటి మధుకలశాలనదగిన జానపద రచనలనుగురించి, అందలి యింపుసొంపులనుగురించీ వాటిలోని మాధుర్యాన్నిగురించీ - దిఙ్మాత్రంగానైనా పరిచయం చేయడానికి ప్రయత్నిస్తాను.

కష్టాలతోనే పుట్టి, కష్టజీవితాలు వెళ్ళబుచ్చే శ్రామికులకు భూదేవే తల్లి-ఆకాశమే తండ్రి—చుట్టూవున్న చెట్టు చేట్టూ చామలే బంధువులు. ఇట్టివారినుంచి ప్రభవించిన సాహిత్యంలో బాలసాహిత్యనుంచి తత్త్వాలవరకు ఎన్నో అపురూపగేయాలు మనకు కనుపిస్తాయి.

(శ్రీ) చలంగారు నుడివినట్లు "...ఎన్ని వేళ్ళనుంచో యివి తల్లిప్రేమలో, భార్య పాతివ్రత్యంలో, చిన్న పడుచు

కలల్లో, పసిపిల్లల చిరునవ్వుల్లో—నాని నాని మెరుపులేసు కొని, ఎన్ని వేల హృదయాల తపనల్లో పొగుచేసుకొని, చిత్రికపడి ఈ రూపాల్ని పొందాయి..." ఈ పాటలు.

ఈ జానపద వాఙ్మయాన్ని వ్యతిరేకించేవారిని, అంటని వారిని చూసి "ఈ కృతకభాషావాదులు పూర్వాచార పరులకన్న అంధులు - వాళ్ళకు ఏదిచూసినా శత్రుత్వమే. పూర్వాచారాల్లో నిలచిపోవలసినవి చాలా వున్నాయి. కాని ఈ కృతకభాషలో మిగిలిపోవలసింది ఏదీలేదు. వీరికి తమ కన్నా పాతవీ పనికిరావు, తమకన్నా కొత్తవీ పనికిరావు. దురదృష్టవశాత్తూ ఈ కృతకభాషావాదులే అధికారంలో వుంటూ వుంటారు..."అని పేర్కొన్నారు శ్రీ చలంగారు.

అటువంటి ప్రజాసాహితి - సజీవసాహితి - సముజ్జ్వల సాహితిని గురించి చాలా తెలుసుకోవలసివుంది.

"ఈ పాటలు తెలుగుజాతి జీవనమంతా కళ్ళకు కట్టేట్లుగా చూపుతుంది. తెలుగు బ్రతుకు అంతా - వానదేముడి నుంచి పరికోతలదాకా, వ్యవసాయంనుంచి వీరత్వందాకా, కాడినుంచి కత్తిదాకా - ఇంతెందుకు తుడుము దగ్గరనుండి దేవతార్చనదాకా అద్దంవలె కనబరుస్తుంటాయి ఈపాటలు."

మన నడత, నాగరికములు, విజ్ఞాన సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు ఎలా క్రమానుగతంగా వికాసం చెందుతూ వచ్చాయో పరిశీలించగోరే వారెవరైనా మన జానపదవాఙ్మయాన్ని విధిగా పరిశీలించాలి. పుష్పాల పరిమళాలను ఆఘ్రాణించాలి.

ఎవరూ అంటక, ముట్టక ఊరుకున్న సమయంలో ధైర్యంచేసి పల్లె జీవితచరిత్రగా పేర్కొనదగిన పాతపాటలను కూర్చి, వరి ఒక రూపుదిద్ది చిన్నగానైనా పుస్తకరూపంలో వెలువరించారు కనుకనే నేడు ఆపుస్తకాలను, ఆ వ్యక్తులను, ఆ పాటలను వెదుకుతున్నాము. అటువంటి వ్యక్తులు చిరస్మరణీయులు. అటువంటి పాటలు మేలుబంతులు- నేటివారికి పచ్చని చామంతులు, గుత్తుల పూబంతులు.

అంటే ఈనాడు చామంతుల జడలూ కనుమరుగయాయనుకోండి - పూబంతుల కొప్పులూ కనుపించడం లేదనుకోండి. పెళ్ళివాకిట బంతులాటలూ మరచిపోయా రనుకోండి.

అంతదాకా ఎందుకు - ఈ యాంత్రిక యుగంలో, ఈ యాటం యుగంలో - పాశ్చాత్య నాగరికత ధర్మమా అసి-చద్దికుండల స్థానంలో కాఫీ కప్పులు ప్రత్యక్షమయాయి, చామంతి జడల స్థానంలో యినుపముక్కల రింగులూ - రంగుగుడ్డలూ ప్రత్యక్షమవుతున్నాయి. పెళ్ళివారి గడపల్లో పేర్లు చెప్పడాలు, బంతులాటలు పోయి పేకుహాండులూ, హాండ్ బాగ్ లూ కనుపిస్తున్నాయి.

తిరగళ్ళ స్థానంలో పిండిమరలు, దంపురాళ్ళ ప్రదేశాలలో బియ్యంమిల్లులు, గొబ్బికోలాటాల ఆటల బయలు ప్రదేశాలలో రింగ్ టెన్నిస్సులు, బాడ్మింటన్ లు తయారైనాయి. నవనాగరికత పేర - పాతపాటలు, ఆటలు గృహకృత్యాలు, వేడుకలు, విందులు కనుమరుగై పోతున్నాయి.

అలా కనుమరుగై పోతూవున్న కొద్ది పల్లెపాటలనైనా పదాలనైనా విని - చూసి - కూర్చి-రక్షించవలసిన సమయం - ప్రచురించవలసిన కాలం ఆసన్నమయింది.

ఆ ప్రాధాన్యాన్ని గుర్తించే ఈనాటి రచయితలు, సాహితీ వేత్తలు, ప్రచురణకర్తలు, జానపద వాఙ్మయ రక్షణకు కదిలారు - కదులుతున్నారు. అందుకు తొలిగా విఘ్నేశ్వరపూజ చేసిన ఘనత శ్రీ మంగువారికీ, శ్రీ చలపతిరావు గారికీ దక్కుతుంది. వారెంతయో అభినందనీయులు.

ఈపుస్తకాలన్నీ గుజలీ ప్రతులుగా కనబడినా-ధైర్యం చేసి ప్రచురించారు. జానపద వాఙ్మయ సేకరణోద్యమానికి నాందీ ప్రస్తావన పలికారు.

నాడు వారు నాందీప్రస్తావనచేసిన ఘనతే నేడు కొన్ని చక్కని సంపుటాలు వెలువడడానికి దోహదం చేసిన దంటే అత్యుక్తి కానేరదు.

మధురకవితలు అన్న వ్యాసాలు ఏనాటివి. అవన్నీ పుస్తకాల నలంకరించాయా? లేదు.

ఒక వ్యాసమా, రెండువ్యాసాలా! బాలభాష, స్త్రీ భాష - పామరభాష మొదలగు చక్కని నామాలతో, విషయ విభాగాలతో, చర్చలతో, ఉర్రూత లూగించినవి. (ఈ సాహితిని చూసి భయపడే పెద్దలనులెండి) ఆ వ్యాసావళిలో ఒకటి -- అదైనా ఈనాటికి - ప్రభాకర పరిశోధక మండలివారు బాలభాష, పేరుతో వెలువరించారు.

బాలభాష అంటే ఏమిటి? — ఇది జానపద సాహితి క్రిందనే పేర్కొన్నారే — జానపదులు భావావేశంలో అల్లి నట్లుగానే — బాలల నోట్లోంచే ఈ పాటలు వచ్చాయా? అని ఒక మిత్రుడు ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు నాకు కొంచెం నవ్వు కలిగినా — ఆశ్చర్యం కలిగించలేదు.

బాలలతో ఆడుకొని, బాలల మధ్యనే వుండి ఆ పాల బుగ్గలను ముద్దుపెట్టుకుని, ఆ పసిహృదయాల లోతుల లోంచి — ఆ పూరేకల పెదవులలోంచి తేనె చినుకులుగా వెలువడే చిన్న చిన్న పలుకులూ, కులుకులూ, చూసేవారికి — బాలభాష అంటే యిట్టే అర్థమవుతుంది. కాని, లేకపోతే అర్థం అవడం కష్టమే.

అసలు బాలలను అర్థం చేసుకోవడమే కష్టం. "ఏనుగును తెచ్చియిస్తేకానీ అన్నం తినను" అంటాడు. "ఆ చందమామను నాకు తెచ్చిపెట్టు" అని మారాం చేస్తాడు. ఏమిటి యీ చేష్టలు - వీటినే బాలక్రీడలు — అన్నాము.

అందుకే మనవారు "పిల్లాడినెత్తుకునేకంటే బిచ్చ మెత్తుకుంటే నయం" అన్నారు.

అంటే పాపలమీద ప్రేమ — ఇష్టంలేక కాదు ఈమాటన్నది వారి బాలక్రీడలను — సరిగా అర్థం చేసుకో లేక, ఆ పసిబాలలు వేసే యక్షప్రశ్నలకు సమాధానాలు యివ్వలేక అన్నమాట.

అలాగే చాలాకాలం క్రిందటనే "బాలానందం" పాటలు అని అనుకుంటాను రాజమండ్రినుంచి ఒక పుస్తకం

ప్రచురించారు. ఆ పాటలన్నీ జానపద సేకరణలే, బాల పాటలే, అన్నీ పరిచయమైనవే - ప్రచారమైనవే.

తెలంగాణానుంచి నేదునూరి గంగాధరంగారి సేకరణలు "సెలవరు" పేరుతోనూ, విజయవాడనుంచి"ఎల్లోరా" (నావి) సేకరణలు 1954 లో ప్రథమ సంపుటి, 1959 లో ద్వితీయ సంపుటి "జానపదగేయాలు" అనే పేరుతోనూ, "కృష్ణశ్రీ" గారి సంకలనం"పల్లెపదాలు" పేరుతోను, శ్రీ ప్రయాగ "తెలుగు పల్లెపాటలు" పేరుతోనూ వెలువడాయి.

ఇంతవరకూ వెలువడిన - చెప్పుకోదగిన గేయసంపుటాలు ఈ నాలుగు మాత్రమే. ఇక ఈ వాఙ్మయంమీద సమీక్షాగ్రంథాలు ఇంతవరకూ వెలువడినవి పరికిద్దాము.

సమీక్షాగ్రంథాలకు ముందర సమీక్షావ్యాసాలు భారతి, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, గృహలక్ష్మి, స్రవంతి, మొదలగు పత్రికలలో చాలామంది సాహితీవేత్తలు రకరకాల శీర్షికలతో వెలువరించారు.

అందులో అగ్రగణ్యులు - కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారే. వీరు చక్కని వ్యాసాలను అందజేశారు. వీరి తరువాత చాలమంది అప్పుడప్పుడూ కొన్ని వెలురించారు.

తరువాత మిత్రులు శ్రీ టేకుమళ్ళవారి పేరు వినవస్తుంది. వీరు చాలాకాలంగా - చాలా పట్టుదలతో కృషి చేస్తున్నారు. అలాగే ప్రత్యేకంగా శ్రద్ధతీసికొని

శ్రీ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు ఆలిండియా రేడియోలో మహిళామండలి కార్యక్రమాల్లో చక్కని సమీక్షలను అందించారు. వాటిలో చక్కని విషయాలు పొందుపరచి - చక్కని విషయసంగ్రహం అందించారు.

అలాగే - శ్రీ గిడుగు సీతాపతిగారు (వాణిలో), డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు (కిన్నెరలో), శ్రీ ఆవంత్స సోమసుందర్ (కిన్నెరలో), శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు (కిన్నెరలో), శ్రీ పిలకా గణపతిశాస్త్రి గారు (భారతిలో), 'ఎల్లోరా' (ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, స్రవంతిలలో), శ్రీ యస్వీ జోగారావుగారు భారతిపత్రిక మొదలైనవాటిలో, శ్రీ నేదునూరివారు (ప్రజామతలో). శ్రీ కె. సభా ఆంధ్రప్రభలో వ్యాసాలు వ్రాయడంతోపాటు చిత్తూరు మాండలానికి సంబంధించి ఎన్నో జానపదగేయాలు సేకరించారు. ఇంకా ఎంతోమంది పెద్దలు వివిధ పత్రికలలో గేయాలను గూర్చి, పదాలను గూర్చి, దేశికవితలను గురించి, హరిహరీ పదాలు, యక్ష గానాల గురించి - మార్గ- దేశి కవితలమధ్య భేదాలగురించి చాలా వ్యాసాలు వెలువరించారు. ఇవి సారస్వత ప్రియులకు, రచయితలకు, ఎంతో సహాయకారి అయినాయి.

జానపదసాహితి అనగానే "నన్ను ముట్టుకోకు నా మాలకాకి" అన్నట్లుగా వుంటారుకొందరు. ఏమిటి కారణం? అలా అంటకుండా దూరంగా వుండడానికి—ముట్టితేనే పాపం అనుకోడానికి??

వారు బహిరంగంగా చెప్పే సాకు-ఈ జానపదగేయాల నిండా బూతు పదాలు ఎక్కువగా వున్నాయని. విద్యాంలో బెడ్డలు వెరగలిగిన ఈ పెద్దలు వద్దు ఎందుకు వెరలేదని మనం గ్రహించాలి.

ఆ పని తప్పు- ఈదారి ప్రమాదం అని చెప్పేవాళ్ళు ఈ పని మంచిది, ఈ దారి సులువైనదీ అనికూడా చెప్ప గలిగితేనే విలువ వుంటుందికాని - గాలిలో బెలూనులాగ ఎటుపడితే అటు మాట్లాడకుండా వుండాలి.

జానపద సాహిత్యమంతా వట్టి బూతులతో నిండిన దన్నప్పుడు-మార్గ కవితలలోని శృంగారపదాలమాట ఏమిటి?

వీటిలోని బూతులు వారి చెవులకు వినిపించినప్పుడు, మార్గకవుల రచనలలోని బూతుపద ప్రయోగాలు వారికి ఎందుకు వినరావడంలేదో! వాటిని చదువుకుంటూ ఏల ఆనందం పొందుతున్నారు?

ఇంతకూ వీరు జానపద కవితలకు ఆపాదించినది బూతు పదాలు వున్నాయని. ఆబూతుపదాలే వారి మార్గకవితలలో దొర్లితే అది బూతు అనిపించుకోదా? అర్థం శుభం తెలి యని అమాయకమైన పల్లెజనాళి - తమ కష్ట సమయంలో- సుఖసమయంలో తన్మయత్వం పొంది - భావావేశంతో అల్లిన పాటలలో బూతులు దొర్లడం సహజం- అసహజం అనిపించుకోదు కూడా.

కాని చక్కని పాండితీ పటిమయుండి—వ్యాకరణంలో, ఛందోరీతులలో ఘటికాగ్రమణులయి వుండీకూడా వారి మార్గకవితాలతకు ఈబూతుపూవుల లాంటి పదప్రయోగాలు వన్నె తెస్తాయంటారా? ఒకరి విషయంలో ఒక పని తప్పు అని మనం చెప్పినప్పుడు ఆ పనే మనం చేసినా తప్పే అవు తుందికాని ఒప్పు కానేరదు.

జానపద కవితలలో వినబడే బూతులు ఏమిటి? కొంచం పరికిద్దాము :—

"వెన్నుమీదా చూపు
మలపరా - నా సామి
చన్నుమీదా చేయి
తియ్యరా నా సామి ..."

అని ఒకపాట.

ఈ పాటలోని అసలు భావం :— సోమరిపోతులాగా తిని, శృంగారచేష్టలు చేస్తూ, స్త్రీలోలుడవయేకంటే, నీ కాలాన్నీ, తెలివితేటల్నీ దేశ సౌభాగ్యానికీ, దేశ పురోభి వృద్ధికీ వినియోగిస్తే ఎంతో బాగుంటుందిసుమా — అని.

ఇంతటి విశాల భావంతో వాడబడిన ఈ చన్ను శబ్దప్రయోగం అమాయకురాలైన పల్లెపడుచు నోటినుంచి వచ్చినపుడే తప్పు అయినపుడు —

"సూత్రమునకైన సందీక స్థూలమగుచు
క్రిక్కిరియు నీదు చన్నవయొక్క అంత

రమున, నెట్టులో నా చూపులిమిడి
అహాహ క్రమ్మరగలేవు రాతిలో కప్పలలుల"-

"నిక్క పొగరెక్కువారిని నిగ్రహింప
దగునె తలవాల్చువారికి తగునె శిక్ష
తరుణి చనులకు కరవిమర్దనమె కాక
వృద్ధకుచములకొక నమస్కృతియె కాదె"—

అనే ఈ పై పద్యాలలో ప్రత్యేకం శృంగారం కొరకే వాడబడిన "తరుణిచనులకు కరవిమర్దనమె", "వృద్ధ కుచలములు" పద ప్రయోగం ఎందుకు తప్పుకాదో?

ఈ మార్గ కవులు వాడిన చన్ను శబ్దం బూతు కానప్పుడు జానపదులు వాడిన చన్ను బూతు ఎలాగైందో దుగూహ్యాం.

నేటి సాహితీపరులు - నాగరికులమనుకునేవారు - కదలి మంచి చెడ్డల మధ్య, విమర్శావిమర్శలమధ్య సలగి అట్టడుగున పడిపోయిన - పడిపోతూన్న జానపద కళా ఖండాలను, జానపద వాఙ్మయక్షేత్రంలో పరిశోధనలు జరిపి వెలికి తియ్యాలి - మెరుగులు దిద్ది పునరుద్ధరించాలి.

అటువంటి రక్షణోద్యమము, కార్యదీక్ష కనుక మనలో కలిగిననాడు - ఎన్నో గాథలు, చరితలు, పదాలు, పాటలు దొరుకుతాయి.

జానపద కవితలలో - ప్రతిపాటా ఒక జీవిత సత్యం, ఒక సందేశం, ఒక ప్రబోధం ధ్వనిస్తూ మానవజాతిని మేలుకొలుపుతూ వుంటాయి.

ఇందులో పిల్లలకు పాలు, ఉగ్గు, బువ్వ, పెట్టడం దగ్గరనుంచి, ఆయుర్వేద రహస్యాలనుంచి, ప్రథమ చికిత్సా విషయాలనుంచి-ఆటపాటలు, వెటకారాలు, వెక్కిరింతలు, గృహకృత్యాలు, బోధలు, తత్వాలదాకా ఎన్నో రకాలు వున్నాయి.

ఈ బాల పాటల నడకలో యతిప్రాసానియమాలు చక్కగా వుంటాయి. ఈనాటి మన తల్లులు కాఫీగతప్రాణులవడం మూలంగాను, ఆముదం అంటేనే వెగటు చూపిస్తూ పాశ్చాత్య వ్యామోహితు లవుటవలనను - ఉగ్గుపాటలు మరచి పోయారా అనిపిస్తూంది.

బియ్యపు మరల ధర్మమా అని దంపుపాటలు మరచి పోయారు, మిషనులు రాగానే తిరగలి పాటలు వదిలేశారు - నాగరికత పేరుతో నోములకు, వ్రతాలకు స్వస్తి చెప్పారు.

పాశ్చాత్య అనుకరణలతో మన పాతఆటలు, కోలాటాలు పోయి రింగు టెన్నీసులు వచ్చాయి.

" కాళ్లా గజ్జె కంకాలమ్మ ... " స్థానంలో
" ట్వింకిల్ ట్వింకిల్
లిటిల్ స్టార్ ... " పాటలు వినబడ్తున్నాయి.

వీరి వ్యామోహం ఎంత వరకు పోయిందంటే "కొత్తొక వింత, పాతొక రోత — " అన్న ధోరణిలో వుంది.

పూర్వపు బాలపాటలలోవున్న నడక, శైలీ, తెలుసుకోతగ్గ విషయాలూ - ఈనాటి రచనలలో కానరాదంటే కోపం ఎవరికీ రాదనుకుంటాను.

శ్రీ గిడుగు వారు పేర్కొన్నట్లు "...అటువంటి విలువ గలిగిన పాత సాహిత్యాన్ని మన పండితులు కొంతమంది - ఆదరించలేదు - సరే ఆదరించ వద్దు. ఒకవేళ వీరు ఆదరించినా వారి ముళ్ళకంపలాంటి, ప్రజలకు అర్థం కాని ఛందోరీతులలో అల్లిన రచనలవలనే ప్రజలకు దూరంగానే ఈ జానపద రచనలూ వుండిపోయేవేమో. అదీ ఒక మేలుగానే పరిణమించింది.

అయితే వారి రచనలు తాటాకు ముక్కలనైనా ఎక్కాయి - ఈ జానపద రచనలు తాటాకులమీదకైనా రాలేకపోయాయి ..." అని పండితులు ఆక్షేపించవచ్చు.

వీరు రాజులను, రారాజులను పొగడుతూ వ్రాసిన అంకితాల కవిత్వాలకీ - ఆర్భాటపు కవితలకీ, వల్లకీ మోతలూ, ప్రచారాలూ అవసరమయ్యాయి కాని ఈ నిర్మల జానపద సాహితీ స్రవంతి ఏ అండా - ఏ ప్రచారమూ లేకపోయినా నేల నాలుగుచెరగులా - ప్రవహిస్తూనే వున్నది."

విచిత్రమేమిటంటే ఏ పూర్వ ఛాందసకవులయితే ఈ జానపద వాఙ్మయాన్ని బూతు సాహిత్యమన్నారో-వారి బాల్యంలో వారిని కన్నతల్లి ఉగ్గుపెడుతూ - పాలుపోస్తూ - పాడినపాటలు ఏమిటో వారొకసారి తమ బాల్యం వెంపుకు

తిరిగి ఆలోచించమనండి. నాడు తల్లి ఆడిస్తూ పాడిన ఆ పాటలకు వీరే పకపక నవ్వి, ఉబ్బి తబ్బిబ్బవ లేదంటూరా! అంతేకాదు – ఈనాటికీ వారివారి ఇళ్ళలో వారి భార్యలూ, వారి ముసలమ్మలూ – వారివారి బాలురకు ఏ పాటలు నేర్పుతున్నారో – ఏవిధంగా ఉగ్గు, పాలు పెట్టుతున్నారో తెలుసుకోమనండి. ఈ జానపద సాహిత్య లేని గ్రామం, పాడని కంఠం, నవ్వని హృదయం, వినని చెవి, ఉండదంటే అత్యుక్తి కానేరదు.

అటువంటి సాహిత్య విషయంలో చేయవలసిన పని గురించి ఎంతైనా తెలుసు కోవలసియుంది, నేటికీ ఈ గేయ కుసుమాలు – నవనవోన్మేషంగా విలసిల్లుతూ గ్రామిక జనాళిచే మాత్రమే కాదు, నవజనాళిచేకూడా ఆదరణపొంది– వారి హృదయాలను కితకితలు పలికిస్తున్నవంటే ఈ గేయా లలో వుండే విలువ గ్రహించవచ్చు.

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు పేర్కొన్నట్లు 'అటువంటిఈ దేశి కవితలు ఎత్తుకుని పరీక్షించిననాడు–అందలి సున్నితములైన భావములు, దేశీయమగు భాష, కమ్మని తెలుగు నుడికారమూ, అడుగడునా – పలుకుపలుకునా ప్రతి ధ్వనిస్తూండును – పొడగట్టుచుండును.

ఈ పద కవితలు ఎంతనిసర్గ రమణీయమైనను ఛందో డంబరమును, సంస్కృత బాహుళ్యమునూ గల మార్గకవిత ఎదుట మసలలేక – పామర జనాశ్రియమై చిరకాలము పల్లె

పట్టులందే పారాడవలసి వచ్చినది.

కాని దీనియందలి సహజ మాధుర్యములునూ, సర్వజనీనతను గుర్తించి దీనికినీ నాగరిక లోకమున నాదరమును సారస్వత ప్రపంచమున ఉచితస్థానమును కలిగించుటకు యత్నించిన మహానుభావులే ద్విపదకావ్యకర్తలు. నాటి నుంచియే దేశిసాహిత్యం - పొంగులు వారుతూ - తుష్టినీ, పుష్టినీ సంతరించుకొని ముందుకు నడక సాగించింది.

వీరిలో—అంటే యీ ద్విపద కావ్యకర్తలలో ప్రథమాచార్యుడుగా పేర్కొనదగినవాడు పాల్కురికి సోమనాథుడు. ఈ మహానుభావుడు మహాపండితుడు. కావ్యగౌరవమును పోషించునది సర్వజనీనతగాని, ఛందఃప్రయాసాతిశయము కాదని గుర్తించి - వివిధవృత్తములతో సంస్కృత బహుళముగా గద్యపద్యాత్మకమగు గ్రంథరచన మొనర్పవలయు ననెడి యాకాలపు మార్గకవులకు—

"ఒప్పదు ద్విపద కావ్యోక్తి నాజనదు
ఆరూఢ గద్య పద్యాది ప్రబంధపూరిత
సంస్కృతభూయిష్ఠ రచనమానుగా
సర్వసామాన్యంబుగామి జాను తెనుగు
విశేషము ప్రసన్నతకు"
(బసవ పురాణము)

అని చక్కని సమాధానమిచ్చి—

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు

చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చిదద్విపదలు కోర్కెదైవార..."
(పండితారాధ్యచరిత్ర)

అని ఎలుగెత్తి సవాలు పలికి మార్గ కవితోద్యమానికి ఎదురు తిరిగి దేశికవితోద్యమానికి బాసటగా నిలచాడు :

"సరళముగాఁగ భావములు
జాను తెనుంగున నింపు పెంపుతో" —

అని నన్నెచోడుడు కూడా ప్రవచించాడు

దేశి కవితలు – మార్గ కవితలు అన్నది చాలాచోట్ల చర్చించడం జరిగింది.

జానపద రచనలనే దేశిరచలుగా మనం చెప్పు కొన్నాం. సులభగ్రాహ్యమూ, సుందరస్వరూపము, ఇంపైన ధ్వని ప్రధానమూ అయిన భాషనే 'దేశి' అందాం! సంస్కృత పదభూయిష్టమైన వాటినే 'మార్గ' రచనలు అందాం!!

మొట్టమొదట ఈ మార్గ, దేశిపదాలను ప్రయోగిం చిన వాడు నన్నెచోడుడు అనేది ఇక్కడ మనం ముఖ్యంగా చెప్పుకొనవలసివుంది.

"మును మార్గకవిత లోకం
బున వెలయంగ దేశికవిత
బుట్టించి తెనుంగున నిలిపిరంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు

మొదలగ పలువుర్

సురవరులం గ్రమంబున వచో

మణిసంహతి బూజచేసి మా

ద్గురు చరణార విందములకున్

దగ సమ్మతి జేసి కొల్చి వి

స్తరమతులం బురాణకవి సంఘము

నుత్తమమార్గ సత్కవీ

శ్వరులను దేశి సత్కవుల

సంస్తుతి జేసి మనోముదంబునన్"

అని పేర్కొని "మార్గ" - "దేశి" పదాలను పేర్కొన్నాడు.

అక్కడదాకా ఎందుకు (క్రీస్తుశకం 750కి పూర్వపు వాడని చెప్పబడుతున్నవాడు) మతంగుడు తన గ్రంథంలో యిలా పేర్కొన్నాడు. కొన్ని పంక్తులను పరికించండి:—

"దేశీకార ప్రబంధోయం" అనీ,

"సప్తమీ కథితాగాథా

తతో ద్విపదకో త్తమా" అనీ,

"దేశీగీతేపి వస్తుస్స్యా

న్నాటకేపి ప్రయుజ్యతీ" అనీ,

"ఏలా నాదవతీరమ్యా

వర్ణాలంకార శోభితా" అనీ,

ఇలా ఎన్నో దేశిరచనలున్నట్లు, దేశి, మార్గరచనలను గురించి పేర్కొన్నాడు.

1230 ప్రాంతంవాడని చెప్పబడుతూన్న శార్ఙ్గదేవుడు కూడా దేశిరచనలను గురించి చెబుతూ ద్విపద, త్రిపది, చతుష్పది, షట్పది, ఏల, పదం, కళిక, ఉత్కళిక, ఏకతాళి, ధవళం, మంజరి, మంగళం, వర్తన, ముక్తావళీ - మొదలగు దేశిచ్ఛందోరీతులను గురించి పేర్కొనడం గమనించవలసిన ముఖ్యవిషయము!!

"అప్పకవీయములో లాలిపాటకు, పెండ్లిపాటకూ, దవళము, సువాలమున్నగు పాటలకు లక్ష్యములున్నవి.

ఆనందరంగరాట్ఛందములో సూళాదితాళకొట్నములు, ధవళములు, శోభనములు, ఆరతిపాటలు, జోలలు, ఏలలు, గొబ్బిళ్ళు మున్నగు పాటలు పేర్కొనబడ్డవి.

గుడారు వెంకటదాసకవి బలరామచరిత్రలో ధవళము, సువ్వాల, శోభనము, ఆరాత్రిక, లాలి మున్నగు పాటలు పేర్కొనబడ్డవి...

లక్షణదీపిక లో ధవళములు మున్నగు పాటలు పేర్కొన బడ్డవి.

కళాపూర్ణోదయములో జోలపాటలు, పెండ్లిపాటలు పేర్కొనబడ్డవి.

పోలువరదన్నువే నిదుర
బుచ్చుటకై తమతల్లి పైడి యు
య్యెల నిడి యూపుచో, గువల
యాధిపుపాటలు పాడినం గర

బలసుచు గేరి కేరి నగు
నన్న్యల పాటలు పాడినం, గరం
బలయుచు నేడ్చు, లోకు లవు
రా పతిభక్తియుటంచు నవ్వగన్
మంగళసూత్రము గట్టెగు
రంగాక్షికి నంతరంగ రాజేంద్రుడు పు
ణ్యాంగనలు పెండ్లిపాటలు
మంగలికోళ్ళ మృదుగీతి మధురిమ నెనయన్"

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములో యిట్లు వర్ణించబడినది:

"గాణల్మెచ్చగ బాడి రింపుదొలకంగా డాళ
మానంబులన్
క్షోణీనాథజయాంక సంకలితముల్
సూళాది గీతావళుల్
వాణీపాణి సరోరుహాంగళి నఖ వ్యాపార
లీలారణ
ద్వీణాసంచిత పంచమస్వాణ కళా
విఖ్యాత కంఠధ్వనిన్".

—చేమకూరి వేంకటకవి తన విజయవిలాసములో ధవళములనూ, అయిరేని పాటలనూ పేర్కొన్నాడు:

"కట్టిరి మంచి లగ్నమున కంకణముల్
కర పంకజంబులన్

8).

బెట్టిరి మేనులన్ నలుగు మేలిమృగీమద
కుంకుమంబులన్,
జుట్టిరి కైశికంబుల విశుద్ధ మనోహర
పుష్పమాలికల్
పట్టిరి పేరటాండ్రు దవళంబులు బాడుచు
నుల్లభంబులన్"

నాచన సోమన జాజర పాటలను గురించి ఈ క్రింది విధముగా పలికినాడు :

"వీణాగానము వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన బ్రాహ్మణ వీట
జాణలు మెత్తురు జాజఱ పాట"—

ఈ పాటలు ఎక్కువగా (బ్రాహ్మణవీట అన్నాడు) బ్రాహ్మణులలో ప్రచారమందు ఉండినవి అనుకోవాలి.

అయితే శ్రీనాథమహాకవి ఈ 'జాజఱ' పాటనే కాబోలును "జాదర" అని పేర్కొనడం గమనించవలసి యుంటుంది.

* "జాదర జాదరంచు మృదుచర్చరి
గీతలు వారుణీ రసా
స్వాద మదాతిరేకముల చంద్రిక
కాయగ దక్షవాటికా

* భీమేశ్వర ఖండములో—

వేదుల మీదటన్ కనక వీణలు
మీటుచు పాడిరచ్చరల్
మోదమెలర్పగా భువనమోహన
విగ్రహు భీమనాథునిన్"

అయితే మనం గ్రహించవలసింది — నాచన సోమన బ్రాహ్మణుల యింటి దనడం, (శ్రీ) నాథుడు అచ్చరల్ పాడేవనడం మాత్రమే. మొత్తంమీద ఈ జాజిరి లేక జాదర - పాటలు అప్పటికే. మంచి ప్రచారంలో వున్నాయనేదే—

(1) "పల్నాటి వీరుల చరిత్రను పిచ్చుకుంట్లవారును, కాటమరాజు కథను గొల్లవారును, ఎల్లమ్మ కథను బవనివారును చెబుతూండేవారు.

* "పనిచేసి గంజియైనను
అంబలైనను నెద చల్లగా
ద్రాగి యెచటనైన పడియుండి
వెన్నెల గుడిపాట పాడగా
పేదల కాత్మ సంప్రీతి కలుగు"—

— వెన్నెల పదాలు, వాలేశు పదాలు అని పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నదే ఈ "వెన్నెలగుడిపాట" అయి వుంటుం దేమో?

---

(1) ఆంధ్రుల సాంఘిక చరిత్ర —196

*సింహాసన ద్వాత్రింశికలో —

కవితలలోనూ, సంగీతంలోనూ, నాట్యంలోనూ, పాటలలోనూ - అన్నిటా రెండుపద్ధతులు ప్రచారమైనాయి. "దేశి", "మార్గ" - విధానమని!

సంగీత శాస్త్రములో మార్గ, దేశి విధానము లుండి నట్లు వివరించినారు. అలాగే "అగాయితాం మార్గ విధాన సంపదా" అనీ దేశిమార్గ లాస్యతాండవములు (కాశీఖండం) చెప్పినారు.

నాట్యములలో ముఖ్యముగా మార్గ, దేశి విశేషా లనుగురించి శ్రీనాథమహాకవి కాశీఖండంలో ఒకటికి రెండు సార్లు ఉదాహరించడం జరిగింది. జక్కిణి అనే దేశినృత్యం ఒకటి, చిందు అనే నృత్యవిధానం ఒకటి వున్నాయి. ఇందులో "జక్కిణి" నృత్యమునుగురించి దశవతార చరిత్రమునందు యిలా వర్ణించడం జరిగింది. అది ఇది:—

"దరుపదంబులు సొక్కమై సిరులు వొసగ
సరిగ నిరుగెల కుంచియల్ సవదరించి
పెక్కువగ జక్కిణీకోపు ద్రొక్కనొక్క
చక్కని మిటారి నరపతుల్ సొక్కి చూడ"—

—దీనినిబట్టి "జక్కిణీకోపు" ను ప్రజలు చాలా ఆదరించేవారనీ, చూసి ఆనందించేవారనే కాకుండా - నర పతుల్ సొక్కిచూడ" డంకూడా వుండడం నాడు ఈ దేశి నృత్య ప్రచారానికి - ప్రత్యేకతకు నిదర్శనంకదా?

"గొండ్లి" నృత్యవిధానముకూడా అప్పటికే ప్రచార ములోవున్న దేశిపద్ధతి ఆట ఒకటి వుంది. "గొండ్లి"

నృత్యాన్నే మనకోలాటంతో పోల్చుకోవచ్చు ననుకుంటాను.
అక్కడదాకా అనవసరం - తెలంగాణములోవున్న "బతుకమ్మ", రాయలసీమలోవున్న "బొడ్డెమ్మ" నృత్యపు ఆటపాటలే ఈ "గొండ్లియాట"కు సరిపోల్చుకోవచ్చును—

"*"... గొండ్లి యాడించుచున్నారు ♦ గొరగవడుచు
నాడుచున్న చూడు మూర్ధాభినయము
తాను నెట్టిక సీలంతగాని లేదు"—

అని చెప్పబడింది.

ఈ 'గొండ్లి' నృత్యం చాలా ప్రాచీనమూ, ప్రచారమూ అయినదని చెప్పడానికి మరొక్క ఉదాహరణ యిచ్చి ముగిస్తాను.

దీనినీ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తను ఆంధ్రుల సాంఘిక చరిత్రలోనూ పేర్కొనియున్నారు.

"ఆ కాలపు తెలుగు వాఙ్మయంలో గొండ్లి నృత్యమునుగూర్చి పలుమారు వ్రాసినారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిట్లు వ్రాసినారు. "జాయసేనాని తన నృత్తరత్నాకరములో - చాళుక్య భూలోకమల్లశోమేశ్వరుడు దానిని ప్రచారము చేసె" నని తెలిపి ఈ క్రింది ప్రమాణము నిచ్చెను :—

"కళ్యాణ కటికే పూర్వం
భూతమాతృ మహోత్సవే

---

* గొరగవడు — మైలారుదేవునికొలుచు ప్రీ అని సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొని యున్నారు.

♦ కుండలాకార నృత్యమే గొండ్లి.

సోమేశః కుతుకీ కాంచిత్
భిల్లవేష ముపేయుషీం
నృత్యంతీ మథ గాయంతీం
స్వయం ప్రేత్య మనోహరం
ప్రీతో నిర్మితవాన్ చిత్రం
* గోండలీ విధిమత్యయం
యతో భిల్లీ మహారాష్ట్రే
గోడిగీత్యభిధీయతే"—

(:) "జాను తెనుగు" ననేకదా రచనలు చేస్తానని వచించాడు నాచన సోముడు. అయితే ఈ "జాన తెనుగు" అంటే ఏది అనేది పాఠకునిలో కలిగే ప్రశ్న?

"తత్సమ, తద్భవ దేశి పదజాలంతో కూడిన భాష ఆంధ్రభాష అనబడుతుందని ప్రౌఢ వ్యాకరణ కర్త నిర్వచించాడు—"

"సర్వసామాన్యమైన తత్సమ తద్భవ దేశిపదజాలంతో కూడిన భాషే జాను తెనుగు అన్న నిర్వచనం"—

"ఆంధ్ర శబ్దం భాషాపరంగా తిక్కన కాలానికే వ్యవహారంలోకి వచ్చిందని నిన్నమొన్నటివరకూ పెక్కురు భావించారు. కాని తిక్కనకు పూర్వుడైన పాల్కురికి సోమన్నయే చతుర్వేద సారంలో భాషాపరంగా ఆంధ్ర శబ్దాన్ని

* గోండిలీ, గొండిలి — గొండ్లి
సురవరం ప్రతాపరెడ్డిగారు —

(:) "ఆంధ్రభూమి" 1961-1-8 — 5
చూ॥ జాను తెనుగు తీరుతెన్నులు వ్యాసం.

ప్రయోగించాడన్న సంగతి ఈక్రింది పద్యంవల్ల తేటతెల్లమగు చున్నది:-

"ఈ కృతి రచియించి యీ లోకమందు ప్ర
తిష్టింతు నీశ్వరాధిక్య మహిమ
నీ కృతి భావించి ఈ లోకమందు సం
పాదింతు జంగమపాత్ర మహిమ
నీ కృతి యొనరించి ఈ లోకమందు ని
ష్ఠింతు ప్రసాదనం సేవ మహిమ
నీ కృతి గావించి యీ లోకమున ప్రతి
పాదింతు బటుతర భక్తి మహిమ
నాద వృషభాంశజుడు బసవాధు
డట్టి కృతినాథు కృపచేత నిప్పుడాంధ్ర
భాష, ప్రకటింతు బద్యప్రబంధము
గను వసుధ సత్కవిసమ్మతి బసవలింగ"

దీనినిబట్టి ఆంధ్రభాషనే తెనుగు అనుకోవడంలో బాధ వుండదు-

వాఙ్మయ మహోద్యోగులు - మిత్రులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి మాటలలోనే -"జాను తెనుగంటే ఆంధ్రభాష అన్నమాటేకదా, అంటే ఆంధ్రభాషకూ, జాను తెనుగుకూ ఏ మాత్రం భేదం లేదన్నమాట!"

"నన్నయ తన భారత రచనలో తత్సమ, తత్భవ దేశి పద సమ్మిళితమైన ఆంధ్రభాషను ప్రయోగించిన నన్నయే

ఆ భాషను 'తెనుగు' భాషగా ఈ క్రింది పద్యాలలో నిర్దేశించాడు:—

"జననుత కృష్ణద్వైపాయన
మునినృపభాభి హిత మహాభారతం బ
బద్ధ నిరూపితార్థమేర్పడ
దెనుగున రచియింపు మధికధీయుక్తిమెయిన్"

అలాగే మరో ఉదాహరణ :—

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలునీని తరు
లక్ష్యర రమ్య తనాదరింపనా
నారుచి రార్థ సూక్తి నిధి
నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన
బంధురుడయ్యె జగద్ధితంబుగన్"—

దేశీయ రచనలు ఎన్ని రూపాలలో వుండేవో మనకు ఈ క్రింది రచన ఆధారంగా నూహించవగును:

వెలనాటిచోదుని బౌద్ధ గురువుతో చర్చలు జరపడానికి బయలుదేరిన పండితారాధ్యుడు వెనుక ఆయన శిష్య బృందం ఈ రకమగు పాటలు పాడుతూ, ఆడుతూ వెళ్ళినట్లు పేర్కొన్నాడు - అది యిది:—

"పదములు తుమ్మెద పదముల్
ప్రభాతపదములు శంకర

పదములు, నివాళిపదములు
తాళేసు పదములు, సంజ
పదములు, గొబ్బిపదములు
సంజవర్ణన మణిగణ
వర్ణన పదములు—"

ఆ మార్గాన్నే తదుపరి ఎంతోమంది అనుసరించారట. యేలపాటలనుకూడా మొట్టమొదట పాల్కురికి సోమనాథుడే రచించినట్లు - ఆంధ్రలోవున్న ఒకనది యేలానదిని వర్ణిస్తూ పాడిన పాటయే యేలపాట అనియు - ఈ వరుసలే యేలలుగా వచ్చినవనియు సాహిత్యరత్న శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి అభిప్రాయంగా పేర్కొని యున్నారు.

శ్రీ వీరేశలింగంవంటి భాషాకోవిదులు ఈ 'మార్గ-దేశి' లనుగురించి యిలా నిర్వచించి యున్నారు. "మార్గ రచన అంటే సంస్కృతభాషాకవిత్వమనీ, దేశి రచన అంటే తెలుగు మొదలైన దేశభాషా కవిత్వమనీ"- నుడివారు.

పోతే ఇక్కడ అప్రస్తుతం అనుకోండి - ఈ మధ్య నెవరో మిత్రులు "తెలుగురచనలోనే పై రెండుపద్ధతులూ - అనగా 'మార్గ-దేశి' పద్ధతులు వున్నాయనీ కూడా సెల విచ్చారు.

ఈ యేలపాటలు అనేవి సుగ్రీవుని పట్టాభిషేక సమయంలో, వాలి సంహార సమయమున శ్రీరామచంద్రుడు వచ్చినపుడు స్వాగతం పలుకుతూ వనితలు పాడిన పాటలే యేలలని విమర్శకుల అభిప్రాయము.

ఈ యేలలు రెండువిధములుగా కనబడుతున్నాయి.

ఒకటి : సుగ్రీవుడు శ్రీరామచంద్రునకు కానుకలు పట్టుకొచ్చిన సమయంలో చెంచీతలు యేలలూ పాడినారట. అవి యిలాగున్నాయి :

"భానువంశమునా బుట్టి
దానవ కామిని గొట్టి
మానివరులాసన్నుతింపగా
ఓ రామచంద్రా
పూనిముఖమూ నిర్వాహింపవా
రాతినాతి జేసి పూరా
రాతిచేతివిల్లూ విరిచి
భూతలేంద్రూలెల్లా మెచ్చగా
ఓ రామచంద్రా
సీతనూ వివాహమాడావా ?
పరశురాము భంగపరచి
భరతునకూ రాజ్యామిచ్చి
గురుడుబనుప నడవికేగావా
ఓ రామచంద్రా
సురలు, భూసురులు మెచ్చగా..."

సరే, పైన పేర్కొన్నది యేలపాటే. మరి నిమ్మనాధుని విరచితమయిన చిక్కయ్యచరిత్రలోని యేలపాటగా పేర్కొన్న ఈ క్రింది పాట యింకోలావుంది చూడండి...

"శరణు శరణు దేవరాయ
శరణు శరణు జనవిధేయ
శరణు దేవతారాధ్యా
శరణు వేదాంతవేద్యా
ఎన్ని జన్మములను నిన్ను
ఏనుపూజ చేసినానో
కన్నులార నిన్ను జూడ
కలిగెనే పవిత్రమైతి......"

దీనినిబట్టి యేలలు రకరకముల ఛందస్సులలో వివిధ రచయితలు రచించివున్నట్లు మనం వూహించవలసి యుంటుంది.

ఇటువంటి దేశి సారస్వతాన్ని గురించి పరిచయం చేస్తాను.



## 2

బాల వాఙ్మయానికి కర్తృత్వం వహించేది తల్లి హృదయం. తెలుగుతల్లులు తమ పాపలకు ఉగ్గుతో పాటు, పాలతో పాటు ఆటపాటలూ, కథలూ గాథలూ నేర్పడంతో - కావ్యరసాన్నీ, భక్తిరసాన్నీ కూడా రంగరించి పోశారు.

బాలలకు ప్రపంచంతో నిమిత్తంలేదు - కాని భవిష్యత్తు తమదే! తమకు ఈర్ష్యాద్వేషాలూ, కులమతాలూ, హెచ్చుతగ్గులతో సంబంధంలేదు. అందుకే వారి చేష్టలు, గెంతులు, పలుకులు, ఆటలూ - పాటలూ ఏ ఒకరికో అందం అనిపించి - ఆనందం కలిగించి - మకరందం కుమ్మరించేవి కావు. పిల్లల ఆటపాటలకు, చిలిపితనపు చిట్టిపనులకు,

తేనెచినుకుల యతిప్రశ్నలకు మురియని హృదయం – చూడని – వినని – సంతోషపడనివారు ఎవరు?

ఆటంబాంబులను గురించిన ఆలోచనలు వారికి వుండవు. భయం, కుట్ర – వారికి సంబంధించినది కాదు. లేదని బెంగా? ఉందన్న గర్వమూ?? అవి ఏవీ వారికి తెలియని విషయాలు! తినడం, ఆడుకోడం, పాడుకోడం – హాయిగా తల్లిబడిలో జోలపాటల కమ్మదనంలో నిదుర పోడం – యివే వారి ప్రపంచ విషయాలు – యివే వారి మనోభావ మందారాలు!!

బాలురు, బాలికలు – వీరు విడివిడిగా ఆడుకుంటూ పాడుకొనేవి, కలిసి పాడుకునేవి ఆడుకొనేవి కూడా చాలా ఆటపాటలు ఈ బాలవాఙ్మయంలో వున్నాయి.

చెడుగుడు ఆట, ఆకుఆట, కోతికొమ్మచ్చిఆటలు, వాటికి సంబంధించిన పాటలూ బాలురసొత్తు; బుజబుజ రేకుల పెండ్లి ఆట పాట, ఉయ్యాలఆట, తూరుతేపిల్లి, గొబ్బిళ్ళు – మొదలగు ఆటలూ వాటి పాటలూ బాలికలకు చెందిన కాపీరైటు హక్కు!!

ఈ ఆటల్లో – పాటల్లో పురాణగాథలు, జానపద కథలు, నీతులు, ఆరోగ్యవిషయాలు – ఆయుర్వేద రహస్యాలు – భవిష్యత్ రథసారథ్యానికి పరుగులు – భవిష్యత్ ప్రయాణానికి దారులు – ఎన్నో వున్నాయి!

మన ప్రాచీన వాఙ్మయంలో ఆటలను పేర్కొన్నారు –

పాటలద్వారా ఆటలు - ఆటలద్వారా పాటలు - ఈ రెండింటి సంబంధ సమ్మేళనంద్వారా శారీరకబలం, విజ్ఞాన హేతువూ కూడా!

పూర్వకాలంలో అనగా సుమారుగా నూటఏబది ఏళ్ళనాటి కవి (నారాయణకవి అనుకుంటాను) ఒక సీస మాలికలో ఆటలన్నింటినీ ఒక లిస్టుగాయిచ్చి వర్ణించాడు. అలాగే ప్రాచీన సాహిత్యంలో మన ఆటల వర్ణనలు చాలా చోట్ల వున్నాయి. మచ్చుకు ఈ క్రింది పద్యం చూడండి:

"దూచియు జాబిల్లి
బూచికన్నుల కచ్చి
గుడిగుడికుంచంబు కుందెనగిరి
చీకటి మొటికాయ
చింతాకు చణుదులు
పులియాటలును చిట్ల పొట్లకాయ
తూరనతుంకాలు తూనిగ తానిగ
చిడుగుడు మొకమూట చిల్లకట్టె
దాగిలిమూతలు తనుబిల్ల యాలంకి
గుప్పట గురిగింజ కొండకోతి
చిక్కణబిల్లయు జెల్లెను గోడుగును
బిల్లదీవులు లక్కిబిక్కి దండ
గడ్డెరబోడి యొక్కసి కొక్కుబయుగాయ
పోటు గీరనగింజ బొంగరములు..."

అని తెలిపినాడు - కాని యిందులో చాలా ఆటలు యిప్పుడు మనకు వినరావు, కనరావు...

ప్రస్తుతం మనకు అందుబాటులోవుండే విషయాలనే పరికిద్దాము :

మన ఆంధ్రదేశ చరిత్రను పరికిస్తే మహాకవి గురజాడ అప్పారావుగారు జానపద సరళిలో, కొన్ని రచనలతో కొత్త కొత్త రీతులలో భాషాసరస్వతిని అలంకరించారు.

పుత్తడిబొమ్మా పూర్ణమ్మా లాంటి గేయాలు, ఇంకా తదితరములూ - ఈ జానపద ఫణితులలోనే నడచినట్లు మనకు కనబడుతుంది. ఖచ్చితంగా చెప్పాలంటే తెలుగు కవిత్వానికి కొత్త మెరుగులు పెట్టి వ్యావహారిక భాషలో కవన అల్లిన నవయుగ వైతాళికుడు - మహాకవి గురజాడ వారే. రాను రాను చాలమంది కవులు ఈ ధోరణిలోనే రచనలు సాగించారు. ఈ నాటి ఈ తరహా రచనల కన్నింటికీ మూలపురుషులు అమరకవి గురజాడవారే.

నేటి బాలురే రేపటి పౌరులని గుర్తించిననాడు - నేడు తొడిగిన మొగ్గే రేపటి పూవన్న సత్యాన్ని అర్థం చేసుకొన్ననాడు - బాలపాటల యొక్క విలువను తృణీకరించక సరికదా, దేశానికి - దేశసౌభాగ్యానికి మాతృకగా ఎంచి గౌరవిస్తారు - పునరుద్ధరించి పూజిస్తారు.

అంతటి విలువ అయిన బాలపాటలను తెలుగు దేశంలో సేకరించినవారు కొలదిమంది వున్నారు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీ నేదునూరి గంగాధరం, శ్రీ టేకుమళ్ళ

కామేశ్వరరావు, డాక్టర్ బి. రామరాజు, ఎల్లోరా – (నేను) 'కృష్ణశ్రీ', ప్రయాగ- మొదలగువారు ఇంకా మరికొందరు వున్నారు.

బాలగీతావళి, పిల్లలపాటలు, గీతామంజరి, పాతపాటలు, బాలానందం పాటలు, బాలభావ — మొదలగునవి కొన్ని వున్నవి.

ఈనాడు పాతపాటల మాదిరిగానే కొన్ని పాటలు రచిస్తున్నారు కొంతమంది రచయితలు. ఈ రచనలలో కొన్ని జానపద సరళిలో – చక్కగానే వుంటున్నాయికూడా. అందుకు తార్కాణంగా కొన్ని రచనలు యిస్తాను:

ఈ క్రిందిపాట రచించినది అమరకవి గురజాడనాగు. ఈ పాట "ముత్యాలసరాలు" అన్న పుస్తకంలోనిది.

"ఆటలపాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
కలువల కన్నెల కన్నెల్లారా
పిల్లలగన్న తల్లుల్లారా
విన్నారమ్మా ఈ కథను—"

ఈ పాట చూడండి – ఎంత సరళంగా – నిర్మలంగా బాలలహృదయాలకు యిట్టె అంటేలాగ ఎలా సాగుతుందో.

అలాగే ఈ రచన శ్రీ చింతా దీక్షితులుగారు రచించినది చూడండి. ఈ గేయం "లక్కపిడతలు" అను పుస్తకంలోనిది.

"బాజాలురా నాన్న బాజాలు
బజాలు వచ్చాయి బాజాలు
బాజాలతో వచ్చె పల్లకీ అదిగో
పల్లకీలో ఉంది పార్వతీ దేవి
పార్వతీ దేవికీ జేజేలు పెట్టు—"

ఈరచన ఎంత మనోహరంగా వుందంటారు? బాజాలు, పల్లకీ, పార్వతి - జేజేలు - అన్నపదాలు పాప నేర్చుకోడం ఒకటి. ఆ బాజాలతో కూడిన పాలకీలో - జేజేలు పెట్టవలసిన పార్వతి రావడం - అర్థమవుతుంది.

అలాగే నా ('ఎల్లోరా') స్వంతరచన "ఎర్రపూలు" అను పుస్తకంలోనిది వినండి.

"శ్రావణమాసాన చవితి వెళ్లాక
బొమ్మలా పెళ్ళండి కమ్మగా విందు.
చెప్పలేదని తలచి రాకపోయేరు
విందుకై ఎన్నెన్నొ వింతలుంటాయి.
బొమ్మలాపెళ్లికీ ప్రోగ్రాము లివిగో,
కప్పదప్పులతోటి కోకిలా గానం,
నెమలి నాట్యంతోటి హంసనృత్యాలు
అప్పుడే మీకంత ఆరగింపూలు,
తేనెటీగలు అన్ని తేనెకడవలతో
చిలుకబంధువులంత పండ్లబుట్టలతో
వస్తారు తెస్తారు విందు చేయంగ
రావాలి తప్పకా విందు గుడువంగా

విందు జరిగేచోటు వినిపింతు వినుడు.
జాజిపూలతోట మల్లెపందిరిలో
మాధవీలతప్రక్క మందార చెంత
మంచిగంధపు మాను మంచాలు వేసి
మల్లెపూవులపాన్పు ఇల్లంత పరచి
పసుందాకు దర్జాకు లోటు లేకుండ
విందు వినోదాలు తెల్లవార్లూను
చేశాము యేర్పాటు చెప్పుతున్నాము.
రావాలి మరువకా రావాలి సుమండీ
రాజు రాణీగార్ల పెళ్ళి రేపండి
అందుకే యింతగా పెళ్ళి పిలుపండి."

ఈ విధమైన గేయాలను - చక్కని శైలి, సడకా వున్న గేయాలను ఎంతోమంది వ్రాస్తున్నారు. శ్రీ కవిరావు, శ్రీ బి. వి. నరసింహారావు, శ్రీ నార్ల చిరంజీవి, శ్రీ కె. సభా, మొదలగువారు - ఇంకా ఎంతోమంది రచయితలు వ్రాస్తున్నారు - తయారవుతున్నారు.

బాలసాహితిగా పేర్కొనదగిన జానపద గేయాలను యిక్కడ పరిచయం చేస్తాను.

పూర్వకాలపు పిల్లల గేయాలను ఎవరు రచించారో అంతగా తెలియదు. కాని, ఆ పాటలు మన తెలుగునేల నాలుగుచెరగులా - ప్రతితల్లి నోటా కంఠస్థమై ప్రచారానికి వచ్చాయి. ఈ పాటలు అనేక రీతులలో అనేక ప్రబోధిత రూపాలలో రచింపబడి వున్నాయి. పూర్వకాలపు బాల సాహితిలో ఎంత తేలిక భాష వాడబడిందో గమనించండి.

ఒక్కొక్క పనికి, ఆటకు ఒక్కొక్కపాట. లేచింది మొదలు పడుకొనేవరకు జరిపే ప్రతిపనికీ ఈ పాట – పని విలువను ప్రతిబింబిస్తుంది. అటువంటివాటిలో కొన్ని పరిచయం చేస్తాను.

ఉదయాన్నే చంటిపిల్లవాడు లేస్తాడు. అలా లేచీలేవడంతోనే మన యిళ్ళలో ఆముదము (ఉగ్గు) పెట్టడం పరిపాటి. అలా ఉగ్గుపెట్టే సమయంలో పాడే ఈ పాటలు చూడండి.

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రాలుతిన్న గుగ్గిళ్ళు జీర్ణమై..."

అంటూ ఉగ్గుతోపాటు పాతకథలను రంగరించి, బోధించి – ఆఖరున

"అబ్బాయి త్రాగిన పాలూ ఉగ్గూ జీర్ణమై
కుందిలాగ కూర్చుని
పందిలాగ ప్రాకి
లేడిలాగ లేచి
నందిలాగ నడిచి
తాంబేలులాగ..."

అంటూ తన కొడుకు కుందిలాగ కూర్చొని, పందిలాగ ప్రాకి, లేడిలాగ పరుగెత్తి–వాటిలాగే మంచి పుష్టికలిగి ఆరోగ్యవంతుడుగా అవాలని, ఆ తల్లి తన దీవెనలను పాట రూపంలో పాడుతుంది.

అక్కడినుంచి స్నానానికి తీసుకువెడతారు పాపని.

"అమ్మకడుపు చల్లగా
అత్తకడుపుచల్లగా
లెక్కలేని సొమ్మెట్టుకుని
పుట్టంలేని బట్టకట్టి
అనుమూ తునుమూ
మునిమనుమలతో వర్ధిల్లాలి..."

అంటూ తలకు నూనె పెడ్తూ దీవిస్తారు. అటు అత్తగారి వెంపూ, ఇటు పుట్టింటి వెంపూ సుఖంగా వుండి ఆయురారోగ్యాలతో వర్ధిల్లమని.

స్నానం పూర్తి అయాక తలతుడిచి – కాళ్ళమీద కూర్చోబెట్టుకుని ఆడిస్తూ పాడేపాటలు వినండి:

"గుమ్మాడమ్మా గుమ్మాడీ
ఏవూరు వెళ్ళింది గుమ్మడీ
ఏం తెచ్చింది గుమ్మడీ
వేలూరు వెళ్ళింది గుమ్మడీ
వెలక్కాయ తెచ్చింది గుమ్మడీ..."

అంటూ ఆడిస్తూ ఊపుతారు, అలా వూపుతూ పాటలు పాడుతూవుంటే చక్కగా నిద్రపోతారు పిల్లలు. అప్పుడు ఉయ్యాలలో పడుండబెట్టి చక్కగా పాడుతూ వూపుతారు. ఈ సమయంలో పాడే పాటలని లాలిపాటలనీ, జోలపాటలనీ, ఉయ్యాలపాటలనీ వ్యవహరిస్తారు. ఈ పాటలను సరైన వరుసలలో చక్కని గొంతుతో పాడుతుంటే ఆ సమయంలో పెద్దవాళ్ళకే కునికిపాట్లు వస్తాయంటే ఆశ్చర్యంలేదు.

ఒకవేళ ఎంత ఊపినా నిద్రపోక చంటిపిల్లలు ఏడుస్తూంటే పాడే యీ పాటలో పాపమీాదవుండే బలమైన ప్రేమకొద్దీ తల్లి

"ఏడవకు ఏడవకు వెర్రి చల్లమ్మ
ఏడిస్తె నీకళ్ళు నీలాలు గారు
నీలాలు గారితే నే చూడలేను..."

అంటూ తన ప్రేమను వెలిబుచ్చుకొని - కన్నబిడ్డ కనుల నీరు పెట్టడం చూడలేక...

"పాలైన కారవే బంగారు కండ్లా..."

అని వాపోతుంది తల్లి. అలాగే ఈ గేయం పరికించండి—

"పిల్లరావే తల్లి పిల్లలకు తల్లి
పిల్లలకు నీళ్ళోసి పల్లెలకు పంపి..."

అన్నపాటలో ఎంత ఆనందముందో? చంటి పాపడని చూసి, ఎప్పుడు పెద్దవాడవుతాడా అని ఉవ్విళ్లూరే తల్లి సంతోషం పట్టలేక...

"ఆడి రాగా ముద్దు
వాడి రాగా ముద్దు
నట్టింట అబ్బాయి
నడవంగ ముద్దు—"

అనుకుంటుంది - అంతకంటే మాతృహృదయం ఏం కోరుకుంటుంది చెప్పండి!

ఏ కందిపప్పు బద్దలు కావాలనో, బెల్లం ముక్క కావాలనో ఏడుస్తూ ఎంతకీ ఊరుకోకపోతే, తల్లి పాపను బెదిరిస్తూన్నట్లుగా పాడే ఈ పాటలు చూడండి...

"అదిగో బూచివాడు
మన అటక మీదున్నాడు
ఏడుస్తే వాడు నిన్ను
ఎత్తుకు పోతాడు..."

అంటూ భయపెట్టి మాయబుచ్చ చూస్తుంది తల్లి. కాని అంతదాకా భయపెట్టిన తల్లే గారంతో...

"అల్లరి చేయకమ్మా
నీకు బెల్లము పెట్టెదనమ్మ
అల్లరి చేయకమ్మా
పల్లకీ ఇదిగోనమ్మ..."

అని ఓదార్చ చూస్తుంది మళ్లీ.

జడవేసుకోకుండానో, కాటిక పెట్టించుకోకుండానో గడబిడచేస్తూ ఉండే సమయంలో తల్లి - తన పిల్ల ఎంత బుద్ధిమంతురాలైనా - పక్కింటి పిల్ల ఎంత అల్లరిదైనా - ఆ పిల్లనే మంచిదాన్నిగా చూపిస్తూ...

"కన్నతల్లి నీవు
కాటుక పెట్టించుకోవె
వాళ్ళ అమ్మాయి చూడు
నిను చూసి నవ్వుతోంది—"

అని పక్కింటి తోటిపిల్లల మీద తెలియకనే ద్వేషం నేర్పు తారు. ఇది మన పూర్వపు పాటలలో వున్న మహా దోషం. భయపెట్టి పనిచేయించడం, ద్వేషాన్ని పురి గొల్పడం అదియిస్తా ఇదియిస్తా ఈ పనిచేస్తావా? అని లంచం అలవాటు చేయడం మొదలు పెడతారు.

ఈ పప్పూ, బెల్లం అలవాటు పెద్ద అయాక కూడా పోదు. ఏదైనా అవసరమొచ్చి దగ్గరకు వెడితే ఏం యిస్తావు? అనడం వరకూ ఈ అలవాటు పెరుగుతుంది.

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఉత్తమమాత లక్షణాలు శీర్షిక క్రింద ఈ విషయాన్ని చాలా గొప్పగా చెప్పారు. కనుక పూర్వపు పాటలలో వున్న యిటువంటి - లంచం, భయం, ద్వేషం - అలవాటు చేసే వాటిని మనం మరచిపోవాలి - వాటిని వదిలిపెట్టెయ్యాలి.

చిన్నతనంలో ఉగ్గుతో రంగరించి - బోధించే మంచి విషయాలే పెద్ద అయాక కీర్తి ప్రతిష్ఠలకు పునాదిగా వుంటాయి. చిన్ననాటి ఉగ్గుబోధలే రేపు కీర్తికి బాటలు వరచి క్రాంతికి అంకురార్పణ చేస్తాయి.

పాటలు ద్వారా ఆటలు :-

ముసలితనంలో కదల నవసరం లేకుండా ఉండేపని - పిల్లలను ఆడించడ మొక్కటే, పిల్లలను దగ్గర కూర్చొబెట్టు కుని - ఆటల రూపంలో పాడే ఈ పాటలు గమనించండి.

"కాళ్ళాగజ్జీ గంగానమ్మా
వేగూ చుక్కా వెలగా మొగ్గా..."

అంటూ ఆడిస్తారు. ఈ ఆటపాటల్లో చక్కని శరీర వ్యాయామం కూడా ఉంది. ఇదే పద్ధతిలో భక్తీ, బలం, కలిగించే ఈ పాటలు వినండి:

"తప్పట్లోయ్ తాళాలోయ్
దేవుని గుళ్లో బాజాలోయ్..."

అంటూ ఆడించి, మా పాపకు పాలూ, ఉగ్గూ అని నవ్విస్తారు. అలాగే ఈ క్రిందిపాట...

" ఒక్కా ఓ చెలియా
రెంతూ రోకళ్లూ
మూడూ ముచ్చిలుకా
నాలుగు నందన్నా
అయిదూ చిట్టిగోలుసు
ఆరూ జవ్వాజి
ఏడుం బేడీలు
ఎనిమిది వెన్న ముద్ద
తొమ్మిది తోవచ్చు
పది పటిలేడు ... "

అనే ఈ పాట అంకెలు నేర్పడానికి చాలా ఉపయోగిస్తుంది. అలాగే చంటిపాపకు అన్నం తినుపించు సమయంలో ఏ వెన్నెల కాంతిలోనో వుండి - చందమామను చూపిస్తూ, పిల్లవాడిని మాయపెడ్తూ ఈ పాటలు పాడతారు. ఈపాటలు వింటూంటే మన చిన్నతనం కళ్ళముందు కనిపించడం లేదంటారా?

"చందమామ రావె
జాబిల్లి రావె
కొండెక్కి రావె
కోటి వేలు తేవె
పైడి గిన్నెలో
పాలు పోసుకుని
వెండి గిన్నెలో
పెరుగు పోసుకుని
ఒలవని పండూ
ఒళ్లో వేసుకు
ఒలచిన పండూ
చేత్తో పట్టుకు
అ_ా అలా తిరిగొచ్చి
అమ్మాయి కియ్యవే..."

ఈ పాట పాడుతూ, మధ్యమధ్యన కబుర్లు చెబుతూ అన్నం పెడితే ఎంత అల్లరి పాపలైనా ఇట్టే బువ్వ తినేస్తారు.

అలాగే పసిపాపలకు – తొక్కుపలుకులని సంభాషణ రావడానికీ, నోరు సునాయాసంగా తిరగడానికీ యీ పలుకులు నేర్పుతారు.

"ధిమిత ధిమిత
ఏమి ధిమిత?
పసుపు ధిమిత!

ఏమి పసుపు
ఛాయ పసుపు ... "

ఇలాంటి పాటలు చాలా వున్నాయి.

అలాగే బాలురలో చిన్నతనంనుంచీ పరిశీలనా పటిమను అభివృద్ధి చేయటానికి పనికివచ్చే ఈ పాటను పరిశీలించండి:

" వీరీ వీరీ గుమ్మడిపండూ
వీరెవ్వరోయ్ ?
దాగుడుమూతా
దండాకోర్
పిల్లీ వచ్చే, ఎలుక భద్రం
ఎక్కడి దొంగలక్కడికే
గప్ చిప్ సాంబారుబుడ్డి ... "

ఈ పాట వ్యాయామాన్ని, పరిశీలనా పరిజ్ఞానాన్ని కూడా పాపలకు అందిస్తుంది. ఇంతేకాదు – ఈ రకములైన బాలపాటల్లో కొన్ని ఆయుర్వేద రహస్యాలు కూడా వున్నాయని అంటారు...మచ్చుకు :

" కొండమీద వెండిగిన్నె
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందూ ? ... "

అని ప్రశ్నించి ...

" వేపాకు చేదూ
వెల్లుల్లిగడ్డా

నూనెమ్మ బొడ్డూ
నూటొక్క సారీ
పూయవోయి నూరి
పూటకొక్క తూరి ... ”

అని సమాధానం యిస్తుంది. ఇటువంటి ప్రథమ చికిత్సా ప్రబోధితములయిన పాటలు యింకా ఎన్ని ఉన్నాయోకదా ?

కొంతమంది గుంపులుగా చేరి ఆడుతూ పాడే యీ పాట చూడండి, ఎంత వ్యాయామం యిస్తుందో?

“ అల్లల్లా కోడి పిల్లల్లా కోడి
గుట్టమీాదా కోడి గవ్వల్లా కోడి...”

అంటూ పాటపాడుతూ – ఆటలాడి తిన్నది అరగించుకొంటారు పిల్లలు. అటువంటిదే ఈ బాలగేయం కూడా:

“ ఒకటీ ఒప్పిందం
రెండూ దశి తండ్రీ
మూడూ త్రిమూర్తీ
నాలుగూ వేదాలు...”

అలాగే —

“ రావే రావే బాలా
ఆడుతు పాడుతు రావే
ఒకటీ, రెండూ వయ్యారిబాలా
రెండూ, మూడూ ముత్యాలబాలా...”

అంటూ సాగుతుంది.

ఈ కోలాటం పాటను వినండి - ఎంత ఇంపుగా, సొంపుగా - తాళయుక్తంగా - దృశ్య మనోహరంగా వుంటుందో —

" అటవీ స్థలముల కరగుదమా
వట పత్రంబులు కోయుదమా !
జనులారా గుమి గూడుదమా
జటకోలాటము వేయుదమా!
నొకరి నొకరి తా-
నొక కుడియడమల
నొప్పుగ దీనిని తిప్పుదమా!
మంచిగంధమూ తీయుదమా
చెంచిత మెడకిది పూయుదమా!
మల్లెపూవులూ కోయుదమా
మందయానపై జల్లుదమా
కోతికొమ్మచ్చు లాడుదమా
కోరివనంబుల చేరుదమా
దాగుడుమూతా లాడుదమా !
తరువుల చాటున దాగుదమా
విప్పపువ్వులూ ఏరుదమా!
విసువక మనమిపుడు పోవుదమా !!

పై పాటను గుంద్రంగా కూడిన బాలికలు కోలాటం కర్రలు చేత ధరించి కథానాయిక కథ చెబుతూంటే మిగిలిన

జట్టు తిరిగి పాటను చెబుతుంటారు. ఒకరిని తప్పించుకు ఒకరు తప్పుకుంటూ, ఒకరి కోలాట కర్రలతో మరొకరు కొడుతూ, కాలి అడుగులు తాళం మాదిరి మార్చుకొంటూ, వెనుకకూ, ముందుకూ మారుతూ, యింకా ఒకరిని తప్పించుకుని ఒకరు కోల వేస్తూ పాడే ఈ పాట, వేసే కోలాటం - చాలా యింపుగా వుంటుంది - ఇటువంటి కోలాట పద్ధతులు యింకా బాలికోన్నత పాఠశాలల్లో వేయిస్తున్నారు.

ఇలాగే గొబ్బి తట్టడం కూడా! గొబ్బిపాటలు చాలా ప్రాచీనమైనవి. "గొబ్బియళ్లో" పాదాంత పదం చాలా చోట్ల మనకు దర్శనమిస్తుంది. అన్నమయ్యగారి సంకీర్తనలలో మనకు ఈ గొబ్బిళ్లు వినిపిస్తాయి!" కొలని దోసరికి గొబ్బిళ్ళో, యదుకుల సామికి గొబ్బిళ్ళో—అన్నది!"

ఈ కోలాటం పాటలూ, గొబ్బి పాటలూ సామాన్యంగా పౌరాణికంగానే వుంటాయి!

గంగమ్మ గౌరమ్మ అప్ప సెల్లెండ్రూ -
గొబ్బియళ్ళో! గొబ్బియళ్ళో!!
ఒక తల్లిబిడ్డలకు వైరములేదు ,,
మంచి మంచి పూలేరి ఒక రాసిపోసిరి ,,
కానరాని కలువలేరి ఒక రాసిపోసిరి ,,
ఏడుమూర లింటిలో ఏడొక్కతూము ,,
ఏడొక్క తూమేసి ఎల్లా కొలిపించే ,,
పోగిడి ఒక తూమేసి పారా కొలిపించె ,,
గరిపెడు తీసేసి గంగా కెత్తండీ ,,

మంచి మంచి పూలేరి మామయ్య కంపె "
కానరాని పూలేరి గారమ్మ కంపి "
అక్కనూ చెల్లినీ ఒక్కరీ కిచ్చె! "

—చెమ్మఆట అని పిలవబడే ఈ పాటలో అవతార వర్ణనలు ప్రత్యక్షం అవుతున్నాయి!!

కొండెకూ పూలు జుట్టవే!
అమ్మ నన్ను
గోపాలకృష్ణుడనావే!!
చిన్నారి నామాలెట్టవే!
అమ్మ నాకు
వన్నెలా సొమ్ము లెట్టవే!!
వీరుడని నన్ను పిలువవే
అమ్మ నన్ను
వీరులాఖ్యాతి అనవే!!
కుచ్చులా జడలు వెయ్యవే!
అమ్మ నన్ను
కూర్మావతారుడనావే!!
పతకాలు నాకు వెయ్యవే!
అమ్మ నన్ను
అయోధ్య రాముడనావే!!
చేతి వంకెలు నాకుపెట్టవే!
అమ్మ నన్ను
వైకుంఠ వాసుడనావే!!

12)

వేలికుంగరం నాకు పెట్టవే!
అమ్మ నన్ను
వెలలేని కృష్ణుడనావే!!

మొలకు గజ్జెలు నాకు పెట్టవే!
అమ్మ నన్ను
మోహనావతారుడనావే!!

కాలికందెలు నాకు పెట్టవే!
అమ్మ నన్ను
కలికావతారుడనావే!!

ఒళ్ళంత సొమ్ము లేయవే!
అమ్మ నన్ను
వజ్రాల వాసుడనావే!!

పట్టుపంచలు నాకు కట్టవే!
అమ్మ నన్ను
పార్వతీ తనయుడనావే!!

—పండుగలకు సంబంధించిన పాటల్లో అట్లదద్ది, ఉయ్యాల పాటలు ప్రధానమైనవి. అట్లతద్ది బాలికలకే సంబంధించినదైనా, వ్రతం, పూజ మినహాయించి మిగిలిన అన్నిటా అంటే అట్లు. తిమ్మనం తినడంలోనూ, ముంతక్రింద అన్నం తినడంలోనూ, పిల్లలతో తెల్లవారుజామున నేలేచి చరుచుకుంటూ, ఆడి, పాడి, ఊయలలూగి — గెంతడంలోనూ బాలురకూ పాలువుంది!

అట్లతద్దోయ్
ఆరట్లోయ్!
ముద్దపప్పోయ్
మూాడట్లోయ్!
పడకలమీాదా
పిల్లలారా - జల్లలారా
లేచి రారండోయ్!!
పీటాక్రింద పిడికెడుబియ్యం
పిల్లలారా, జల్లలారా!
లేచీ రారండోయ్!

వెన్నెల వెలుగుల్లో ఒక గ్రూపు అటు ఒక గ్రూపు యిటు నిలుచుండి పెళ్ళి ఆట అని ఆడుతారు.

చిట్టి మీా రేమిటివారే
చిట్టికా- మీా రేమటివారే!
పూర్ణి మీా రేమిటివారే!!
తామర మొగ్గల్లా!!

చిట్టీ మేం వ్యాపారులం
చిట్టికా- మేం వ్యాపారులం!
పూర్ణి మేం వ్యాపారులం!
పూర్ణకా- మేం వ్యాపారులం!
తామర మొగ్గల్లా!!

చిట్టీ మీా వ్యాపారమేమి?
చిట్టికా- మీా వ్యాపారమేమి?
పూర్ణీ మీా వ్యాపారమేమి?

పూర్ణక్కా మీా వ్యాపారమేమి?
తామర మొగ్గల్లా!!

చిట్టీ మేం రత్నాల వ్యాపారులం
చిట్టెక్కా మేం రత్నాల వ్యాపారులం!
పూర్ణీ మేం రత్నాల వ్యాపారులం
వర్ణక్కా మేం రత్నాల వ్యాపారులం
తామర మొగ్గల్లా!!

గుజగుజ రేకుల పిల్లుందా?
గుజ్జా రేకుల పిల్లుందా!
స్వామీా దండల పిల్లుందా?
సహారాజులు మెచ్చే పిల్లుందా!!

గుజగుజ రేకుల పిల్లుందీ!
గుజ్జా రేకుల పిల్లుందీ!
స్వామీా దండల పిల్లుందీ!
సహారాజులు మెచ్చే పిల్లుందీ!!

గుజగుజ రేకుల పిల్లాడున్నాడా?
గుజ్జా రేకుల పిల్లాడున్నాడా!
స్వామీా దండల పిల్లాడున్నాడా?
సహారాజులు మెచ్చే పిల్లాడున్నాడా?

గుజగుజ రేకుల పిల్లాడున్నాడు!
గుజ్జా రేకుల పిల్లాడున్నాడు.
స్వామీా దండల పిల్లాడున్నాడు
సహారాజులు మెచ్చే పిల్లాడున్నాడు!!

గుజగుజ రేకుల పిల్లనిస్తారా?
గుజ్జా రేకుల పిల్లనిస్తారా?
స్వామీదండల పిల్లనిస్తారా?
సహారాజులు మెచ్చగ పిల్లనిస్తారా!!

గుజగుజ రేకుల కట్నమెంత?
గుజ్జా రేకుల కట్నమెంత?
స్వామీదండల కట్నమెంత?
సహారాజులు మెచ్చగ కట్నమెంత??

గుజగుజ రేకుల జరీకుచ్చులు!
గుజ్జా రేకుల చంద్రహారాలు!
స్వామీదండల్ల ఒడ్డాణం
సహారాజులు మెచ్చగ సూరీడూ!!

గుజగుజ రేకుల మాకొద్దూ
గుజ్జా రేకుల మాకొద్దూ!
స్వామీదండల మాకొద్దూ
సహారాజులు మెచ్చగ మాకొద్దూ!!

గుజగుజ రేకుల పిల్లాడి కట్నమెంత?
గుజ్జా రేకుల పిల్లాడి కట్నమెంత?
స్వామీదండల పిల్లాడి కట్నమెంత?
సహారాజులు మెచ్చగ పిల్లాడి కట్నమెంత??

గుజగుజ రేకుల రవ్వంగరాలూ
గుజ్జా రేకుల కడియాలూ!

స్వామీదండల హారములూ!
సహారాజులు మెచ్చగ తారాయి!!

గుజగుజ రేకులు మాకొద్దూ
గుజ్జా రేకులు మాకొద్దూ!
స్వామీదండలు మాకొద్దూ!
సహారాజులు మెచ్చగ మాకొద్దూ!!

గుజగుజ రేకుల చీనాంబరాలు తెచ్చాము!
గుజగుజ రేకుల జల్తరురవికలు తెచ్చాము!
స్వామీదండల వండ్లూ వసుపూ తెచ్చాము!
సహారాజులు మెచ్చగ పెండ్లికి వచ్చాము!!

—ఆటలు ఆడుకుంటూనూ, పాటలు పాడుకుంటూ కూడా పిల్లలు తమ పంటలు బాగా పండాలనీ, గాదెలు నిండాలనీ, అమ్మ వండితే తమ బొజ్జనిండాలనీ కోరుకొనే పసి హృదయపు లోతు ఎంతటిదో?

వానలు కురవాలి
వరిచేలు పండాలి
బుడుగో బుడుగో!
మాగాదె నిండాలి.
మాదాసి దంచాలి
బుడుగో బుడుగో,
మా అమ్మవండాలి

మా బొజ్జ నిండాలి!
బుడుగో బుడుగో!!

ఈ 'బుడుగో బుడుగో' పాట గిరగిరా తిరుగుతూ పాడ తారు!

—ఒక చేతిమీద ఒక చెయ్యిపెట్టి ఆడుతూ పాడేది ఈ పాట.

గుడిగుడి గుంచం
గుండా రాగం!
పాములపట్నం
పడగారాగం!
కత్తైనా బద్దైనా?
వేస్నిళ్ళా! చన్నీళ్ళా?

—అలాగే చంటిపిల్లాడిని నవ్వించడానికి ఆటగా పాడేది ఈ పాట:

చేతులు కడిగి
అరిటాకేసి
పప్పుపెట్టి
బువ్వపెట్టి
కూరేసి
నెయ్యోసి
చారోసి

మజ్జిగోసి
అత్తారింటికి బారేదోయ్?
అంబలికుండకి చిల్లేదోయ్??

— పాటలుపాడి ఆడిస్తూ అందులోనే బాలలకు భక్తి, నీతి గరపడం బాలగేయాలలో ఒక ప్రత్యేకత! అందుతో పాటు మన వంటలపేర్లు, వాయిపరుసలు, వస్తువులు, దేముళ్ళ పేర్లు నేర్పడంతోపాటు ఆయుర్వేద రహస్యాలుకూడా రంగరించి నేర్పడం చాలా గొప్పకదూ మరి!

కొండమీద
వెండిగిన్నె
కొక్కిరాజు
కాలువిరిగె
దానికేమి మందు?

—అని, కాలువిరిగిన కొక్కిరాజుకు మందు ఏమిటో ఈ పాటే చెబుతూంది:

వేపాకు చేదు
వెల్లుల్లిగడ్డ
నూనాయి బొడ్డు
నూటొక్కదార

—అని మందుకూడా చెప్పి ఆయుర్వేద సూత్రం ప్రబోధిస్తుంది. ఇటువంటి పదాల ప్రత్యేకత ఎంత విలువైనదంటారు!

ఈ విధంగా పాటల ఆటలను, ఆటలతో కూడిన పాటలను పరిచయం చేసుకురావాలంటే - నేను ప్రత్యేకం బాలల కోసం బాలకవితలకు (జానపద)సంబంధించి తయారుచేసిన 'బాల గీతాల' పుస్తకం అంత అవుతుంది. ఇక్కడ మచ్చుకు కొన్ని మాత్రమే పరిచయం చేశాను! ఆఖరున మన ఆటలను పరిచయంచేసి ముగిస్తాను.

"చెడుగుడు దోబూచి చిట్లపొట్లకాయ
గుడుగుడుగుంచాలు గూవనాళ్ళు!
చీకటి మొటికళ్ళు సిరిసింగనావత్తి
కుప్పిగంతులు నెట్లుకుందికాళ్ళు!
తూరనతువాలు గీరనగింజలు
గుజగుజరేకులు గుంటచాళ్ళు!
పింపిళ్ళు కుచ్చెళ్లు పిడిగృద్దులాటలు
దాగిరి ముచ్చులు, తన్నుబిళ్ళ!
బొమ్మరాలువ్వలపోటీ వెన్నెలకుప్ప
లప్పళావాలంకు లందలములు!
పుట్టచెండ్లుప్పనబట్టె లచ్చనగండ్లు
పిల్లదీపంబులు పిల్లగోళ్ళు!
గంజనగాలీనెగాజులు నాల్గు
కంబాలాటఃట్టిన గోలెలాకే!
పీకెటబొమ్మల పెల్లిండ్లునో మన
గుంటలు గుజ్జెన గూళ్ళనండి!
కోలక్రోతుల గొబ్బెళ్ళు కుంచెనగుడి

గచ్చకాయలు కలుమూసి గంతలల్లి
చిక్కనాబిల్లలోటిల్లు చిందెరయున
నొప్పునాటల పేర్లయి యువిదలార!"

చూడండి—ఎన్ని ఆటలు వున్నాయో ఆడుకోడానికి? మరి అన్ని ఆటలు నేడు ఆడుకోడానికి అంత సమయముందా అనేదే ఆలోచన! — ప్రశ్న!!

మన ఆటలను గురించి ముఖ్యంగా ప్రాచీన క్రీడలను గురించి మన ప్రాచీన కావ్యాలలో ప్రశస్తి మెండుగా కనుపిస్తుంది — దీనినిబట్టి పైన మనం చదివిన ఆటలు అన్నీ చాలా ప్రాచీనమైనవని మనం గుర్తించ గలుగుతాం!

ఈ విధంగా ఉదయం లేచింది మొదలు తిరిగి నిద్దుర పోయేవరకూ — జరిపే ప్రతిపనికీ పాటలద్వారా—ఆటలద్వారా సంరక్షణ జరుపుతారు — పిల్లలకు అందులోనే చక్కని నీతులూ, కథలూ నేర్పుతారు!



# 3

తెలుగు సాహిత్యంలో జానపద వాఙ్మయానిది ఓ ప్రత్యేకత - అందులో స్త్రీలపాటలది మరో ప్రత్యేకత.

జానపద గేయ వాఙ్మయంలో ప్రమదల ప్రత్యేకత చాలా కనిపిస్తుంది - ప్రమదల పెదిమలనుంచి వెలువడే ప్రతి పాటా, పదం ఒక ప్రత్యేకతనీ, గౌరవాన్నీ రంగరించుకొని మానవ హృదయాలను చక్కలిగింతలతో ఊయలలూపు తుండం టే ఆశ్చర్యంలేదు.

తొట్టిలో పాపను పరుండబెట్టి నిద్రబుచ్చుతూ పాడే లాలిపాటలు మొదలు వృద్ధాప్యం పొంది జీవితానుభవాలను ఎత్తికరించే తత్త్వాలదాకా సిరి గళాలనుంచి గగనవీధి దద్ద రిల్లేలాగ భావపూరితమైన పాటలు ఎన్నో వెలువడుతాయి. ఒక్క

మాటలో చెప్పాలంటే-మానవజాతి ప్రతిబింబాన్ని ప్రతిధ్వనింప జేసే సాహిత్యం స్త్రీలసాహిత్యం అంటేచాలు. చూడండి: తెలుగుపదముచు నిలువని వాకిలి, గడప,ఉత్సవం, పెళ్ళి, యిల్లు ఏముంది? పురుషునితో పాటు, సంఘంతో పాటు, సమాజంతో పాటు అన్నిరంగాలలోనూ-అన్ని వెంపులనుంచీ స్త్రీ మనకుకనిపి స్తుంది.మనతో సహకరిస్తుంది.సహజీవనం సల్పుతుంది-కష్టనష్టా లను సమానంగా పంచుకొని సమాజపు పల్లకీని ఓ భుజంతో మోస్తుంది - అందుకే స్త్రీలేని కావ్యం, కథ, కబురు-గడప వాకిలి లేదు. అలా స్త్రీ లేని వాకిలి వున్నా ఓరవాకిలే అది, మకరందం లేని మందారమే అది, విందూ, పసందూ లేని ఓ సందే అది. అటువంటి ఘనతరమూ, పటుతరమూఅయిన- మధురమూ-మహిమాన్వితమూ,అయిన ప్రమదల ప్రత్యేకత లను చూపించే స్త్రీలపాటలను పరికిద్దాం:

"శ్రీ సూర్యనారాయణా మేలుకో
హరి సూర్యనారాయణా మేలుకో..."

అంటూ మనయిళ్ళలోఆడవాళ్ళు ఉదయపు సమయాం లలో మేలుకొలుపులు పాడుకుంటూరు,కాని మేలుకొలుపులు ఏవి విన్నా అంత ఆశ్చర్యంలేదు. కాని, ఈ మేలుకొలుపు పాటవింటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. ఎందుచేతనంటే... లోకాన్నే మేలుకొలపవలసిన నారాయణునికి యింకా

మేలుకొలుపు ఏమిటి? అని. సూర్యునితోనే లేచి, సూర్యునితోనే నిదురించే మనం-సూర్యుని మేలుకొలుపుతూ పాడడం అంటే ఆశ్చర్యమేకదూ చెప్పండి. అటువంటి ప్రత్యేకతలు ఒక్క స్త్రీ సాహితిలో నేవుంది అనుకుంటాను.

అసలు స్త్రీ సాహితిలో ప్రత్యేక స్థానం అలంకరించుకొని వున్నవి మేలుకొలుపులు.

ఈ మేలుకొలుపులు - భూపాల రాగంలో - మహానందం కుమ్మరిస్తూ మన ఆడవాళ్ళు తెల్లవారు సమయపు పిల్లతెమ్మెరలు వీస్తూన్న సమయంలో వీటిని పాడుతుంటారు. మన తెలుగువారి నిత్యజీవితాన్ని ప్రతిబింబించేవి ఈ స్త్రీల పాటలే. తరచిచూస్తే ఈ స్త్రీలకు సంబంధంలేని రచన, చరిత్ర, సంస్కృతి లేదనిపిస్తుంది. ఉయ్యాలనుంచి యుద్ధందాకా ఈ స్త్రీలకు సంబంధం కనిపిస్తుంది.

యక్షగానాలు వ్రాసిన కవయిత్రులు వున్నారు, యుద్ధాలు సలిపిన వీరనారులు వున్నారు. చూడండి సీతాదేవి కూడా యుద్ధం చేసిందట. వసగాడి సన్యాసి రచించిన దశకంఠుని రామాయణంలో దశకంఠుడు (రావణుడు) మరణానంతరం-శతకంఠుడనే రాక్షసుడు రావడం-అతనికి రామునికీ యుద్ధం జరగడం-అందులో అంటే ఆ యుద్ధంలో సీతాదేవి కూడా పాల్గొన్నట్లు తెలుపబడింది.

అక్కడదాకా ఎందుకు, మన తెలుగు గ్రామాలలో కవురుపాట అని ఒక పాటవుంది.

"వడుకు వడుకూ కదుర
వడకవే కదురా
ఏకుల్ల బుట్టంత
ఎల్లుండిసంత
ఏకేకు ఒక బారా
ఎల్లుండి సంత
నా యేకులైపోయె
నాకేమి చింత!
ఏకుల్ల యెల్లక్క
వత్తిపుల్లక్క
రాట్నాల రామక్క
రావె పోదాము—"

అని పాడే ఈ స్త్రీ మనోధైర్యానికి తార్కాణంగా చెప్పదగిన...

"కదురు సల్లాగుంటే
కదలింతు గోల్కొండ..."

అని చెప్పిన స్త్రీయే ఆఖరున ఏమంటుందో—ఆ పాటలో

"మగడెందుకే తగని
మగడెందుకే—"

అని. ఈపాట ఏమిటి అంటారు? ఈ కదురుపాట పల్లెవారి ఆర్థిక జీవనానికి చక్కని అద్దము. స్త్రీ యొక్క ఆర్థిక స్వాతంత్ర్యమే మగవాని జులుమునకు మద్దత్తు. కదురు చల్లగుంటే తగని మగడెందుకూ? అని పేర్కొన్నారు.

ఈ పాటనే తెన్నేటి సూరిగారు యింకోలా పేర్కొన్నారు. మొదటిపాటంతా పైపాటలాగే సాగుతుంది. కాని, ఆఖరున మగడెందుకే తగని మగడెందుకే...అన్న చరణానికి బదులు...మగడు యుద్ధానికిపోతే సంతోషంతో ఏకులు వడుకుక్కుంటాను—దేశస్వాతంత్ర్యంకోసం భర్తవెళ్ళాలి—ఢిల్లీ చల్లగుండాలి అని.

ఏమైనా ఏనాడూ స్త్రీ దేశంకోసం - జాతికోసం - పాటుపడేది అని తేలుతుంది. స్త్రీ వాఙ్మయంలో యిటువంటి ప్రత్యేకతలు ఎన్నో వున్నాయి.

"ఏడుకొండలవాడ
వెంకటా రమణా
మేలుకో తెల్లార వచ్చెను..."

అంటూ పాడుతుంటే - భక్తిరసము హృదయాలలో ప్రవహిస్తుంది. ఈ మేలుకొలుపులూ మొదలయిన పాటలు తెలుగునేలలో ఏ ఒకమూలనో పాడుకొనేవి. ఏ ఒకరో వ్రాసినవి కావు. నేలనాలుగు చెరగులా పాడుకుంటారు. మన తెలుగుహృదయాలనే ప్రతిధ్వనింపజేస్తాయియీపాటలు. అటువంటి విశాలత్వం చేకూర్చుకోబట్టే భాష సులువు. సాఫీగావుండి, తేటతనంతోపాటు మాధుర్యాన్నికూడా పొంది వుంటుంది.

ఈ స్త్రీల పాటలలో విశేషమేమంటే - కొన్ని పాటలలో వున్నట్లుగా ద్వంద్వార్థాలూ, కల్పితాలూ వుండవు.

"శరద్రాత్రి నిండు వెన్నెలలో పెండ్లివారి బండి ప్రయాణంలాగా వుంటుంది యీ స్త్రీ సాహితి" అలాగా సాగుతుంది ఈ పద జాలం.

"మేలుకో: శ్రీరామ
మేలుకో రఘురామ
మేలుకో గుణధామ
మేలుకో...
దీనుల రక్షింప
దీక్షవహించినా
దేవ నిద్రా వేగ మేలుకో—"

ఈ మేలుకొలుపుపాట మానవ హృదయంలోని వేదననూ, ఆ వేదననూ ప్రతిధ్వనింప జేస్తుంది. శ్రీరాముడు తెలుగువారి అధిష్టాన దైవం అన్న సంగతి అందరికీ తెలిసిందే. ఇంట్లో అతనిపేరు, సీతమ్మపేరూ పెట్టని తెలుగువారు చాలా తక్కువ. ఆ మహిమాన్విత నామాలను వింటేనే తెలుగు హృదయం పరవళ్ళు త్రొక్కుతుంది. ఏ తెలుగు వాకిట చూసినా రామాయణ కాలక్షేపాలూ, సీతా కళ్యాణాలూ, భజన గోష్ఠులతో తెలుగునాడంతా రామమయమై ఓయని పల్కుతూ వుంటుంది. అంతకంటె తెలుగు ఆడబడుచుల హృదయాలు సీతమ్మ పేరు వింటేనే పాలకడలిలాగ పొంగులు వారుతాయి.

"లేవే సీతమ్మా
లేవే ముద్దులగుమ్మా
లేవే బంగరుబొమ్మ, లేవే..."

అన్న పాట తెలియని స్త్రీ హృదయం తెలుగునాడున కనుపించదు.

కష్టం వచ్చినా, సుఖంలో తేలియాడుతున్నా, శ్రీరాముని తలవడంమాత్రం మరవరు, మరవలేరు ఆంధ్రులు – అదే వారి ప్రత్యేకత.

కాని ఈ మేలుకొలుపులు అనేవి ఏమిటి? దేముడు నిద్రపోవడం అనేది వున్నదనీ – అలా నిద్రలో మునిగి ప్రజారక్షణ కృషి మరచిపోకుండా, భక్తులకోసం మేలుకొనమని ఎప్పుడూ మేలుకొనే ఉండుసుకూ ఈ దీనులకోసం అన్న అర్థం ఇందులో ధ్వనిస్తూంది.

స్త్రీల పాటలలలో ఉయ్యాల పాటలు చాలా మనోహరంగా వుంటాయి. ఈ పాటలు అనేక వరుసలలో వుండి చివరన ఉయ్యాలా అనో, లేక ఉయ్యాలో అనో ఊతపదం పాడబడుతూ వుంటుంది.

ఈ పాటలు పాపలను ఉయ్యాలలో పరుండబెట్టి ఊగించడం మొదలు అట్లతద్దిలో పెద్దలు త్రాడు ఉయ్యాలలూగి, కోతలూ, ఊడ్పులసమయాలలో ఏదో ఒక కథను చెబుతూ ఆఖరున ఉయ్యాలా అంటూ ఈ ఉయ్యాలపాటలు పాడుతుంటారు.

అసలు యీ వుయ్యాలపాటలు అనేవి, ఉయ్యాల అనేది చిన్నవారికే కాదు, ప్రేమికులు, భార్యా భర్తలూ, వారూ వీరూ ఏమిటి అందరూ సరదాగా పాడుకుంటూ ఊగుతారు. ఇందులో అంత ప్రత్యేకత కనబడుతుంది.

అంత ప్రత్యేకత లేకుంటే పెద్దన్నగారంతటి వారు కూడా ఇలా పేర్కొంటారా చెప్పండి! కవిత్వం చెప్పడానికి ఉండవలసిన హంగులను పేర్కొంటూ...

"నిరుపహతి స్థలమ్ము
రమణీప్రియదూతిక అందియిచ్చు
కప్పుర విడెంతో బాటు
బంగరు తూగుటుయ్యల..." అన్నారు.

చంటిపిల్లలను నిద్రబుచ్చడానికే కాదు – ఆఖరికి కవితోపాసనకూ ఈ ఉయ్యాల కావాలన్నారంటే యీ ఉయ్యాల పాటలో ఉండే ఘనత ఎంతదో అంటారు?

ఈ ఉయ్యాలపాటలు – అటు ఏ చెట్టు కొమ్మకో వ్రేలాడగట్టిన పాతచీరలో పరుండి ఆడుకునే బీద పసికూన నుంచి, ఇటు అంతఃపురసౌధాలలో చక్కని తూగుటుయ్యాలలో ఊగే కలవారి బిడ్డదాకా యీ ఉయ్యాల పాటల మధుర గాలులమధ్య నిద్రపోయి – ఆడుకోవడం సహజంగా జరుగుతూంటుంది.

వారూ వీరూ అనే భేదం లేకుండా అన్ని తరగతుల లోనూ యీ పాటలకు విలువ, గౌరవం, స్థానం వుంది - అదే యీపాటలకున్న ప్రత్యేకత, ఆకర్షణ.

అలాగే స్త్రీల పాటల్లో తలుపుదగ్గర పాటలని పాడేవి ఉన్నాయి. ఈ పాటలు ఏ దేవుళ్ళమీదో పెట్టి పాడుతారు.

"శ్రీ కాంతామ
నేనీ సఖుడను
శీఘ్రిము వాకిలి తీవే, నీవు
శీఘ్రిము వాకిలితీవే—"

అని భర్త అడుగుతాడు - అందుకు సమాధానంగా...

"ఓకాంతుడ నీ
గుణములు తెలిసెను
ఊరికి వెళ్ళగదోయీ - నీవు
ఊరికి వెళ్ళగదోయీ —

అని భార్య సమాధానం యిస్తుంది. ఈ పాట యిలాగే సాగి ఆఖరున రాజీగా అంతమౌతుంది.

ఏమిటో - ఆ పరాత్పరులలోనే ఒకరిమీద ఒకరికి యింత అనుమానాలయితే ఇక మానవమాత్రులలో వీటిని గురించి ఆలోచించాలా చెప్పండి.

అక్కడదాకా ఎందుకు - అందుకే - బ్రహ్మాంగారనుకుంటాను...

"రాముడంతటివాడు
రమణి సీతనుబాసి
అడవులా పాలాయెరన్నా..."

అని సెలవిచ్చారు.

ఈనాడు జీవితాలే కారడవులయినప్పుడు యిక ఆలోచనకే తావులేదు. అక్కడే కాదు - నేడే కాదు - నాడూ ఇద్దరు స్త్రీలమధ్య తన భర్తల అందచందాలను గురించి ఎంత పట్టింపులు వుండేవో చూడండి:

ఈ సంవాదము గౌరీ, లక్ష్మి మధ్య సాగుతుంది...

"గౌరిదేవి నీ శంభు దేవునకు
గళమున నలుపేమమ్మ..."

అని లక్ష్మి గౌరిని అడుగుతుంది—ఆ మాటకు గౌరి ఎంత సూటిగా సమాధానం యిస్తుందో చూడండి...

"నారీమణి నీ విష్ణుదేముడూ
నలుపు కాదటే కొమ్మా..."

అని.

ఇలా యిద్దరిమధ్య నడుస్తుంది - ఈ సంవాదాలు చూడ ముచ్చటగాను, వినసొంపుగాను ఉంటాయి. ఈ సంవాదంలో గొప్పతనం హరిహరుల అవతారాలు కళ్ళకు కట్టినట్లు చిత్రించడం గమనార్హం

ఇక స్త్రీల సారస్వతంలో సందేశాలు చూడండి. జానపద సాహిత్యంలో కూడా కావ్యాలలోలాగ మేఘసందేశం, దమయంతి, హంస సందేశంలాంటి సందేశాలూ వున్నాయి.

పక్షులద్వారా, మేఘాలద్వారా తమ సందేశాన్ని ప్రియునికి తెలియచెప్పటంలాంటి రచనలు చాలావున్నాయి. అటువంటిదే యీ గేయం. ఈ గేయంలో రంగనాథుని జాడ తెలియక ఒంటరితనాన్ని భరించలేక అలా వెన్నెలలో కూర్చుని తన బాధను రంగనాథునికి చెప్పమని చందమామ ద్వారా సందేశం పంపుతుంది లక్ష్మీదేవి.

"నావెన్న దన్నాకో
నాడూ జన్మించినా
చందమామా

నా నగధారులతో
నా మనవీ దెల్పావే
చందమామా.

నిన్నా నీ పొద్దూన
తిన్నన్న మే గాని
చందమామా
నీ కన్నులనే
నన్యమెరుగసయ్యా
చందమామా.

పాలాసంద్రునీ యింట
పుట్టినామూ మనము
చందమామా
ఇంత పగతూడవై నన్ను

బాధింపుడది యేమొ
చందమామా—"

ఇందలి భావం ఎంత హృదయంగమంగావుందో గమనించండి. చిలుకమ్మద్వారా శ్రీకృష్ణునికి రుక్మిణి సందేశం పంపడం విన్నదే. సరే— నలమహారాజు హంసద్వారా రాయబారాలు పంపిన సంగతి చదివిందేకదా. పోతే సీతాదేవి రాములవారికి రాయబారమంపిన విషయము పాటద్వారా మనకు విదితమే - అది ఎలాగుందో వినండి...

"భూదేవి కూతుర్ని కోయిలారో
జనకుని కూతుర్ని కోయిలారో
దశరథుల కోడల్ని కోయిలారో
శాంతకు మరదల్ని కోయిలారో
రాఘవుల దేవిని కోయిలారో
నల్లనయిన వారె కోయిలారో
నవ్వుచూవుందురే కోయిలారో
శ్రీరామచంద్రులే కోయిలారో
భర్తను విడిచుంటి కోయిలారో
అహార నిద్ర లేకుంటి కోయిలారో
రాము రమ్మని చెప్పు కోయిలారో
మెడవి హారం యిస్తు కోయిలారో
ప్రాణేశుతో జెప్పమ్మ కోయిలారో
పక్షి చేసిన పనులు కోయిలారో

ఉపకారమైయుండు కోయిలారో ..."

ఎంత ఇంపుగా సందేశం నడిపించాడో ఇందులో కవి గమనార్హం.

అలాగే అన్నగారితో చెల్లెలు సలహాగా చెబుతున్న ఈ పాటలో ఎంత యదార్థత, జీవితసత్యం ఇమిడి వుందో:

"ఊరి ముందరి చేను
చేయకుర అన్న,
ఊళ్లోన వియ్యంబు
అందకుర అన్న,
ఊరి ముందరి చేను
కాకుల్లపాలు,
ఊళ్ళోన వియ్యందు
మాటలా పాలు ..."

దీంట్లో ఏది యదార్థం కాదంటారు ?

నేడేకాదు - నాడూ అత్తవారింటికి అడుగుపెట్టిన కోడలిని యిది తెలేదు అది తేలేదు అనడం ఉంది. అత్త వారి యింటికి వెళ్ళింది సుభద్ర:

"పున్నెంబు నాడైన
బూరెలొండుకొనీ
పుణ్యాడ రమ్మనీ
పిలిచిరా మీవాళ్ళు?
అమవాస్యనాడైన

అట్లు వండుకోనీ
అల్లుడా రమ్మనీ
పిలిచిరా మీవాళ్ళు? ”

అని సుభద్రని నిలవేస్తాడు అర్జునుడు. దానికి సుభద్ర మా వాళ్ళు బీదవాళ్ళని సమాధానం చెప్పడం, చివరకు పుట్టింటి వెళ్ళి అన్నగారిని అడిగి ఏవేవో పట్టుకువచ్చి అర్జునుడిని సంతృప్తిపరచడం వరకూ ఈ సంవాదం నడుస్తుంది. ఈ పాటలో మధ్యతరగతి సంసారాలలో జరిగే నిత్యానుభవాలు జ్ఞప్తికి వస్తాయి.

ఇటువంటివన్నీ మన పాతచరిత్రలకు నిఘంటువుల లాంటివే.

పెళ్ళిళ్ళలో వుండే వాతావరణం చూస్తే ఆనందం ఆకాశం ఎత్తు ఎగురుతుంది. ఆ పెళ్ళి అయిదురోజులూ ఏ అరమరికలూ లేకుండా వుంటారు. అటువంటి అరమరికలకు తావు వుండనివ్వదు – ఆ వాతావరణం – అందుకే బావ గార్లమీదా, ఒదినగార్లమీదా, వియ్యాలవారిమీదా వేళాకోళాలు, వెక్కిరింతలూ రూపంలో పాటలు పాడుతారు అవి – వినాలి – ఆపెళ్ళిళ్లు చూడాలికాని వాటిని గురించి రాయడం, చెప్పడం, కష్టం. వీటినే పెళ్ళిపాటలు అంటారు. ఈ పెళ్ళిపాటలనే మనం బూజంబంతి పాటలు, అలకపాన్పు పాటలు, అంపకాల పాటలు అనికూడా వ్యవహరిస్తుంటాం.

ఏదో పెద్ద నిరవాకం చేస్తూ బావగారు వచ్చారు. చూసింది మరదలు పిల్ల - ఊహుఁ, సమయం పోనిస్తే ఎలాగ?

"చూపులేనీ బావగారికి
శుభా మంగళం
చేయిలేనీ బావగారికీ
జయా మంగళం..."

అంటూ పాడుతుంది. ఈ పాటలో ఎంత చనువూ, కలిసి కట్టుతనం, చిలిపితనం - ఎంతగా పొంగులు వారుతున్నదో విన్నారూ?

అదేమిటి - ఎదురుగుండా వదినగారు కనబడే సరికి....

"వదినారో నీవెంత
నెరజాణా వమ్మా..."

అంటూ పాట మొదలు పెడతారు. వియ్యపరాలకు పెళ్ళిలో పీటవేసి - వెండికంచం వేసి, నిండావున్న పిండివంటలూ, అన్నం, పప్పూ, కూరా, వడియాలూ - ఓ పాతిక చెయ్యి పట్టకుండా వడ్డిస్తారు. వడ్డించి యింకా ఎక్కడ అలుగుతుందో అన్నట్లు ప్రక్కనే కూర్చుంటుంది పెళ్ళికూతురు తల్లి. ఆ సమయంలో ఆడపెళ్ళివారిమీద మొగపెళ్ళివారు పాడే పాటలు కడుపుబ్బా నవ్విస్తాయి.

"విందూ చేసినారూ
వియ్యాలా వారింటా

వింద్దూమాట చెబితే
వింతగా వుంటుంది,
పొట్టి బావగారూ
కొట్టూ పెత్తనమాట
కొట్టూలో సరుకులూ
ఇవతలకూ రానియరూ,
అత్తగారూ వచ్చి
పళ్ళెం తట్టినాదీ
మామగారు వచ్చి
మటమటా లాడేరూ
పెద్దా బావగారూ
మేళం వద్ద నుండే
వదినగా ర్లంతాను
వడ్డించా బోయారూ..."

ఈపాటవిన్నాక మీకుమాత్రం నవ్వు రాలేదంటారా? ఇలాటి పెళ్ళి పాటలు, వేళాకోళం పాటలు, ఈ స్త్రీలపాటలలో లక్షోపలక్షలున్నాయి. సరే పెళ్ళి అయినది మొదలు ఆడ అమ్మాయికి ఊపిరి సలుపనంత ఉద్యోగం – నోములు, వ్రతాలు, పని పాటలు.

గొబ్బి అని పాడుతారు. పేడను ఉండగా బెట్టి అందులో బంతిపువ్వో గుమ్మడిపువ్వో పెట్టి పాడే ఈ పాటలో–రేపటి తన జీవతానికి ఈనాటినుంచీ మంచినే కోరుకుంటూపాడే ఈ పాటలు చూడండి....

"సుబ్బీ గొబ్బెమ్మా
సుబ్బడ్నియ్యావే
చామంతి పువ్వంటి
చెల్లెల్నియ్యావే
తామర పువ్వంటి
తమ్ముడ్నియ్యావే
మల్లీ పువ్వంటి
మొగుడీ నియ్యావే..."

అలాగే మూగనోములని ఉన్నాయి.

ఈ పాట నడక - శైలి ఎలాగ సాగుతుందో వినండి. నీటిమీద తామర పూవులాగ.

"మోచేటి పద్మమ్మ
పట్టేటి వేళ
మొగ్గల్లు తామరలు
పూసేటి వేళ
సందేళదీపంబు
పెట్టేటి వేళ
చాకింటి మడతల్లు
తెచ్చేటి వేళ
ఆవుల్లు దూడల్లు
వచ్చేటి వేళ
ఆబోతు రంకెలు

వేసేటి వేళ
అన్నల్లు అందనా
లెక్కేటి వేళ
బావల్లు పల్లకీ
లెక్కేటి వేళ
అక్కల్లు మజ్జన్న
మాడేటి వేళ
బీరాయి పువ్వుల్లు
పూచేటి వేళ
బిందెలతో ఉదకంబు
తెచ్చేటి వేళ
ఆనపా పూవుల్లు
పూచేటి వేళ..."

అవన్నీ సరే ఆడవారివి అనుకోండి – మొగవారిని కూడా కవ్వించే ఈ అట్లతద్దినోము ఏమిటి చెప్పండి.

తెల్లారకుండా లేవడం – గుంపులు గుంపులుగా కూడి నిద్రపోతూన్నవారిని కూడా లేవడం – అక్కడనుంచి – ఆటలు – తరువాత ఉయ్యాల లూగడం – కడుపునిండా అట్లూ తిమ్మనం ఆరగించడం ఎంత విచిత్రమైన పండుగ – నోముయిది.

నాలుగింటికే లేస్తారు ఆడపిల్లలూ–మొగ పిల్లలూ.

" అట్లతద్దోయ్ ఆరట్లోయ్
ముద్దపప్పోయ్ మూడట్లోయ్

పిడికిల క్రిందా పిల్లల్లారా
లేచీ రారండోయ్..."

అని ఒక్క యిదిగా ఈ పాటపాడుతూ బయలుదేరు తారు. ఆటలూ, పాటలతో తెల్లవారుతుంది. అక్కడి నుంచి( ఈ నోముకు ఏవువుయ్యాలలు కాబోసును ఊగాలనే శాస్త్రం వుంది) ఉయ్యాల లూగడానికి బయలుదేరుతారు.

ఈ పండుగ వస్తుందంటేచాలు - ప్రతివాకిటా - ప్రతియింటా త్రాడు ఉయ్యాలలూ, బల్లఉయ్యాలలూ వేసి సిద్ధం చేస్తారు. గ్రామాలలో పెద్ద పెద్ద చెట్లకు ఉయ్యాలలు వేసి అందరూ ఊగుతారు. అది ఒక సమిష్టి జీవిత విధానానికి ప్రతిబింబం. అందులో రైతుకుటుంబాల యిళ్ళ లోనే - యిటువంటి అందచందాలకు ఒక ప్రత్యేకత కనిపిస్తుంది.

ఆ ఉయ్యాలలో ఒకరికి యెదురుగా ఒకరు నిలబడి భయం లేకుండా రంగు రంగు చీనీలుపోసిన పరికిణీలు గాలికి ఎగురుతూంటే, పచ్చచామంతులు పూబంతులూ ఆ గాలిలో జడలమధ్యన దోగాడుతుంటే చూసేవాళ్ళకు ఏ లోకంలోనో విహరిస్తున్నట్లే వుంటుంది.

అలా పాడే పాటలో...

" ఓయిబొమలాల ఉయ్యాలా
బొమలందూనా ,,
రాజు మారాజు ,,

ఏడుగురు కొడుకులు ఉయ్యాలో
ఆర్గురు కొడుకులకు ,,
కళ్యాణమయింది ,,
కడసారపు కొడుక్కు ,,
కళ్యాణ మవలేదు ,,
ఓయి బావలాల ,,
బావలందూనా ,,
......................,,

ఎంత హాయిగా ఉందంటారు యీ పాట.

సరే, ఈనోములు తాము ముందు ఏదో ఫలితం పొంద దలచి చేస్తారు. అదిసరే సాక్షాత్తూ భగవత్స్వరూపుడైన సుబ్రహ్మణ్యేశ్వరునికి ఈ స్త్రీలోకం సలహా యిస్తూందంటే వింతగా కనిపించడం లేదూ!

నాగుల చవితి అన్నాప్పటికి పాలుపుట్టలోపోసి నాగు మయ్యను ప్రార్థిస్తాను.

"పడగ లెత్తకు పాము
పగవారము కాము
పడగెత్తి చూసింది
నాలుకలు రెండు
నాలుకలు దూయకే
నీవారమునాగు
మంచినాగువైతే

పంచె లెత్తేము
కోడెనాగూ వైతె
కోక లెత్తేము
..........
..........
మాపత్తి పండితే
పంచ లెత్తేము
పడగెత్తకే నాగు
పగవారము కాము
నీపూజ చేసెదము
నీకు మ్రొక్కెదము..."

అని నాగుమయ్యని ప్రార్థించిన వీరే, చివరకు ఆ నాగుమయ్యని బంధువుగా భావించి ఆప్యాయతతో సలహాలు యిస్తారు.

"పుట్టలో నాగన్న
బూచి నాగన్న
ఎండలో పడుకోకు
వెర్రినాగన్న
......
అటుబోకు నాగన్న
చాకిరేవులకు
సాలిపురుగని నిన్ను

పంపుతారు వారు...

..................."

అంటూ బుద్ధులు చెప్తున్నారంటే - మనకు వింతగా లేదంటారా? అలా నోములు పూర్తి అయ్యాక అమ్మాయిని అత్తవారియింటికి పంపుతారు. అలా పంపుతూ తల్లి కూతురికి బుద్ధులు చెబుతూంది:

"మాయమ్మా లక్షిందేవి
పోయిరావమ్మా
పోయీ నీ అత్తింట
బుద్ధి గలిగుండూ
ఎవ్వ రేమనినా
ఎదురాడకమ్మా
వీధీనిలుచుండీ తల
విప్పి ముడవకు మీ
మాట లెన్నన్నాను
మాటాడకమ్మా
పలుమారు మామీద
ప్రేమలుంచకుమీ
అత్తనీ కాదనీ పూలు
ముడవాబోకమ్మా..."

అని తల్లి సలహాయిచ్చి సాగనంపుతుంది.

ఈపాట వింటూంటే ఓ బంధువుకు దూరమైపోతు న్నట్లు మనం బాధపడతాము. అలా పుట్టింటినుంచి అత్తిం

టికి వెడుతూ, చెల్లెళ్ళకు, అక్క, అన్నలకు అప్పగింతలు పెడుతూంది:

"బొమ్మరిల్లున్నాయి
బొమ్మలున్నాయి
నేను ఆడేటి
సాలలున్నాయి
నామారుగా మీరు
ఆడుకోరమ్మా
పోయి నా అత్తింటికి
పోయివస్తాను
దీవించు అన్నయ్యా
దీవించు అక్కా—"

అని కంటితడితో బండి యెక్కుతుంటే అంతదాకా ఆడుకొన్న చెల్లి, తమ్ముడూ ఏ విధంగా బాధపడతారో ఈ పాట ప్రతిధ్వనించడం గమనించండి.

అలా అత్తింటికి వెళ్ళిన కోడలు భర్తకూ, అత్తగారికీ అణగిమణగి వుండాలి - ఊc అంటే భర్త అలుగుతాడు - అలా అలిగిన భర్త - భార్యతో సూటిగా మాట్లాడకుండా ఏ చిలుక మీదనో పెట్టి పనులు ముగించుకో చూస్తాడు. అటువంటి విచిత్రమైన యీ పాట చూడండి.

ఎదురుగుండా తడిక కనబడింది - తడిక పక్కనేవుంది భార్య. తడికద్వారా రాయబారాలు:

"కొత్తిమీర తెచ్చాను
గోంగూర తెచ్చాను
వండమాని చెప్పవే
తడికమ్మా..."

అని భర్త తడికతో కబురు పంపుతాడు. భార్య మాత్రం ఏం తీసిపోదు. ఆ తడికతోనే...

"కొత్తిమీర తెస్తేను
గోంగూర తెస్తేను
వండనాని చెప్పవే
తడికమ్మా..."

అని సమాధానం యిస్తుంది.

ఈవిధమైన తడికరాయబారాలు, చిలుక రాయబారాల లాటి పాటలు చాలా వున్నాయి. కాని ఇక్కడ ఒక చిన్న అనుమానం, కూనలమ్మ పదాలని కొన్ని వున్నాయి. యీ కూనలమ్మ పదాలు అన్నవి - మనం అనుకునే కూని రాగాలు తీస్తున్నాడనీ, కూనలమ్మ సంగీతాలు తీస్తున్నాడనీ అంటున్నాము. అలా ఒక నానుడి వుంది. వీటికి సంబంధించిందే ఈ క్రింది పాట:

"జపతపంబులకన్న
చదువు సాములకన్న
ఉపకారమే మిన్న
ఓ కూనలమ్మా!

అన్నమిచ్చినవాని
నాలినిచ్చినవాని
నవహాసించుటహాని
ఓ కూనలమ్మా.

మగనిమాటకు మాట
కెదురుబల్కెడి బోటి
మృత్యుదేవతసాటి
ఓ కూనలమ్మా."

ఈ పాటలు కూనలమ్మతో చెబుతూన్నట్లు వేదాంత పరంగా పాడతారు. కాని ఈ పాటలో కొన్ని చరణాలు యింకోలాగ కూడా విననౌను - మచ్చుకు :

"ఆడితప్పినవాని
ఆలిమరచినవాని
ఆదరించుట
మోసమన్నా..."

అంటూ 'మోసమన్నా' అన్న సంబోధనగా నడుస్తాయి.

బాల్యంలో ఆటపాటలతో చక్కగా పెరిగిపెద్దయిన అమ్మాయి యుక్తవయస్సు వచ్చేటప్పటికే నోములని, వ్రతములనీ ప్రారంభిస్తారు - అక్కడినుంచి వివాహం, అత్తింటికి వెళ్ళడము జరుగుతుంది. అక్కడినుంచి సంసార తాపత్రయం, గృహిణిగా కర్తవ్య నిర్వహణ ప్రారంభం.

ఈ గృహకృత్యంలో జరుపుకొనే ప్రతిపనికీ ఒక్కొక్క పాటవుంది. అందు క్రిందకే దంపులు, పిసురురాతి-పదాలు, నీళ్ళుతోడు పాటలు మొదలయినవి వస్తాయి.

అలా అత్తింటికి వెళ్ళిన కోడలిని దంపు దంపమంది అత్తగారు. ఒక్కతే దంపుతూంటే ఊసుపోవాలిగా మరి – అందుకు:

"నా చేతి రోకళ్ళు
నల్ల రోకళ్ళు
వేయించు అన్నయ్యా
వెండి పొన్నుల్లు
......
కోడలా కోడలా
కొడుకు పెళ్లామా
పచ్చిపాలమీాది మీాగడేది
వేడిపాలమీాది వెన్న లేవి?
......
పాపమ్ము చేసుకుని
బావిలో పడితే
పైమురికియేగాని
పాపాలు పోవు
......
దంపు దంచాలేను



దండె త్తలేను
......
వేపచెట్టూకాడ
నా బొమ్మరిల్లు
కూడోర అన్నయ్య
కూడొండుతాను !
కూటికీ కాదప్ప
కూతురుగొచ్చాను..."

లాంటి పదాలు వందల కొలదీ వున్నాయి. ఈ పాటలద్వారా కష్టాలు - సుఖాలు, నీతులూ - నియమాలు చెప్పుకుంటూ పనిలోవుండే కొంతశ్రమని ఈ పాటపాడ్డంలో మరచిపోతారు.

అలాగేవిసురు, రాతి పదాలని వున్నాయి. పిండి విసురుతూ ఈ పాట పాడుతారు:

"చిలుకనీళ్ళు తోడే
జలకమాడేను
హంస అన్నమువండె
ఆరిగించేను
వెలదీ మంచములావె
వెన్నెలల బైటూ..."

లాంటి పదాలు గృహకృత్య సారస్వతంలో చిరపరిచితాలు.

అప్పుడే లేచింది కోడలు - ఉదయం అయ్యేటప్పటికి కవ్వము ఎదురౌతుంది. కోడల్ని పిలిచి మజ్జిగ చేయమంది అత్తగారు. కవ్వంతో మజ్జిగచేస్తూ పాడుతూంది ఈ పాట:

"అన్నా బండేటి పాలు
కిన్నెరల మోత
అమ్మా చేసేదీ చల్లోయీ!
అమ్మా చేసేదీ చల్లా
కవ్వాల మోత
రాగిదీ కవ్వామోయీ..."

ఈ మజ్జిగ కవ్వం పాటలు తెలియని తెలుగువారు - అందులో రైతుకుటుంబాల్లో అరుదే అనుకుంటాను. ఈ పాటలు కొంచెం తేడాతో పరికిస్తే కోలాటం పాటలకు దగ్గరగా కనిపిస్తాయి. ఆ కవ్వాన్నే ఇద్దరు ఎదురెదురుగా నిలబడి త్రిప్పుతూ పాడితే కోలాటమే అనుకోవచ్చును. అలాగే రాట్నాల పాటలు. మన భారతదేశానికే - ముఖ్యంగా తెలుగునాడులో కూడా కటీరపరిశ్రమ లేకదా జీవితాధారం. ఈనాడంటే-రాట్నాలు-మగ్గాలు - కొయ్యబొమ్మలు మొదలగు పరిశ్రమలు మూలపడుతున్నాయి గాని నాడు యివేకదా మనకు జీవనాధారం.

అటువంటి రాట్నములు త్రిప్పుతూ పాడే పాటయిది అనుకుంటాను.

" అందచందము లేని
ఆడ కూతురుకి
అందమేరు పరచు
ఆ పత్తి చెట్టు!
కవ్వమాడని యిల్లు
కదురు త్రిప్పని కొంప

మగ్గము లేనూరు
మరి కానరాదు..."

చూడండి. ఈ పాటలో మన పాతచరిత్రనూ—ఒక యదార్థ సత్యాన్నీ ఎలా ప్రతిధ్వనిస్తూందో.

అందంలేని ఆడకూతురుకి బట్టలు సింగారిస్తే సరి ఎక్కడాలేని అందం వస్తుందట. ఈ మాట నిజం కాదంటారా? విచిత్రంగా లేదంటారా?

పూర్వకాలంలో-కవ్వము, కదురు, మగ్గము-వుండని కొంపే లేదని - ఆ రోజులలో వాటికి అంత విలువ, బలిమీ వుండేదనీ - మనకు లెక్కలూ అందిస్తూంది.

ఈ పాటలను పరికిస్తే కొంచెం దంపుపదాల వరుసలోనే వినిపిస్తుంది అనుకుంటా.

పల్లెటూరి జీవనం అంతహాయి అయినదీ, గౌరవమైనదీ యింకోటి లేదు. అత్తగారు ఏ పనో చేస్తోంది. కోడలు వూరికే కూర్చుంటే ఎలాగ? కదురు అందుకుంది. ఆ సమయంలో పాడే పాట యిది:

"వడకు వడుకూ కదుర
వడకవే కదురా
ఏకుల్ల బుట్టంత
ఎల్లుండి సంత
ఏకేకు ఒక బార

ఎల్లుండి సంత
నాయేకులైపోయె
నాకేమి చింత!
కడురు సల్లాగుంటె
ఢిల్లి సల్లాగుంటె,
నా మగడు రాకున్న
నాకేమి చింత..."

అన్న యీ పాటలో స్త్రీ దేశసౌభాగ్యంలో ఎంత భాగస్వామో, పూర్వము దేశ సౌభాగ్యం కోసం స్త్రీ ఎంత సహాయపడిందో ఈ పాట ఒక మచ్చుతునక.

ఢిల్లీ చల్లగుండాలట (అంటే ప్రభుత్వము అనుకుంటాను) ఢిల్లీప్రభుత్వ సైనికుడు అనుకుంటాను యీమె మొగుడు. అతను భార్యకోసమని ప్రభుత్వపు పనులు మానేసి వస్తే ఎలాగ? రాడు. అలా రాకూడదనే ఈమె కోరిక. అందుకే కదురు సల్లాగుంటే(పొట్టగడవాలిగా మరి,)అందుతో పాటు – ఢిల్లి సల్లాగుంటె – నా మగడు రాకున్న నాకేమి చింత...అని యెంత ధైర్యంగా చెబుతుందో గమనించండి.

ఇక ఒక్క పరిచయాన్ని చూపి ముందుకు వెడతాను. స్త్రీల సారస్వతశాఖలో మంగళ హారతులకున్న హుందా, గొప్పతనం మరెందులోనూ కనుపించదు. కొన్ని కొన్ని పాటలు వింటూంటే అందులో లీనమైపోతాముకూడా. అటువంటి తరహాక్రిందకే వచ్చే ఒక పాట – ఎంతపసందైన నడకతో ముందుకు సాగిపోతుందో పరికించండి.

ఈ క్రిందిపాటలో-పార్వతి ఎక్కడికో బయలుదేరడం, ఎక్కడికని చెలికత్తెలు అడగడం, సంభాషణరూపంలో - శివుని అవతారాన్ని కన్నులకు కట్టినట్టుగా గోచరింపజేసే పద్ధతిలో సాగుతుంది. ఆ పాట యిది...

"ఘల్లూ ఘల్లునా పాద
గజ్జెలందేలూ మ్రోయ
కలహంసా నడకాల
కలికీ ఎక్కడికే?
జడలోనూ గంగానూ
ధరియించుకొన్నట్టి
జగములేలే సాంబ
శివుని సన్నిధికే...
మంగళం - మంగళం.

బొడ్డూమల్లెలూ జాజి
దండాలు మెడనిండ
అందా మెరిగిన జగ
దాంబా ఎక్కడికే?
అందముగ విభూతీ
అలరూగంధామూ
నలచీన నీల
కంఠేశు సన్నిధికే.

తళతళ మనూ రత్న
తాటంకములూ మెరయ
పసిడీ మండలముల
పణతీ ఎక్కడికే
కలియూగ జన్మాము
గలశివుడైనట్టీ
గుమడైనా శంభు
శంకరునీ సన్నిధికే.
మంగళం - మంగళ.
.........................."

ఇటువంటి గేయాలు యింకా ఎన్ని వున్నాయో! గృహాకృత్యసారస్వతం విలువ, పటిమ - అంత బరువైంది!



# 4



జానపద సారస్వతంలో శృంగార సాహిత్యది ఒక తరహా! ఒక ప్రత్యేకత!!

ఈ శృంగార సాహిత్యంలో ప్రేమీ ప్రేమికుల మధ్య జరిగే మహాదాసం దాన్ని, వారి ప్రేమైకజీవితా ధర్మా లనూ కళ్ళకు కట్టినట్టు వినిపింపజేస్తాయి ఈ పాటలు.

పాట! – ఎంతకమ్మనిమాటో! జాన పద కథల్లో నుంచి కావ్యాలదాకా, జానపదుల జీవితలోతుల అంచులలో నుంచి చిక్కని తేనెగా, తెల్లటి మల్లెలా, సన్నటి జాజిలా, చందమామలా పాటలు వినిపిస్తూనే వున్నాయి. నక్క కాకి బావని పాటపాడమంది; బొమ్మల పెళ్ళికి కోకిలగాన కచేరీలు

తప్పకుండా పెట్టేస్తూనే వున్నారు - భవిష్యత్ రథసారథులు మన యిళ్ళల్లో - బొమ్మల పెళ్ళిళ్ళలో!!

ప్రేమించే పూవుని, వరించే కలువని, అనుసరించే అందాన్ని, అందుకోవాలనుకొనే ఆనందాన్ని - అలా మాటల్లో పొదిగి, గొంతులోంచి ఒక్కసారి బైటకు విని పిస్తాయి - అందలి కోరికలు, నమ్మకాలు, అనురాగాలు, సరాగాలు, సరసాలు, సల్లాపాలు, చల్లగాలులు, మేఘాలు, చందమామ, చిలుకలు, హృదయాలు, చూపులు, రూపులు- ఏకమై-ముడివేసుకుని-ఒక్కసారి గుమ్ముమని-సంపెంగలాగా, మొగలిలాగా స్వాగతం పలుకుతుంది.

పాట - అందులోనూ శృంగారపరమైనది - ఎంత కమ్మనీ, చిక్కనివో విందాం - మనమూ - ఓ బావలాగో, మరో చిన్నదిలాగో, సన్నజాజుల చిన్నదిలాగో అయి ఆ ఆనందాన్ని ఓ నిముషం పంచుకుని పట్టుజరీ కుచ్చుల పాలకీలో ఊరేగుదాం!

*ఈ పాట ఒక పురుషుడు ఒక పడుచుమధ్య జరిగే సంభాషణలాంటిది - అమ్మాయిని చూసిన యువకునికి యువతి ఏవిధంగా వుంటే అందంగా వుంటుందో చూడండి.

మగ :- పొట్టిదానికి మట్టెలందం
పొడుగుదానికి గాజులందం
నాగుబాముకు నడుము సన్నం
నెమలిపిట్టకు పింఛమందం
తకజనత తకధిమితతా!!

---

* ఈ పాటలు విశాఖ మిత్రుడు 'వరాహగిరి' ద్వారా సంపాదించినవి

ఆడ :- సిట్టిపొట్టి సిన్నినోడా
సిన్నిదాన్ని సూసినావా
గట్టులేక మట్టువిప్పి
గుటక లెన్నో మ్రింగినావ?
సెట్టుసాటు నున్నదాన్ని
సద్దూసేయద్దురో
బావా నా బావా !!

మగ:- ఆ పక్కా నొకమంటా
యీ పక్కా నొకమంటా
ఏ తంటా లేకపోతే
నా యెంట రాయే
సినిమా సూపెడతా
నా సక్కని గుంటా
సినిమాను సూపెడతా !!

విశాఖ మండలంలో మోటుసరసపు పాటలు, పచ్చి శృంగారగీతాలూ చాలా వున్నట్లు అనుకుంటాను. పై గేయం కాని, ఈ క్రింది గేయంకాని అటువెంపువే! సెరుకుతోటకూ బుచ్చెప్పకూ అవినాభావసంబంధం కలదని చెప్పే ఈ పాట వినండి :

"సీది బాగుండె బుచ్చెప్ప
సెరుకుతోట !

రంగూరంగూలకఱ్ఱ
గుంపూగుంపూలకఱ్ఱ
నీది బాగుందె
బుచ్చప్పా బాగుందె
సెరుకుతోట బాగుందె...

వచనం:- ఎందుకు బాగుండదు ?
ఉన్నవారైదుగురు
కూకుంటె యెడతారు
నిలబడితే యెడతారు
తోటకి—
నీరు యెడతారు,
నాది మేతేసుకుపోనాది
బుచ్చప్పా మేతేసుకుపోనాది
సెరుకుతోట మేతేసుకుపోనాది !

వచనం:- ఏటి పిల్లా నీ ఖర్మం ?
ఉన్నవాడొక్కడు
నోటోడైపోనాడె
బుచ్చప్పా నోటోడైపోనాడె
ఎక్కమంటె ఎక్కనేడు
ఏతాము -
నడువులు నొప్పంటాడు
కాళ్లూరావంటాడు
నా గెహచారం కాలిపోను
మేతేసుకుపోనాది - నాది

బుచ్చప్పా మేకేసుకుపోనాది
నీది బాగుందె బుచ్చప్పా
సెరకుతోటా !!

ఈ 'లచ్చిమి' ఆకులమ్ముకునే పడుచు. ఈమెతో సంబంధం కలిసింది. ఏదో యిస్తాననికూడా చెప్పి యింటికి ఆహ్వానించినట్లుంది. అందుకే లచ్చిమి ప్రక్కనుంటే స్వర్గమే అని కలలుకూడా కంటున్నాడు :-

"ఆకులమ్మే లచ్చిమీ
సిగురాకులమ్మే లచ్చిమీ
ఆకులమ్మిన రూకలన్నీ
ఏటిసేత్తివె లచ్చిమీ !! ||ఆకు||

కోడినిత్తావంటివీ
కోడిపెట్టనిస్తానంటివీ !
గట్టిగా నే నింటికొస్తే
కొంటెగా తలుపేస్తివి !! ||ఆకు||

నేను చేసిన పాపమూ
ఇది నాకు పట్టిన కరమమూ !
సక్కగానూ పక్కవుంటె
సొరగమే యిక సావునేదే !!" ||ఆకు||

సంతలూ, తీర్థాలూ, అమ్మవారుగుడి ప్రదేశాలూ, దేముడుగుళ్లూ, చాకిరేవులూ, బల్లకట్లూ, చేనుగట్లూ - చాలా చాలా మందికి బావను కలుసుకోడానికీ, మామను

పలుకరించడానికీ, మరదలుని చూడ్డానికీ, అత్తను చూడ్డానికీ అనుకూల ప్రదేశాలు.

"మంగమ్మ చాకలి చిన్నది - క్రితంలో కలుసుకున్నవాడే యితగాడు. ఆ ఎండలో ఒంగొని చాకిరేవులో బట్టలు ఉతుకుతూంటే మంగమ్మ సొగసు మంత్రముగ్ధుణ్ని చేసింది - అందుకే అంటున్నాడు :

"మంగమ్మా
సాకిరేవుబల్ల కాడ సంగతీ
నీ సక్కదనము కాలిపోను
సుక్కలాంటి మంగమో ||సా||

నున్నని బల్ల మీద
సాగదీసి కొడుతుంటే
మంగమా —
సాగతీసి కొడుతుంటె
బట్టలు సాగతీసి
కొడుతుంటె -
నీ కష్టము సూసీ మనసు
ఇష్టపడది మంగమో ! ||సా||

తాజాగా తాటికల్లు
మజాగా మాపిటికీ
మాయవరం సంతలోన
మారిపోదాం మంగమో !! ||సా||

‘సిన్ని’కీ ‘బావ’కూ ఒకరిమీద ఒకరికి నమ్మకం, అభిమానం, ప్రేమ వున్నాయి. అందులో సందేహంలేదు. అయినా ఒక నిర్ణయానికి వొచ్చాక ఎందుకైనామంచిది - బావ నన్నేలమని అంటుంటే తను వున్నదాన్ని కానసీ - నా ఉసురు పోసుకోవద్దనీ ఎంతయిది గామనవి చేస్తుందో చూడండి - ‘సిన్ని’ వున్నది కాకపోయినా ‘బావ’ సిన్న జమీలున్నవాడుట.

బావ:- సిన్ని నా సిన్ని ఓ సన్నజాజుల సిన్ని
పొన్నపూల సిన్ని నే నందమైనవోడ్ని
నన్నేలుకోవె సిన్ని నిన్నొదిలి వుండలేను !

సిన్ని:- బావా నా బావా బంగారుముద్దుల బావా
ఎన్నటికీ నిన్నే నే నేలుకొంటానోయీ
నే వున్నదాన్ని గాను నా వుసురుపోసుకోకు !!

బావ:- సిన్ని నా సిన్ని నే సిన్నోణ్ణిగానె
సిన్నజమీలున్నవోడ్ని నినుకలకాలంపూజిస్తా
మీ అన్నలతో సెప్పి నన్నేలుకోవె సిన్ని!

సిన్ని:- నీకన్న ఎవరు నాకు మా యన్నలతో సెప్పి
అందాలబావ నన్ను ఏ అడ్డు సెప్పకుండ
నన్నింటిదాన్ని సెయ్యి నన్నొడ్డునేయిబావ!!

సిన్ని కోరిక ప్రకారం అన్నలతో మాట్లాడి ఈ సిన్ని జమీలున్న బావ ముడివేసే వుంటాడనుకుందాం.

విడాకుల హక్కులూ, వ్యక్తిస్వాతంత్ర్యాలూ ఎక్కువగా గలిగిన ఈజనంలో ధైర్యం ఎక్కువ. తాటిచెట్టునీడ ఇల్లు

కాదనీ, తగులుకున్నవాడు మొగుడుకాదనీ తెలిసినా - విన్నా - అవి అంత లెక్కలోనికిరావు ! అంత అడ్డంకులూ కావు !!

తను వెళ్ళిపోతూంది. ఎక్కడికని, ఎప్పుడొస్తావనీ అడుగుతున్నాడు భర్త ? అందుకు పడుచు యిచ్చే సమాధానం చూడండి :

"రాతిమీా రాజనాల్ పంట పండేయేళ! రాతి బసవేశ్వరుడు రంకెలేసేయేళ" తిరిగొస్తానని నిక్కచ్చిగా (అంటే ఇక రాననేకదా) సమాధానం యిచ్చే మన స్త్రీత్వంగల బంధువులే కదా వీరంతా ! అటువంటి తరహాకే చెందిన ఈ క్రింది పాటలో చివరకు గురువువలన గుంటడుపుట్టాడన్నా వింత అనుకోవడం ఎందుకూ??

నిరాని రానిరబండి
నిలుపర బండోడా
నిరానిరానిరబండి !

అల్లుడొత్తాడాని
అత్త తొంగిచూాత్తుంటె
మీాసంగీటుకోని
మీాదనుపడ్డాడో — ॥నిరా॥

దమ్మిడీ యిచ్చినేను
తాటిపండు కొనుక్కుంటె

పీశము నేడానీ
పిరియాద్ధీ కెళ్ళాడో —— ॥ని రా॥

వచనం:- తప్పేటి పిల్లా?

ఏటిసెప్పను మావా??
గుఱవులు నేనూనూ
గరవులమీాద కెల్తుంటె
గుఱవుకాలూ తగిలి
గుంటడు పుట్టాడో !! ॥ని రా॥

డబ్బుకూ, లేదా భూమికి ఆశపడో, హోదాకో, తప్పకనో కాటికి కాళ్ళుచాచుకుకూర్చున్న ముసలివారికి పడుచుపిల్లలను వివాహంచేయడం ఈ నాడంత లేదని అనుకున్నా పూర్వకాలంలో ముమ్మరంగా సాగిన అత్యాచారం. అటువంటి ముసలిభర్త - పడుచుభార్య మనసులు ఎలా వున్నాయో పరికించండి :

ఏటో లె పిల్లా?
సీటికిమాటికి జగడమేలో లె!

సీరలెన్నో దెచ్చినాను
రయికలే సరిబెట్టినాను
సరుకులెన్నో గూర్చినాను
సరసనూ నే మెలగుతానూ !! ॥ఏ॥
వన్నెదాన్ని కన్నెదాన్ని
వంతులాపాలైనదాన్ని

సిన్నదానికి ఏటికావలెరా ?
నా ముసలిమొగడా !
పడుసుదానికి ఏటికావలెరా ??
సెంతనుంటె సాలునేటి
సింత నీవు బాపగలవా ?
పడుసుపంతం పదిలిపోనేదా ?
నా ముసలిమొగుడా
సిన్నతనమూ తిరిగివస్తుందా ??
సిన్నవారికి తిరముగలదా
మిన్నలా ముసలోళ్ళకంటె
నేతమనసుకు ఆశపడకోలె
నా పడుసుగుంటా
ముసలిగుండెలు ఆగిపోతాయె !!— ॥ప॥

అందుకునే 'ఈడూ జోడూ' అన్నారు !

♦ ఈ పాటలోని శృంగారం వినండి. ఇది సవర పాటలు.

యావ్వనం కెరటాలు తన్నుతూన్న ఓపడుచుని పలుకరింపులో 'ప్రేమ'ను వినిపిస్తున్నాడు :

"దాచిన దాగవు సఖియా, నీ
కంటిచూపులో కనబడు నీ
సిగ్గూ వలపూ చిరునగవ్వూ
తెలిసికొంటినో చెలియా !

అలాగే భర్తజాడకోసం సందేశం – కాదు – వార్తాహారుని పంపడం :

---

♦ "ధ్వని" లో — సవరపాటలు — డాక్టరు గిడుగు సీతాపతిగారి వ్యాసంలోనుండి.

"త్వరపడవోయ్
తమ్ముడ త్వరపడవోయ్!
త్వరగా తెలుసుకు
రావోయ్ బావను
త్వరగా తీసుకు రావోయ్!
మూడో నాలుగు
ఏండ్లు గడచినవి
నా ప్రియకాంతుని
కానవైతినోయ్!
అయిదు వంటలూ
చల్లిపోవునోయ్!
నా మనోహరుని
చూడనైతినోయ్!
తల్లితండ్రులూ
అన్నదమ్ములు
అత్తామామా
బావలు మరదలు
ఎందరుండినా
ఎవరికి వారే
ఎట్లు కలుగునోయ్
ఆనందము!
నా మనోహరుడిట లేకుంటే
నా చెంతకు అతడిట రాకుంటే

తృప్తికలుగదోయ్ తమ్ముడ
తృప్తికలుగదోయ్!
సిరిసంపద లెన్నియుండినా
సరియగునా నా కాంతునితో
ఎవరికి కావలె
ఎవరు చూడవలె
నాపతి చెంతను లేకుంటే!
నా ప్రాణేశ్వరుడిక
కనబడకుంటే
నా ప్రాణములిక
నిలబడవోయ్!
త్వరపడవోయ్ తమ్ముడ
త్వరపడవోయ్!
త్వరగా బావను
తీసుకు రావోయ్!"

పాపం - భర్త అలిగి వెళ్ళాడో - అనుమానించే వెళ్ళిపోయాడో-ఎందుకు వెళ్ళాడో! ఎక్కడికి వెళ్ళిపోయాడో? అతడు వెళ్ళిపోయాక భర్తలేని లోటును గ్రహించింది - ఒక్క క్షణంకూడా గడపలేకుండా వుంది-"నా ప్రాణేశ్వరుడిక కనబడకుంటే నా ప్రాణములిక నిలబడవోయ్" - ఎంత ప్రేమ! ఎంత బాధ!!

అటువంటిదే - జొన్నకంకిలాంటి పాట - మరొక్కటి అందులోదే విందాం-:

"రావే చెలియా రావే
చుట్టచుట్టుగా పుట్టినయ్యాకో

చూడముచ్చటగు మరిచిగుకోయను
సందేహము కలుగును నీ దేహము
చూడగ సుందరికో చెలియా!

వలపు కలుగదా? నీకో సకియా
మనసుపుట్టదా నాపై నీకూ?
తగిన వాడనే కానా సకియా
నను చేకోనవా చెలియా!
... ... ... ... ... ..."

ఈపాట ఇంకావుంది మచ్చుకే యిచ్చాను.

—ఇప్పుడో, యింకాస్త సేపట్లోనో వస్తాడని ఎదురు చూస్తూ కూర్చోవడంలో చాలా శ్రమవుంది. పిట్ట రెక్కాడిస్తే ప్రియుడేనన్న ఊహ, చెట్లఆకు గలగలాడితే అదిగో అతగాడే ననే అపోహ, దీనికి సాయం పరాయివాడుచూస్తే ఎలాగ? అనేభీతి - గబగబారాడేమా? అనే ఉత్సుకత. రాత్రికి వస్తాడని రాత్రి గంధంతీసి వుంచిందట.

"చందమామో
ఓ చందమామో!
రాత్రికి రాత్రికి
వస్తావానీ చందమామో
రాతీగంధం
తీసేవుంచితి చందమామో
ఎప్పుడెవ్వుడు
వస్తావానీ చందమామో

ఎలగా చెట్టూ
నీడనుంటి చందమా మో
ఇప్పు డిప్పుడు
వస్తావానీ చందమా మో
ఇప్ప చెట్టు
నీడానుంటి చందమా మో
ఇప్పుడెప్పుడు
రాకుంటేను చందమా మో
ఇప్పపువ్వు
రాలినాదీ చందమా మో
మళ్ళీ మళ్ళీ
వస్తావని చందమా మో
మల్లీ పోదనా
విలిచీయుంటీ చందమా మో
మల్లిపోదా
మాటలు వినీ చందమా మో
మల్లిపువ్వే
రాలినాదీ చందమా మో

ఈవిధంగా ప్రియుడికోసం చీకటిరాత్రులను కోటివెన్నెల రాత్రులలగా భావించి ఆ ప్రేమహృదయంలో వేలజ్యోతులు వెలిగించుకొని ఎదురు తెన్నెలు చూచే పవిత్ర పడుచు హృదయాలు ఎన్నోకదా!

"ఒకరికీ చేతూలిచ్చాన్
ఒకరికీ కాళ్ళు యిచ్చాన్
ఒకరినీ చేతాబట్టీ

కూకున్నానోయ్ - బావా
కూకున్నానోయ్..."

అంది ప్రియురాలు - విన్నాడు ప్రియుడు - ప్రశ్నించకుండా ఎలాగుండగలదు-ప్రేమైక సామ్రాజ్యాధిపత్యం నల్పుతూన్న అతడి హృదయం.

"ఎవరికీ చేతులిచ్చావ్?
ఎవరికీ కాళ్ళనిచ్చావ్?
ఎవరినీ చేతబట్టీ
కూకున్నావే పిల్లా
కూకున్నావే?..."

అని కోపం బుసలుకక్కగా, అనుమానం పెనుభూతమై భయం గొల్పగా - ఆక్రోశంతో అడుగుతాడు.

ఆ సమయంలో చిలిపితనానికి చీరకట్టి, సరసాలకు వారసత్వం వహించిన ప్రియురాలు:

"గాజులకీ చేతులిచ్చాన్
కడియాలకి కాళ్ళనిచ్చాన్
డబ్బులిన్ని చేతాబట్టీ
కూకున్నానోయ్ - బావా
కూకున్నానోయ్...."

అని ప్రియుడిని నవ్వించి, కవ్వించి, ప్రేమతో ముంచెత్తి ముగ్ధుణ్ని చేస్తుంది - ఈ పాట ఎంత ముచ్చటగొల్పుతూం దంటారు. అలాటి నాయికా నాయకుల మధ్యన సంభాషణల రూపంలో జరిగే పాటలు లక్షోపలక్షలు.

కూలిపని చేసుకోనే పల్లెజనాళి జీవితమే ఒక విచిత్ర మైనది. చిలిపితనం, కొంటెతనంతోపాటు రసానుభూతి

కూడా గోచరిస్తుంది వారి భాషలో, భావాల్లో, ప్రవర్తనలో, కులుకుల్లో – పలుకుల్లో.

"మేఘాలతో ఆడుకోవడం వారికే తెలుసు – పక్షులను పలుకరించడం వారికే తెలుసు – దేవతలకు పొలిమేరల లోనే ఉపాహారాలు పెట్టి పొమ్మనగలరు – నెత్తినపెట్టి ఊరేగించగలరు. ఆకాశం అంచుల్లో విహరించగలరు–ఎన్నో కలలు కనగలరు – ఆడగలరు – ఆడించగలరు.

పల్లె పల్లెంతా వారి దృష్టిలో ఒక కుటుంబం. అందుకే మావయ్యా, అప్పా, బావా, తాతా వరుసలలోనే కాని ఒకరు నొకరు 'పిలుచుకోరు."

ద్వేషాలులేని – అరమరికలు ఎరుగని హృదయాలు వారివి – అందుకే వారు చెట్లక్రిందనే జీవిస్తున్నా – గంజినే త్రాగివున్నా, వారి పనిపాటల్లోనే – ఆనందం కల్పించుకొని హాయిగా జీవితాన్ని అనుభవించగలరు – అదే వారు పెట్టి పుట్టింది – వారికి సృష్టికర్త అట్టే పెట్టింది.

ఆ పల్లెలోనే వుంటూంది గంగి. ఆ పల్లెలోనివాడే గంగడు. గంగడికీ పెండ్లికాలేదు –గంగి పెళ్ళీడుకు యింకా రానేలేదు.

గంగడు ఏపుల్లలో గొడ్డలెత్తి కొట్టుకొని గంజికి డబ్బులు తెచ్చుకోవాలి, ఏ తోటవారునో ఎండుపుల్లలు ఏరుకుంటేనేగాని గంగికి గంటలు దొర్లవు.

అలాటి గంగి – నింగిలో నిక్కిచూస్తే చుక్కలా గుంటుంది. చక్కనిచుక్క – చీరసింగారిస్తే తూరీగ రెక్క.

ఏం లాభం — తన అందాన్ని, అద్దంలో కూడా తొంగిచూసుకొనేపాటి అదృష్టంకూడా నోచుకోలేదు గంగి.

నింగినే గొడుగుగా చేసుకొని - భూమినే తల్లిగా నోచుకున్న గంగికి, చెట్లూ చేమలూ బంధువులుగా ఎంచుకునే గంగికి అద్దం ఎక్కడిది.

అలాంటి గంగి చంకన వేడపూసినతట్ట పెట్టుకుని పెద్ద చెరువుప్రక్క పుల్లలు ఏరుకుందుకని బయలుదేరి వెళ్ళింది.

ఓ చోట తట్టపెట్టి పుల్లలు ఏరుకుంటూంది గంగి- అంతక్రితమే అక్కడ ఆటలాడుకుంటున్నారు కొంతమంది యువకులు. వారి కంటబడింది గంగి. ఇంక చెప్పేదేముంది చిలిపితనాలకు జామార్లుకట్టుకొన్నవారు ఏ కేకదూ?

"కాటుకెట్టిందిరా పిల్లా
చూడమనీ - ఏలో డోముకులాడి
కమలాలెట్టిందిరా పిల్లా
చూడమనీ "
పూలు పెట్టిందిరా పిల్లా
చూడమనీ "

అంటూ గంగి పెట్టుకున్న పూలను, కంటి కాటుకను, చెవి కమలాలనూ వర్ణించి కవ్వించడం మొదలుపెట్టారు.

అయినా అంత పట్టించుకోలేదు గంగి. తనపని ముగించుకొని ఆ యేరుకున్న పుల్లలు గూటికి చేరేసి - కొడవలి తీసుకొని ఏటవతల దూడకోసమని గడ్డిపరకలకని వెళ్ళింది. అక్కడ కొంతమంది పయిలకుర్రవాళ్ళు దూడలను మేపు

కుంటూ ఆడుకుంటున్నారు. గంగి వంగొని గడ్డికోసు కుంటోంది. అంతలో పెద్దకాపు వచ్చాడు - పచ్చగడ్డిలో పచ్చగా కనిపించింది గంగి.

"పచ్చగడ్డి కోసేటి
పచ్చని పిల్లా
పమిటకొంగు జారిందే
పలుచని పిల్లా..."

అంటూ పాటమొదలుపెట్టాడు పెద్దకాపు. చెవులో కితకితలు పలికింది ఆ పాట గంగి. ద్వేషం ఎరుగని గంగి చిరునవ్వు తోనే 'పెద్దకాపుగారికి అంతా వేళాకోళమే' అని తన కోత చాలించుకొని రేవువద్దకు వచ్చింది - అప్పటికే చాల పొద్దెక్కింది. పడవమామ అవతలిగట్టున పడవ నిలుపుకొని వున్నాడు - చూసింది గంగి. జాలారన్న (జాలారన్న చేపలు పట్టే జాలరి) ను పిలుస్తోంది చూడండి. ఎంత ఆవేశపూరితంగా వినబడుతుందో యీ పాట:

"ఓ ఓ ఓ ఓ జాలారన్నా
ఏరుదాటెయ్యరా జాలారన్నా
పడవదాటెయ్యరా ”
వడ్డునకు జేర్చరా ”
గోదారి గాలిరా ”
గోలపెట్టుకొస్తోంది ”

ఏటవతల మా యిల్లు జాలారన్నా
ఎప్పుడెళ్ళి జేరుతానో ”
సీకటడీ పోతుందీ ”
ఒంటరిగా వున్నాను ”
మళ్ళీ వచ్చినప్పుడు ”
మంచిగ మాట్లాడతాను ”
ఓ ఓ ఓ ఓ జాలారన్నా—”

ఎలాగైతే ఏరు దాటింది గంగి. ఇంటికి వెళ్ళేటప్పటికే దీపాలుకూడా పెట్టారు. చాలా విసుగుగావుంది గంగికి - ఏం గడ్డి? ఎండలు ఎక్కువగా వున్నాయి.

ప్రక్కపిల్లలను అందర్నీ చేర్చింది.

గంగన్న పంటలు పండించుకుంటూ చేలంపట తిరుగుతున్నాడు, చాలా కష్టపడుతున్నాడు. వర్షాలు లేవు-ఏనాడు వర్షం కురుస్తుందా అని ఎదురుచూస్తున్నాడు గంగడు - అది గ్రహించింది గంగి.

వర్షాలు కురవాలంటే — వానదేముని కొలువాలని వాళ్ళ ముసలమ్మ చెప్పగా వింది. వెంటనే ఓ చిన్నదీపం వెలిగించింది — చుట్టూచేరి వానదేముడు పాట మొదలు పెట్టింది.

“మొర్రో మొర్రో
వానదేముడా

మమ్మింకా దయచూసి
మావాడకే రావ
ఏనుగులాంటి మోగోళ్లు
ఎత్తులాడిపోయారు
..........
ఈనుచున్న చేలన్నీ
ఎండిపోవుచున్నాయి
పండుచున్న చేలన్నీ
పండువారిపోయాయి
దుక్కి ఎద్దులన్నియు
తూలిపోవుచున్నాయి..."

అప్పుడే గంగన్న గంజితాగి చూరుముంగిట చుట్ట అంటించుకు కూర్చున్నాడు. గంగి పాడిన యీా పాట తన కెంతో సేద తీర్చినట్లుగా నవ్వుకున్నాడు.

ఆ నవ్వులోనే గంగిరూపం తన కళ్ళముందు ఎంతో అందంగా కనుపించింది. ఆ ఆలోచనలోనే గంగడు నిదురించాడు. చూరువార కోడికూసింది – గంగడు లేచాడు – గునపం తీసుకుని బెల్లు విరుస్తున్నాడు – ఊతంగా తనలో తాను...

"ఎన్నాళ్ళు పాటుపడ్డ
ఈ గునపమే మిగులు
ఈ రెక్కలే మిగులు

గంజిముంత వంచిచూడ
గంజిచుక్కకే కరువు..."

ఆ పాట ఆఖరి కునుకులో వున్న గంగికి వినపడింది. ఒళ్ళు విరుచుకు లేచింది గంగి. బయటకు వచ్చింది - గంగన్న బావ కష్టపడుతున్నాడు — తన మనస్సు ఉస్సురంది. అదే ఆ కూలిజనంలో, పల్లె జనాళిలో వున్న గొప్పతనం - నాదీ - నీదీ అనే భేదంలేదు వారికి - ఒకరి కష్టం - అందరి కష్టం- ఒకరి ఆనందం అందరికీ పరమానందం — ఎవరైనా వారి మీదకు వచ్చారా - గూడెం అంతా కదులుతుంది - కరా లన్నీ కలుస్తాయి.

గంగి తిన్నగా వెళ్ళింది. గంగడు బెల్లు పెల్లగిస్తూంటే గంగి బెల్లు పైకిపడేస్తూంది - గంగడు గంగినిచూసి చాలా ఆనందం పొందాడు. ఇంతలో గంగి అందుకుంది...

"ఓ బావ ఓబావ ఓబావ
మోమైన తోలగలవ
ఓబావ నువ్వు
పోలైన యొయ్యగలవ ఓబావ..."

గంగి పాట విన్న గంగడు కంఠం ఎలా వూరుకోగలదు. తను బావట — అయితే గంగి గంగడికి మరదలు. అందు కున్నాడు గంగడు పాట...

"మరదాల మరదాల ఓ మరదాలా
మోటంటే నాకిష్టం
ఓ మరదలా, మరీ

పోటంటే మహాయిష్టం
ఓ మరదలా..."

చూశారా యీ పాటలో ఎంత ఆహ్లాదం — చనువూ వున్నా యంటారు.

గంగి చేతులు దులుపుకు తన గుడిసెలోకి వెళ్ళబో యింది — అయితే గంగీ బావకు బూరిముక్క ఎప్పుడన్నాడు— సరసంగా గంగడు. ఛీ — ఫో — అంటూ లేడిలాగ సిగ్గుతో గుడిసెలో దూరిపోయింది గంగి.

రానురాను గంగీ, గంగడు మధ్య అన్యోన్యం ఎక్కు వయింది. గంగిని చూస్తే గంగడు, గంగణ్ణి చూస్తే గంగి ఒక విధమైన అనుభూతిని పొందసాగారు.

ఒకరోజు గంగడు ప్రక్క మామిడి తోపులో వున్నాడు. పని కట్టుకు వెళ్ళింది గంగి. అలా ఎంతసేపో గంగన్న బావ ఒడిలో ఆడుకుంది — వెళ్ళిపోదామని లేచాడు గంగడు. చూసింది గంగి...

"ఎల్లొస్తనోయ్ బావ
మళ్ళొస్తనోయ్,
మళ్ళొస్తనోయ్ బావ
యెళ్ళొస్తనోయ్,
కళ్ళు తెరిసేతలికి
కళ్ళెదుట వుంటాను,
వళ్ళు యిరిసేతలికి
వళ్ళోన వుంటాను

సుళ్ళు తిరిగొస్తాను
గళ్ళు కదిలొస్తాను ॥ఎ॥
సక్కని తురాయి క్రింద
చుక్కలాంటి రాయిమీద
ముక్కుతూ మూలుగుతూ
ముడుచుకొని తొంగేవు
మురిసినా తలచినా
ముంగలే వుంటాను ॥ఎ॥

అంతదాకా సరసాలు ఆడింది గంగి. చాలా సేపయింది కూడాను. వెళ్లిపోదామని లేచినుంచుంది గంగి వెళ్లిపోతూ...

"కళ్ళు తెరిసేతలికి
కళ్లెదుట వుంటాను
ఒళ్ళు యిరిసేతలికి
వాళ్లోన వుంటాను..."

అంటూ మామకు ధైర్యంచెప్తుంది.

అంతదాకా సరసాల్లో మునిగియున్న బావకు ఈమాట ఏమంత ఉత్సాహంగా కనుపించదు. అలా నిరుత్సాహంగా కనుపించిన బావను చూసి - తిరిగి ఇంకా ధైర్యంకలిగిస్తూ...

"ముక్కుతూ మూలుగుతూ
ముడుచుకొని తొంగోకు
మురిసినా తలచినా
ముంగలే వుంటాను...

అని ఉత్సాహాన్ని కలిగించి మరి వెడుతుంది.

ఈ పాటలో ఎంత ఆప్యాయతనీ, మనోధైర్యాన్నీ జానపద కవి పొదిగాడో గమనార్హం.

బావకోసం సుళ్ళుతిరిగే వరదలు అడ్డుపడినా, వెళ్ళొద్దు అనే అధికారంలాంటి హద్దులు అడ్డుతగిలినా—నీకోసం వస్తాను సుమా బావా...అని ధైర్యం యివ్వడం ఎంత హృదయంగమంగా వుందో!

రెండురోజులు కనబడలేదు గంగికి గంగన్న బావ. సాయంత్రంవేళ గంగి దంపుకొంటూంది నూకలు. బావను అల్లంత దూరంలో చూసింది.

"బావయొచ్చాడూ
కూరేమి లేదు!
కుళ్ళిపోయిన గుమ్మడికాయ
బావకు కూర—"

అని దంపుతూనే వెక్కిరింతలు మొదలుపెట్టింది గంగి. ఇంతలో తలెత్తి చూసేటప్పటికే బావ వెనకాల చాలామంది వున్నారు. గంగి తండ్రిని కలుసుకొని గంగన్నకూ గంగికీ పెళ్ళి చేయిద్దామని వచ్చారు పెద్దలు. ఎక్కడలేని సిగ్గూ వొచ్చింది గంగికి.

పెద్దలు నిశ్చయించినప్రకారం గంగిని గంగడికి యిచ్చి వివాహం జరిపించారు. ఆచి, తూచి చేసుకొన్న సంబంధమేమో చాలా అన్యోన్యంగానే వున్నారు.

గంగడు కుక్కిమంచం వాల్చుకు కూర్చున్నాడు. గంగి చాటలో నూకలుపోసి చెరుగుతూంది. గంగి కడుపులో ఏదో

ఒక కోరికవుంది — ఆ కోరికను గంగన్న బావకు తెలియ చెప్పాలి.

అందుకు పాటరూపంలో తన కోరికను ఎలా వ్యక్తీకరిస్తూందో చూడండి...




"మనయింటి యెనకాల
దానిమ్మ చెట్టో
దానిమ్మ చెట్టున్నాది
గంగన్న బావో!
తింటేను దానిమ్మ
పండే తినాలి
కంటేను తొలిచూలు
కొడుకును గనాలి...

ఆహా! ఎంత చక్కని కోరిక! "వరి మొలకా, మొగ మొలకా" అన్నారు!

ఈ విధమైన సారస్వతం ఎంతో వుంది జానపద గేయాలలో!

ఒకరోజు గంగి, గంగడూ ఏదో కూలిపని కోసమని పేటవలత వూరువెళ్ళారు - అసలే నీరులేని వ్యవసాయాలు - అక్కడ కష్టపడి పని చేసుకొంటేనే కాని రాళ్ళు రత్నాలు కావు.

అటువంటిచోట గంగి చెట్టునీడను పడుకుంది. గంగడు పనిమానేసి గంగిని చేరాడు. అప్పుడు గంగి అంటూంది చూడండి...

"వెన్ను మీాదా చూపు
మలపరా నాస్వామి
చన్ను మీాదాచేయి తియ్యరా..." - అని

మన ఆటలు తరువాత— ముందు పంటలకు నీరు కావాలి - ఆ యాతాం పని చూడకుండా - సరసాలేమిటని అడుగుతూంది గంగి. ఎంతటి జాతీయ భావాలు కలదో గంగి.

ఇక్కడే ఒకమాట.

ఈ పై పాటలోవచ్చిన 'చన్ను' పద ప్రయోగాన్ని బూతుగా కాకుండా కాళిదాసుగారి శ్యామలా దండకంలో 'కుచోన్నతే కుంకుమ రాగశోనే' అని చదువుకొని అభినందించినట్లూ; అల్లసాని పెద్దన్నగారి మనుచరిత్రలో 'తనయాస్తనదుగ్ధము' లను పదము చదివి మెచ్చుకొన్నట్లూ, పోతన్న గారి భాగవతంలోని 'చను కట్టు పయింబడ' అన్న పద్యం చదువుకున్న హుందాతనంతోనే చూడాలికాని మరోలా చూడకూడదు.

పెద్ద కవులు-చక్కనిపదాలమధ్య వాడిన ఈ పదాలే చూసి ఉబ్బి తబ్బిబ్బవుతున్న మనం యీా అమాయక యువతి ఎక్కడో 'చన్ను' అన్నంత మాత్రాన తప్పు పట్టనవసరం లేదు.

అలాటి సువిశాలత కనుక వుంటే ఈ జానపదసాహితి ఎంతో ముందుకు రాగలుగుతుంది.

గంగడు ఈ సమయంలో రంగం ప్రయాణంకట్టాడు- అక్కడే మంచి సంపాదనుందని. అక్కడినుంచి చాలా సరు

కులు గంగికి పంపాడు. కాని ఎంతకీ గంగడికి జాబు రాలేదు-
అలా రాలేదని ఆలోచిస్తూ...

"జోడుగొట్టాలోడమీదా - సిరిసిరి మువ్వా
జోడుంగరాలంపానే "
తీగజాబులంపానే "
కవరు జాబులంపానే "

ఏనాడూ ఓడచూడని గంగడికి రెండు గొట్టాలువున్న ఓడ ఒక గొప్పతనం. అటువంటి ఓడమీద తన సిరిసిరి మువ్వలాంటి గంగికి రెండుంగరాలు పంపాడట.

కాని ఎంతకీ గంగికి అందినట్లు కబురురా లేదు. ఎలా వస్తుంది? గంగికి చదువురాదు - సంధ్యారాదు. అందుకు గంగికి అందినా (అందకుండా ఎక్కడికి పోతాయి) జాబు రాయలేదు.

అందుకు బాధపడుతూ అంటున్నాడు చూడండి: తీగజాబు లంపాలిట (టెలిగ్రాం అన్నమాట), కవరుజాబు లంపాలట (కవరు అన్నమాట) ఎంత మనోహరంగా, యథార్థంగా కనబడుతుందో చూశారూ?

చివరకు గంగి జాబు రాయకపోవడం మూలంగాను, ఒంటరిగా వుండలేకనూ గంగడు వచ్చేశాడు. అలా రంగం నుంచి వచ్చిన బావని - గళ్ళలుంగీ, చేతిలో రూళ్ళకర్ర, కంపెనీ చట్ట, అడ్డగళ్ళ బనీను, కాలికి చైనా చెప్పులూ, ఒంటిమీద పచ్చబొట్లూ - చూసేటప్పటికి మురిసిపోయింది గంగి.

గంగడు రంగంనుంచి వచ్చినప్పటినుంచీ గంగి కొంచం హుందాగా కనబడుతూంది.

ఈ జానపదవాఙ్మయంలో గ్రామిక సాహిత్యం క్రింద చాలా పాటలు యింపైనవీ, విందయినవీ వున్నాయి. యివి అదో రకమయిన తరహాగా వుంటాయి. ఈ తరహా గ్రామిక గేయాలలో మోటుగా పదాలు వున్నా—ఎన్నో జీవితానుభూతులను, జీవిత సత్యాలను మనకు ప్రబోధిస్తాయి.

చేలో ఊడ్పులు ఊడ్చడానికి బయలుదేరారు. అందుకు ముందుగా చేలో గణపతి ప్రార్థనచేసి కొబ్బరికాయ కొట్టడం పరిపాటి. అందుకు ఆ పనిని గంగికి అప్పగించారు.

చేనుమూల ఒకచోట ఒక రాయికి పసుపురాసి, కుంకంపెట్టి, కొబ్బరికాయ కొట్టింది— ఆ వెనుకనే ప్రార్థన అందుకుంది:

"ఓ గణపతయ్యా గణపతయ్యా
ఉంగ్రాడ్లా నీకు పోతురా
ఓ గణపతయ్యా
మందకోడిగ ఉండబోకురా!

ఓ గణపతయ్యా గణపతయ్యా
జమ్మిపత్రి పూజసేతురా
ఓ గణపతయ్యా
ముందె నీకు పూజసేతురా!

ఓ గణపతయ్యా గణపతయ్యా
ఊరిలోన ఊరేగించెదం

ఓ గణపతయ్యా
ఉయ్యాలల వూపుతానురా!
ఓ గణపతయ్యా గణపతయ్యా
ఉండ్రాళ్లూ నీకు పోతురా
ఓ గణపతయ్యా
మమ్మెు ఎపుడు మరువబోకురా"

ఈ పాటనే కొన్నిచోట్ల యిలా పాడతారు:

* "ఓ యిగనరాజ యిగనరాజ
జమ్మిపత్రి పూజ సేతురా
ఓయిగనరాజ
జామిపత్రి పూజసేతురా..."

గంగి చెప్పగా- గణపతి ప్రార్థన అందరూ పాడారు- పూజ పూర్తయింది. ఊడ్పు ప్రారంభించారు - అందరూ వంగుని ఊడుస్తూంటే - ఒకపిల్ల సన్నని గొంతుతో - పాట చెప్పతూంది.

ఆ పాట ఆ గాలి వాలులో- వీనులవిందుగా వుంది.

"ఏయి వరాలో ఏయివరాలో
ఏకూ లొడికిన పాప
యెర్రన్న పాప.
ఆగూగో అన్నల్లు
వచ్చాచున్నారు
ఆ రెండు కొత్తారు?

* ఈ పాట రాయలసీమలోనిది.
మిత్రులు — కె. సభాగారి సేకరణలోనిది.

రాజూ లళ్ళుల్లు
రాజూ లల్లుళ్ళయితే
రారంటే పాప!
నామాట జోళ్ళైతే
మేడెక్కి చూడు..."

ఈ గ్రామిక గేయంలో ఎంతటి భావం కనుపిస్తుందో చూడండి:

"ఆరూగో అన్నల్లు
వచ్చాచున్నారు..."

అని ఒకతె అంటే- అందుకు యింకొకతె- మనబోటి చిన్న కుటుంబీకుల యిళ్ళకు వాళ్ళెందుకు వస్తారు అన్న అసంతృప్తితో...

"ఆ రెండూ కొస్తారు
రాజూ లల్లుళ్ళు..."

అంటుంది. ఈ జవాబుకి మొదటి యువతి – మనం మాత్రం తీసిపోయామా? అన్న స్వతంత్ర భావంతో- స్వేచ్ఛాగర్వంతో.

"రాజూ లల్లుళ్ళయితే
రారంటే పాప...!"

అని ఎంత నిండుగా ప్రశ్నిస్తూందో.

గణపతి ప్రార్థనచేసి వూరుకుని, చేలోకి గంగిమాత్రం దిగకుండా హుందాగా గట్టుమీదే కూర్చుంది. చేలోకి

దిగమన్నాడు గంగన్న. ఊఁహూఁ అంది గంగి. చూశాడు గంగన్న బావ.

"ఉల్లిమల్లా చీరాగట్టీ
కచ్చిలూ పైకెగాగట్టీ
ఊడుపూకి దిగామంటే
ఉన్నవాళ్లా పిల్లానంటావే
ఓలోలే గంగి
ఉన్నవాళ్ళ పిల్లానంటావే!
ఉన్నవాళ్లా పిల్లానంటే
కన్నుగీసే రమ్మన్నావూ
కంటిబాసలు నాకూ ఒద్దురా
ఓలోలే బావా
కంటి యిరుపులు నాకు ఒద్దురా"

అంది గంగి. అందుకు సమాధానంగా గంగన్న బావ......

"ఉన్నవాళ్లా పిల్లావనీ
ఉబ్బిపోకే ఓలే పిల్లా
కోతలాకి కోరి వస్తేనూ
ఓలోలి గంగి
కోతలోళ్ళకి కోపా మొస్తుందే"

గంగన్నబావ తనను దెప్పి పొడుస్తున్నాడని గంగికి కోపంవచ్చింది. బావకు సమాధానంగా...

"కోరమీసాల్ నువ్వూ కుంటూ
ఎఱ్ఱగుడ్డా చుట్టూ కొంటూ
కోతలాకే రావద్దంటావా ?
ఓరోరి బావా
కోరిక్కైనా తీర్చనంటావా—"

అని నిలవేసి అడుగుతుంది గంగి.

ఈపాటల వరుసలనే యేలపాటలు అంటున్నారు. ఈ యేలలు యింకా ఇతర వరుసల్లోకూడా వున్నాయి. మొదటి రెండు వరుసలూ యిదే నడకలో సాగి తరువాత నడక మారుతుంది.

ఈ యేలలు మొత్తంమీద చాలా ఉద్రేక పూరితం గానూ, వినసొంపుగానూ ఉంటాయి.

ఆవులు అంబా అని అరుస్తున్నాయి– కోడి కొక్కొరో కో అని లోకాన్ని మేలికొలుపుతూంది – గంగడు కొడవలి తీసుకొని కోతలకు బయలుదేరాడు—

గంగికి బద్ధకంగా వుంది – తను యింట్లోనే వుండి పోయింది. మంచి ఎండగావుంది. గంగడు గంజినీళ్ళకు ఎక్కడినుంచి ఎక్కడికి వస్తాడు. అందుకు తలమీద బుట్ట, బుట్టలో గంజిముంతలూ పట్టుకొని బయలుదేరింది గంగి, చేను గట్టున నిలబడి చూసింది. ఆ ఎండలో గంగన్న బావ ఒంటిమీద చెమట మిలమిలా మెరుస్తూంటే గంగికి బాధ వేసింది – అక్కడినుంచే బావను పిలుస్తూంది.

"కొండవలీ మొలనుంచి
కోత చాలించి!
రావోయి బేబేగ
గంగన్న బావా!
తలమీద కొచ్చాడు
తండ్రి సూరీడూ!
యిలలోన జనులెల్ల
యిసిగి పోనారూ! ||కొ||
ముఖమెల్ల కప్పింది
ముత్తేల సెమటూ!
ఒళ్లెల్ల ఒసివాడి
కందిపోనాదీ. ||కొ||

బంగారు నీ మోము
ఒసివాడి పోయె
ఒళ్లెల్ల కందింది
వెర్రినా బావా ||కొ||

సెలయేటిలో మునిగి
సెమట కడిగేసి
సరసనూ కూకోని
సల్దారగించూ ||కొ||"

ఎండలో అలసి సొలసివున్న గంగన్నకి తన మరదలు కంఠం చెవిని పడ్డాటప్పటికే - ఎంతో తేరుకున్నట్టయింది.

కాలుసేతులు కడుగుకుని గంగిని చేరి పిచ్చాపాటీ మాట్లాడు కుంటూ గంజిమెతుకులు తిన్నాడు.

సాయంత్రందాకా కోతల్లో మునిగున్న కూలి దంప తులు గంగి – గంగడూ తిన్నగా రేవుదగ్గరకు వచ్చారు. కాని అక్కడ పడవతాత లేడు, నావ ఒక గడకు కట్టి ఎటో పోయాడు.

ఉన్నట్లుండి గంగడు గంగిని ఎక్కించుకోకుండా తను పడవలోకి దూకి అవతలిగట్టుకు వెళ్ళిపోయాడు. ఆ ఆటల్లోనే తమ శ్రమను మరేచేది ఈ జీవితాలు. చూసింది గంగి...

"ఆపూ పడవాపూ
సరంగుబావా
వస్తున్నా వస్తున్నా
సరంగు బావా..."

అంటూ గంగి గంగన్న బావను సరంగు బావగా తలచి — చిలిపిగానే అనుకోండి — పిలిచింది. అందుకు గంగన్నబావ...

"కల్లుముంత ఇస్తావ
కడగదిలో కొస్తావ
గంగీ ఓ గంగీ
కందకుండ చూస్తానే
గంగీ ఓ గంగీ..."

అంటూ వెటకారాలు అందుకున్నాడు గంగడు తనకు గంగి పరాయి దయినట్లు. సరే! బావే అలా అన్న ప్పుడు గంగి ఎందుకు వెనుకపడాలి?

"నడిరేవు మధ్యలో
నన్నింసా పెట్టకూ
నా కొంపా కొచ్చిందీ
వదులూ ఓ బావా..."

అని తనూ అందుకుంది.

చదువుకోని గంగికి – చదువుకున్న వాళ్ళకులాగే— బహిరంగప్రదేశంలో మొగాడితో చేయి కలపడం తన కొంపకు తెచ్చుకోవడమే అని తెలుసు. అందుకే...

"నా కొంప కొచ్చిందీ
వదులూ ఓ బావా..."

అనడంలో ప్రతిధ్వనించే ప్రత్యేత విశిష్టత – ముందు చూపు.

ఈ విధంగా ఎన్నో గేయాలు కథారూపంలో పరిచయం చేయదగ్గవి జానపద సాహితిలో లక్షోపలక్షలు. అవన్నీ యిక్కడ పరిచయం చేయాలంటే చాలా పెద్ద గ్రంథం అవుతుంది!!





# బుర్రకథా తత్త్వము

# 5

జానపద వాఙ్మయంగా (రకరకముల దేశీయ ఛందస్సులలో పాటలు) ప్రసిద్ధిపొంది-చాలా ప్రాచీన చారిత్రక విలువనుపొందిన జంగంకథలనే బుర్రకథలు తెలుగునాడున జరిగిన ఎన్నో గాథలకూ, చారిత్రకాంశాలకూ ప్రతిబింబాలుగా నిలిచాయి.

ఈ జంగం కథలుగా తెలుగునాట ప్రచారమయిన ఈ సంగీతకథలు చాలా రూపాలలో - చాలా కథల యితివృత్తాలతో ప్రచారమయి వున్నాయి.

వీటినిగురించి యింతకుముందే ఎంతోమంది చారిత్రక పరిశోధకులు, జానపద వాఙ్మయోద్ధారకులు చర్చించి

వున్నారు. కనుక, వారు సూచించిన ముఖ్య విషయాలను ఆధారంగాగొని జంగం కథాతత్వాన్ని దిఙ్మాత్రంగానైనా పరిచయం చేయడానికి ప్రయత్నిస్తాను.

ఈ తరహా దేశిరచనలను గురించి — ఇంతకుముందే జానపదవాఙ్మయ పరిశోధకులు ఎంతోమంది కాలాలవారీగా, కథలవారీగా చర్చిస్తూ ఎన్నో వ్యాసములలో చర్చించి వున్నారు.

ఈ తరహా రచనలను, దేశిసారస్వతాన్ని గురించి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, చిలుకూరి వీరభద్రరావు గారు, నిడదవోలు వెంకటరావుగారు—యింకా ఎందరెందరో రకరకాల శీర్షికల క్రింద చర్చించియున్నారు.

క్రితంలో ఈ జంగం కథలపై వెలువడిన వ్యాస భాగముల నాధారంగాగొనియే నేను కొంచెం పరిచయం చేయడానికి ప్రయత్నిస్తాను. జానపదవాఙ్మయమన్నా, జానపద గేయాలన్నా మనవారికి అంతశ్రద్ధ వున్నట్లు కనుపించదు. ఈనాడు ప్రభుత్వం కొంత కదిలి ఒకకమిటీని సేకరణకుగాను వేసించనుకోండి. ఈ ప్రభుత్వం అండా, ఈ కమిటీ గుర్తింపు లేని ఎంతోమంది ఏనాడో యిటువంటి సేకరణలుచేసి, ఉద్యమానికి బలం చేకూర్చిన అజ్ఞాతకవులూ, సాహిత్యోద్ధారకులూ వున్నారు. అటువంటివారికి గుర్తింపు జరగదు—ఎందుచేత ?

ఇదే ఇతరదేశాలతో పోల్చిచూస్తే మనం ఈ సేకరణ కృషిలో, పునరుద్ధరణకృషిలో చాలా వెనుకబడివున్నామని

అనిపిస్తుంది. ఒక సమీక్షలోని లెక్కలను క్రింద యిస్తున్నాను :—

* "జానపద విజ్ఞానంయొక్క ప్రసిద్ధిని గుర్తించిన తర్వాత ప్రపంచంలో అన్ని ప్రాంతాలలోనూ కూడా దానిని సేకరించడానికి, వృద్ధిపరచడానికీ విజ్ఞానులు పాటు పడ్డారు. ఆ కృషిలో అతినవీనంగా జరుగుతూన్న ప్రయత్నాలను మాత్రమే కొంత యిక్కడ వుదహరిస్తాను :

"ఐరోపాఖండంలోని హంగరీదేశంలో లజ్‌త అనే ఆయన హంగేరీ జానపదగేయాలను సేకరించాడు. (బి.బి.సి. లండన్ లెటర్–నెం.392) అమెరికా దేశస్థులు జానపదగేయాలను సేకరించుకోడానికిచాలాపాటుబడ్డారు. ఆ గేయాల ప్రదర్శనలుకూడాతరచుజరుగుతుంటాయి 17వశతాబ్దంలో వ్యాప్తిలో వున్న జానపదగేయాలు నేటికికూడ వినిపిస్తూంటాయి. అమెరికా కాంగ్రెస్ గ్రంథాలయంవారు 40,000 జానపదగేయాలను సేకరించారు. (అమెరికన్ రిపోర్టర్ – తెలుగు ప్రతి 25–7–52 – పుట 2). ఫాబియన్ బవర్స్ అనే అమెరికా రచయిత ప్రపంచంలోని జానపద నాట్యాలను పరిశీలిస్తూ భారతదేశంకూడా వచ్చాడు. ఈయన కథక్ నృత్యాన్నీ, మణిపుర నృత్యాన్నీ పరిశీలించాడు. ఈయన భారతీయనృత్యం (ది డాన్స్ ఆఫ్ ఇండియా) అనుగ్రంథాన్ని ఆంగ్లంలో ప్రకటించడానికిపూనుకున్నాడు.(అమెరికన్ రిపోర్టరు–తెలుగుప్రతి

* శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారి–జంగం కథా పరిచయ వ్యాసాలు – గృహలక్ష్మిలో

9-1-55) ఈ మోస్తరుగా ప్రపంచంలో జానపద కళలమీద శ్రద్ధాసక్తులు నానాటికీ వృద్ధి అవుతున్నాయి."

# జంగం కథలు - జానపద వాఙ్మయము

జానపదవాఙ్మయంలో జంగం కథలని ఒక శాఖ, ఒక ప్రత్యేకత. ఇందులో చాలారకాలు మనకు కనిపిస్తాయి. నాటి చరిత్రలను ఆధారంగా తీసుకొని రచించినవి, నాటి సాంఘికాచారాలను, పరిస్థితులతో ముడిపెట్టి రచించినవి, రామాయణ కథలలాంటి యితివృత్తాలలలో రచించినవి, యుద్ధచరిత్రలను వీరరస ప్రధానంగా రచించినవి.

ఈ జంగం కథాపద్ధతి, రచనావిధానం నాడూ నేడూ కూడా ప్రచారంలోనే వుంది. నేటికీ జంగంకథ వరుసలలో బుర్రకథలు రచించి రాజకీయ పరిస్థితులను ప్రచారం చేస్తున్నారు. మచ్చుకు కష్టజీవి, పల్నాటియుద్ధం, బెంగాల్ కరువు మొదలగునవి. అలాగే పూర్వ ఔన్నత్యాన్ని గొనిరాసినవి- బుద్ధచరిత్ర, పండితరాయలు మొదలగు బుర్రకథలు.

వీరశైవమతం విజృంభించిన కాలానికే అంటే క్రీ. శ. 1150 నాటికే జంగాలు ఈ కథలను పాడుతూండేవారు. కను కనే వీటికి జంగంకథలు అను నామం ప్రసిద్ధమై నిలచిపోయింది. మహాస్రవంతి అయిన తెలుగు జానపదవాఙ్మయంలో జంగం కథలు ఒకశాఖగా ప్రధానమై నిలిచాయి.

ఒక విషయాన్ని ప్రజల మనస్సులలో హత్తుకునేలా చేయగల పటిమ ఈ బుర్రకథలకువుంది. నాటి అన్యాయా లనూ, అక్రమాలనూ ఏలుతున్న ప్రభువులదృష్టికి తీసుకు రావడంలో కూడా ఈ జంగం కథలపాత్ర చాలా వుంది.

ఈ జంగం కథలకు ఊతపదాలనేవి తప్పక వుంటాయి. ఈ కథలకు ప్రతి చరణం చివరనూ "తందానా తందానే" అనియు, "రామారామా రామారామా రామా రఘు రామా" అనియు, "తందాన రాజనందనా" అనియు, "తందానాబాయి రాజనందన" అనియు, "మేలునేలు", "తందాన తాన" అనియు ఊతపదాలు ప్రచారంలో వున్నాయి- వాడబడుతున్నాయి.

కొంచెం ఉధృతంగా - వేగంగా పాట సాగే సమయంలో 'సై' అనే ఊతపదం పాడుతుంటారు - మచ్చుకు పల్నాటియుద్ధం బుర్రకథలోనిది —

"అందెవేసినా పందెగాండ్లురా - సై
అందమైన పుంజులెత్తిరి - సై
పాతలు కత్తులు దీసిరి - సై
సానలమీదే సాదిరీ - సై"

అలాగే పూర్వకాలపు రచన అయిన ఆరుగురు మరాఠీల కథలోనిది:—

"అప్పుడు ఓరి తమ్ముడా - సై
మాపట్నము చేరినవారికీ - సై..."

ఈ రకంగా 'సై' అనే ఊతపదం వాడుతుంటారు.

పోతే పూర్వకాలపు జంగం కథలను ఎవరు రచించారూ అని. అదీ ఒక ప్రశ్నే. ఈ ప్రశ్న చాలా కష్టమయినది - కొన్ని కొన్ని కథలలో వారి వారి పేర్లు కపులు

చెప్పుకొన్నారు. కొందరు పేర్లు పేర్కొనలేదు - కొన్ని కొన్ని కథలకు కవి పేర్లు దొరికినా - కొన్నింటికి దొరకలేదు. చూడండి - చిన్నమ్మకథ రాసింది చెంగల్వరాజని పేర్కొన్నారు. కాంభోజరాజుకథ రాసింది జంగం సుబ్బయ్య దేవరట - జంగం కథలలో ఆఖరున కవి తన నామాన్ని ఎత్తు కోడం అనేది వుంది కనుక - ప్రతికథని ఆసాంతం పరిశీలిస్తేనే గాని కవి నామం తెలియడం కష్టమే. జానపద గేయాలు మొదలగువాటిలో దొర్లినట్లుగానే జంగం కథలలోనూ ప్రక్షిప్తాలు దొర్లినాయి. అది సహజం కూడా - పద్యాలు మొదలగునవి.

ఈ కథలను ఎక్కువగా చెప్పుకొనేది జంగాలు, జక్కులు, బవనీలు - వీరు ఫలానా ప్రాంతమని కాకుండా అన్ని ప్రాంతాలలోనూ వున్నారనియే చెప్పవలసి వుంటుంది. వీరి వేషములూ - పరికరములూ కూడా ఒకటిగానే వుంటాయి. ఒక తంబుర, ప్రక్క వంతచెప్పేవారి చేతిలో డక్కీలు అంతే.

తంబుర మీటుతూ కథకుడు కథ చెప్పుతూంటాడు. ప్రక్కన వంతవారు వంతచెబుతూ తాళం వేస్తుంటారు.

పూర్వకాలపు జంగం కథలన్నీ చాలా అద్భుతాల తోనూ, వింతలూ విచిత్రాలతోనూ, మహిమలూ మాయా జాలాలతోనూ నిండివుండేవనే చెప్పాలి - అతి ప్రాచీన కథ అయిన కాంభోజరాజుకథ నుంచి - చారిత్రక కథ

అయిన పల్నాటి వీరచరిత్ర వరకూ మనకు ఈ విషయములు యథార్థములుగానే కానవస్తాయి. జంగం కథాతత్త్వంలో చేసుమళ్ళవారు పేర్కొన్న పలుకులనే ఉదాహరిస్తాను.

"జంగంకథలో వీరుడు పరమాద్భుతమైన అసాధారణ మనిషిగా ఉండాలనే నియమంవల్ల రచన యథార్థతకే దూరమైపోయింది. ఇది ఒక్కొక్కప్పుడు గంధర్వ కథ కాబోలు అనిపించేటంత అసహజంగాకూడా కనబడుతుంది. పాతదైన కాంభోజరాజు కథలోనూ, అదే ఒరవడి అయిన బాలనాగమ్మ కథలోనూ (బాల పేరుతో చాలా కథలు ప్రచారమయాయి) కాకుండా, చారిత్రకమైన పల్నాటి వీర చరిత్రలోకూడ కొన్ని పట్టులలో నిజంకాదేమో ననిపిస్తుంది. బ్రహ్మనాయుడు విషంతిన్నా చావడు; బాలచంద్రుడి మెడ మీాద కత్తిపడగా ఆ కత్తి పిండిపిండయిపోతుంది; చచ్చిన భటులమీాద కుమారరాముడు మంత్రజలం చల్లగా వారు బ్రతుకుతారు."

దీనినిబట్టిచూస్తే అతిశయోక్తులతో రచనలు అల్లడం నాటి ప్రజలనూ, ప్రభువులనూ మెప్పించడంకోసం ఇటువంటి అతిశయోక్తులను వారు ఆచరించడంగా మనస్ఫురించవలసివుంటుంది. రాను రాను ఈ అతిశయోక్తులకే ప్రచారం ఎక్కువై అన్ని రచనలలోనూ వాటికి స్థానం, విలువ, బలం - ఎక్కువయికూర్చుంది. ప్రబంధ కవుల దగ్గరనుంచి జానపద కవులవరకూ ఈ లక్షణాలు వారి వారి

రచనలలో మనకు సమానంగానే కనిపిస్తున్నాయి – మిస్టరీ సాహిత్యంలాగ.

పక్షులు పలుకడం, మాట్లాడడం, జంతువులు యుద్ధాలు చేయడం, రాళ్లూ రప్పలూ సహాయపడడం. నాగులు ప్రత్యక్షమయి వరాలియ్యడం ఈ కథలనిండా మనకు కనుపిస్తాయి. ఆ పద్ధతులు అన్నిటా ప్రత్యక్షమయి కూర్చున్నాయి కూడా.

పాల్కురికి సోమనాథకవి ఈ కవిత్వానికి జీవం పోశాడని చెప్పవచ్చును. పూర్వకాలంలో ఎంతోమంది ఈ దేశి కవిత్వాన్ని తూలనాడినా శ్రీనాథుడంతటివాడు 'పల్నాటి వీర చరితం' ద్విపదలోనే రచించాడు.

పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథమహాకవి నన్నె చోడుడూ నాడే ఈ దేశికవితకు అండగానిలిచి-యిందులోనే ఎన్నో రచనలను మలచినారు.

అందుకు మనకు ఎన్నో ఉదాహరణలు కనిపిస్తూనే వున్నాయికదా. పోతే, ఈ జంగం కథాతత్త్వమును గురించి యింకా కొంచెం దగ్గరగా పరిచయం చేయవలసివుంటుంది. అదికూడా చూడాం.

జంగంకథలు అన్నా, బుర్రకథలు అన్నా, తందాన కథలు అనుకొన్నా ఒకటే అన్నది మనకందరకూ తెలిసిందే.

అసలు ఈ బుర్రకథా సంప్రదాయం అనేది తరచి చూస్తే యక్షగాన మహాస్రవంతినుంచి పుట్టిన సెలయేరా అని పిస్తుంది.

ఈ జంగం కథలను ఎక్కువగా ప్రచారంలోనికి తెచ్చింద్, అనుకరించింది జంగాలు. వీరు ముగ్గురు ముగ్గురుగా ఒక తంబుర, రెండు ఢక్కలతో గ్రామాలలో సంచారం చేస్తూ కథలు చెప్పుకుంటూ పోతుంటారు.

ఈ బుర్రకథలు శ్రీనాథుని కాలానికే చాలా ప్రచారంలో వున్నట్లు క్రీడాభిరామం రచనలో మనకు తెలుస్తూన్నదే. పోతే, ఈ బుర్రకథలనే జంగంకథలు ఎక్కువగా మంజరీ ద్విపదలోనే రచించినట్లు తెలుస్తూంది. ప్రస్తుత కాలంలో రగడలలోనూ చాలాకథలు వెలువడినాయి.

బుర్రకథ రచనలో ద్విపదలే కాకుండా తదితరములయిన ఛందోరీతులుకూడా అనుసరించబడినట్లు ధేనువకొండ వెంకయామాత్యుడు రచించిన ఉత్తర గోగ్రహణం మనకు ప్రత్యక్ష నిదర్శనంగా వినిపిస్తూంది.

దేశీయ ఛందస్సు అయిన ద్విపదతోపాటు – కీర్తనలూ, దరువులూ, కందార్థాలూ మొదలగునవికూడా వాడబడ్డాయి.

చూడండి – ఒక విషయం చెపుతాను – ఎక్కువగా నేను పాతకాలపు జంగం కథల ప్రతులను తిరగవెయ్యలేదు. కాని, అనుకోకుండా బంగారు తిమ్మరాజుకథ అని ఒక పుస్తకము చూడడము తటస్థించింది. అది 28 పేజీల పుస్తకము– వెల మూడు అణాలు – దీనిని ప్రచురించినది స్కేప్ అండుకో, ముద్రాక్షరశాల ముద్రితము.

ఈ బంగారు తిమ్మరాజు కథలో నేను చూసిన ప్రతిలో రచయితపేరు మొదటగాని, ఆఖరునగాని కనిపించ లేదు.

ఆఖరున వున్న చరణం ఇది:—

"శ్రీరంగములో చేరివున్నడూ
ఆ రాయలవారు
రామా రామా రామా రామా
రామా రఘురామా
......
......
పెనుగొండా తా నేలుతున్నడూ
పూల రంగరావు ॥ రామా ॥

......
ఎవరు పాడినా ఈ కథ విన్నా
పుణ్యము గలదయ్యా ॥ రామా ॥
రామచంద్రుడూ వారికిచ్చునూ
రాజ్యసంపదాలు ॥ రామా ॥
సీతమ్మా వారికిచ్చునూ
శ్రీ సంపదాలూ ॥ రామా ॥"

అని వుంది. కొన్నింటిలో ఆఖరున కవి తన నామధేయాన్ని చెప్పకోవడం పరిపాటి. కాని యిందు కవి నామధేయం కానరాలేదు.

పూర్వకాలపు జంగం కథా రచనలు చాలారకాలలో, రీతులలో నడచినవి. చూడండి - కొన్ని పాత కథలలోని నడకలు క్రింద యిస్తున్నాను—

చిన్నమ్మకథ :—

"అత్తకట్టిన కట్టులన్నియు విప్పినాదిగా
కంకణ హస్తములతల్లి కడవలో వేసింది
వక ఇంతటి కబళము తల్లి వడ్డించబోయె
అట్టి మాటలకు స్వామి ఆలోచన చేసెను"

బంగారు తిమ్మరాజు కథ :—

"ఎదురుగవచ్చిన రావణబ్రహ్మను
యెగరగొట్టినట్లు
వెళ్ళిన కార్యం బాగుజేసుకూ
బేటికి రావయ్యా
.......
వెన్ను దగిలి వెనువెంటనుండుమీా
అలమేల్మంగమా"

కాంభోజరాజు కథ :—

"కుర్చీమీాద కొలువుతీరింది
తందాన తాన
తొమ్మిదో గడియలోగాను
తందాన తాన
బాలుడే ప్రసన్న మౌతున్నాడు
తందాన తాన"

పెద్ద బొబ్బిలి రాజు కథ:—

"కపటమాటలూ చెప్పినాడు
దుబాసి లక్ష్మడూ
ఎత్తిన కత్తీ దండుమీదనే
తాయిగ పొడిచేను
చదురువిడిచి లేచినాడు
ధర్మా రాయూడు"

కుమార రాముని కథ:—

"తండ్రి ఎరుక లేకుండ
కుళ్లాయీలు పెట్టిరి
జరీ అంగరకాలు తొడిగిరి
రుమాలు నడుములగట్టి
చెట్టపట్టాల్ పట్టుకొని
పెద్ద బజారుకి వచ్చిరి
అక్కడ కోమటివారి పిల్లలు ॥తందాన॥"

కాకమ్మ కథ:—

"భీమవరపు కాలువ ఒడ్డు
కొచ్చింది కాకమ్మ
ఒడ్డుమీదనె గంగ
పొర్లుచున్నది కాలువ
పొంగే గంగను కండ్ల
చూచింది కాకమ్మ"

బాలనాగమ్మ కథ:—

"పిల్లలంతా గుంపులు గూడిరి ॥తందాన॥
ఇసుకబట్టి పప్పు చేసినాడు "
చిల్లపెంకులు వరహాలు చేసెను "

దేశింగురాజు కథ:—

"వారటు చక్కర పంచిరప్పుడు
వరుస వీధులాను
పరమ ముదంబున వచ్చినవారికి
బహుమతులను యిచ్చె
అరయగ కొలువున వున్న
జనులకు నట యీనాములిచ్చే"

ఈ వరుసలను తిలకించిన మనకు ఒక విషయం బోధపడుతూంది – ఇన్ని వరుసలలోకీ మంచి ప్రచారమూ, పేరూ అందినది బొబ్బిలి కథలాటి వరుసలకే. అందుకే దానినే నేటి కథారచయితలు ఎక్కువగా అనుసరించడం జరిగింది.

అయితే — పాతకథల వరుసలను ఎనిమిదిదాకా చూపించినప్పుడు కొత్త బుర్రకథా రచనా శైలిని చూపడం భావ్యమనుకుంటాను — కనుక, క్రింద నేటి బుర్ర కథలను కొన్ని చూపించడానికి ప్రయత్నిస్తాను – పరికించండి:

కష్టజీవి బుర్రకథలోనిది:—

"చంపలేను ఆ దొరనండి నే
తందానా తందాన తందన

హరిశ్చంద్రుఁలూ ఆ బాబండీ
తందానా తందాన తందన
కోపమెరుంగని గొప్పోరండీ
తందానా తందాన తందన"

యింకోక వరుస:—

"వినిపించండీ దొరలు నన్ను పిలి
పించిన పని యేమొ
వినరా నారిగ పెద్దపనుండే
పిలిపించా నిన్ను
నేను జెప్పినా పని జేసిలివా
నీకు మాన్యమిస్తా"

బుద్ధచరిత్ర బుర్రకథలోనిది:—

"బుద్ధదేవునీ కథ చెప్పూచుంటిమీా
శ్రద్ధగ వినరయ్యా
జయము జయము మన బుద్ధదేవునకు
జయము దిగ్విజయము
కాశికి నుత్తర దిక్కునయున్నది
కపిలవస్తు పురము ||జయ||
దానిని శుద్ధోదన మహారాజు
నేలుచు నున్నాడు... ||జయ||

పల్నాటి యుద్ధం బుర్రకథలోనిది:—

దీనిని రచించినది ప్రసిద్ధ బుర్రకథకుడు శ్రీ నాజర్. స్వయంగా రచించుకొని, స్వయంగా కథను చెప్పి పేరు

సంపాదించుకొన్న 'ఆంధ్రుడు ఈయనే అనుకుంటారు. కథ రచనలో, కథ చెప్పడంలో ప్రజా నాట్యమండలి కొత్త అధ్యాయాన్ని సృష్టించినది మరువకూడదు.

అసలు ప్రాచీన సంప్రదాయ కథా వాఙ్మయానికి ప్రజా నాట్యమండలి ధర్మమా అని తిరిగి ప్రచారం లభించింది. నాటి ప్రజా నాట్యమండలి ప్రత్యేక కృషి ఫలితమే బుర్రకథలూ. వీధి భాగోతం, ఛాయా ప్రదర్శనాలూ మొదలగునవి ఆంధ్రనాడున తిరిగి ప్రజా మన్ననల నందసాగినాయి. పల్నాటి యుద్ధములోని కొన్ని చరణాలు వినండి.

"ఎక్కువ తక్కువ మతవిభేదము
అక్కర లేదనుచూ
పక్కటిగ ప్రజలందరుండ తా
చక్కగ యోచించి
చాకలి మంగలి మాలమాదిగ
సర్వజనులకెల్ల
ఏకపంక్తిలో విందుభోజనము
యేర్పాటు జేసి
చాపకూటి సిద్ధాంతము పేరిట
సాగించెను ఘనుడు—"

ఇంకో వరుసలో:—

"తలతోక కాపాడు కత్తిరా—
తళతళా మెరిసేది కత్తిరా—

కాలానికి నాలుక కత్తేరా-
శత్రుసేనకూ మిత్తేరా-
భళానంటిభాయి తమ్ముడా - సై
మేలు భళానోయి దాదానా"

పండితరాయలు బుర్రకథలోనిది :

నేను రచించిన ఈ 'పండితరాయలు' బుర్రకథ ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం వారు ప్రసారితం చేసి వున్నారు. ఇందులోని రెండు చరణాలు పరికించండి :

"బంగారు మా జన్మభూమి — భళిభళి
పాడిపంటల ఆంధ్రభూమి "
నందనోద్యానవనములు "
నానందముగ నుండుభూమి "
ఆంధ్రదేశపు ధాన్యగాదివలె
దేశాన నిలిచిందోయ్"

ఇదే కథలోని యింకో వరుస :—

"వినరా ఆంధ్రుడ పండితరాయని
విశ్వగాథ నేడూ
గలగలపారే గోదావరి నది
ముఖద్వారమందూ
కోటివేలకూ పాగా వేసిన
కోనసీమ నడుమ
పచ్చని పొలాల పైరుచేలతో
బంగరు భూములతో"

పైన ఉదహరించిన పాత, కొత్త తరహాలలో రచించ బడిన కొన్ని కథలను మచ్చుకుగాను చూపించాను— ఇందులో నాటి వరుసలూ - యిప్పటి వరుసలూ కొంచంగా నైనా గుర్తించడానికి వీలు కలుగుతుందనుకుంటాను.

ఇంకా తెలుగునాడున ఎంతోమంది బుర్రకథా రచనలు చేస్తూన్నవారు వున్నారు. చరిత్రాత్మకమైనవి, సాంఘిక పరమైనవి, రాజకీయ ప్రచారపరమైనవి. ప్రాచీన వీర గాథలకు సంబంధించినవి - యిలా రకరకాల యితివృత్తాలతో - రక రకముల వరుసలలో రచిస్తూన్నారు. అన్నీ వరుసగా పరిచయం చేదామన్నా గ్రంథ విస్తరణ భీతిచేత వూరుకుంటున్నాను.

ప్రస్తుత కథారచనలను తిలకిస్తే చాలామట్టుకు ఒకే తరహాలో - ఛందస్సులో - (కొంచం తేడాలో) మనకు అగుపిస్తాయి.

ప్రస్తుత రచనలలో రగడలు ఎక్కువగా వాడబడు తూన్నాయి. చిత్రకవి పెద్దనార్యుడు లక్షణసార సంగ్రహంలో రగడలు తొమ్మిదిగా పేర్కొనివున్నాడు. కాని, చిత్రకవి తరవాతివాడైన అప్పకవి రగడలు తొమ్మిదిగానే చెప్పకపోలేదు. అయితే ఛందో దర్పణకర్త అనంతామాత్యుడు రగడలను ఎనిమిదిగా మాత్రమే పేర్కొని వుండడం గమనించవలయును. యితని మతములో - అనగా అనంతామాత్యుని మతములో - హయప్రచారమూ, తురగ వల్గనమూ ఒక్కటే !

తొమ్మిది రగడలూ యివి:—(1) హయప్రచారము, (2) తురగవల్గనము, (3) విజయమంగళము, (4) ద్విరదగతి,

(5) విజయభద్రము, (6) మధురగతి, (7) హంసగతి, (8) హరిణగతి, (9) వృషభగతి.

బుర్రకథలలో యిన్ని పద్ధతులూ అనుసరించబడక పోయినా కొన్ని మాత్రం వాడుతున్నారు, కొన్ని పద్ధతులు ఆచరణలో పెడుతున్నారు.

ఈ జంగం కథలనే బుర్రకథా సంప్రదాయంలో వున్న గొప్పతనం ఏమిటీ అని? ప్రజలను ఈ కథద్వారా యిట్టే ఆకర్షించవచ్చు. మనం ప్రచారం చేయదల్చుకున్న విషయ సంగ్రహాన్ని శ్రోతల హృదయాలకు యిట్టే హత్తుకొనేలాగ చెప్పవచ్చు.

అతి చాకచక్యముగలిగి, కంఠస్వరం తగుమాత్ర మయినా బాగుండి, సంగీతజ్ఞానం కొంచం గలిగుండి, వీర, కరుణ రసాలను ఒప్పిస్తూంటే - శ్రోతలు ఉద్రూత బాగుతా రంటే వింతా, విచిత్రమూ, పిడ్డూర్యమూ కానేరదు.

సరిఅయిన కథకుడు బుర్రకథ చెబుతూంటే ఆయా కరుణ, వీర రసాలను ఒప్పిస్తూంటే మనకు తెలియకుండానే అందులో లీనమైపోతాము - అదే కథకునిలోని ప్రత్యేకత - ఆ కథలలోని గొప్పతనము!!



# 6

"జగ్రాహపాఠ్యం ఋగ్వేదా
త్సామభ్యో గీతమేవచ,
యజుర్వేదా దభినయాన్
రసానా థర్వణాదపి,
వేదోప వేదైస్సంబద్ధో
నాట్యవేదో మహాత్మనా,
ఏవం భగవతాసృష్టో
బ్రహ్మణా లలితాత్మకః—"

వేదకాలానికే రూపకమనే నాటక ప్రస్థావన వున్నట్లుగా కూడా చెప్పుకోవలసి వుంటుంది. ఋగ్వేదంనుంచి వాచకాన్నీ, యజుర్వేదంనుంచి అభినయాన్నీ, అథర్వణవేదంనుంచి రసాన్నీ, సామవేదంనుంచి సంగీతాన్నీ గ్రహించిన

బ్రహ్మ నాట్యవేదమునే పంచమవేదాన్ని ప్రవచించినట్లు భరతముని చెప్పివున్నాడు. అంటే వేదాలలోనే రూపక బీజాలున్నవన్నమాట.

వీధినాటకాలకు చాలా వయసు వున్నట్లుగా హాలశాతవాహనుడు రచించిన గాథాసప్తశతి మనకు చెపుతూనేవుంది. సుమారు రెండువేల యేళ్ళనాటికే వీధినాటక లక్షణాలు, దేశి వాయిద్య విశేషాలు వున్నట్లు నాటి శిల్ప ప్రతికృతుల రూపావశేషాలద్వారా మనం గుర్తించవలసివుంటుంది.

"జగుఃకలంచగంధర్వాన నృతుశ్చాప్సరోగణాః
దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిశ్చఖాత్పతత్
ఉత్సవశ్చ మహానాసీ దయోధ్యాయాం జనాకులః
రథ్యాశ్చ జనసంబాధా నటనర్తక సంకులాః
గాయనైశ్చ విరావిణ్యో వాదనైశ్చ తథాపరైః
విరేజుర్విపులాస్తత్ర సర్వరత్న సమన్వితాః।
ప్రాధేయాంశ్చదదౌరాజా సూతమాగధ బంధినామ్"

వాల్మీకి రామాయణంలో శ్రీరామచంద్రుని జనన వర్ణన మూలంగా – దేశి సారస్వతంగా ప్రచారం పొందిన జానపదరచనలు ప్రచారంలో వుండివున్నట్లు బోధపడుతుంది. రామాయణ, భాగవత చరిత్రలలో మనకు ఈ విషయం తెలియకపోదు.

గంధర్వుల మధురగానం, అప్సరసల నాట్యం, దేవతల దుంధుభివాయిద్యం, వీధుల్లో నటుల నాట్యం,

సూత, మాగధ, బాదీజనుల వాయిద్యాలను గురించి పైన వర్ణింపబడింది. ఈ సమయంలో గంధర్వులు గానం చేయలేదని గేయాలేకదా? అవే తర్వాత తర్వాత - దేశకాలపరిస్థితులనూ, ప్రభావాలనూబట్టి రూపు దిద్దుకొని - కొత్త కొత్త రూపాలలో సాక్షాత్కరించి వుండవచ్చును - అని కాకుండా సంస్కృతంలో ఆదికావ్యం - రామాయణమన్నది చర్చలేనివిషయం.

నన్నయ్యగారి కాలానికి నాటకాలు ప్రచారంలో వున్నాయనడానికి ఈ ఒక్క ఉదాహరణమూ చాలునను కొంటాను - చూడండి:—

"విమలమతిన్ బురాణములు
వింటి ననేకము, లర్థధర్మ శా
స్త్రములు తెఱంగెఱింగితి ను
దాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి, జ
గత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి ప్ర
కాశముగా హృదయంబు భక్తితోన్"

అన్న పద్యంద్వారా మనకు బోధపడుతూ వుంది. దీనినిబట్టి ఈ తరహా దేశిరచనలు రెండువేల యేళ్ళ క్రితమే ప్రచారంలో వుండివున్నట్లు మనమూహింప గలము!

భాగవతంలో కృష్ణుని జన్మసమయంలో గోపికలు ఈతరహా పాటలనే పాడినట్లు దశమస్కంధంలో వర్ణింపబడిందికూడా.

అంతటి ప్రాచీనమయిన దేశి సారస్వత శాఖలో - సంగీతరూపక ప్రధానమయిన యక్షగానములను గురించి కొంచం చూదాం.

యక్షగానమనగా దేశీయ ఛందోబద్ధమయిన నాటకము - దీనినే పాటగా కూడా పేర్కొనక పోలేదు. "యక్షగానాలనుగురించి బ్రౌణ్య నిఘంటువులో పాటగా పేర్కొనబడింది." అయితే అప్పకవి దృష్టిలో యక్షగానము పాటలు గల ప్రబంధం అయివుండవచ్చునని తోస్తున్నది.

ఎందుచేతనంటే- అప్పకవీయములో యక్షగానప్రశస్తి వుంది. అందులో అర్థచంద్రికలు, త్రిపుట, జంపి, అటతాళము, నేనయక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు అని పేర్కొని వున్నాడు.

శ్రీనాథుని కాలంలో యక్షగానాలు చాలా ప్రచారంలో వుండి వున్నట్లు తెలుస్తూంది.

"కీర్తింతు రెద్దాని
కీర్తి గంధర్వులు
గాంధర్వమున
యక్ష గానసరణి"

అని సూచించియున్నాడు కూడా!

అదేకాదు - ఈ యక్షగానాలు తెనుగులో సుమారు నాలుగు వందలకు పైగా వున్నట్లున్నూ, యిందులో సుమారు రెండు వందలు దాకా ముద్రితములయినట్లున్నూ, మిగిలినవి అముద్రితములుగా వుండిపున్నట్లున్నూ చారిత్రక పరిశోధకులు ఒకరు పేర్కొని వున్నారు.

తరచి చూడగాచూడగా - నా వూహకు తట్టినంత మట్టుకు యక్షగానం సంగీతరూపకం అంటే సరిపోతుందని తోస్తుంది. ఈ యక్షగానాలు చక్కని రసవత్ప్రబంధాలనడంలో సందేహంలేదు-మచ్చుకు ఒక పరిచయం:—

"సుగ్రీవ విజయము అనే యక్షగాన ప్రబంధాన్ని కందుకూరి రుద్రయకవి రచించాడు. ఈ యక్షగాన రచనలో రుద్రయకవి ఏయే దేశి ఛందస్సులను చూపాడో చూడండి: 33 సంధివచనాలు, 14 జంపెలు, 11 ద్విపదమాలికలూ, 9 త్రిపుటలూ, 6 అర్ధచంద్రికలూ, 5 ఆటతాళములూ, 4 గీతములూ, 2 సీసములూ, 1 ఉత్పలమాలా, 1 కురుజంపె, 1ఏతాళమూ, 1 కందమూ, 1 ధవళమూ, 1 యేలపదమూ-వున్నవి"

దీనినిబట్టి యక్షగాన స్వరూపం మనం వూహింపగలము. యక్షగానాల గురించి యింకా చాలా వివరాలు, విషయాలూ తెలిసికోవలసివుంది.

ఈ యక్షగానాలకు వసంతఋతువు తంజావూరు రాజుల కాలంలో అని చెప్పవలసివుంటుంది. తంజావూరి

రాజులకాలంలో యక్షగానాలకు మంచి ఆదరణా, పోషణా, ప్రోత్సాహం ప్రోద్బలాలూ లభించాయి.

ఇక్కడ ఒక చిన్నవిషయం చెప్పవలసివుంటుంది - యక్షగానము వేరు, వీధి నాటకము వేరు అనికూడా ఒక వాదంవుంది - అలా చూసినా యక్షగానాలు, నాటకాలూ కూడా తంజావూరి రాజుల కాలంలో ప్రదర్శించేవారు.

నాటి రాజులు వీటి ప్రదర్శనాలకు చక్కని ఏర్పాట్లు కలుగజేయడం, చక్కని ఆదరణ అందివ్వడమూ - కారణ మయింది. ఆ రోజుల్లో స్త్రీలుకూడా యక్షగానాలు రచించారన్నది గమనార్హం. వీరికాలంలోనే రచింపబడిన "మన్నారుదాసవిలాసం" రంగాజమ్మ అను కవయిత్రి విరచితం. ఇంకో విశేషం ఏమిటంటే -యిందులో స్త్రీలుకూడా వేషాలు ధరించడం.

ఈ తరహా యక్షగానాలకే జక్కుల పాటలనికూడా పేరువుంది. ఈనాటికీ రాయలసీమలో అనంతపుర ప్రాంతంలో జక్కులచెరువు అనే ప్రాంతం, ఆ చుట్టపట్ల జక్కులజాతివారూ వున్నారు.

ఆ జక్కుల్నే కాబోలును - ఆనాటికే వున్నారుకూడా కాబట్టి - పాల్కురికి సోమనాధుడు - పండితారాధ్య చరిత్రలో - 'ఆదటగంధర్వ యక్ష విద్యాధరాధులు పాడెడు నాడెడువారు' - అని పేర్కొన్నాడు.

తెలుగునాడున వీధినాటకాలున్నట్లుగానే, తమిళ దేశంలో 'తెరుక్కూత్తులనీ'. కన్నడదేశంలో "బయలాటము' లనీ - వ్యవహారములో వున్నాయి.

యక్షగానమనగా పద్యాలూ, దరువులూ మొదలగు వాటితో వుండే సంగీతరూపకంలాంటిదేనని ముందే చెప్పి వున్నాను. అయితే ఈ యక్షగానాల్లో వేషధారణ యక్ష వేషాలే వేయడం పరిపాటి.

"ఒకనాడు రాజాంతఃపురాలలో - కలవారి ప్రాంగణాలలో-మార్గ నాటకాలూ-వేశ్యా నృత్యాలూ జరుగుతూ వుండేవనీ, జరిగినాయనీ మనమూహించుకోడానికీ, తలచి అంచనా వేసుకోడానికీ చాలా అవకాశాలున్నాయి - సరే, ఇది యదార్థమే అనుకుందాము. మరి నాటి సామాన్య ప్రజానీకంసంగతి ఏమిటి? అనేదికూడా మనం చూడవలసి వుంటుంది."

"వారికి - అంటే - సామాన్య జాతికి ఆ లోటును లేకుండా తీర్చినది ఈ యక్షగానాలే అని చెప్పుకోవచ్చును. చెప్పవలసియుంటుంది కూడా. యక్షగాన ప్రాధాన్యాలలో యిది చాలా ప్రాధాన్యమయింది."

"మన వాఙ్మయంలో యక్షగానాలకున్న వయస్సు తమిళ కన్నడ వాఙ్మయాలలో వున్నట్లు కనిపించదు-

యక్షగాన ప్రశస్తి ముందుగా మన వాఙ్మయంలోనే కానవస్తుంది-అని మన చరిత్ర పరిశోధకుల అంచనా. అది

ముమ్మాటికి నిజం కూడాను. ఈ యక్షగానాలను మననుంచే యితరులు గ్రహించారని చెప్పవచ్చును.

మన వాఙ్మయ ప్రక్రియలన్నీ ఇతర భాషావాఙ్మయాలనుంచే గ్రహించామని అనుకొన్నా, యక్షగానంమాత్రం మనదనీ, ఈ విషయంలోనైనా మనము అనుకర్త్యులము కామనీ గర్వంగా చెప్పవచ్చు"—అన్న యక్షగాన పరిశోధకులు (శ్రీ) యస్. వి. జోగారావుగారి పలుకులు గమనించదగినవి.

ద్రవిడ భాషయందు మొట్టమొదట కురవంజి అనే దృశ్యరచనలు బయలు దేరినవి. అసలు ఈ కురవలు అనువారు ఆటవికులు.

వీరు అడుగువేస్తూ నృత్యముచేయడం అలవాటు - 'అంజె' అనగా 'అడుగు' - అన్న అర్థంవుంది. అందుకే దీనికి కురవంజి అని వాడుక అయింది.

కురవంజినిగురించి చాలామంది పరిశోధనలు చేశారు. తొలినాటకరూపం ఏదనేది ప్రశ్నగానే - చర్చగానే మిగిలిపోయింది. దీనిని గురించి పరిశోధన చేసినవారిలో ముఖ్యులు కీ. శే- వేటూరి ప్రభాకరశాస్త్రిగారనేచెప్పవలసి వుంటుంది. వీరి దృష్టిలో తొలినాటకరూపం "కొరవంజి" అయియుంది.

* వీరి పరిశోధన సారాంశం ఇది:

"ఆంధ్ర ద్రవిడ. కర్ణాటక దేశ అరణ్యాలలో కురవలు

* "నాట్యకళ" (1957— సెప్టెంబరు)లో జానపద కళారూపాలు సమీక్ష - శ్రీ శ్రీనివాసచక్రవర్తి.

(కొరవ, కోవ. కోయ) అను ఆటవిక జాతివారు నివసించే వారు. గరుడాద్రి సింహాద్రి, తిరుమల – మొదలైన క్షేత్రా లలో యాత్రికులకు వినోదం కల్పించడానికి నృత్యవిశేషములు నెరపి ధనార్జన చేయుచుండెడివారు. ఈ కురవలు (కొరవల) అంజె (అడుగు, నృత్యవిశేషము) కురవంజె (కొర వంజె) దానినుండి కురవంజియ, కురవంజి, (కొరవంజ) రూపాలేర్పడ్డాయి. కాలక్రమమున ఈ నృత్య విశేషము ఆయా ప్రదేశాల స్థల మహాత్మ్యాలతోనూ, శివవిష్ణు లీలా కథలతో మిళితములయి గేయనాట్య రూపములను బడసెను.

"వీటిలో సింగి, సింగడు అనే రెండుపాత్రలు కథా పాత్రలగుచుందురు. కొన్నింట కథా సంధాయకుడు సంధి వచనముల జెప్పువాడు, విదూషకుడనదగినవాడు. మూడవ పాత్రము కోణంగి యనువాడుకానగును. కోణంగి తరువాత బోడిగాడు ననబడెను. కోణంగి సంస్కృత నాటకములలోని విదూషకస్థానీయుడగుట స్పష్టముగా గానవచ్చును. సంస్కృత నాటకములలోని ధ్రువాగానమే కురువంజులలో దరువనబడును. తరువాతతరువాత ఇవే యక్షగానంగా పరిణమించాయి" —

అయితే ఈ వాదమును అధిక్షేపించడం జరిగిన విష యమూ గమనించవలసి వుంటుంది.

(శ్రీ) నేలటూరు వెంకట రమణయ్యాగారి ఉద్దేశ్యం యిది:

26)

*"ఇది యరవమాట. సరిఅయిన రూపము కొరవంజి. కొరవంజి యనగా నెఱుకతె...

...కొరవంజుల యక్షగానములందు ఒక తరగతి నాటకములుండుట వాస్తవమే. నాయికా నాయికులకు కద్దె సెప్పుటకందు ప్రవేశ పెట్టిన యెఱుకతవలన దానికా పేరు వచ్చినది...

ఇంతకీ కొరవంజివేషం ఎలావుంటుందో పరికిద్దాం.

"జిలుగు బంగారుచీర
తెల్లని జారుకుచ్చులు
మెరయగా గరిమతో
గుత్తంపు చం
దురుకావి రవికయు
దొడగుచు
వచ్చె నెఱుకతె అహాహా!
చుట్టు శిరస్సున బెట్టుకొని
కుందనపుకట్లమీద వేసిన
కురచ బెత్తము చేతబట్టుకు!
ఫాలమున నసియాడు అల నెలవంక
పాపిట బొట్టు సొగకన్నులువాలు
చూపులు వైడూర్య పచ్చబొట్టుతో!
అందమలరగ యెడమమూపున
ఆడ శిశువును గట్టుకూ!—"

ఈ విధంగా వర్ణించబడింది.

* 'నాట్యకళ'—లో యక్షగాన వ్యాసం.

అయితే మఠరౌళ్ళ విషయం - పాల్కురికి సోమన్న గారి దృష్టిలోనూ శ్రీనాథుని దృష్టిలోనూ, ఈ "జక్కుల పురంధ్రి" ఎలా వుండేదో పరికించి ముందుకు వెడతాను.

"శిరమున నురమున జెవులగంఠయున
గరమునరగూకల్లుంగాళ్ళ జెల్వార
గన దండలును గనుగవగ దణికలు
సవరంబులును గలశంబు దండలును
భసితంపుబూతపై బరగు బచ్చెనలు
నసలారు చిరుగజ్జియలును నందియలు
సరిరత్నవంక్తుల జలపోషణములు
గరమొప్ప తొంగళ్ళు గల చల్లడనులు
బొల్చుదంతావళుల్ పుష్పమాలికలు
దాల్చి యత్యద్భుతోత్సవ లీలదనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూల వివిధవాద్య సమ్మేళనమున
నార్భటంబిచ్చి యొయ్యనజవనికల
గర్భంబు వెడలి"—

"కోణాగ్ర సంఘర్ష
ఘుమఘుమ ధ్వనితార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నొసలు
కొంచ్చిన కన్ను
వాడుపుచే దాటించు నెడపడడప
శృతికి నుత్కర్షంబు జూపంగవలయుచో

జెవి తాడు బిగియించు జీవగ్ర
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగమునుండి లంఘించు రాగమునకు
నురుమయూర ద్వయంబుపై నొత్తిగిల్ల
కామవల్లి మహాలక్ష్మి కైటభారి
వలపుబాడుచువచ్చె జక్కుల పురంధ్రి"

—వీటన్నింటినీబట్టి - క్రితంలో పరిశోధకులు యిచ్చిన అభిప్రాయాలనుబట్టీచూస్తే యక్షగానం అనేక విధాల రూపం ధరించిందని తోస్తూంది.

నేటి బుర్రకథలూ, హరికథలూ లాంటివీ, కూచి పూడి నాటకాలు యక్షగాన సంప్రదాయ పరివర్తనమా? అనీ అనిపిస్తుంది - ఈ విషయమై పరిశోధనచేసి ఎన్నో అపు రూపవిషయాలు శ్రీ యస్వీ. జోగారావుగారు అందిం చారు.

అయితే యక్షగానాలలో గేయములు ప్రాధాన్యం అయివుంటే, కురవంజిలో నృత్యం ప్రాధాన్యం వహించింది.

యక్షగాంధర్వాది వేషములు గలిగి, గాన ప్రధానమై వుండుటచే వీటికి యక్షగానములని నామ ప్రచారమొచ్చిం దనేది విదితమే. శ్రీనాథుడు - 'కీర్తింతురెద్దాని కీర్తి గంధ ర్వాలు గాంధర్వమున యక్షగాన సరణి' - అని పేర్కొని యున్నాడుకదా!

ఈ యక్షగాన ప్రాచీన ప్రదర్శన కళలో మొదటిదిగా ఓబయ మంత్రి రచించిన 'గరుడాచలం'ను పేర్కొనవచ్చును.

తరువాత కందుకూరి రుద్రయ రచించిన 'సుగ్రీవ విజయం'ను పేర్కొనవలసి వుంటుంది.

ఈ సుగ్రీవ విజయము - యక్షగానములందు ప్రసిద్ధి, ప్రచారమూ పొందిన కృతి. ఇందలి కథ రామాయణము లోనిది.

పోతే ఈ సుగ్రీవ విజయమునకు అంతటి ప్రసిద్ధి యక్ష గానాలలో రావడానికి కారణం - దేశిరచన అవడమూ, గేయరూపంలో రచించబడడమూ కారణములు - మచ్చుకు ఒక చరణం చూదాం:-

"తరణి కులమున బుట్టి
శరచాపములబట్టి
తరుణి గోల్పడుకంటె
మరణమే మేలు

నను శౌర్యవంతుడని
తన పుత్రి నిడినట్టి
జనక విభుడీవార్త
విని వగవకున్నె"

తరుణిని కోలుపోయిన శ్రీరామచంద్రుని మనస్సునందలి బాధను రుద్రయకవి చాలా చక్కగా చూపించినాడు.

అసలు ఈ దేశీయ రచనలలోనే అంతటి మహత్తూ, హుందా కనిపిస్తుంది. అందుకే అనుకొంటాను - నన్నె చూడుడూ, పాల్కురికీ జాను తెనుగునే కవిత్వం చెప్పారు.

"సరళముగాగ భావములు
జాను తెనుంగున నింపు
పెంపుతో......" అని నన్నె చోడుడూ

జాను తెనుగు విశేషము ప్రసన్నతకుననియు, ఆరూఢగద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ట రచనమానుగా సర్వసామాన్యంబు గామిజాను తెనుగు ననే యుత్తమ కవితా విశేషముల జూపి సోమనాథుడునూ జాను తెనుగునే విశేష ముగా గౌరవించిరి.

ఈ యక్షగానప్రదర్శనములు ఏ రూపంలో ఉంటాయో కూడా మనకు తెలిపినాడు శ్రీనాథుడు.

"............
ఢక్కాహుడక్కా జర్ఘరల్
ఝల్లరియాదిగాగలుగు శబ్ద
పరంపరతాళ బద్ధమై
యుల్లసిలం ప్రబంధముల
కొప్పగనాడుదురగ్రవేదిపై"

అని సూచించి వున్నాడు.

బసవపురాణంలో పాల్కురికి సోమనాథకవి యక్షగాన ప్రదర్శనల రూపం యిలా సూచించి వున్నాడు.

"............
పాటలుగా గట్టి పాడెడువారు
ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుతించువారు

నటుగాళ సాంగభాషాంగ క్రియాంగ
పటునాటకంబుల నటియించువారు...

(బసవ పురాణం)

పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథుడు యిలా పేర్కొనివున్నాడు. నాడు ప్రదర్శించిన నాటకాలు సంస్కృత నాటకాలు కాదనీ, యక్షగానాలనబడే దేశి నాటకాలే యివి అని మనకు సోదాహరణంగా యిచ్చియున్నాడు–చూడండి:

"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెరసి
రమణ బంచాంగపేరణ యాడువారు,
ప్రమథపురాతన పటు చరిత్రములు
క్రమమొంద బహు నాటకములాడువారు,
లలితాంగ రసకళాలంకార రేఖ
లలవడ బహు రూపమాడెడువారు,
అమరాంగనలు దివి నాడెడు మాడ్కి
సమరంగగడలపై నాడెడువారు,
ఆవియద్గతి యక్షులాడెడు నట్టి
భావన బ్రమోకులపై నాడువారు,
భారతాది కథలు చీరల మరగు
నారంగ బొమ్మల నాడించువారు,
కడు నద్భుతంబుగ గంభసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు,
వారట గంధర్వ యక్షవిద్యాధ

(పండితారాధ్య చరిత్ర)

ఈ యక్షగానాలలో చాలా హాస్యప్రధానమయిన సంప్రదాయిక పాత్రలు వున్నాయి. ప్రతి యక్షగానంలోనూ-అందలి యితివృత్తం వేరు అయినా - హాస్యపాత్రలు ప్రతి దానిలోనూ వుంటాయి. ఈ పాత్రలు అన్నీకూడా హాస్యం కోసం ఉద్దేశించబడినవే. రుచులలో ఉప్పుకు ఎంత ప్రాధాన్యత వుందో రసములలో హాస్యం అంత విలువ కలిగినది. అందుకే సంస్కృత నాటకాలనుంచి, దేశి రచనలవరకూ ఈ హాస్యానికి గౌరవం, విలువ వుంది - ఈ హాస్యం అందరికీ సమానమయింది.

అటు పామర జనం, యిటు పండిత జనం - యిద్దరికీ వినోదాన్ని యిస్తాయి ఈ పాత్రలు. మనకు ఈ విషయం తోలుబొమ్మలలో బంగారక్క, జుట్టుపోలిగాడు ఘట్టంలో తెలిసినదే.

అసలు ఈ సంప్రదాయిక హాస్యపాత్రలు వీటిల్లో లేక పోతే ప్రేక్షకులకు హుషారు అనేది వుండదు - ఎంతో పెద్దగా వుండే ఈ ప్రదర్శనాలకు ముఖ్యంగా హాస్యపాత్రలు చాల అవసరం.

ఈ హాస్యం కొంత మోటుగానూ, వెగటుగానూ వుంటుందని ఈనాడు మనమెంత బాధపడ్డా - ఒకనాడు వీటికి వున్న గౌరవం చాలా పెద్దది.

నాడు రాజాంతఃపురాలలో - రాజులకీ, రాణులకీ, పల్లెలలో సామాన్య జనతకీ కూడా సరిసమానమయిన వినోదాన్ని యిచ్చి చక్కని గౌరవం అందుకున్నవే.

పోతే, ఈ హాస్యపాత్రలు విజ్ఞానయుతమైనవి కాకున్నా - అవి లేకుంటే ప్రదర్శకులను ఆకర్షించలేమన్నది గుర్తించబట్టే నాటి నాటక కర్తలు ఈ సంప్రదాయకపాత్రలను విడువక పోషించారు.

తోలుబొమ్మలలో లాగానే - యక్షగానాలలోనూ, తత్ రూపాంతరములయిన గొల్ల, భామకలాపములు, కురవంజులు మొదలగువానిలోనూ కొన్నికొన్ని పాత్రలు హాస్యరసములే.

ఈ తరహా హాస్యరసప్రవృత్తి కలిగిన ఒకటి రెండు పాత్రలు పరిచయం చేయడానికి ప్రయత్నంచేస్తాను.

అన్ని కాలాలలోనూ — అన్నితరహాల ప్రజలనూ ఫక్కున నవ్వించగలిగింది హాస్యం. నవ్వని, నవ్వలేని, నవ్వురాని మానవుడు వుంటాడనుకోను. హాస్యంలేనిదే శృంగారమే లేదేమో. అందుకే మన లాక్షణికులు హాస్యం శృంగారానికి మైత్రీ రసమన్నారు. ముఖ్యంగా హాస్యరసం నాటకంలో ముఖ్యం. అందుకే హాస్యపాత్రలను ప్రతినాటకంలోనూ ప్రవేశపెట్టారు. ప్రేక్షకులకు వినోదాన్ని కలిగించే ఉద్దేశ్యంతోనే సంస్కృత నాటకాదులలో విదూషకుని పాత్రను సృష్టించింది.

“సంస్కృతంలో విదూషకుని పాత్రే — పాశ్చాత్య దేశాలలో కోర్టుఫూల్; కోర్టుజెస్టర్; బఫూన్‌లు. వీటికి సరిపోలినవే తోలుబొమ్మలలో జుట్టుపోలిగాడు, గాంధోలిగాడు,

బంగారక్క. యక్షగానాలలో కోణంగి, కురవంజులలో సింగీ. సింగడు.

అలాగే మాధవిపాత్ర కూచిపూడివారి సృష్టి. ప్రతి, భామకలాపంలోనూ యితడు మనకు ప్రత్యక్షమౌతాడు.

విదూషకునిలాగ హాస్యప్రసంగాలూ, కథనూ నడిపిస్తాడు, పాత్ర పరిచయాలూ వల్లిస్తాడు.

మాధవి – అచ్చు ఎలాగుంటాడో శ్రీ యస్వీ జోగారావుగారు పరిచయం చేశారు. "ఇతడచ్చుమచ్చు సింహళదేశపు నృత్యరూపకం – కోలంనాటిమాలోని తోరాంతయకథాకారుడు లాంటివాడు, బర్మాదేశపు వీథినాటకము సిభాట్ కేస్‌లో లూ – బయట్ లాంటివాడు.

మొత్తంమీద ఈ మాధవిపాత్ర చాలా ప్రాముఖ్యం కలిగింది. కథకు కలసివచ్చే పాత్ర, కేవలం వెనుకనుండి హాంగు చేసేవాడుగానూ కాక, నాయికా నాయకులకు సహాయకుడుగా వ్యవహరించే పాత్ర మాధవి. వెటకారాలువిసరడంలో యితనికి ప్రత్యేకస్థానం వుంది."

ఈ హాస్యరస ప్రాధాన్యములయిన నాటకాదులలో ఈ తరహా పాత్రలకు రకరకాల రూపాలు చూపారు – కాని, మొత్తంమీద అన్నీ సరిసమానంగానే వుంటాయి. సంస్కృత నాటకాదులలో విదూషకుడు ఎలాగుండేవాడో చూదాం:

ఈ విదూషకుని ప్రత్యేకత నవ్వు పుట్టించడం. లేని ఆకారాన్ని. వింత సంభాషణలూ తెచ్చిపెట్టుకుని వినోదింపచేయడం యితనిలో గొప్పతనం.

ఈ విధంగా - రాజాస్థానాలలో ఘార్వాం వినోదం కోసం - కొంత మందిని పోషించేవారు - పాశ్చాత్యదేశాలలో కోర్టుఫూల్; కోర్టు జెస్టర్ అనేవారు యిటువంటివారే. దీనిక్రిందకే విదూషకుడినీ, లేక మాధవినీ, లేదా సుంకరి కొండడిని తీసుకోవచ్చు. విదూషకుని రూపం యీ క్రింది విధంగా వుండేదని పేర్కొన్నారు.

భరతముని మతప్రకారం - "విదూషకుడు - బట్టతల, మరుగుజ్జు, వికారస్వరూపం, గూని, ఎత్తుపళ్ళు, ఎఱ్ఱటికళ్ళు"- కలవాడుగా చెపుతున్నారు.

ఇంకోవిధంగా విదూషకుని రూపం యిలా వర్ణించ బడింది.

"జుట్టు రాగిది, పీచుగడ్డం. మొత్తంమీద ఈ వర్ణనను బట్టి సంస్కృత నాటకాలలో విదూషకుని పాత్ర కేవలమూ హాస్యంకోసమే సృష్టించినట్లు కనిపిస్తూంది."

సంస్కృత నాటకాలలో విదూషకుని అవతారము అలాగుంటే - మన గొల్లకలాపాలలో సుంకరికొండడి వాలకం ఎలాటిదో చూదాం. వీడివాలకం లాలా కన్నయ దృష్టిలో యిది యిలా వర్ణించాడు:

"గడితపు చల్వచల్లడముపైన బిగించి
తగరాణమొరయ గాదట్టి జుట్టి
పిక్కటి బిరుసుగా బిగియుంచుంగుసుగుంటి
చొక్కాయ పిక్కలనంట దొడిగి
లరికుసుం శారంగు శాలుపాగామీద
గవగుల్కు కల్కితురాయి చెక్కి

శుభగుభాళించు సౌరభముగుల్కెడి మేన
కమ్మిదుప్పటి వేటుగా నమర్చి
కత్తి ఝుళిపించి వరకరాగ్రమునునుంచి
వాడి కొనగోళ్ళ మీసంబు దీడి దీడి
దుండగీడౌచు సుంకరి కొండడదిగో
వచ్చె కాబోలు వినవమ్మ వారిజాక్షి—"

యేతావాతా చెప్పొచ్చేది మన దేశి ప్రదర్శనాలలోని హాస్యపాత్రలు చాలా ప్రాధాన్యము వహించినవనియే. అంతటి ప్రధానమయి వుండబట్టే అన్నిటా ఆ పాత్రలు మనకు ప్రత్యక్షమై గిలిగింతలతో నవ్వించి, కవ్వించి - మురిపించి - కూర్చున్నచోటునుంచి మనలను - ప్రేక్షకులను — కదలకుండా కూర్చోబెడుతున్నాయి.

ఇక హాస్యపాత్రలను విడిచి-అసలు విషయం చూదాం. నేను మొదటనే సూచించివున్నట్లు వేషాలు వేసుకొని, పాడుతూ ప్రదర్శించేరూపకమే యక్షగానమన్నది నిర్వివాదం. అందుకు ముందరే కొన్ని ఉదాహరణలిచ్చాను. దీనిని కూడా చూదాం.

"......ధర్మాంగద చరిత
మనగ చిత్రాంగద విలాసమనగ యక్ష
గాన మొనరింతు వేషములట్టి జనులు
పాడి వినిపింప బుణ్యసంపద ఘటింప—"

అయ్యగారి వీరకవి వ్రాసిన చిత్రాంగద విలాపమనే దానిలోని పై పంక్తులు కూడా యక్షగాన స్వరూపాన్ని సూచిస్తూనే వున్నాయి.

దేశి సారస్వత మణియై వెలసిన యీ వీధినాటక రూపం - యక్షగానాలలోని భాష జీవద్భాష. వీటిని ఎవరూ అంతగా ఆదరించకపోయినా నిలదొక్కుకుని ప్రచారం పొందాయి - చారిత్రక పరిశోధకులకు ఈ యక్షగానాల లాంటి దేశియ రచనలు ఒక మ్యూజియంలాంటివి-నాటి ఆచారాలు, కథలు, గాథలు రూపాలు, నమ్మకాలు కళ్ళకు కట్టినట్టు వీటిద్వారా తెలుసుకోవచ్చు. ఇటువంటి ఈ యక్షగాన రచనలు ప్రాచీనసంస్కృతికి నిలయంగా వెలసిన భాండాగారాలంటే అందంగా వుంటుందనుకొంటాను!!

ఇంతవిలువగలిగిన, పటుతరమైన - ఈ వాఙ్మయ క్షేత్రంలో పూచిన మల్లెలు, జాజులు, సంపెంగలు, బంతులు, చామంతులు - గులాబుల గుబాళింపులు, విడిగా - వరుసగా చూసి - పాత పాలకీలో కొత్తకుచ్చుల టోపీ, సరికొత్త అంచుల జామారు ధరించి - చిరునవ్వుల జల్లుల్లోనాని - ఆ యింపు సొంపుల గుబాళింపులను ఆస్వాదించడానికి ముందుకు వెడదాము. గ్రామికసాహిత్య వీధుల్లో మొదటిమజిలీ చేద్దాం !!



# 7

దేముళ్ళనీ, దయ్యాలనీ—చెట్లనీ, పుట్టలనీ పూజిం చడం పరిపాటిగా—అంటే ప్రాచీనకాలంనుంచే వస్తూన్న ఆచారం; నమ్మకం. వ్యవసాయం చేసుకోవడమే ప్రధాన జీవి తాధారమైన మనకు వానదేముడిని కొలువడం కూడా పరిపాటే కదా-అందుకే...

వానలు కురవాలి - వానదేముడా
వరిచేలు పండాలి ”
నల్లని మేఘాల ”
చల్లగా కురవాలి ”
చేలన్నీ నిండాలి ”

28)

మూనా లెదగాలయ్యా – వాన దేముడా
పెన్నాలె వెయ్యాలి ,,
పచ్చాగ సేలన్ని ,,
పంటల్లూ పండాలి ,,
భాగ్యాలు నింపాలి ,,
భోగాలు నిండాలి ,,
పూజాలు సేత్తాము ,,
పండుగలూ సేత్తాము ,,
మా ఊరి చెరువంత ,,
ముంచెత్తిపోవాలీ ,,
కప్పలకు పెళ్ళిళ్ళు ,,
గొప్పగా సెయ్యాలీ ,,
వానాలు కురవాలీ ,,
వరిచేలు పండాలీ ,,

వాన దేమునిమీద యింకో పద్ధతి పాట:

వాన దేముడా – వాన దేముడా
వానాలు కురిపించు వాన దేముడా
కప్పతల్లి సీళ్ళాడె ,,
కడవలెల్ల నిండాయి ,,
మొర్రో మొర్రో ,,
ఈగతల్లి సీళ్ళాడె ,,
ఈధులన్ని నిండాయి ,,
మొర్రో మొర్రో ,,
చేపతల్లి సీళ్ళాడె ,,

చెరువులన్ని నిండాయి ,,
మొగ్రో మొగ్రో ,,
తూర్పున మెరుపులూ ,,
తుంపరులూ రావాలి ,,
చిన్న చిన్న తుంపరులూ ,,
చెలరేగి రావాలి ,,
జల్లుమనీ కురవాలి ,,
జడివానే కురవాలి ,,

ఈ పద్ధతిలో ఒకేభావంలో—అనేక తరహాలుగా పాడుతుంటారు. ఒక మండలంలో ఒక చరణం, మరో మండలంలో మరో చరణం తేడాలతో ఒకేమాదిరి పాటలు చాలా కనిపిస్తుంటాయి. వానదేముడిని పరిపరివిధాల నారివారి నమ్మకాలనుబట్టి ఆరాధిస్తారు పల్లెజనమంతా.

నాటుకున్న వరిచేలు మొనలు తొడిగి, వెన్నులువేసి పచ్చగా యెదిగి పంటలుపండాలి. అప్పుడు పండుగలు జరుపుకొంటారు. ఇంతకంటే రైతు ఏం కోరుకుంటాడు? మరేం కోరికలుంటాయి ఈ దేశ వెన్నెముకకు?

'ఏరువాక' అనేపదం తెలుగుజాతికి చిరపరిచితమైనదే. అందులోనూ తెలుగురైతుకూలీలకు మరీ పరిచయమైనది..

వానదేముని కనికరం కలగడం, చెరువులు నిండడం, తరువాత—ఏరువాకని స్వాగతం పలుకుతారు—దుక్కి టెద్దులతో నాగళ్ళను అలంకరించి ఏరువాక సాగుతారు. ఆ సమయంలో పాడే పాటలు చాలా వున్నాయి—చూడండి :

ఒలియ ఒలియో ఒలియో
రా వేలుగలవాడా రార పొలిగాడా
పొలి...పొలి...
వెయ్యేలుగలరా పొలి
ఎయ్యేలు కెయ్యేలు ఎనబనూరేలు
పొలిపొలో ఎయ్యేలుగలా పొలి
పల్నాటి కాపోరు ఎటువంటివారు
గుండుపోగులవారు గుర్రాలవారు
దొప్పచెవులావారు దోలికదుపోరు
చెంపతలపాగాలు చేతిరుమాళ్ళు
ఆయెరోసికాపోడు ఏమానిమ్రొక్కె ?
నెలకి మూడొర్షాలు కురవమని మ్రొక్కె
ఆ దక్షిణం మెరసిందో దరనిగిరిదెల్లి
వడ్డాదికొండాను లొడ్డె వర్షంబు
మూడుగొల్లకొండాకు మల్లెవర్షంబు
తూర్పు వర్షంబు తూలాకురిసేను
పడమటి వర్షాలు పట్టికురిసేను
ఆయడివార పెదచెర్వు అదిచాలనిండె
ముత్యాలయూచెరువు మూడుమదువుల్లు
వజ్రాల మా చెర్వు వాలుగమ్ములుగా
ఆ పాలాన్న శబ్దమన్నో మన పల్నాటి గలదు
ఆ బలభద్రుడిచ్చిన ఒకబద్ది పలుపు
జీలుగానాగలి జిల్లేడు వేడి
నారాయుడిచ్చిన నారమోకు

మువ్వలామునకాలి గవ్వల్లకాడి
ఎల్లేడు కాపోడు చేనున్నకడకి
ఏసేను కాపోడు ధరణిపైనింక
ఏసినయి త్తనము ధరణిపై మొలచి
మూడురోజులకి మొక్క మొలకారుపడెను
ఆ అయిదురోజులకి మొక్కో ఎంతేరుపడెను
మూడు నెలలకుపంట మూలాకొచ్చెనుగా
పాలిపొలో ఎయ్యేలు గలవాపొలి !

ఏరువాకమ్మను పసుపు, కుంకుమలతో, పూలతో అలంకరించి నిండారా ఆరాధించేవారి పద్ధతి ఈ క్రింది పాటలో బోధపడుతూంది.

ఏమికావాలీ ఏమికావాలీ
ఏరువాకమ్మకీ ఏకావాలీ !
ఎర్రఎర్రనిబంతి మాలాకావాలీ !
ఎరుపు తెలుపుమబ్బు కొండకావాలి
ఏమికావాలీ ఏమికావాలీ ?
ఏరువాకమ్మకీ ఏమికావాలీ !!

పొలముగట్టుననిలిచి వేడుకోవాలి
పసుపుకుంకుమలతో పూజసేయాలి
కొంకాయ వడపప్పు చేసిపెట్టాలి
ముత్తైదులందరూ పాటపాడాలి
పాటపాడుతు తల్లి పాదాలు మొక్కాలి
ఆటలాడుతు తల్లి పూజల్లుసేయాలి
ఏరువాకమ్మనూ ఏమికోరాలి

ఎడ తెగక సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలుకోరి పరవసించాలి.

ఈ విధంగా ఎరుపురంగు కుంకుమలతో - పచ్చని పసుపు పూతలతో - రంగురంగులుగా వింత శోభను చేకూర్చు పూలహారాలు నిండుగా అలంకరించి - ఎండవెలుగుల్లో - సింగారించుకుని వచ్చిన ముత్తైదువుల పాటల సందడితో ఏరువాకకు స్వాగతం పలికి - హారతులిస్తారు - ఈ తరహా ఏరువాక పాటలు ఎన్నో వున్నాయి.

పదములనుపేర చాలా పాటలు ప్రచారములో వున్నాయి. వెన్నెల, ప్రభాత, తుమ్మెద పదములు మొద లగునవి.

ఈ తుమ్మెద పదములు అనునవి 12 వందల శతాబ్దం నాటికే - అంటే పాల్కురికికాలం నాటికే ప్రచారములో వున్నాయి. అంతటి ప్రచారంలోవున్న ఈ తుమ్మెద పదం సమిష్టిగానంగా (కోరస్) పాడుతూ చక్కని తాళం - రాగంతో ఊగూతూగూతో ఉత్సాహంగా కోతలు కోసుకు పోతుంటారు. ఆ పాట మాధుర్యంలో మునిగి - వంతపదంగా "తుమ్మెదా" అని అంటూ శ్రమను మరుస్తుంది శ్రామిక జినాళి - అ శ్రామైక జీవితంలోనే ఏదో ఆనందం అనుభ వించే శ్రామికహృదయం! ఆ కోవకే చెందే ఈ తుమ్మెద పదం గమినిద్దాం:

శివశివ అనమేలు - తుమ్మెదా
శివయంటేను వినమేలు ,,
శివుని భక్తులాకు ,,

శరణన్న మేలే ఓ తుమ్మెదా
శ్రీకంఠు డనుపువ్వు ,,
మూడు లోకాములాయెనే ,,
సాకారమై యుండు ,,
పరమే కాంతమును జూడు ,,
ముట్టి ముట్టని పువ్వు ,,
అది ముట్టింది జగమెల్ల ,,
అందీ అంటని పువ్వు ,,
అది అంటెంది జగమెల్ల ,,
ముట్టకూడదే ఓ ,,
ముట్టిపాయ లేవేవో ,,
యివ్వనమందూనె ,,
చాల పువ్వుల వాసన ,,
కొవ్వి నీ వెరుగావె ,,
నీ నెవ్వ నేరమూల ,,
ఆరు రేకుల పువ్వు ,,
అది మించిన వాసన ,,
వేరు సేయక నీవు ,,
శివునిచేరి భజించాలె ,,
మేలు యెరిగి నీవు ,,
కేళి జరించాలె ,,
ఏడుగురు రాజులు ,,
నీకు ఈడు జోడు బంటు ,,
చూడపాడు జంపె ,,

రూ ఢికెక్కు మట్టె ,,
ఆస సాపజాతి ,,
వట్టి ఆసదీడు మంచి ,,
మోసబోరు మట్టి ,,
భక్తవాసికెక్కు ,,
అష్టదళముమీద ,,
అంటి చరించాలె ,,
కష్టము లెరుగావె ,,
నీవు స్రష్టవై యుందూవె ,,
తొమ్మిది వాకిళ్ళు ,,
నీవు నమ్మి చరింతూవె ,,
మమ్ములలలోన ,,
నీవు నెమ్మదిగ వుండావె ,,
అనాసతోటపువ్వు ,,
నువ్వు ఆనక వుండావె ,,
అందూన జిక్కిన ,,
తోటమాలిచే బడుదూవె ,,
నింగి నేలయూను ,,
గంగా గౌరులంద్రు ,,
ఉప్పొంగుచు నొకచోడ ,,
వేయివిధాల నటించు ,,
వేయి రేకుల పువ్వు ,,
అది వెదికి కొనాలేవె ,,
కద్గారు నడుగావె ,,

పూవుమధ్య చూపునీకు తుమ్మెదా
గురునకు హరునకు ,,
అంతరవు లేదు నిజము ,,
గురుపాద పద్మములు ,,
నిన్ను దరిశించమంటినే ,,
శివశివఅన మేలు ,,
శివయుం టేను విన మేలు ,,

ఈ తుమ్మెద పదంలో ఎంతటి వేదాంత ప్రభోదం యిమిడివుందో గమనార్హం. అలాగే ఎన్నో వున్నాయి వేదాంత ప్రభోధంతో కూడిన తుమ్మెద పదాలు—మరొకటి మచ్చుకు:

తుమ్మెదా ఓ తుమ్మెదా
తోటలలోకి ,,
చేలల్లోకి ,,
పూలల్లోకి ,,
వరిచేలల్లోకి ,,
ఇరగబడొచ్చింది ,,
దేవసిరినంది ,,
తేరగ వచ్చింది ,,
గొంతెమ్మ పెంచేన ,,
గొలుసులనందీ ,,
ఈనిన వరిచేలు ,,

ఈదవడ దొక్కింది తుమ్మెదా
అల్లము చెడ తిని ,,
పేడకడి వేసింది ,,
అంతటికే ఆసేను ,,
కాపన్న వచ్చాడు ,,
ఎక్కడిది ఈనంది ,,
ఏడాది ఈనంది ,,
పండిన వరిచేలు ,,
పాయలడగ ద్రొక్కింది ,,
కట్టండి నందిని ,,
గాజుల్ల శాలాన ,,
వేయాలి నందికి ,,
ఏడుకట్లా చొప్ప ,,
పొయ్యండి నందికి ,,
గోలాన కుడితి ,,
అంటూనె కాపన్న ,,
గొంతెమ్మ మెడకు ,,
మెడల్లో గొంతెమ్మ ,,
ఏలాగునుందీ ,,
ఉయ్యాల్లో గొంతెమ్మ ,,
ఊగుతున్నాదీ ,,
ఊగూగు గొంతెమ్మ ,,
చెరువులూ నింపిందీ ,,

ఎక్కడిది యీనంది తుమ్మెదా
ఏడాది యానంది ,,
గొంతెమ్మ పెంచిన ,,
గొలుసులా నందీ ,,
మానంది కొట్టద్దు ,,
మమ్ములు తిట్టొద్దు ,,
మానంది బందెలా ,,
మేపించుతామూ ,,
పొలతో పోలెడూ ,,
మాడలేసుకొని ,,
ఇదిగోర కాపన్న ,,
మానంది బంది ,,
ఇక్కడకు తీరదు ,,
మీనంది బంది ,,
తవ్వతో తవ్వెడు ,,
మాడలేసుకొని ,,
మానతో మానెడు ,,
మాడలేసుకొని ,,
అడ్డతో అడ్డెడు ,,
మాడలేసుకొని ,,
కుంచముతో కుంచెడు ,,
మాడలేసుకొని ,,
పన్నెండు చెంగులు ,,

పట్టుపంచెలనూ తుమ్మెదా
పట్టుమన కాపన్న ,,
పైమీద కప్పింది ,,
చాలునని కాపన్న ,,
సంతోషపడ్డాడు ,,
మెడలోగొం తెమ్మ ,,
ఏలాగునుందో ,,
పొరుగూరి చేలోకి ,,
పోబోకునంది ,,
పొరుగు బందులు ,,
తేబోకు నందన్న ,,
కట్టాడి నందిని ,,
గాజుల్ల స్థంబాల ,,
వెయ్యండి నందికి ,,
వెయ్యకట్లా జొన్న ,,

ఊడుపు ఊడవడం, వరికలుపులు, కోతలు, కట్టుడు మొదలగు సమయాలలో పాడే పాటలు, వినిపించే వరుసలు— ఆ సమయంలో కామందుల మీద విసిరే విసుర్లు, వెక్కిరింతలు వేళాకోళాలు వింటూంటే ముచ్చటగా-వినసొంపుగా వుంటుంది. అటువంటి పాటలలో కొన్ని.

ఉదయం సింగారించుకుని పనులకి వెళ్ళే కూలిజనం ఎంత హడావిడిగా వుంటుందో చూడండి:

అద్దారి కోతలకూ యెల్లొద్దారే
అద్దరూపాయి డబ్బులకు అసలేరాను!
చుక్కాపొడిసిన యేలకి సోకూచేసుకుని
లచ్చినాతోరాయె యెల్లొద్దారె!
సెవిలోనా కమలా లెట్టి ముత్యాల బావిలెట్టి
సుక్కాలరయికా తొడిగికరగంచు సీరాగట్టి
కళ్ళకుకాటూకెట్టి అద్దారికోతలకీ యెల్లొద్దారే -
నాసోకూకేమిాగానీ నీసోకూసూసుకోరా
మాటామల్లెకట్టుకో నీముందు నేనొత్తు
నురా—
కాయపంచ కట్టుకోని కిర్రుచెప్పులు తొడుగుకోని
పొన్నుకర్రా చేతాబట్టి పోకకత్తి మొల్లో చెక్కి
అద్దారి కోతలకూ ఎల్లొద్దారే -
గిత్తాదూడని ఎంటా బెట్టుకు
కోడీపిల్లని సంకా బెట్టుకు
పొగసుట్టే నోట్లో పెట్టుకు
పొగలొత్తును లేసీరారా
అద్దారికోతలకూ యెల్లొద్దారే...

అలాగే దినచర్య పరిచయంచేస్తూన్న మరో పదం వినండి:

వాడినిండా పసుపేసొ ఒయ్యారమేమే
గునాసారి గున్నమ్మ!
పొద్దున్న నువులెగసి పొలానికెళ్ళె ”
ఎండెక్కనూరీడు కొండెక్కనూశాడు ”

గంపకింజాకోడి కుయేయనికూసె గునాసారిగున్నమ్మ
గుట్టెక్కినూత్తాడో గంట్రోతుకావు ,,
మద్దేన్నం వేలపుడు మరిదప్పికేత్తే ,,
సద్దిగంజికాస్త తాగేవుండు ,,
ఆకుమళ్ళెలోనూ ఆకెండిపోయె ,,
తోడండినీరంత బావుల్లానుంచీ ,,
కుప్పనూర్పులకాడ కూకున్నావేమె ,,
పండినా సేలోకి పయనామైయెల్లీ ,,
కోయ్యండికోతలు కోడవళ్ళబట్టీ ,,
కోయ్యండి కోయ్యండి కుంచాలతోటి ,,
ఎయ్యండి బళ్ళాకీ ఎగుడుదిగుడూ లేక ,,

వరిపొలాలలో గుంపులుగా చేరి వరినికోస్తూనో, కడుతూనో "జుంయ్"మనే వరుసలో కోరస్ సాంగ్‌గా పాడే ఈ పాట మరీ ఉత్సాహంగా వినిపిస్తుంది:

ఎలేమాను ఎలేమాను ఎలేమాను ఓహో
ఈతాచెట్టుకు నుచ్చేనేసి ఈతాపళ్లు కోయ్యాబోతె
ఎలేమాను ఎలేమాను ఎలేమాను ఓహో
ఈతాముల్లు రొమ్ముగుచ్చె సన్నరవికా సగముతడిసె
ఎలేమాను ... ...
రాజుకొడుకు రాతిరోటుపిల్ల వంకాసూసినాడు
ఎలేమాను ... ...
ఓరానూపుసూసినాడు పిల్లచూడ సకిలించినాడు
ఎలేమాను ... ...

పిల్లదాపుకూ వచ్చినాడు రాజువంకా నూసెపిల్లా
ఎలేమూను ... ...
గడగడమంటూ ఒణికినాదీ రాజుకుదండం పెట్టినాదీ
ఎలేమూను ... ...
మాటవినకా రాజు వెంటనె పిల్లనుచేరీ ముద్దెట్టినాడూ
ఎలేమూను ఎలేమూను ఎలేమూను ఓహో!

తుమ్మెదపదముల లాగానే వెన్నెలపదాలు చాలా వున్నాయి. ఈ వెన్నెలపదాలు, చందమామ పదాలు ఎక్కువగా శృంగారపూరితం, ఆనంద కోలాహలంగానూ కూడిన భావ పదజాలంతో నిండిన నిండుకుండలో నీటితళుకలా వుంటాయి. అలాటిదే ఈ వెన్నలపదం పరికించండి. ఈ పాటను గుంపుగా కలిసి మధ్యలో ఒక బుట్ట అందులో ఒక వరికంకు, లేదా జొన్నకంకు పెట్టుకొని గ్రామంవీధుల్లో పాడతారు:

| | |
|---|---|
| ఆగరగ పట్టింది | యెన్నెలా |
| నీళ్ళకు వచ్చింది | ,, |
| పాపిడి సెట్టెక్కి | ,, |
| పలుకర్ర నయిరిసి | ,, |
| పగడాల రాయెక్కి | ,, |
| పలువరుస తోమింది | ,, |
| ముత్యాల రాయెక్కి | ,, |
| మునివళ్ళయినతోమె | ,, |

సలుపైన రాయెక్కి యెన్నెలా
నాలుకైనగీసె ,,
ముడికెడు నీళ్ళల్లో ,,
మొకమైన కడిగింది ,,
చారెడు నీళ్ళల్లో ,,
జబ్బాలు కడిగింది ,,
చుట్టజలతాకుసావు ,,
సొమ్ములు సుట్టింది ,,
ఆగరగ ముంచింది ,,
ఒడ్డునా ముంచింది ,,
అటుయిటూ సూసింది ,,
ఎవ్వరూ లేరాయె ,,
కట్టమీద కామన్న ,,
గరగెత్తిపోరయ్యో ,,
నీకుగరగెత్తితే ,,
నా పాడియావ్వూ నిస్త ,,
నీ పాడావు నాకొద్దు ,,
నీగరగనేనెత్త ,,
నాకు గరగెత్తితే ,,
నా గున్న ఎద్దునిస్తాను ,,
నీగున్న యెద్దునాకొద్దు ,,
నీగరగ నేనెత్త ,,
నాకు గరగెత్తితే ,,

నానాగరం యిస్తాను యెన్నెలా
నీ నాగరం నాకొద్దు ,,
నీ గరగ నేనెత్త ,,
అంత్తైతె నీ మనసు ,,
నేన వస్తాను! ,,

కళ్లాలతో నిండి – రకరకముల భావాలకు నిలయమైన యిటువంటి పదాలు ఎన్నో!

సంవత్సరమూ కష్టపడి పొలాన్ని దున్నుకొని, ఆకు నూర్చుకొని, కలుపులు తీసుకుని, నీరెట్టుకుని, కాపలా కాచుకొని, వరి కోసుకుని – కొట్టుకుని కుప్పపోసిన ధాన్యరాశిని చూస్తూంటే – శ్రమించిన కూలీకీ, అందుతోనే రైతుకూ ఎంతటి ఆనందం! – అంతటి ఆనందంలోనూ దేవుడిని మరువలేని హృదయంలోని గొప్పతనం గమనార్హం! చూడండి వారు ధాన్యరాశిని చూసి ఎలా మురుస్తున్నారో:

ఒలియొ ఒలియొ ఒలియొ ఒలియో
రా వేలుకలవాడా! రార పొలిగాడా
రా వేలుమీావయ్య రాశిమీాదయ్యా
పో యెర పోలిగాడు పొన్నల్లుదాటి
దా గెరా పోలిగాడు దండకట్టుల
కోడెలు తొక్కంగ కొల్లలై రాశి
ఎద్దులు తొక్కంగ ఎదిగెరా రాశి
మన్నలు త్రొక్కంగ దిన్నెలై రాశి

30)

పెయ్యేలు తోక్కంగ పెరిగెరా రాశి
శ్రీశైల పర్వతము శిఖతేలె రాశి
తిరుపతిగట్టులా దివ్యమై రాశి
కాళహస్తీలాగు కళలూరె రాశి
కోటప్పకొండల్లె గొప్పదీ రాశి
మంగళాగిరిలాగ పొంగెరా రాశి
వేదాద్రిగట్టులా వెలిగేరా రాశి
దుర్గమ్మగట్టులా తోచెరా రాశి
సింహాద్రిగట్టూల చెన్నొందా రాశి

తను కష్టపడి పండించుకున్న వరికుప్ప తన ఆరాధనా దైవగిరులైన తిరుపతికొండలాగా, మంగళగిరిలాగ, సింహాద్రి గట్టులా తోపిస్తూంది. ఇదే పదములు కలిగిన మరోపాట కూడా వుంది. అది చూడండి :

ఒలే ఒలియ ఒలియో ఒలియా
రావేలుగలవాడా రారా పాలిగాడ
రావేలు పదివేలు రాశి పదివేలు
రావేలు నీదయ్యా రాశి మాదయ్యా
పదివేలుగలవాడా రారా పాలిగాడా
పదివేలు నీదయ్యా పంటా మాదయ్యా
నూర్వేలుగలవాడా రారా పాలిగాడా
నూర్వేలు నీదయ్యా నూగు నీదయ్యా
వెయ్యేలుగలవాడ రారా పాలిగాడ
వెయ్యేలునీదయ్యా వెన్ను మాదయ్యా

కోటి వేల్లలవాడ రారా పాలిగాడ
కోటి కేలు నీదయ్యా కొండ్ర మాదయ్యా
పోయెను పాలిగాడూ పొన్నూగూడాటి
వచ్చెనే పాలిగాడూ పరగాణిబాట

వాయెక్కి పాలిగాడు లాలా లాడంగా
కుప్పెక్కి పాలిగాడు కూకా వేయంగ
మర్రెక్కి పాలిగాడు మాటలాడంగ
జువ్వెక్కి పాలిగాడూ జూదమాడంగ
రాసెక్కి పాలిగాడు రంపటిల్లంగ
పాలిగాడు గొట్టంగ పోగాయె రాశి
పెయ్యింబా ద్రొక్కంగ పెరిగెనే రాశి
దున్నలు ద్రొక్కంగ దిన్నాయె రాశి
కోడెలు ద్రొక్కంగ కొనసాగె రాశి
కొండపీటి కొండల్లా దొప్పాయె రాశి
తిరుపతికొండల్లే తీరెనే రాశి
రామలక్ష్మణులల్లె రాసూలు గలవు.

ఈ విధంగా ఒకేమాదిరి భావంతో – ఒకే సమయంలో పాడే పాటలూ, పదాలూ చాలా కనుపిస్తాయి.

రెక్కాడితేనేగాని డొక్కాడదు. అంతకన్నా ఈ జీవితాలు నోచుకోలేదు. అంతమాత్రంచేత నిరుత్సాహం పడరు– పైగా ఆ శ్రామికజీవితంలోనే ఎన్నో సౌఖాలూ – ఊహాలూ ఉత్సాహాలూ రంగరించుకొని, సృష్టించుకొని ఆనందం అనుభవిస్తారు – ఉన్నదానితో తృప్తిపడి, పెట్టిపుట్టిన కాశిని గంజి

సీళ్ళకే సంతృప్తి చెంది, ఆ వెన్నెల వెలుగుల్లో, ఆ చెట్లనీడల్లో, పొలాలల్లో, చేలలో శ్రమిస్తూ శ్రమను మరిచిపోయి సరదాగా గంటలనూ, గజాలనూ సునాయాసంగా దొర్లించుకు పోతాయి - ఆ తరహా పాటలు కోకొల్లలు ఈ వాఙ్మయ క్షేత్రంలో. మచ్చుకు కొన్ని విందాం.

రాయినా శందనాలో ఓయి బామల్లాల బావన్నిలాల॥
రామలచ్చుల్లాటి రాజులూ లేరు
సీతమ్మలాటి యిల్లాలు లేదు
రాయినా.........
ఉత్తర వచ్చింది ఎత్తరగంప
కారుమేఘా లాకాశమంటె
రాయినా.........
తొలకర్లో వర్సాలు కావాలి
ఎకరానికి బస్తాలు పండాలి
రాయినా,.........
నీరుపెట్టి దుక్కుదున్నాలి
దుక్కుదున్ని మొక్క నాటాలి
రాయినా.........
పల్లెలు బాగుండాలి
పట్నాలు బాగుండాలి
రాయినా.........
పైరుకంకులమీద పిట్టలు వాలాయి
ఇల్లాగ రమ్మురో పిల్లోడ
కొట్టకుండ నువ్వు తిట్టకుండా నువ్వు

అందరిల బెదిరిస్తె అవతలకు పోవురా
రాయినా.........

చూడండి - కొత్తగా వ్యవసాయంకు దిగే రైతుకు కూడా, చేయించే వ్యవసాయ కూలికీ కూడ తొలకరిలో వర్షం అవసరమనీ, ముందు నీరుపెట్టి తర్వాత నేల దున్నాలనీ, దుక్కదున్నాక మొక్క నాటాలనీ పాటల్లో, మాటల్లో వ్యవసాయ శాస్త్రం ఎలా ప్రబోధిస్తూందో జాతి జీవనానికి కావలసిన ఎన్నో రహస్యాలు ఈ పాటలమధ్య మాటల్లో దాగి వున్నాయన్నది యిక్కడ గమనార్హం.

వరి కలుపులకూ, చేను కోతలకూ సంబంధించిన ప్రతిదీ సమష్టిగా (కోరస్) పాడేదే—

పుట్టమీదా పాలపిట్టోయ్ నాసామి
కొట్టబోతే తేలు కుట్టేనోయి!
మంతరించే జానలుంటే నాసామి
మల్లెమొగ్గా పానుపే దూనోయ్!

నేలనేలా నెల్లి కూరోయి నాసామి
పాలపాలా బలుసుకోరోయి!
వాలుగొమ్మా చింతచిగురోయ్ నాసామి
వండిపెడితే వలపు తీరెనోయ్!

అరుగుమీదా అరటిపండోయి నాసామి
పండుమీదా మనసులుంటే నాసామి
సంత వేసినపండు రాదోయి!
ఎఱ్ఱచెరువు గట్టుకాడా నాసామి

చెప్పరాని దుఃఖమొచ్చిందోయ్!
ఎడ్లకేసే పోలికేకా నాసామి
నాకు యేస్తే నేను రానోయి!
సూప్రుతేలా నీకు పోరా నాసామి
మాటలుంటే చేరి చెప్పోయి!!

—కూలిపిల్ల అయినంతమాత్రాన, కులం చిన్నది అయినంతమాత్రాన వ్యక్తిత్వం ఎక్కడికిపోతుంది చెప్పండి- ఎంత గాఢంగా ప్రేమించే ప్రియుడైనా ఎడ్లను పిల్చినట్లు "యేయే" అని పిల్లను పిలుస్తే కోపంరాదూ? - అందుకనే ఎడ్లకేసే పోలికేక వేస్తే నేను రానని నిక్కచ్చిగా చెబుతూంది.

చిక్కుడూ ఆకుల్లు వెన్నియల్లో
శివసుద్దులుగట్టి వెన్నియల్లో
చెయ్యేసునే బోదు చుట్టాలజూడ
అక్కడెవరున్నారె అంభోంజ రాజు

మా అమ్మ తమ్ములు మాకు మేనమామలు
మముగన్న తండ్రికి బావమరుదు లమ్మ
బావమరుదులుగూడి బాయి తోడించిరీ
బాయిలో వున్నాది బంగారు బిందె

బిందెలో వున్నాది చామంతికట్ట
కట్టలో వున్నాది చిన్నపు మంచం
ఆ చిన్న మంచానికే సన్నని నులక
దానిమీద పండేటి జాణ లెవరమ్మా

పని జేసి లక్ష్మమ్మ పవళించి నాది
విసినకర్రలతోటి విసిరి లేపన్నా
విసిరినా లేవదూ విరజాజిమొగ్గా
కొబ్బరి ఆకులతో కొట్టి లేపమ్మా
కొట్టినా లేవదూ కోమటోరి పట్టి
దొప్పళ్ళ గంధంబు గుప్పి లేపమ్మా
గుప్పినా లేవదూ ఈ గురిజల బంతి
దొడ్లో పసులెళ్ళె - దొరెండ లొచ్చె
ఇకనన్న లేవవే దొడ్డవారి బిడ్డ
మందపసులెళ్లె మూడు ఎండలెక్కె
ఇకనన్న లేవవే మాయింటి కోడలా॥

ఈ వరి కలుపు పాటలో కోడలును లేపడం - వర్ణన ఎంత ముచ్చటగా సాగిపోతుందో చూడండి —

మంచి పనిఎద్దడిగా వుంది - పండి ఒరిగున్నాయి వరిచేలు - జనమే దొరకడంలేదు. కోతకు మనుషులను పిలుస్తున్నాడు ఓ బంటూ కూలన్న —

కూలికొస్తావంటె పిల్లామరీ
కూలంటె కులాస అయ్యా మాకు!
నేతకొస్తావంటె పిల్లామరీ
నేతంటె నేటోను అయ్యా మాకు!
ఊడ్పుకొస్తావంటె పిల్లామరీ
ఊడ్పంటె ఊగులాట అయ్యా మాకు!
కోతకొస్తావంటె పిల్లామరీ
పన్నా! కోతంటె కోలాటం అయ్యామాకు.

సరే! నాకు కావలసింది. కోతకు మనుషులే కోలాటం వేద్దాం రా! అని కోతలకు బయలుదేరారు - చేను కోస్తూన్నారు:

కోతకొయ్యండమ్మలాలా సేలు
కోరుకున్నా మమ్మలాలా!
ఆరుమూడు కాలమైన
అసరుకమరి కొసరులేదు ॥కోత॥

సోడిసేలు యెన్నులేసి
సోలెడు గింజలుకైతె
పాలికాపు బత్తాలకు
వనికొచ్చును కొయ్యండి ॥కోత॥

దసరా భోగాలంటే
ఆసరా తీరుస్తాయి!
పసరానికి కసవుంటే
భాగ్యాలే పండాయి! ॥కోత॥

సాలొచ్చిన మహారాజు
సెయిములగా యిస్తాడు!
కాసుసేత పడితేను
గగనమందేను సేను ॥కోత॥

—ఈపాటలో ఎంత నిండుహృదయం కనబడుతుందో! పంట బాగా పండాలిట, తనకు నాలుగు కాసులురావాలిట. అలాగే—

"కొయ్యండల్లా కొయ్యండీ
కోసి బణుపూలెయ్యండీ

వానలవరదల వంగినసేను
వెన్నులు ఈనిన వన్నెలసేను
తిన్నగదీసి మొదలూకోసి
పనలన్నీనీ పంజెట్టావా
గింజలు, బందలు పడిపోకుండా
పొందుగ వెన్నులు కోయ్యాండల్లా
కాలంసూత్తె సీతాకాలం
కొడవలిపాటూ జాగ్రత్తరా
కాలూ సెయ్యీ ఆడితేనే
కుండలో కూడూ కనిపిస్తాదీ—

పనిచేస్తూకూడా ఆ పనిలో మెలుకవలని గురించీ, జాగ్రత్తలను గురించీ హెచ్చరించుకోడంలో వారి అంతర్గత విశాలత్వభావం సుభోదకం కావడంలేదూ.

విచిత్రంగానే కనిపిస్తూంటుంది దేశి సారస్వతం పరికిస్తూంటే. ఆ పాటల్లో దాగిన పదాల భావాల కలియిక లోని అర్థం – పండితులకు సవాలు పలకడంలాంటివి. జాతికి నీతిని, దేశానికి బోధననూ, హృదయానికి శాంతినీ, జీవితాలకి క్రాంతినీ, బాటలకు కాంతినీ యిచ్చే భావాలూ, పదాలూ యిందులో కోకొల్లలు. దేశి శాఖలో ప్రతి పనికీ పాటలు వినిపిస్తాయి – మానవుడి జీవితచర్య యావత్తూ – పాటల్లో ప్రతిబింబించి పలుకుతాయి! లేచింది లగాయితు నిదురించేవరకూ అన్ని పనులకూ పాటలు. విడ్డూర్యం కాదూమరి? చూడండి:



# 8

పాటలేనిదే బ్రతుకేలేదా అనిపిస్తుంది! లేచింది మొదలు పడుకొనేవరకూ – ఆటకు పాట, గెంతుకు పాట, నిద్రకు పాట, పనికి పాట, వెక్కిరింతకు పాట, పూజకుపాట, నీతికిపాట, పాపకుపాట, అటుచూసినపాట. ఇటుచూసినపాట, బతుకేపాట–శ్రామికులు ఏపనిచేస్తున్నా పాట లేనిదే చేయరు, బండతోయడంనుంచి పగ్గంపట్టడంవరకూ; చెట్టుకొట్టడంనుంచి గట్టుత్రవ్వడంవరకు, చేను కోయడంనుంచి ధాన్యం మూట కట్టడంవరకూ; బొల్లు తవ్వడంనుంచి ఏతం వేయడంవరకూ; కర్ర పట్టడంనుంచి కొడవలి ధరించడంవరకూ; సూరీడు లేచింది మొదలు పడుకొనేవరకూ పాట–అందుతో పని – అదే బ్రతుకు ఆ జాతకాలకు–అదే వారికి నిత్యకార్యక్రమం.

నేడేకాదు నాడూ మన భారతజాతి జీవనంలో కదురు చాలా గౌరవం అందుకున్న పని! రాట్నంలేని కొంప లేదేమో ఆ రోజుల్లో. "కవ్వమాడని యిల్లు, కదురుతిప్పని కొంప, మగ్గము లేనూరు కానరాదుట!"- నిజమే! నేడంటే యంత్రాలూ, తంత్రాలు, మంత్రాలు వచ్చి కదురు కవ్వం, మగ్గం మూలకు నెట్టబడ్డాయి కాని, ప్రాచీన భారతంలో ఈ మూడూ మన జాతి జీవనానికి బలమైన వృత్తులేమరి!!

కదురుపాట - (రాట్నం)లో ఎంత సంతృప్తి కను పిస్తూందో వినండి :

అందచందము లేని ఆడకూతురికి
అందమేరుపరుచు ఆ పత్తిచెట్టు!
పాడిపంటలున్న బంగారమిచ్చు
పైడిపత్తిని పెంచ బంగారు హెచ్చు!
పాలుపెరుగులున్న పాపలకొరకు
పత్తి నూలుదీయు పాతలకొరకు!
కవ్వమాడని యిల్లు, కదురు తిర్పనికొంప
మగ్గము లేనూరు మరి గానరాదు!
రాట్నాల మ్రోతమ్మ రవ్వలా మ్రోత
కనకగిరి గొల్లోరి కవ్వాల మ్రోత!
ఏకుల్ల రాట్నము కాళ్ళ సంకెళ్ళు
కలవారి అల్లుడి కాళ్ళ సంకెళ్ళు!
ఏకేకు ఒకబార ఎల్లుండి సంత

నా యేకులయిపోయె నా కేమిచింత!
పుంజమ్ము నూలుకు పోగుతక్కువ

కొండమీద పొద్దుంది కొట్టబోకత్త!
చేనివారొస్తారు చెప్పబోకత్త!

— తోటలకు నీరుపెడుతూ పాడుతున్నారు :

ఊడ్పులా కాలాన
ఒద్దన్న మొగుడు!
కోతలా కాలాన
కోరి రమ్మన్న!

ఏమిరా ఓ బావ
ఏమిరా నీవు?
ఆలికన్నం పెట్టవు
ఊరి కుపకారమా!

ప్రజ్ఞకి పెళ్ళాడా కాని
కూడెట్టడం నా కులాన లేదు!

అల్లాగ సెబితేను
బోడిగాల్లోడ
పిల్లల్ని కంటావ
సిగ్గు లేకుండ!
పిల్లలంటే భాగ్యం!
మొగుడంటె దుఃఖం!
మొనగాడ వయ్యావ
మోమాటం లేక!

పొద్దున్నే పోతాను
మాపటికి వస్తాను!
నీ సోకులకు నేనేమి
అడ్డు వచ్చాను?

—సంపాదించకుండా వుంటూ పిల్లలిని కని తన కేం పట్టనట్లు వుండే మగవారికి యిదో వెక్కిరింతే. అయితే తన సంపాదనపరుడు కాకనో, లేదా పొద్దున్న పోయి మాపటి వచ్చే చిన్న కూలీ కనుకనో - ఇంటిదాన్ని ఏ అడ్డంలేకుండ సోకులకు జల్సాగా విదిలాడు!

— చేనులో అకు నూరుస్తున్నారు - రంగురంగు దుస్తులూ, రంగైన పూలకొప్పులూ, ఖంగ్ ఖంగ్ మన కంఠాలూ, ఓ! కోలాహలంగా వుంటుంది:

ఒయ్ రాజ ఒయ్ రాజ
ఒయ్ రాజ!

ఓ రాకూర్చున్నట్టి ఒయ్ రాజ
ముక్కూ కాడున్నట్టి ,,
తప్పాకాలున్నట్టి ,,
డిబ్బముక్కున్నట్టి ,,
ఒయ్ ఒయ్ ఒయ్ రాజ
ఒయ్ రాజ! ,,
నెత్తినైన జుట్టులేదు ,,
కత్తి పదును లేదు ,,
కంటికైన చూపు ఆసలెలేదు ,,

కాలూపుతాడయ్యా ”
కన్నె కొడతాడయ్యా ”
కన్నెత్తిచూస్తేను ”
కన్నంలో దూరాడు ”

బాగుంది! పనులుచేస్తూ కూలిజనం - అందులోనూ ఆడజనం - ఏ కామందునో, కాపునో, రెడ్డినో, దొరనో, ఏదోఒక వంకపెట్టి పాటల్లో యిలా వెక్కిరించడం చాలా చోట్ల కనుపిస్తూంది- "నెత్తికైన జుట్టులేదు, కత్తికైన పదును లేదు"ట. పౌరుషంలేనివాడని అర్థం. తమనిచూసి కన్నుకొడ్తాడట - తీరావారు కన్నెత్తిచూస్తే కన్నంలో దూరాడట—ఎంత అలుసుతనమో - ఎంత వెటకారమో!!

ఏతాము తోడుతూ పాడేపాటలు కొన్ని వున్నాయి- ముగ్గురు అవసరము ఈ యేతాము తోడుటకు! నూతులూ, కాలువలూ దగ్గరలోలేని మెట్టప్రదేశాలలో యేతాము గట్టి నీళ్లు తోడుతూండడం కద్దు.

ఏతాముతోడరా తమ్ముడా!
నీకు చేతైన సాయమదే తమ్ముడా!!
పాతాళ గంగమ్మ పైకుబికి పొంగింది
ఏతాముతోడి మెరక సేలన్ని తడపాలి
గూడు నొప్పనకుండ గూనలాగాలిబేగ
సేలన్ని తడిసి మరి మూనలు బాగెదగాలి
కట్ట తెగిపోకుండ కట్టండి. గట్లన్ని
బద్దిపై సిన్నోడ భద్రముగ నడపాలి
పట్టుతప్పితె వళ్ళు భళభళా రాలేయి

ఏతమెక్కినవాడు ఏరుకట్టినవాడు
ఏటేట పంటలతో యెలగాలి పదివాళ్ళు!!

ఇదీ ఏతాముపాటే - గాని, ఈ ఏతాముద్వారా తను అనుభవించే కష్టాలను వినిపిస్తూన్నాడు:

ఏటికేతంబట్టి వెయిపుట్లు పండించి
ఎన్నడూ మెతుకెరుగరన్నా! నేను
గంజిలో మెతుకెరుగరన్నా!!

కాల్జేయి కడుక్కొని కట్టమీాద కూసుంటె
కాకితన్నీ పోయెరన్నా - కాకి
పిల్లతన్నీ పోయెరన్నా!!

పోరుకూజాలేక పొయికాడ కూచుంటె
పోరితన్నీ పోయెరన్నా - పోరి
తల్లితన్నీ పోయెరన్నా!!

చుక్క పొద్దున లేచి బొక్కెనెత్తాబోగ
బొక్కబోర్లా బడితిరన్నా!
నాదేటి బ్రతుకాయెరన్నా!
నేను నాడే చావకపోతిరన్నా!!

ఈ యేతాము పాట-అందలి నిరాశ, దురదృష్టమూ చూస్తే - ఈ క్రింది పాట జ్ఞప్తికి వస్తూంది.

ఎన్నాళ్లు పాటుబడిన
ఈగుణపమే మిగులు
ఎందుకోయీా జన్మ - ఓరన్నా!

కంటరాక్టరు మేడ
కలక టేరూ మేడ
కట్టించుకు కట్టపడక
సౌఖ్యాలూ పొందుతుంటె
ముందూ మన కేదంచు
మోసాపోతూవుంటె
ఎండసెగనా మాడుతున్నా
గంజిముంతకు బరువులేదు!
గంగమ్మతల్లి చలువకు తిరుగులేదు!!

పాపం! ఇతగాడు "గంజిముంతలో గంజికె నోచుకో లేదు కాని, నీళ్ళకిమాత్రం నోచుకున్నాడు. అంటే -నీళ్లు తాగి బ్రతుకుతున్నట్లున్నాడు!

ఈ పాటనే డా॥ బి. రామరాజుగారు అభ్యుదయలో (1958 జనవరి) "శ్రామిక గేయములు" అన్న వ్యాసంలో 'కాకి'ని గ్రామాధికారిగాను, 'కాకిపిల్ల'ను, గ్రామాధికారి కొడుకుగాను చూపిస్తూ తన్నులుతిన్న రైతుని పరిచయం చేశారు మరోరకంగా.

బస్తా దిగుమతికి ఊతం సరిగా కుదరాలి - అలా ఊపు సరిగా వచ్చిందంటే ఎంత బరువైన బస్తాలైనా బంతులలాగా దిగుమతి జగిరిపోతాయి!

హైలేసో యల్లా హైలేసో
ఓ చూరుకాడా ,,
ఓ పిల్లదాన ,,

ఓ పెళ్ళిచేసుకుంటె హైలేసో
ఆ పెద్దకాసులదండ ,,
ఆ పెట్టెదెగాని ,,
ఆ చుక్కలరయికా ,,
ఆ కుట్టించి పెడతాను ,,
నీ సన్న సన్నాని ,,
నీ నడుముకూ ,,
నేనొక్క ఒడ్డాణం ,,
నే చేయించి పెడ్తా ,,
హైలేసో యల్లా హైలేసో!!

గొడ్డళ్ళతో కట్టెలు కొట్టడం, చెట్లు నరకడం చేస్తూంటారు. ఆ సమయంలో ఈ పాట పాడతారని ఒకరు అన్నారు కాని గొడ్డలి ఊతానికి ఈ పాట తాళం సరిపోతుందా అని—అయినా విందాం:

" నరకవయ్యా నరకవయ్యా
ఓహో-నరకవయ్యా!
వాడేమి కొట్టాడు - చింతచెట్టు
నీడేమికొట్టాడు - చిన్న చెట్టు
నేవేమి కొట్టావు - ములగచెట్టు
నరకవయ్యా నరకవయ్యా
ఓహో - నరకవయ్యా! "

ఈ పాటలో కష్టంఅనిపించేపని చింతచెట్టు కొట్టడం, లేదా అలాటిదే మరో గట్టి చిన్న చెట్టు కొట్టడం - కాని

యింకోడు గొడ్డలితో ములగచెట్టు కొట్టాననంటున్నాడు - నవ్వురాదూమరి అందుకే-పాటలోనే నవ్వుతున్నారు.

" వాడేమి కొట్టాడు ఓహో చింతచెట్టు!
వీడేమి కొట్టాడు అదో చిన్నచెట్టు!
నీవేమికొట్టావు ఇహిహీ• ములగచెట్టు!! "

కులం గోత్రం ఉన్నా, లేకున్నా, అనురాగం అనేది ఆ కూలి జనంలో వుంన్నతగానూ, సంతృప్తి వారి అనుభవించినంతగానూ, ఉన్నవాళ్లూ పెద్దవాళ్లూ అనుభవించలేరా అనిపిస్తూంటుంది - బావ కోడికూతతో లేచి చేనుమీదకు కూలికోసం వెళ్ళిపోయాడు - అప్పుడే "తలమీదకొచ్చాడు తండ్రి సూరీడు"-అంటే అపరాహ్నం అయింది - బావకి ఆకలికదూమరి! - గంజిపట్టుకుని తనే చేలకేసివెళ్ళి అల్లంత దూరాననే నుంచుని బావను పిలుస్తూంది:

తలమీద కొచ్చాడు
తండ్రి సూరీడు!
యిలలోన జనులెల్ల
యిసిగిపోనారు
కొడపలీ మొలనుంచి
కోతసాలించి
రావోయి బేబేగ
రంగన్న బావా
మొకమెల్ల కప్పింది
ముత్యాల సెమటా

ఒళ్లెల్ల వాసివాడి
కందిపోనాదీ

కొండవలీ మొలనుంచి
కోత సాలించి
రావోయి బేబేగ
రంగన్న బావా

బంగారు నీమోము
వాసివాడి పోయె
వొళ్లెల్ల కందింది
వెర్రి నా బావా ॥కొండ॥

ఎంత ప్రేమో రంగన్న బావ అంటె - 'మొకమెల్ల కప్పింది ముత్యాలసెమట, బంగారు నీమోము వాసివాడి పోయె' ఎంత అనురాగం - ఆనందమయ జీవితం!!

అడవులలో పుల్లలూ, కట్టెలూ, కుట్టుడాకులూ ఏరుకుని, కోసుకుని తీసుకెళ్ళడానికని "కూపు" లు అని నిర్ణయిస్తారు. ఫలానా అడవిప్రదేశంలో పుల్లలు ఏరుకోవచ్చునని నిర్ణయించే ప్రదేశానికే "కూపు" అని అంటారు. అటువంటి కూపుకు వెళ్ళే ఒంటరిపడుచులను - ఫారెస్ట్ గార్డు లాంటి ఓ అధికారి చీటి చూపమంటున్నాడు. అప్పుడు పడుచు అంటుంది.

ఏటోరి బాబూ
సీటిమాటికి
సీటి నూపమంటరూ

మాటిమాటికి
తనికి సేత్తమంటరు
సీటిలేకుండా రాలేదు
కూపుకూ
అడ్డానుకూ

ప్రక్కన మరోపిల్ల అడుగుతూంది:
ఎప్పుడోలెంకీ ఆ సోకుదారు నాయాలు?
ఏటమ్మ్మానిల్దిసి అడుగుతుండు?

తన సమాధానం: ఎవరూనేదే మన చింగం పిల్చెంకన్న మనువడు. ఈమద్దెన పారెట్టు గార్డయినాడు

దించునీదీ నెత్తిబరువ్వా
సూపించునీదీ సీటిపిల్లా
కూపుసీటి కాకపోతే
అపుసేత్తనమ్మా
కేసు వ్రాపుసేత్తనమ్మ

పిల్ల అంటున్నది:- వ్రాపుసేసినట్టే వున్నవు బాబూ!
అడ్డాకుల మాటబాబు
సెడ్డా బరువుందిబాబు
ఎత్తితే దించలేము
దించితే ఎత్తలేము
సెప్పరాని కాడుంది
యిప్పి నూసుకో సీటి

అతడు :- ఏంసేయమంటావేపిల్లా ఉద్యోగదరమం
ఒడి నొడతలువడి
సీటి తడిసిందేవమ్మా

పిల్ల :- బాబుసేతికి తడితగిలిందా!

అతడు :- మీందనున్నాయే గదుపిల్లా ఆటికిరాసేస్తాను.
ఒద్దోయ్ బాబు
గాడ్డుబాబు
సంతర్పణ తింటారు
మంచిది ఈ అడ్డాకు

ఏటోరిబాబు
సీటిమాటికి
సీటి నూపమంటరు
మాటిమాటికి
తణికిసేత్త మంటరు
సీట్లిలేకుండ రాలేదు
కూపుకూ అడ్డాకుకూ

ఊడ్పులు - ఆ మాటలోనే ఎంతో బలం కనిపిస్తుంది - ఎంతపని, ఎక్కడికెదరి, తండాలుగా కూలీలు, బళ్ళు, ఆకు, నీరు, ఓ! ఆ కోలాహలం, పచ్చని వరిఆకు ఊడుస్తూ, పాటలు పాడుతూ, పిట్టలు ఎగురుతూన్న ఆ దృశ్యం - ఎంత అందమైనదీ - ఈ ఊడ్పు పాట-వినండి:

నోమినోమన్నారె తుమ్మెదా!
నోమన్నలారా ,,
కలువరేకులె కళ్ళు ,,
కలికి సీతమ్మవి ,,
ఆ అందచందాలు ,,
అవనిలోనే లేవు ,,
బంతు లాడబోయె ,,
నీ మంతి సీతమ్మ ,,
సీత బంతుల యాట ,,
చిలుకలే చూశాయి ,,
సీత చెలికత్తెలె ,,
సిగ్గులే పొందారు ,,
అంతలో నాబంతి ,,
అరచేతిలో పడి ,,
జనకుడు తెచ్చినా ,,
శివునింటి కింటికీ ,,
దొరలుచ పోయింది ,,
సీత చెలులను చూసి ,,
నవ్వుచూ పలికింది ,,
అమ్మ అతివలార ,,
నాఅందమైన బంతి ,,
పెట్టె క్రిందకు పోయె ,,

తీసి యివ్వారమ్మ తుమ్మెదా!
చెలులు అందరుగూడి ”
చేతులు కలిపారు ”
సత్తువలు చూపారు ”
బలములే చూపారు ”
శివదేవుడి యిల్లు ”
కదలాకెపోయెను ”
నవ్వుచు సీతమ్మ ”
అంసనా గొచ్చింది ”
తామరలె చేతులు ”
అరికాళ్ళు బంగారు ”
అతిసులువుగాను ”
అవలీల నెత్తింది ”
జనకుడె చూశాడు ”
దేవతలు చూశారు ”
పుష్పవృష్టి కురిసె ”
దేవదుందుభు లెల్ల ”
దేవఘోసలు చేసె ”
జనకు డంతటతోను ”
జానకొద్ద కొచ్చి ”
సంబరముతో తాను ”
తన వంతమె పలికాడు ”
కన్నతల్లీ నిన్ను ”
పొగడతరమూ కాదు ”

దేవతలె జంకారు తుమ్మెదా!
రాక్షసులు రానేరు ”
నరుల వశమూకాదు ”
నీ బలము చూడంగ ”
నా మనసు పొంగింది ”
నీ బలము మించిన బలము ”
నే నవని చూడాలేదు ”
ఈ విల్లు విరిచేటి ”
వీరునకె నిన్నిత్తు ”
సీత సిగ్గుతోటి ”
చెలులాతో చేరింది ”

బరువు పని చేస్తూన్నప్పుడు పాడేపాటలు అనేకం అనేక రకములు వున్నాయి - ఐతే, నీటిమీద నడిచే పడవ బరువుకూ, నేలమీద దొర్లే రోడ్డు రోలరుకూ ఒకేపాట అత కదు. భావాలూ, మాటలూ ఒకలా కనుపించినా - ఎత్తుగడ - తాళం మరోలా సాగుతుంది. పాటను ఆధారం చేసుకుని పడవగాని, రోలరుగాని సాగవు. వాటి బరువును ఆధారం చేసుకొనే పాటా - బంటా సాగుతుంది. సాగడమేమిటి? ముందుకు వరిగెత్తి బరువున్న పనిని పదిలపరుస్తుంది-!! రోడ్డురోలరు పాటలు, పడవ పాటలు ఈ తరహా క్రిందకే వస్తాయి - ఈ బరువు పని పాట పరికించండి :—

జంబైలే జోతులంగరు
అవుర, అవుర, మనోన్నెళ్ళబ్బయి ॥జం॥
నీకు బారులేదు, జోరులేదు ”

నీకు రోసంలేదు మీసంలేదు ,,
నా చల్లనీళ్ళు అల్లిమొగ్గ ,,
నా ఉడుకునీళ్ళు ఉల్లిపువ్వు ,,
కాకి దుస్తులు కట్టుకోని ,,
కాకినాడకు పోతుంటె ,,
కాకిపిల్ల నెత్తిమీద ,,
కావు కావు తన్నింది ,,
కడవమీద కడవపెట్టి ,,
కాకినాడ రేవుకెళితే ,,
కాకినాడ కలకటేరు ,,
కడవదించె కౌగలించె ,,
బిందెమీద బిందెపెట్టి ,,
భీమడోలు రేవుకెళితే ,,
భీమడోలు మునసబు ,,
బింది దింపి మాటలాడె ,,
ముంతమీద ముంతపెట్టి ,,
ముంజవరం రేవుకెళితే ,,
ముంజవరం మొగోడు ,,
ముంత దింపి ముద్దులెట్టె ,,
ఆః! జంబైలే జోతులంగరు
ఆః!! జంబైలే జోతులంగరు!!

పసుపు తోటలలో పసుపు ఏరుపాట యిది. దీనిని ఎక్కువగా పాడేదీ, పని చేసేదీ ఆడవారే – ఈ పసుపూ వారి మాంగళ్యరూపమేగా?

నీలాటి రేవంత
నిగ్గు తేలిందీ
ఏ చేడె కడిగిందీ
ఈ ఛాయావసుపూ!

పచ్చిపసుపు బావల్లా
మరదా లాడిందీ!
అనప్పసుపు అన్నల్లా
చెల్లెలాడిందీ!!

కొట్టు పసుపు కొడుకూలా
తల్లి ఆడిందీ —
కొడుకూలా తల్లియే
తానూ గోపమ్మా!

గొంతయాడిన పసుపు
గోవ పూఛాయ
అన్నల్ల చెల్లెలే
తానూ అమ్మాయి!

ఆతివ ఆడినపసుపు
ఆవపూఛాయ,
బావల్లా మరదాలె
తాను అమ్మాయి
పణతిఆడిన పసుపు
బంగారుఛాయ.

ఈ బస్తా బరువుపని పాట చూదాం:—

వస్తావటోలె పిల్ల
వస్తావంటె నిన్ను
వరంగల్లు తీసుకపోత
వస్తావంటె.

నన్ను వరంగల్లు
తీసుకపోతె వస్తానుగానీ
మన దారిఖర్చు దప్పిఖర్చు
తెస్తావటోయి.

మన దారిఖర్చు
దప్పిఖర్చు తేస్తానుగానీ
అడుగు దాటకుండ మాట
ఇంటా వుంటే?

అడుగు దాటకుండ
మసలుకుంటు వుంటానుగానీ
మాట పేచీరాకుండ నువ్వు
నూసుకుంటావా?

పోటీ రాకుండగాను
నూసుకొంటానుగానీ
పోకిళ్ళు పోతవుంటె
కూకలెడ్తాను.

భావ కవిత్వం, జానపద కవిత్వం, వచన ఫక్కే-గేయాలూ మొదలగు శీర్షికల క్రింద నేడు వెలువడే తరహా క్రిందనే ఈ గ్రామిక, శృంగార, స్త్రీల, పని పాటలలోనూ పై మూడునాలుగు రకాల నియమాలూ కనుపిస్తాయి. కొన్ని

భావాలకి మాత్రమే అందంగా వుంటాయి. కొన్ని పాడుకో డానికి హుందాగా వుంటాయి - కొన్ని పంక్తులుగా విడదీసు కుని చదివి కూర్పునూ, అందలి నేర్పునూ చూసి మురియ డానికే బాగుంటాయి.

గుంటూరు చిన్నదానా
గుబురు కేశాలదానా
గుబురూ కేశాలమీదా
గొబ్బిపూలు సోకే
— ఓ చిన్నదానా
గొబ్బిపూలె సోకే
— ఓ చిన్నదానా
పువ్వాడ చిన్నదానా
పువ్వాల జడలదానా
పువ్వాల జడలమీదా
మనసెంత నీకే
ఓ చిన్నదానా
మనసెంత నీకే
— ఓ చిన్నదానా
రంగాము పోయి నేను
రంగైన రయిక తెస్తే
రంగైన రయికమీద
మనసేల లేదే
— ఓ చిన్నదానా
మనసేల లేదే
— ఓ చిన్నదానా.

రంగంటు కూలిపనులకోసం వెళ్ళడం - అక్కడి నుంచి వస్తూ చక్కలరయికలూ, ముద్దుటుంగరాలూ, కమ్మల జోళ్లూ పిల్లలకు తేవడం పరిపాటే - తను పని కట్టుకుని తన చిన్నదానికోసం "రంగైన రయిక తెస్తే" మనసేల లేదో దురూహ్యాం. మరి అతగాడిని గురించి చిన్నదాని అభిప్రాయం ఏమిటో?

అలాగే మరో రోడ్డురోలరు పాట చూద్దాం :

ఓ చిన్నదానా విడువనె చెంగు!
ఓ చిన్నదానా వదలనె చెంగు!!

-

బంగారు చిన్నదాన
బాజా బందూలదాన
బాజా బందూలమీద
మోజేలలేదే - ఓ చిన్నదానా

గుంటూరు చిన్నదానా
గుల్లా పేరూలదానా
గుల్లా పేరూలమీద
కల్లూ పోలేదే - ఓ చిన్నదానా

కాకినాడ చిన్నదాన
కాసుల కంటెదాన
కాసుల కంటెమీద
మనసేల లేదే - ఓ చిన్నదానా

అర్ధరూపాయ పెట్టి
అద్దాలరయిక తెస్తె

అద్దాలరయిక మీాద
బుద్దేల లేదే - ఓ చిన్నదానా
నల్లా నల్లానిదాన
నడుము సన్నానిదాన
తళుకూ సేవలమల్లె
కులుకూ సూపులదాన - ఓ చిన్నదాన
నిను సూసి ఈ మనసు
నిలువాకున్నాదోలె - ఓ చిన్నదానా.

—ఇటువంటి పాటలు చాలా ఆకర్షణగా వుంటాయి. నా రేడియో 10 సం॥ ప్రసారిత అనుభవంలోనూ ఇటువంటి పాటలే శ్రోతలను ఆకట్టుకున్నాయని అనుకుంటాను. అదే కాదులెండి. లలిత సంగీతశాఖ ప్రధాన వ్యక్తుల పట్టుదల - శ్రద్ధ - మరీ మెరుగులుపెట్టి ఈ సారస్వతానికి చక్కని ఆదరణ లభింపజేశాయి.

పై పాటల వరుసలో మరోరకం చూదాం:

గూడూరు చిన్నదానా
గూడూరు గుట్టాలదాన
గూడూరు గుట్టాలమీాద
గాజులుంటె పోకే — ఓచిన్నదాన
నీలీ నీలాటిదాన
నిలువు నన్నాటిదాన
నీలీ నీలాముమీాద
నగలుంటె పోకే — ఓచిన్నదాన

సన్నా సన్నానిదాన
సన్నాని కురులదాన
సన్నాని కురులామీాద
జాజిగుత్తి సోకే — ఓచిన్నదాన

—అవును! కురుల సౌందర్యానికి పెట్టిపుట్టిన తెలుగు పడుచులకు మల్లెమొగ్గలు, జాజిగుత్తులు కాప్పీరైటు లాంటి సింగారింపు!

—ఈ బరువులాగు పాటలోని పదాల పరుగులు ఉరుకులు - హుషారులు పరికించండి.

ఓ ఆరిజెల్ల
బేరి మోాత
ఓ నల్లనేలల
దున్నదలచేరా
మొక్కబోతే
ఓ దయ్యమైరా
పట్టినాదిరా
ఓ మానయుంబరా
గాలిమోాతరా
ఓ గాలి మోాతరా
ధూాలి మోాతరా
ఓ రేమి రన్నయాా
ఉసారు లేదురా
ఓరాగి డబ్బురా
ఈడు ముంతరా

ఓ బొట్టు పెట్టరా
బొమ్మ చూడరా
ఓ మిద్దెమీదరా
మిరపచెట్టురా
ఓ కాయ చూడరా
నీలు లేవురా
పాలు లేవురా
ఓ కూకున్నాదిరా
కుర్రకుంకరా
ఓ మేతిరోడురా
దానెంప టెల్లరా
ఓ కుంచమంతరా
ఓ గుడిసెలోనురా
ఓ మాని కంతరా
ఓ రోలు తోసెరా
ఓ ఆరిజెల్ల
బేరి మ్రోత
ఓ నల్ల నేలల
దున్న దలచేరా

—మేతిరోడు ఈ పాటల్లో ఎంత సర్వ సాధారణంగా వినిపిస్తూంటుందో – "కుర్రగుంట, చిన్నది, పడుచుది" కూడా అంత సర్వ సాధారాణమే. ఈ రెండూ ఏదో సమయంలో అంటే కూలిపని చేయిస్తూ అజమాయిషి చేయించే మేతిరోడు – అతడి క్రింద పనిచేసే కుర్రకుంక – అనుకోకుండా

ఓ యింటివాళ్ళు అయి. కుంచమంత గుడిసెలో ప్రత్యక్ష
మవడం సర్వసాధారణం.

ఈపాట పరికలుపుల సమయంలో సమిష్టిగా పాడేదిలా
గుంది:

రాయే రాయే భామానందానా
రమణిముద్దులగుమ్మా నందానా

సామోరుసత్తె భామాకూడెను
సరివాదములు యేసుకొన్నారు
వేడికూటి యేళాకి యూరాలుతెస్తాను
సల్దికూటేళాకు సవితిని తెస్తాను
చాల పొద్దూలేదు సరివాదమేశారు

రాకయ్యా రాకయ్యా సామ్మోరూ
మా అన్నలొస్తారు సామోరూ
మమ్మల్ని తిడతారు సామోరూ

మిమ్మల్ని కొడతారు సామోరు
రాకయ్యా రాకయ్యా సామోరు
పొద్దు చాలాలేదు సామోరు
ఏడుగురు అన్నలూ సామోరు
వచ్చే వేళాయింది సామోరు

ఈ "సామోరు" ఎవరో గుడిసెలూ. కూడాలూ
పట్టి అలవాటుపడ్డ పెద్దమనిషిలాగున్నాడు - ఎంతకీ కద
లడుకాబోలును, "రాకయ్యా రాకయ్యా సామోరూ, పొద్దు

చాలాలేదు సామోరు, ఏడుగురు అన్నలూ సామోరు వచ్చే వేళాయింది సామోరూ" అని బ్రతిమాలుతున్నారు.

—గోడలు కట్టునప్పుడు. మేడలు మిద్దెలు కట్టునప్పుడు, పెద్ద పెద్ద భవనాలు, భవంతులు మిట్లులు కట్టు సమయంలో – కూలిజనం బంటాలుగా చేరి ఎవరిపనులు వారు చేసుకుంటున్నప్పుడు చూస్తే అది ఒక మహాయంత్రం .. తట అదే అలా పనులు చేసుకుపోతున్నట్లు–కనిపిస్తుంది

ఒక గుంపు తవ్వుతుంటుంది. మరో బంటా ఏపో బరువెత్తుతూంటుంది, ఒక తండా యిటుక పేరుస్తూంటుంది. ఒక వరుస సిమెంటు బాల్చీని వైర్ వర్కులా ఒకరి చేతినుంచి ఒకరిచేతికి అందించుకు పోతూంటుంది. ఎవరిదృష్టి వారిది, ఎవరి పనిపాటవారిది – అలాటి సమయంలో పాడేదే ఈక్రిందిపాట. ఈ పాట వరుస చాలా ప్రచారమైనదే! బాల సాహిత్యంలో కూడా ఈ వరుస పాటలు చాలా వున్నాయి.

నాటారమ్మా నాటారు
యేమిటామొక్క నాటారు
జాజారమ్మా పూలతోటలో
జాజీమొక్క నాటారు

సాగేనమ్మా సాగేనూ
యేమిటాతీగ సాగేను
జాజారమ్మా పూలతోటలో
సన్నాజాజి సాగేను

యేసేనమ్మా యేసేను
యేమిసిగురు యేసేను
జాజారమ్మా తోటలోనా
చామంతే సిగురేసేనూ

తొడిగేనమ్మా తొడిగేను
యేమిమొగ్గలు తొడిగేను
జాజారమ్మా తోటలోనా
జాజిమొగ్గలు తొడిగేను

విచ్చేనమ్మా విచ్చేను
యేమీపూలు విచ్చేనూ
జాజారమ్మా పూలాతోటలో
మొగలేరేకులు విచ్చేనూ



# 9

మన వాఙ్మయంలో యేల శబ్దాలు చాలా కని పిస్తాయి.

ఈ యేలలు చాలా చక్కగా శృంగారపూరితమై ధ్వానాన్ని ప్రతిఫలిస్తూంటాయి.

రకరకాలుగా ఎన్నో ఏలపాటలు వున్నాయి - అవి కొంచెం చూదాం:

ఎక్కడో వున్నాడు తనరంగడు - యిప్పుడు వస్తాడు అప్పుడు వస్తాడు అని ఎదురుతెన్నులు కాస్తూంది. ఎంతకీ రాక పోతే కాకిచేత కబురైనా, గువ్వచేత గురుతైనా పంపమని కోరుకొంటూంది.

ఎరుపురంగూ ఎదురు చుక్కారా
నా సామిరంగా!
ఎన్ని దినము లెదురు చూంతురా

వలపునిలుపా జాలలేనురా
నా సామిరంగా!
కలలోనైనా కానవేమీరా

కాలుకురచ ఆడదానినిరా
నా సామిరంగా!
కాలుకురచ ఆడదానినిరా

మూరతక్కువ చీరలంపరా
నా సామిరంగా !
ఆకులాతో పోకలంపారా
నా సామిరంగా!
ఆలసించీ ఆపబోకూరా
నా సామిరంగా!
అలపగానికి చెడుపు బుద్ధీరా
నా సామిరంగా!
పోయెటెరువులు వచ్చేటప్పుడు
నా సామిరంగా !
పాలపిడతలో విషములుండెనురా!
గువ్వచేతా గురుతులంపారా
నా సామిరంగా
కాకిచేతా కబురులంపారా!

అనుకోకుండా అగుపించే ఆడుదానిని చూస్తే యువక మనస్సు ఎలా వుంటుందో ఈ పాట చెబుతూంది:

ముద్దు మొగమూ దాన
ముక్కు పోగూ దాన
కాకి వేషము దాన
కామంచి పడుచా - మంచెదిగవే!

అరకచేనూ లోన
ఆవులున్నవి భామ
ఆలమందా నన్న
అదలించిరావె - మంచెదిగవే!

గూమూల మాటలో
గూకలున్నవి భామ
మంచెకిందకి రావె
పంచుకుందాము - మంచెదిగవే!

మంచెదిగవే అన్న సంభోధనలో మరో పాటవుంది. "మంచె" అనగా చేలమధ్య పిట్టలను తోలుటకు ఎత్తుగా కట్టే స్టేజి లాంటిది.

పురు:- మంచెదిగవె పాంచాల
సిలకా మంచెదిగవె
మంచె దిగవె
ఓ పంచెవన్నెల సిలకా
ఒంచీన తలయెత్తి

వాలూసూపులు సూసి
మంచె దిగవె
పాంచాల సిలకా!

స్త్రీ :- సెబాసు కుఱ్ఱోడా
సెవుల పోగులవాడ
మాబావ విన్నకన్నా
మరియాద దక్కునా
మంచెదిగను నేను
కంచెదాటి రాను

పురు:- అల్లాము బెల్లాము
తెల్లా కొంగున కడుదు
తెల్లా కొంగునకట్టి
తెల్లవారేసరికి పోదు
మంచె దిగవె
పాంచాల సిలకా!

స్త్రీ :- అల్లాము బెల్లాము
వల్లాదు నా మనసు
అన్నాదమ్ములు సూత్తే
ఆచోటు నిలువారు
మంచె దిగనూ
మంచీ మురుగులవాడా!

పురు:- పూలా రైకదానా
వాలుసూపులదానా
కాలులో ములుదిగెను

కాసంత ములుదియవె
మంచె దిగవె
పాంచాల సిలకా!

స్త్రీ :- కాలులో ములుదిగితే
కల్రిమంగలి గలడు
తాలీకట్టినవోడు
తాయెత్తు కట్టూను
మంచె దిగనూ
పాంచున్న చినవోడా
నే మంచె దిగనూ!

ఈ పదుచు చాలా తెలివైనదీ-ముందుచూపు గలదీ లాగుంది. తాలికట్టినవాడు "తాయెత్తుకట్టు" నని ఎంతసున్నితంగా చెప్పి ముందుచూపు కనబరుస్తున్నాదో.

ఊరడ్నాకు దిగమన్నాడు పిల్లని - ఊఁహుఁ! అంది. వున్నవాళ్ళ పిల్లవా అని అడుగుతున్నాడు.

ఉల్లమల్లా చీరాగట్టీ
కచ్చలూ పైకేగాగట్టీ
ఉన్నవాళ్ళా పిల్లనంటావే!
ఓలోలీరంగీ
ఉన్నవాళ్ళా పిల్లానంటావే!

ఉన్నవాళ్ళా పిల్లానంటే
కన్నుగీసే రమ్మన్నావూ

కంటిబాసలు నాకూబద్దుర!
ఓరోరిమామా
కంటివిరుపులు నాకూబద్దుర!

ఉన్నవాళ్ళ పిల్లానాసీ
ఉబ్బిపోకే ఓలేపిల్లా
కోతలాకీ కోరీవ స్తేనూ
ఓలోలీరంగీ
కోతల్లోళ్ళకి కోపా మొస్తుందే!

కోరమీసాల్ దువ్వూకుంటూ
ఎర్రగుడ్డా చుట్టుకొంటూ
కోతలా కే రావద్దంటావా!
ఓరోరిమామా
కోరికైనా తీర్చనంటావా!

ఎంత కమ్మని కోరికో ఈ చిన్నవానికి! మల్లె పందిరి క్రింద కూర్చుని వయ్యారి రాకతో తెల్లవారుద్దామని ఆశ! తన ఆశను కమ్మగా ఎలా వ్యక్తీకరిస్తూన్నాడో!.

వేళజూడ వెన్నెలాయె
వెండికట్ల కిన్నెరాయె
మల్లెపూల పందిరాయె
వయ్యారి రావె—మన
నవ్వులోనె తెల్లవారుసూ!

కొండగోగులు పూసెనేమొ
కొండనిమ్మలు కాసెనేమొ

దొండపండులాంటి పెదిమె
వయ్యారిరావె—ఈ
మనసు ఎవరి పాలుజేతూను

మల్లెపూలు పూసినట్లు
మళ్ళిమళ్ళి మాటలాడు
మల్లెపూలవంటి మనసు
వయ్యారిరావె—నే
గంధమైన పంపబోతిని!!

విడిచిన మల్లెపువ్వులాగ మళ్ళిమళ్ళి మాట్లాడాలిట - ఎంత మాధుర్యంగా మలచినాడో ఇందలి మాటలను.

మల్లెలు తెలుగువారి బంధువులేమో! మల్లెపూల తెప్పమీాద తేలిపోడం, మల్లెపందిరి క్రింద గడపడం - ఎంత తెల్లనీ చల్లనీ ఆశలూ ఆశయాలో. అలాటిదే మరొకటి:

మల్లెపొదనూ యింట
పెంచుకోవాలీ
మల్లెతో మనసార
పాడుకోవాలీ
మల్లెపొద మాటున
మాటిచ్చినాను
తప్ప కొస్తానసీ
చెయ్యేసినాను:

మాటతప్పితే మల్లి
కోపగిస్తాది
మరిచావులే మాట
ఎక్కిరిస్తాది
మల్లెవాసన మధ్య
మాటల్ల మధ్య
మళ్ళి వస్తానని
మాటిచ్చినాను!

మాటతప్పి నేను
మల్లి చేరకపోతే
మాట తప్పావనీ
మాటలంటది మల్లి
మల్లెపొదమాటున
మనసివ్వకోని
మనసులో ఏటోను
దాసుకున్నాము

ఈ పాట సంగీతప్రధానంగా లేకపోయినా—ఇందలి భావం బలంగావుంది. మల్లితో ఈ పడుచుకెంత స్నేహమో చూడండి – మాటతప్పితే మల్లి ఎక్కిరిస్తుందిట!!

ఒంటరిగా కనుపించింది సిన్ని. ధ్యానంలోవున్న తనకు – యిక ఏం కనుపించడం లేదు – తన ఎదుట సిన్ని ఎంత అందంగా కనుపిస్తూందో చూడండి:

సిన్నీ నా సిన్నీ
ఓ సన్నజాజుల సిన్నీ
పొన్నపూల సిన్నీ
నే నందమైనవోడ్ని
నన్నేలుకోవె సిన్నీ
నిన్నొదిలి వుండలేనూ

బావా నాబావా
బంగారు ముద్దుల బావా
ఎన్నటికీ నిన్నే
నేనేలుకొంటానోయి
నే నుస్నదాన్ని కాను
నా వుసురు పోసుకోకు!

సిన్నీ నా సిన్నీ
నేసిన్నవోడ్ని కానే
సిన్న జమీాలున్న
ఓడ్ని నిన్ను కలకాలం పూజిస్తా
మీ అన్నలాకో సెప్పి
నన్నేలుకోవె సిన్నీ!

నీకన్న ఎవరు నాకు
మా యన్నలతో సెప్పి
అందాల బావనన్ను
ఏ అడ్డు సెప్పకుండ
నన్నింటిదాన్ని సెయ్యి
నన్నొడ్డుసెయ్యి బావా

—అలాగే యిలాటిదే యింకోటి. పై దానిలో 'సిన్నీ - బావా' అయితే యిందులో 'చంద్రి-బాలయ్య' ల మధ్యలో సంభాషణ—

నీ లేడికన్నులోలె శంద్రి
నీ లేతనవ్వులోలె శంద్రి
ఆ తీగసొగసులోలె శంద్రి
ఆ పళ్ళగుత్తులోలె శంద్రి
ఆనడకజోరులేమె శంద్రి
సినదుము సన్నమోలె శంద్రి
నీ రంగుపింగులు సూత్తే
రంభలాగున్నావు
రంగం ఎడదామోలే శంద్రి!!

నేకై కాల సిన్నదాన్ని బాలయ్య
నన్ను కంకులు బెట్టకు బాలయ్య
నా కమ్మ బాబులేరు బాలయ్య
నను ఆరళ్ళు బెట్టకు బాలయ్య
నా మేనత్త సాకుతూంది బాలయ్య
నాకు మేనరికమున్నాది బాలయ్య
ఈ ఇరుగు పొరుగూనూత్తె
ఏమనూకుంటారో
ఎంట రాకూరోరి బాలయ్యా!

కమ్మోరి బావికాడ శంద్రి
నువ్వు కడవనెత్తినెట్టి శంద్రి
సందు గొందులు దాటి శంద్రి

నువ్వు సిందులు దొక్కంగ శంద్రి
నీకొప్పు తిప్పాలుసూసి శంద్రి
నా కోరిక ఊరేయి శంద్రి
నీ కాళ్ళ కడియాలోలె శంద్రి!

గణగణా మ్రోగాయి శంద్రి
గిలుకుమట్టెలతోటి శంద్రి
నువ్వు గిర్రునా తిరిగేవు శంద్రి
సుక్కలో సూపెడితే
సుక్కలాగున్నావు
లక్క రైకలిస్తానోలె శంద్రీ

నే మరలుగొన్నానోలె శంద్రి
నువ్వు మాయదారివోలె శంద్రి
మత్తుమందు జల్లావె శంద్రి
నా వుత్తమాటలుగావె శంద్రి
నా కెర్రిత్తిపోతూందె శంద్రి
నువ్వు ఎంత పాపివోలె శంద్రి
సేతిలో సెయ్యేసి
సందిటలో కొత్తేను
సంక లెగరేస్తానే శంద్రి!

—పాపం ఎంతకీ లొంగడంలేదు – ఆఖరికి తన బాధను విప్పి చెప్పాడు – శంద్రిని సూత్తూంటే ఎర్రిత్తిపోతుందట—

సూర్యచంద్రావహ్నీ నుడుమా
శౌర్యమానే చిలుకాగంటి

సూర్యదీప్తి గాయూచుండగా
యేగంటిలింగా!
జూడ జూడశ్చర్యమూ యోరా
యేగంటిలింగా!

శాంతాల పాళెములోనా
చింతమానూ పుట్టెగదరా
చింత ఆనలూ కొనలూ సాగేనా
యేగంటిలింగా!
చింతపూసి పండూపండేరా
యేగంటి లింగా!

కానరాని అడవిలోనా
వానలేనీ మడుగూనిండె
వానలేని మడుగూమీందానూ
యేగంటిలింగా!
మానరానీ అగ్ని పొడమేరా
యేగంటిలింగా!

ఆకులేని యడవిలోనా
తోకలేని మృగమూపుట్టె
తోకలేని మృగమూ కడుపూనా
యేగంటిలింగా!
ఈకలేని పక్షిపుట్టేరా

—ఏమిటో! తోకలేని మృగం, ఈకలేని పక్షి!! ఈ తరహా యేలలు చాలా కనుపిస్తున్నాయి.

ఓబలేసుని కొండలనడుమా
వొంచిగడ్డి కోసేదానా
వొంచికుడ్డా ఒల్లిగడ్డా మే ||ఓబులేశ||

గిద్దెలగిరీ కొండలనడుమా
యెద్దులు కాచే ముద్దులుమరదీ
నన్నుచూసి నవ్వబోకోయి ||ఓబులేశ||

కట్టుగూడీనుం చెళ్ళేదానా
కాలుకురచా చిన్నదానా
కానులిస్తా యెంటవస్తావా ||ఓబులేశ||

ముద్దుటరకా దున్నేవాడా
ముద్దులా మేనత్తాకొడకా
దాపటెద్దుకు దప్పికాయెనురా

—ఈ దాపటెద్దు ఎవరో? ఇటువంటి యేలలు వింటూంటే మనకూ గొంతుకలుపుదాం అనిపిస్తూంటుంది

చింతమానూ చిలుకాలారా
చింతలేటీ జాణలారా
చందమామావంటి దానినిరా
ఓ ముద్దూలరంగా
సందుగాదూ యేమిసేయనురా!

చిలుకలుంటే బంతేగట్టీ
చిలుకలూరి మల్లెమున్నీ

మిసిమిపడ్లా మొలకజల్లితే
ఓ ముద్దులరంగా
కలుపుతీయా మరచిపోతినిరా!

చిలూకనిచ్చి నేసూకొంటి
చిత్రమైన పందిరిమంచం
ఇద్దరికీ యిరుకౌగుందూరా
ఓ ముద్దులరంగా
విరిగి రెండూ ముక్కలాయెనురా!!

—బండికట్టుకుపోతున్నాడు ఓ చిన్నవాడు – ఎంత అందంగా పిలుస్తూందో ఈ పాట గమనించండి.

ఆవు నెద్దు బండికట్టి
పరుగు పరుగున పోయేవాడ
బండినిలిపి బాసలాడారా
ఓ – పెదమల్ల చిన్నా!
బండినిలిపి బాసలాడారా

ఆకసమునా అరటివనము
ధరణిమీదా నిమ్మవనము
నట్టనడుమ బండి బాటోయి
ఓ పెదమల్ల చిన్నా!
బండిబాటలో బొమ్మలాటోయి

ఉదయగిరీ గట్లమీదా
ఉలవ లెండాబోసే పాపా
ఉలవలకు ఎద్దులొచ్చేనే
శుద్దులాడా పొద్దుపోయేనే

బాటవార బండ్లమీాద
చెక్కగొట్టె అక్క-మొగడు
చెక్కవచ్చి చెంప దగిలేను
ఎక్కడలేని దుఃఖమొచ్చెనే

బాటవార గట్టూమీాదా
వడ్లుదంచే చిన్నపాప
నానబియ్యం నాకూ బెట్టావా
మళ్ళిరారా మలచీపెట్టేను!

—తను నమ్ముకున్న ప్రియుడా యెను-దగ్గరగావున్నంతవరకూ చూడకుండా వుండడం ఎలాగ – అందుకే "ఉంటే ఈఊరిలో యుండూ – పోతే పొరిగూరికిపోరా" అని పలుకుతూంది!

లింగా నిను మరువలేనురా
చక్కని నామాలకొండ
లింగా నిను మరువలేనురా

ఉంటె ఈ ఊరిలో యుండూ
పోతే పొరుగూరికి పోరా
చుట్టుప్రక్కలా పల్లెలయుంటె
చూడకుండా వుండలేను — ॥లింగా॥

కూలికిపోతే నాకేరారా
సిలికిపోతే నాకేరారా
నీ జనుము నేనే కోస్తా
నా జనుమూ నేనే కోస్తా
కోసి అంతా కట్టలు కడతా
కట్టినదంతా గూటికేస్తా

గూటిమీాని నె తూకుండ బెడతా
కూడువండీ నీకే యెడ్తా
మెరమెరకునీ కన్నులుచూస్తా

లింగా నిను మరువలేనురా
చక్కని నామాలకొండ
లింగా నిను మరువలేనురా!

—బెదరగొడితె మేసే ఎడ్లుకూడా అదురుపడీ సరిగా పనిచెయ్యవుట - మేనత్త కొడుక్కు సలహా లందిస్తూంది—

ముందటేరు దున్నువాడా
ముద్దుల మేనత్త కొడకా
దాపటెద్దుకు దప్పికాయెనురా
ఓ అందగాడా నరసన్నబావా
నూతికాడా నీలుపెట్రారా!

దూరబారము దున్నబోకు
దిబ్బచేరి చూడలేనూ

ఊరుముంగిటా ఉల్లిచేనూరా
ఓ అందగాడా నరసన్నబావా
ఉల్లికోతకు పిలుపులంపారా

ఉల్లితెల్ల మీసమోడా
ఉల్లిచేను చేయువాడా
నాకు కుంచెడు ఉల్లి అంపారా
ఓ అందగాడా నరసన్నబావా
ఉల్లి పులుసూ వండగలనురా!

కాలువవతల అందగాడా
పెసరచేనూ దున్నువాడా
యెడ్లకీ కాసుకు వేయకురా
ఓ అందగాడా నరసన్న బావా
అట్టు లేస్తే అదురుపుడ్తాదీ!

ఒకరిని ఒకరు ప్రేమించుకొన్నారు. "నడిసి రారా నరసాకు..." ఎంత కమ్మగా స్వాగతం పలుకుతూందో.

సెక్కమీాదను సన్నగోరూ
సెంపనా జవ్వాది పూతా
సొంపుగా నీకెవరు బూసారే??

చక్కాని బాలా
ఇంపుగా నీకెవరు బూశారే
ఇత్తడి జూన్నెన్ను కొలుతూ
ఈనినావుల పాలుగొలుతూ

రాగిమ్మాను పూలుగొలుతబ్బి
బంగారుసామి
నడిసి రారా నాదు సరసాకూ!
కుంకమూా కురువేరు చేనూ

దవనమూా దానింటితడికే
వంగి రారా సుంకు తగిలేనీ
బంగారుసామి
తమలపాకూ మడుపులందేనీ!

37)

కుట్రకుట్ర సినుకులోనా
వుంటిరా దానింటి యెనుక
దూడ తొత్తుమాట వినేరా
బంగారిసామి
దుక్కవంట నానిపోయే రా!
గారడీదానింటి వెనుక
మావిడికొమ్మలు రెండూ
అందలేదూ పొందలేదూర
బంగారిసామి
అన్నె కాత్ కోడికూసేరా!
గాజులుండే చేనిమీదా
కమ్మకెగ్గిరి చెట్టుపుట్టా
కమ్మకెగ్గిరి వాసనాకేరా
బంగారిసామి
ఉండలేదుర యుండనా మనసు!

అయితే పైన స్వాగతం పలికిన రెండాకులు ఎక్కువ చదివిన పడుచుకత్తె ఈమె. ఉపాయాలను సదుపాయాలను ప్రియుడికి తనే బోధిస్తూంది —

కొత్త కుండనీరు తీపి
కోరిన మగవాడు తీపి
వాడినా చెరుకెంత తీపబ్బీ
పెరుమాళ్ళ చిన్నా!
పదరా బందామపోదామూ!
నీకు నీవారు లేరూ

నాకూ నావారు లేరూ
ఏటిగట్టున ఇల్లు కట్టబ్బి
పెరుమాళ్ళ చిన్నా
ఏరువస్తే కూడబోదాము!

చెంపనా సంపంగనూనె
అంచునా చెంగల్వమొగ్గ
ఏటిబడ్డున ఇల్లు కడదాము
పెరుమాళ్ళ చిన్నా
పదరా బండారుపోదామూ!

బావిలోపల బల్లిపలికె
బన్నసరమూ కొలుకులూడె
బిళ్ళలా మొలత్రాడు తెగెనబ్బి
పెరుమాళ్ళ చిన్నా
ఏరు వస్తే ఈదిపోదాము!

ఆకసాన ఆకుతోట
యంత్రమధ్యన పూలతోట
పూలతోటలో బండ్లబాటమ్మొ
పెరుమాళ్ళ చిన్నీ
బండ్లబాటలో మంచిమాటమ్మొ!

ఇంత ధైర్యం తనుగా తాను యిస్తే - వెనుదిరిగే మొగాడు ఎవరు? అందులోనూ తను ఎందుకో ఏటివొడ్డునే యిల్లుకడదామంటూంది!

ఇక్కడ తాను మునిగింది గంగ, తావలచింది రంభ, అన్నది - 'కోరినమగవాడు తీపి' తో వినిపిస్తున్నాయి.

ఈ పాట 'చిలుక - గోరువంక'ల మధ్య నడుస్తూంది.

మొవ్వాకు చీరకడతా
మొగలిరేకులు పెడతా
నన్నూ పెండ్లాడుతావా - ఓ కన్నెగోరా
నన్నూ పెండ్లాడుతావా!
ముత్యాల పేరూపెట్టీ
ముద్దుటుంగరము పెట్టి
నిన్నే పెండ్లాడుతాను
ఓ చిన్నీ చిలుకా
నిన్నే పెళ్ళాడుతాను!
మల్లెపువ్వులు చుడ్తా
మొలకూ వడ్డాణం పెడతా
నన్నూ పెళ్ళాడుతావా ఓ కన్నెగోరా
నన్నూ పెళ్ళాడుతావా
పసుపున పాదాలుకడగి
పచ్చాపట్టంగీ తొడిగి
నిన్నే పెళ్ళాడుతాను ఓ చిన్నీ చిలుకా
నిన్నే పెళ్ళాడుతాను
గజ్జలందియలు పెడతా
పచ్చాకు తాళికడతా
నన్నూ పెండ్లాడుతావా ఓ కన్నెగోరా
నన్నూ పెండ్లాడుతావా

వీడు ఎవరో న్యాయంతో - ధర్మశాస్త్రంగా పెళ్ళి మాటలు కానిచ్చి - పుస్తెకడతానంటున్నాడు.

నిమ్మచెట్టూ సోకు చూడూ
నీడనున్నా పిల్లని చూడు
ఓరోరి మామా
నిమ్మకాయలా సోకు చూశావా!

దబ్బచెట్టు దారిలోనా
ఘాటిగానూ పోతున్నాదీ
దానితోనూ సైగచేశావా!
ఓరోరి మామా
దానితోనూ సైగచేశావా

మామిడిచెట్టూ మాటునున్న
మాలపిల్లనీ నీవే చూసీ
పళ్ళుయిమ్మనీ సైగచేశావా!
ఓరోరి మామా
పళ్ళు యిమ్మనీ సైగచేశావా!

అనపాదూ అందంచూడు
అత్తగారీ సోకుచూడు
అనపకాయల అందంచూడు

పళ్ళలోనే పళ్ళు రాలాయా
ఓరోరీ మామా
పళ్ళలోనే పళ్ళు రాలాయా

ఇతగాడు ఏదో మోటసరసం చేసినట్లు కనిపిస్తూంది. అందుకే పళ్ళు రాలాయేమో? ఈ పాట ద్వంద్వభావ పూరితం!

పెసర మెట్టా చేసికాడా
జోరునిద్రాపోయే పాపా
సేయి తియ్యి మొగము జూతాము
ఓ ఢింకిజెల్ల
నీకు బాస నాకూ కోపామె!

గోరింటాకు కొమ్మతగిలి
కొంగు కొమ్మన తగులూకొందీ
మొగలిరేకల ఊయలేయరా
ఓగోరి మామా
మొగలిరేకలె నన్ను చేరారా!
రాజసీమను పుట్టిందాన
రాసులంటే మురిసేదాన
రావె యెడదారి ఏడుకొండలకీ
ఓ ఢింకిబొంగ్రి
కదులపోదాం కంచిక్షేత్రానికి

తను ఏదో వేళాకోళంకోసం ముఖం మూసుకుంది-అలా మూసుకోడం తనకు కోపంగావుంది. ఎంతటి ఆటలో మునిగున్నా - దేవుడూ భక్తి మరువలేని ఈ హృదయం చూడండి —

ఓ వాలుకన్నుల మువ్వ వెంకటస్వామి
నిన్ను నేను విడువజాలరా
ఇంటిముంగల ఇనుపరోలు
సేతిలో శామంతిరోకలి

దంచిదంచి నీవంక చూసితె
ధరణిమీదా కాలు నిలువ వెంకటస్వామి
నిన్ను నేనూ మరువజాలరా!
ఓ వాలుకన్నులా మువ్వ వెంకటస్వామి
నిన్ను నేనూ విడువజాలరా!

ఉంటే ఈఊళ్లో వుండూ
పోతే పొరుగుదేశం వెళ్ళి
సుట్టుపట్ల ఏములనవున్నా
చూడక నా మనసుండ వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా
ఓ వాలుకన్నులా మువ్వ వెంకటస్వామి
నిన్ను నేనూ విడువజాలరా!

ఎర్రసెరువు వాలుగుముక్కలు
గోలకొండ గుల్ల సింతపండు
ఆవాలు ధనియాలు వేసి వండితే
ఆ వాసనకి సుట్టుతిరిగే యెంకటిస్వామి
నిన్ను నేను మరువజాలరా!
ఓ వాలుకన్నుల మువ్వ వెంకటస్వామి
నిన్ను నేను మరువజాలరా!

ఓ అందకాడ నా కోడెకాడ
సందెకాడను గోడదూకి
తొంగిచూడ గడబిడాయెను
నిన్ను నేను మరువగజాలరా!

ఓ వాలుగన్నులా మువ్వా వెంకటస్వామి
నిన్ను నేను మరువలేనురా

ఈ మువ్వా వెంకటస్వామిలాగే పోలీసు వెంకటసామి కూడా ఒకడున్నాడు.

ఓ...రాళ్ళగమ్మలా
పోలీసెంకటసామి
నిన్ను నేను మరువజాలరా
ఓ పోలీసెంకటసామి
నిన్ను నేను మరువజాలరా!
ఉంటే ఈఊరిలో వుండూ
పోతే పొరుగూరికి పోరా
కోమటాయనా కొట్టుకాడా
కొత్తకోకా యిచ్చినపుడూ
మడతలన్నీ యిప్పిచూస్తే
మనసునీరై పరుగులేసెనురా
ఓ పోలీసెంకటసామి
నిన్ను నేను మరువలేనురా
ఇంటిముందర యినుపరోలూ
చేతిలో చామంతిరోకలి
దంచునపుడు నిన్ను చూస్తే
ధరణిమీదా కాలు నిలువదురా
ఓ రాళ్ళకుమ్మలా!
పోలీసెంకటసామి
నిన్ను నేను మరువజాలరా!

పుట్టినింట వున్న యువతి అత్తింటికి వెళ్ళక తప్పదు. అలా వెడుతూంటే అంతదాకా కలిసి తిరిగిన ప్రియుడు దూరమవుతున్నాడే అనే బాధ - అలా వెళ్ళిపోతూ కబురు చెబుతూంది:

ఒందుకోను ఒడ్డుపల్లె
పందుకోను పల్లెసెరువు
ఒల్లకుంటే గొల్లపల్లెయ్యా
  దయగల్ల సామీ
  రేపు పయనామాని దెల్పారా!

మిట్టలెక్కి చూసువాడ
ముష్టి కాకరసెట్టుకాడ
ముద్దుముద్దూ గలసిపోయేరా
  దయగల్ల సామి
  రేపు పయనామాని దెల్పారా!

కాసరానీ గట్టుమీదా
కమ్మరెగ్గర సెట్టుకాడ
కారణాలూ సెల్లిపోయెరా
  దయగల్ల సామి
  రేపు పయనామాని దెల్పారా!

నీళ్ళులారా నిమ్మలారా
నిత్యబూసిన మల్లెలారా
నీళ్ళగొచ్చిన నీళ్ళగనోష్నియి

దయగల్ల సామి
రేపు పయనామని చెప్పారా!

అత్తింటికి వెడుతున్నానని దయగల సామిచేత కబురు అందించడమో? లేక రేపు మూటాముల్లే గట్టి వెళ్ళిపోదాం అని కబురో!

లగ్గోపిల్ల - చిన్నవాడు మధ్యన జరిగిన సంభాషణ ఇది :

"నల్లనల్ల మబ్బునుండి    లగ్గోపిల్లా
అదె తెల్లతెల్ల చంద్రుడొచ్చె    ,,
అల్లిబిల్లి తీగెచూడు    ,,
అదో నేరేడుక్రింద జూడు    ,,
చల్లనైన చలువ జూడు    ,,
నేరేడు నీడలోన    ,,
నీ చారెడేసి కళ్ళచూపు    ,,
మారేడు నీడలోన    ,,
నీ బారెడంత జడను జూపు    ,,
నిండూ పున్నమనాడు    ,,
పండూ వెన్నెలగాచె    ,,
చిన్నారి చిన్నదాన    ,,
నా కన్నుపండువ సేయరాదె    ,,
పొన్నపూలు వేరి తెచ్చి    ,,
నీ చిన్నచేత నియ్యరాదె    ,,
అందమైన నీదు మోము    ,,
ఆ చందురుడ్ని ఓడించె

తెల్ల జొన్న రొట్టె జేసి లగ్గోపిల్లా
మంచి వెన్న బూసి వెంట తేవె ,,
పల్లెదరి తోట కాడ ,,
మంచి తెల్ల మల్లిపూలు తేవె ,,
నా చేను పండిపోయె ,,
ఇంక నీ చేను పండదాయె ,,
చేను చేను గలసినట్టు ,,
మేను మేను కలపరాద! ,,

అని చిన్నోడు అంటుంటే లగ్గోపిల్ల సమాధానం అండిస్తూంది :

"కారుమాట లాడబోకు పిల్లవాడా!
మా వారువచ్చిచూస్తారు ,,
కారుమబ్బు లొచ్చినాయి ,,
నాకు దారిచూపు లేచివచ్చి ,,
కటికి చీకట్లుకమ్మె ,,
చిటుకుపాటుకు వానజూడు ,,
అటక మీద పిడకలన్ని ,,
ఆ అటక మీదె వుండిపోయె ,,
గుడిసె మంచ కెళ్లుదాము ,,
చూడు తడిసి వణుకుతాము ,,

తను ఆ మాటకు సమాధానం యిస్తూన్నాడు:

నీ చేను గుడిసెమంచె లగ్గోపిల్లా
నా చేను ఒట్టిమంచె ,,

తెప్పమీద తెప్పవచ్చె లగ్గోపిల్లా
తెప్పతోటి చినుకులొచ్చె ,,
అంగట్లో మొన్నాగొన్న ,,
కొత్త గొంగడన్న కప్పుకోవె ,,
దగ్గరికి రావాదె ,,
నీవు సిగ్గుపడితె తడుస్తావు ,,
వానవెలిసి వెన్నెలొచ్చె ,,
మనంతాన మాడినట్టులాయె ,,
బట్టలన్ని తడిసిపోయె పిల్లవాడా
నేను పట్టుకోక తెచ్చుకుంట ,,
నీవ పట్టుకోక తెచ్చుకుంటె లగ్గోపిల్లా
నేను పట్టంచు ధోతిగడత ,,
లగ్గమైన మనసుతోటి ,,
మనం లగ్గమైతె బాగుండు ,,
ఊరుపల్లె విడిచిపెట్టి పిల్లవాడా
ఈ వూరుబైట లగ్గమేంది ,,
బాజా బజంత్రీ లేవి ,,
మంచి మోజుమీద సవ్వడేది ,,
కులము కులము కలిసినాక ,,
ఈ పొలముగాడ తొందరేమి ,,

పాత పరిచయస్తుడే ఈ బావ. కొత్తకోరికల్లా పచ్చ బొట్టు పొడిపించడం – అదిచూసి తను మురియడం!

పచ్చబొట్టు పొడిపించుబావా
పావలా అర్ధిచ్చి

సాగిపించూ బావా
పచ్చబొట్టూ పొడిపించు బావా!
కొండమీద దేముడంట
గుడిలోనీ దేముడంట
యేఁదుమోరి యింటియెనుక
యఱ్ఱ బొట్టుపెట్టుకోని
కోమటోరి యింటియెనుక
కోకలన్ని కట్టుకోని
నిన్నే పిలవాలీ బావా!
కోకే బాగుండాలి బావా!
చుక్క పొడిపించు బావా
చుక్క బాగుండాలి బావా!
పచ్చబొట్టు పొడిపించు బావా
పావలా అర్ధిచ్చి
పొడిపించు బావా!
పచ్చబొట్టు పొడిపించు బావా!

సాధారణంగా లంకలలోను, మెట్టప్రదేశాలలోను, అడవిప్రదేశ గ్రామాల పరిసరాలలోను. పడుచులు ఏ పుల్లల కోసమనో "కూపు"లకు వెళ్ళడం, ఏ పేడకనో వెళ్ళడం — తోటకూరా, గోంగూరా తెచ్చుకుని అమ్ముకుందామని వెళుతూండడం పరిపాటి. ఈ సమయంలో ఒంటరిగా కనుపించే పడుచులను వెటకారం చేయడమూ ఈ పాటలద్వారా పరిపాటిగానే కనుపిస్తూంది.

గోంగూరకని గరువుమీదకు వెళ్ళి ఒళ్లు అంతా ఖరాబు చేసుకుని ఆ అనుభవాలను ఆఖరున తలుచుకుంటూంది:

నే నెరక్క పోతినే గోంగూరకు
నే నెవరితోను చెప్పకుండ ”
ఆ గరువుమీాద కెల్తినే ”
పరువుతక్కువ నాకొడుకె ”
నెత్తి మోతలమారి ”
అత్తగారు చూడకుండ ”
కొత్తదైన లేఅంచుచీర ”
కుచ్చెళ్ళుపోసి కట్టి ”
గుత్తముగ రయిక తొడిగి ”
నెత్తిమీాద గంపెట్టి ”
నోరెత్తిచెబితె సిగ్గుచేటు ”
పెత్తనాల కెళితెనే ”
దడి అవతలనుండి ”
తొంగితొంగి చూశాడు ”
నుంచున్నా ననుచూసి ”
మీాసం మెలిపెట్టినాడు ”
పనసదార పెట్టంటు ”
పైనా బడబోయాడె ”
లంచ మిదిగో నన్నాడు ”
నన్ను లాలనచేశాడె ”
నోరెత్తిచెబితె సిగ్గుచేటు ”

తమకు అంగీకారమైందా నెత్తిన పూజించే పల్లెజనం యిష్టంలేదా పాతాళానికి ద్రొక్కుతుంది. మొత్తంమీద వీడెవడో చాలా రభస చేసినట్లున్నాడు. అందులోనూ పెళ్ళి అయిందట - మరి కష్టంగా వుండదూ అత్తగారున్న కోడలికి. ఒళ్ళు తెలియని పొగరుతనానికి ఈపాట ఒకసాక్ష్యం!

ఈ గోంగూరపాటే యింకోలాకూడా వినవొస్తుంది:

నే నెల్ల కెల్ల కెత్తినమ్మ గోంగూరకి
మాయదారి నాకొడుకు ,,
నన్ను పాకచుట్టు తిప్పాడె ,,
పాకలోకి లాగాడె ,,
కొంగుబట్టి లాగాడె ,,
రయికె ముడియిప్పాడె ,,
మాయదారి నాకొడుకు ,,
నన్ను మాయజేసి ముంచాడె ,,

ఒకేపాటను - కొంచం తేడాలో అక్కడక్కడి — యిటువంటి దౌర్భాగ్యుల నామాలచేర్చి పాడుకోడంకూడా కద్దు!

ఒంటరిగా కనుపించింది పిల్ల! దాని ఒంటినీ, బట్టనీ, కట్టునూ ఎలా వర్ణించి కవిస్తున్నాడో చూడండి:

కాటుకెట్టిందిరా పిల్ల- ఏలో ఓముకులాడి
కమలా లెట్టిందిరా ,,
గాజూ లేసిందిరా ,,
సూపూ సూసిందిరా ,,
చరపూ చరిచిందిరా ,,

'చంకదాంక బాడీని ఏలో డొంముకులాడి
బాగా ఏసిందిరా ,,
పూలూ పెట్టిందిరా ,,
షోకూ లోయిందిరా ,,
అందరినీ చూసి పిల్ల ,,
అదిరీ పోయిందిరా ,,

ఈ తరహా 'కొయ్యోడు' పాట నా చిన్నతనంలో విన్నట్లుంది. దీనిని పరికిస్తే ఈమధ్యలో అనేక చరణాలు కలుపుకుని వినిపించే పాటా యిది అని అనుమానం.

చుక్కల కోకా కట్టుకోని
చుట్టూగోడు రైకా తొడిగి
బుర్ర సున్నగ దువ్వ్యాకోని
బొట్టూ కాటుక బెట్టూకోని
నోటికి చుట్టా పెట్టూకోని
గోటుగాను నడుచుకొంటు
చక్కదనమె చూసుకొంటు
ఎక్కడికి కెల్తావు చిట్టెమ్మంటె
- ఆ - పుల్లలకెడ్తను కొయ్యోడో
రయ్యో కొయ్యోడా
ఓ రయ్యో కొయ్యోడా!

కూలి జనంలో సింగారించుకుని పయనమవడంతో పాటు చుట్టకాల్చడం ఆచారం - అలవాటుగా కనిపిస్తుంది. అటువంటి నాగరికురాలే ఈ చిట్టెమ్మ నోటిలో చుట్ట పెట్టుకొని వెళ్ళింది.

కఱ్ఱచేత పట్టుకోని
కిఱ్ఱుచెప్పులు తొడుక్కోని
కాయపంచలు కట్టుకోని
పక్కలాకులు వేసుకోని
ఎక్కడికెల్తావు కోయ్యోడంటే
పోలేరమ్మా మెరకలమీదికి
పోగాకుకెల్తిని చిట్టెమ్మ
ఓ లమ్మో-చిట్టెమ్మో!!
చీటికి మాటికి చిట్టెమ్మంటూ
చిట్టెమ్మన్నా నడీదిలోనూ
చినబాబుంటడు పెదబాబుంటడు
కరణాలుంటరు కాపులుంటరు
చిట్టెమ్మాని పిలువకురో
ఓరయ్యో కోయ్యోడ!
నే కుందనాయుడి కూతిర్నో
రయ్యో - కోయ్యోడ!!
అబ్బో అబ్బో అలాగునైతే
కురసాకురసా మొక్కలిపీటా
కుందనాయుడి కూతురివా
లమ్మో చిట్టెమ్మో!
నే మద్దెప్పయ్య మనవణ్ణి
లమ్మో చిట్టెమ్మో!!

39)

ఈ చిట్టెమ్మి నాలుగు ఆకాలు చదివి-చిన్నోడినీ, పెద్దోడినీ బుట్టలో వేసుకున్న దానిలాగుంది. కొత్తగా వలుక రించవచ్చిన కోయ్యోడిని ఆగ్రామంలో కొంచం ఘటికుడు కాబోసు నేనుకుందన్నా యుడి కూతురినని బెదిరిస్తూంటేఅంత ఘటికుడును కాబోసును - నేను మద్దెప్పనాయుడు మనవడినని కంటెసవాలిస్తున్నాడు. గుడినిబ్రమింగేవాళ్లు ఒకరైతే గుడిలో లింగాన్నే బ్రమింగేవారొకరు. ఒంటిమీదినగలనూ,నగలకుమించి తీర్చినట్లు తనకుకనుపించేఅవయవాలనూ వర్ణిస్తున్నాడు-ఈ తరహా పాటలకి ఈదేశివాఙ్మయంలో కొరవలేదు.

గౌరమ్మోల్ గౌరమ్మా
నిన్నేతల్లి కన్నదే
గౌరమ్మా గౌరమ్మా!

| | |
|---|---|
| నీ ముక్కెంత చక్కనే | గౌరమ్మా గౌరమ్మా |
| నీ ముక్కెంత నత్తెంత | ,, |
| నీ నడుమెంత చక్కనే. | ,, |
| నీ వడ్డాణమెంతందమే | ,, |
| కాలెంత చక్కనే | ,, |
| నీ కాలిఅందెలెంత అందమే | ,, |
| నీఒళ్ళెంత చక్కనే | ,, |
| నీ ఒళ్ళుమీదినగ లెంత అందమే | ,, |
| నీ కళ్లెంత చక్కనే | ,, |
| నీ కళ్ళకాటుకెంత అందమే | ,, |

పొదుగింటి పుల్లకూర చాలా రుచిగా కనుపిస్తుంది. చివ రకు మొహం మొత్తుతుంది. అప్పుడు ఇతగాడికి ఈ అందాలు కనుపించవు పాములూ జెర్రెలుగా కనిపిస్తాయి–

యుద్ధం రోజులలో చాలా చోట్ల సిపాయి బావల రంగు రంగుదుస్తులకూ, సిపాయిమామల టక్కు–టక్కు– అందాలకు మాటలకూ లొంగి మోసపోయి నమ్ముకొన్నవాడిని మరచి తాత్కాలికంగా మాట నమ్ముకుని–మురిసిపోయిన వాళ్ళెంత మందో వున్నారు. రాజును చూసినమీాదట మొగుణ్ని చూస్తే మొత్తబుద్ధి వేసినదన్నట్లు అలాటి సిపాయి బావతో స్నేహం చేసి–అతను పెట్టిన వస్తువులను తల్చుకుని పాత అనుభవాలను కొతజ్ఞాపకాలుగా వల్లె వేసుకుంటూంది.

సిపాయి బావా
సిరికన్నెసీ
మరలీపోనావా!
ఆనాడు నీ వెట్టావ్
అందమైన ముద్దులూ
లోలకులూ
అవి సెక్కిళ్ళపై జారి
సల్లగూగుతుంటేను
జల్లూజల్లున ఒళ్ళు
సెమ్మగిల్లిందోయీ!
కల్లగాదోయీ
సిపాయిబావా

సిరికన్నె సి
మరలీపోనావా!

ఆనాడు నీవేసిన మొలక
ఈనాడు పెద్దదాయె
పువుపూసి కాయ
కాసిందోయీ!
సిపాయిబావా
సిరికన్నె సి
మరలీపోనావా!

పావం అమాయకురాలు. సిపాయిబావ ధర్మమా అని ఒక పాపకూడాను! ఆకొచ్చి ముల్లుమీదపడ్డా ముల్లొచ్చి ఆకుమీదపడ్డా ఆకు కేకదూ దెబ్బ!

ఎంతసేపూ పురుషునిదే తప్పుగా కనిపించుతుంది. కాని యువకుణ్ని కవ్వించి - మురిపించి - లోబర్చుకొనే స్త్రీ లెంతమంది లేరు? అందుకు ఈ పాటే సాక్ష్యం :

గాజులుండే సేతిలోన
గంధపాడి పూతవూసి
వీధివీధులు
పలువరించారా!
ఓ మొరుకలీ
వీధివీధులు
పలువరించరా!

బావిలో బచ్చలీకూర
చేనిలో చెంచలీకూర
చెంపకూ సంపెంగనూ నెరా
ఓ యెరుకలీ
చెంపకూ సంపెంగనూ నెరా!

నాగునాగు పూసమోడ
నాగుచెట్ల కావిలోడ
పరగచేనీ బాట తెలుపుమురా!
ఓ యెరుకలీ
పరగచేనీ బాట
తెలుపుమురా!

కూడుపెడతా తినిపోరా
కూడవస్తా తీసుకుపోరా
ముళ్ళులేనీ మొల్లక్రిందికీ
ఓ యెరుకలీ!
ముద్దులాడీ నన్ను పంపారా!

ఈతమానూ ఇల్లుకాదూ
తాటిమానూ తావుకాదూ
తగరమూ బంగారుకాదూర !
ఓ యెరుకలీ
తగులుకున్నోడు మొగుడుకాదురా !
ఓ యెరుకలీ
తగులుకున్నోడు మొగుడుకాదురా!

ఈ మెకు చాలా విషయాలు తెలుసునులాగుంది. "ఈత కూను ఇల్లు కాదనీ తెలుసును, తగులుకున్న వాడు మొగుడు కాదనీ తెలుసును – తెలుసుండే పలువరిస్తూంది.

తనతో లేచిరమ్మని ప్రోత్సహిస్తున్నాడు యావ్వనంలో వున్న పడుచుని.

చక్కానిగుంట
సరసనుకూచుంట
నా యెంటరా యె
చక్కానిగుంట!

సినిమా చూపెడత
నేతిమిఠాయి కొనిపెడత
ఏతంట లేకపోతె
నాయంటరాయె
చక్కానిగుంటా!

సినిమా చూద్దామన్న అభిలాషమూలంగాను, నేతి మిఠాయి పొట్లాలు రుచిమరగడం మూలంగాను లంగా సడ్డలు పొందడంద్వారాను – లొంగి బోల్తాపడే అమాయక హృదయాలు లేకపోలేదు.

ఈపాటలాగే యింకోటికూడావుంది.

చక్కానిగుంటా
రా యె నా యెంట
సరసనుకూచుంట

పెళ్ళిచేసుకుంట
గుఱ్ఱాన్నెక్కిస్తా
కూడానేనొస్తా
సఱ్ఱున ఊరంత
సైదిరిగి వత్తాము

నేకులాసగుంటా నిన్నంటా
నిన్నే పెళ్ళాడతానంటా
నాకునీకు జోడంటా
నాకేమి పెట్టకు తంటా!

చేపలబుట్టా చంకనెట్టి
సందెడుపూసలు మెళ్ళోబెట్టి!
పసందుగ బండార్లంక చీరనుగట్టి
పచ్చలరవికా తొడగబెట్టి!

వెనుకబడిన కులాలలో-మాల, మాదిగ మొదలగు జాతులలో వివాహానికి పెళ్ళికూతురు గుఱ్ఱాన్నెక్కితే-పెళ్ళికొడుకు నడుస్తూ ఊరేగడం ఆచారం. ఆ సంప్రదాయానికి సంబంధించినవాడే ఈ పెళ్ళికొడుకనుకుంటా -"గుఱ్ఱాన్నెక్కిస్తా కూడానేనొస్తా, గిఱ్ఱున ఊరంత సై తిరిగొస్తా" నని అంటున్నాడు.

ఈ పల్లెపాటలలో గొప్ప విషయం ఒకటి ముఖ్యంగా మనకు కనుపించేది- మన పాత ఆచారాలూ, నమ్మకాలూ, కట్టుబాట్లు, చరిత్రలూ గ్రహించడానికి చాలావీలు ఆ యా

మండలాలలో జరిగిన చిన్న చిన్న సంఘటనలుకూడా కథల్లా ఈపాటల్లో అల్లబడి మనకు వినబడడంకూడా కద్దు.

ఈ "నాయుడు" చాలా ధైర్యంచేసి, ఎంతమందినో మసిబూసి మారేడుకాయ చేసినట్లు కనిపించేలా 'నాయుడో రింటికాడ' వంటిపాటలు అనేకం వినబడుతున్నాయి! కాని, ఈపాటలో నాయుడ్నే మసిచేసి-మైకంలో మత్తెక్కించి, చాలా సంపాదించినట్లుగావుంది. ఇటువంటి మంత్రముగ్ధుల్ని చేయగలిగిన సానులచేతుల్లో ఎంతమంది నాయుడులాంటి వాళ్ళు స్వాహా అయ్యారో?

నాయుడోళ్ళింటికాడ
నల్లతుమ్మ చెట్టుకాడ
నాయుడేమన్నాడే పిల్లా? — అబ్బ
ఎంతవింతగున్నాడే పిల్లా!
నాయుడోళ్ళింటికాడ
నల్లతుమ్మ చెట్టుకాడ
నాలుగురూపాయలిస్తానన్నాడే-అబ్బ
నా గుండెఝల్లుమన్నదే లమ్మో!
కోమటోరింటికాడ
గున్నమామిడి చెట్టుకాడ
కోరికో రేమన్నాడె పిల్లా!

కోమటోరింటికాడ
కొట్టూబజారుకాడ

కోరికోరి రమ్మన్నాడమ్మో - అబ్బ
నా గుండె బడేల్ మన్నాదె లమ్మో!

కరణంగా రింటికాడ
కన్నమామిడి గున్నక్రింద
కాసులపేరిస్తానన్నాడమ్మో!

మునసబుగారింటికాడ
ముందల దరవాజకాడ
అతడేమన్నాడె పిల్లా!

మునసబుగారింటికాడ
ముందల దరవాజలోన
ముక్కుపుడకలిస్తానన్నాడమ్మో!

మాలపల్లి తూముకాడ
మల్లెపువ్వుల తోటకాడ
బాలుడేమన్నాడే పిల్లా!

మాలపల్లి తూముకాడ
మల్లెపువ్వుల పందిరిక్రింద
మల్లి మల్లి రమ్మన్నాడమ్మో.-అబ్బ
నాగుండె ఝల్లుమన్నాదె లమ్మో!

క్రిందనున్న కడియాలు
మీాదన పావడాలు
నెత్తిమీాద నాగరము
ఏదేవుడిచ్చాడె పిల్లా!

కడియాలు కామరాజు
పావడాలు పావయ్య
నాగరము నాగరాజు
నన్ను కోరికోరి యిచ్చేరమ్మ - అబ్బ
నా గుండె ఝల్లుమన్నాదే లమ్మో!

ముంతంత కొప్పుమీద
మూడూచేమంతిపూలు
ఏరాజు పెట్టాడమ్మా - అబ్బ
ఎంత చక్కగున్నావలమ్మో!

చామంతి పువ్వులూ
చెంగూలోనాబెట్టి - నన్ను
కోరికోరి పిలచాడే నాయుడూ - అబ్బ
గుండె ఝల్లు మాన్నాదె లమ్మో!

కాళ్ళకూ కడియాలు
వ్రేళ్ళకూ మట్టెలూ
నాయుడెప్పుడిచ్చాడె పిల్లా!

కాసులపేరు వేసుకోనీ
కాలువగట్టున వెళ్ళుతుంటె
కాని పట్టుబట్టాడే నాయుడూ - అబ్బ
నాగుండె ఝల్లు మన్నాదే లమ్మో!

—ఇదే పాటను ఓ గారడీవాడు యిలా పాడుతున్నాడు—

నాయుడోరింటికాడ
నల్లతుమ్మచెట్టుకాడ
నాయుడేమన్నాడే పిల్లా – నిన్ను
నాయుడే మన్నాడే పిల్లా!

నాయుడోరి తోటకాడ
నల్లతుమ్మచెట్టుకాడ
నాయుడోరబ్బాయిరన్న
నాయెంటాపడ్డాడురోయన్నా!

గలగల గాజులూ
ఏడొచ్చినాయి నీకు
పుల్లలేరబోంకుతావ – నువ్వా
బాసలకీ పోలేదా పిల్లా!

పాటకపుజనం ఎక్కువగా మామ, బావ వరుసలను వాడుతూంటుంది. సంతలో మావయ్యలూ, తీర్థాలలో బావలూ వీరికి చాలమందికనుపించి పలుకరిస్తారు. అటువంటి సంతలో బావలకు బంధువే ఈ బావః

శుక్రవారం సంతలోన
బావయ్యో బావయ్యో!
చుట్లమీద తొక్కినావు
బావయ్యో బావయ్యో
నువ్వు తొక్కినందు కేడ్వలేదు
బావయ్యో బావయ్యో

నీకాలునొప్పి కేడ్చాను
బావయ్యో బావయ్యో
ఆదివారం సంతలోన
బావయ్యో బావయ్యో
అంది అంది గుద్దినావు
బావయ్యో బావయ్యో
నీవు గుద్దినందు కేడ్వలేదు
బావయ్యో బావయ్యో
నీ గుత్తినొప్పి కేడ్చాను.
బావయ్యో బావయ్యో
బుధవారం సంతలోన
బావయ్యో బావయ్యో
బుగ్గలట్టుకు కరిసేవు
బావయ్యో బావయ్యో
నువు కరిచినందు కేడ్వలేదు
బావయ్యో బావయ్యో
నీ వంటినొప్పి కేడ్చాను
బావయ్యో బావయ్యో!

ఈ సంత జనానికి - చుట్టూ చూస్తూన్నారనీ, ప్రక్కవారు చూసి నవ్వుతారనీ సిగ్గువుండదు. కట్టుకున్న దాన్ని పక్కగా గుద్దడానికి, ఉంచుకున్న దాన్ని సంతలో గుద్దడానికీ వెనుకాడరు - వారిలో మార్పు ఏనాటికో——?

పాపం బావను తను ప్రేమించింది - నమ్మింది! గాఢంగా నమ్మింది!! అయినా సంతలో గుద్దాడు, కొట్టాడు - కరచాడు. అయినా తను ఏమనదు బావని. పైగా - తనను కొట్టడంలో బావకు ఏం నొప్పి కలిగిందోనని మరీ ఏడుస్తుంది అమాయకురాలు! ఎంత నిర్మల హృదయమో?



పడవ పాటలు ఎన్నో రకాలు. ఆ పడవల రేవు - ఆ ఎగురుతూన్న తెరచాపల వరుసలు, సరంగుల హడావిడి కూలిజనం కోలాహలం - గంగమ్మ గలగలలు - గొల్లమ్మ పకపకలు, ప్రయాణికుల పరుగులు.

పడవ సరంగులు తమ నీటి ప్రయాణంలోనే, ఆ పడవ మీదనే, ఆ గాలిలో, ఆ జోరులో, ఆ నీటి కెరటాల ఒడి లోనే శ్రమను మరచి, వెన్నెల వెలుగుల ప్రయాణాల్లో శృంగారమయమైన పాటలు పాడుకుంటూ సునాయాసంగా బరువునూ, పడవనూ ముందుకు నెట్టుకుపోతారు. ఎన్ని పాటలు - ఎన్ని అర్థాలు వీటిలో - ఎన్ని పదాలు అందులో అదే వారి ఆనందం - అదే వారి స్వర్గసీమ!

41)

పెళ్ళికూతురు చూడు హైలేసా
బహు పెద్దమనిషిరా ,,
చూసిరమ్మంటేను ,,
చేసుకొచ్చిందిరా ,,
గంగమ్మ గౌరమ్మ ,,
దండాలు మాతల్లి ,,
కొలుపులు మాతల్లి ,,
కొండల్లో మాతల్లి ,,
దిగిరావె మాతల్లి ,,
దండాలు యివిగోను ,,
దండాలు గంగమ్మ ,,
కన్నేసి కనిపెట్టు ,,
మాతల్లి కనిపెట్టు ,,

–ఈ "హైలేసా" "ఏలేలో" "హావ్వారి హావ్వ" ఊతపదాలు. ఎంత బరువైనా ఈ "ఊతపదాల" ఊపులో నెట్టుకుపోసాంది.

హైలేసో హావ్వారి హావ్వ
లాగరోరీ లంగరు త్రాడూ
పీకరోరీ పిల్లాడిజుత్తూ
జంపైలే బోటులంగరు
లాగరోరీ లంగరుత్రాడూ!

మూడు నెల్లా ముండాపోరు
ఆరునెల్లా జన్మాఖైదు
ఎక్కరాని పడవామీందా

సెప్పరానీ దుఃఖమొచ్చే
హైలేసో హావ్వారి హావ్వా!
హైలేసో హావ్వారి హావ్వా
జీవిత రహాశ్యాలు ఎన్నో ఈ పాటల్లో వినిపిస్తాయి.
ఈ క్రింది పడవపాటలో ఆ హుంబా కనండి.

నేలను నమ్మి ఏలేలో
చెట్టూవున్నది హైలేసా
చెట్టును నమ్మి ఏలేలో
కొమ్మావున్నది హైలేసా!
కొమ్మను నమ్మా ఏలేలో
రెమ్మావున్నది హైలేసా
రెమ్మాను నమ్మా ఏలేలో
అమ్మావున్నది హైలేసా!
అమ్మని నమ్మా ఏలేలో
పువ్వావున్నది హైలేసా!
పువ్వును నమ్మా ఏలేలో
పిందేవున్నది హైలేసా!
పిందెను నమ్మా ఏలేలో
కాయావున్నది హైలేసా!
కాయనునమ్మి ఏలేలో
పండువున్నది హైలేసా!
పండునునమ్మి ఏలేలో
నేనున్నాను హైలేసా

నన్నునమ్మి ఏలేలో
నువ్వున్నావు హైలేసా!

ఏకాకిగా బ్రతుకు దుర్భరమనీ, ఒకర్ని ఒకరు అనుసరించుకుని, ఒకరికి ఒకరు సహాయపడుతూ – చెట్టూ నేలాలాగ, పూవ్వూ కాయూలాగ — ఆడ మగా జీవితాలు కుటుంబాలు – ప్రజలు — ప్రపంచం – కొనసాగాలి అన్న దివ్యసందేశాన్ని వినిపించడంలేదూ యిందులో?

ఏలియాలా ఏలియాలా
ఏలియాలా ఏలియాలా
జోరుసెయ్యి అయిలెసా
బారుసెయ్యి అయిలెసా!

అయిలపట్టు అయిలెసా
గిల్లకట్టు అయిలెసా
అద్దిరబాబు అయిలెసా
అక్కడపట్టు అయిలెసా!

సాపసుట్టి అయిలెసా
సంకనెట్టి అయిలెసా
సందమామ అయిలెసా
సక్కంగా అయిలెసా!

జోరుసెయ్యి అయిలెసా
బారుసెయ్యి అయిలెసా!

సన్నజాజి అయిలెసా

సీరకట్టి అయిలెసా
పొన్నపూలు అయిలెసా
కొప్పునెట్టు అయిలెసా
సిన్నదొచ్చి అయిలెసా!
కన్నుగీసె అయిలెసా

సన్నజాజి, సందమామ, కొప్పునిండిడాలూ, జానపదకవితల్లో సర్వసాధారణాలు. చిన్నదొచ్చి కన్నుగీటిందట – మరి చిన్నవాడు ఏంచేశాడో?. చూడండి – ఒంటరిగా పడుచు కనుపించేసరికి యువకుని మనసు ఏవిధంగా కొంటెగా పలుకుతూ కవ్విస్తూందో:

ఏలూరెళ్ళిందొక చిలుక దాని
ఎఱ్ఱకోకమీద నా మనసు – హాయ్ ॥ఏ॥
ఒంగోలెళ్ళిందొక చిలుకా దాని
ఒంపుచూపుమీద నామనసు ॥ఏ॥
ముకునూరెళ్ళిందొక చిలుక దాని
ముక్కుపుడకమీద నామనసు ॥ఏ॥
రంగూనెళ్ళిందొక చిలుకదాని
రవిక సొంపుమీద నామనసు ॥ఏ॥
కాకినాడెళ్ళిందొక చిలుక దాని
కంటి విరుపుమీద నామనసు ॥ఏ॥

ఇలా ఒంటినీ, కంటినీ. బట్టనీ కట్టునీ వర్ణించి కవ్వించే కవితలు చాలా ఒకేమాదిరివి కనుపిస్తాయి వీటిలో!

కొంచం ఊపు-ఊతం కలిగి రయ్‌మని వీచే జోరు గాలిలాగా వినిపించేపాటల్లోదే- ఈ పడవసందడి పాట పరికించండి.

ఓ ఓ ఓ పల్లెమామా
పడవాపు పడివాపు పల్లెమామా
పడవొడ్డు కట్టించు పల్లెమామా
పచ్చి చాపలగంప పల్లెమామా
బరువుగా వుందోయి పల్లెమామా!
ఓ ఓ ఓ పల్లెదానా
ఏవూరుదానవే ఎర్రదానా
ఏ జాతిదానవే పొట్టిదానా
నట్టేటి పడవకీ పడుచుదానా
గట్టులేదు పుట్టలేదు పల్లెదానా
సందెచీకటిపడ్డాది పల్లెమామా
గడవేసి ఒడ్డుకురా పల్లెమామా ॥ఓ॥
పడవొడ్డుకొచ్చింది పల్లెదానా
గంప దింపుతాను రావె పల్లెదానా

పల్లెజాతి మాటలవరుసలలో మామా, మరదలూ వరుసలూ, బరువు దింపడాలు, గడవెయ్యడాలూ ద్వంద్వార్థాలతో ఎక్కువగా దొర్లుతూంటాయి.

పడవ పాటలలో "సిరిసిరి మువ్వ" పాటలూ చాలా వున్నాయి. యివన్నీ ప్రియుడూ — ప్రియురాలూ మధ్య డ్యూయెట్‌గా శృంగారరసం ఒలుకబోస్తూ నడుస్తాయి. ఇవి రకరకములుగా కానవగును.

రంగం వెళ్ళాడు ప్రియుడు - ఏదో సంపాదించుకు వద్దామని. అక్కడ ఎవరో మధ్యలో స్నేహం అయినట్లున్నారు.

ఆఖరుకి కాని తను విడిచివెళ్ళిన 'సిరిసిరి మువ్వ' జ్ఞాపకం రాలేదు — అప్పుడు అనుకొంటున్నాడు:

జోడుకొయ్యలోడమీదా సిరి సిరి మువ్వ
జోడగ్గిపెట్టె లంపినానె ,,
అవి అందెనాయొ అందలేదో ,,
నాకు తిరుగుజాబు లంపలేదే ,,
మూడుకొయ్యల వోడమీదా ,,
నీకు ముక్కుపుడక లంపినాని ,,
అందిందో లేదో నె ,,
నాకు తిరుగుజాబు లంపలేదు ,,
నాల్గు కొయ్యల ఓడమీదా ,,
నీకు నానుకోడులంపానే ,,
అందిందో లేదో నే ,,
నాకు తిరుగుజాబు రాలేదో ,,
అర్ధరూపాయి డబ్బులకు ,,
నువ్వాశ పడబోకంది ,,
ఇసుపత్రి పాలైతే ,,
నిన్నాదుకో నేవారు లేరందీ ,,
కసరికసరి కొడితేను ,,
నే సరసమనుకున్నానె ,,
కంటికి కాటుకపెడితె ,,
నేను కన్నె అనూకున్నానె ,,
షైటపావడా గడితే ,,

నే పడుచు అనుకున్నానే    సిరిసిరి మువ్వా
పౌడ రేసుకుంటేను    ,,
నేను బాలికనూకున్నానే    ,,
తళుకు జూపిస్తేను    ,,
నా వలపులనూకున్నానే    ,,
నీమీద వలపంటే    ,,
కామాలు ననుకున్నానె    ,,
సంకురాత్రి పండుగనాడు    ,,
నేను సారాసీసా్త్రాగబోతే    ,,
ఒంటిగా నుంటేను    ,,
నాశొక్క చుక్క దిగలేదూ    ,,
కష్టపడ్డ డబ్బంత    ,,
ముండ కాటిమీద పెట్టినానె    ,,
ముద్దుగుమ్మ నేడిపించి    ,,
పాడుముండలకు బెట్టానె    ,,
సముద్రాలు దాటిపోతే    ,,
పైసాఅయిన లేకపోయె    ,,
బుద్ధిలేక రంగమెళ్ళి    ,,
ఈరద్ది పాలు పడ్డానే    ,,

పాపం-రంగంలో ఓదాని వలలోపడి పడ్డపాట్లు తలుచుకుని బాధపడి - చేతులు కాలాక సిరిసిరి మువ్వను తలుచుకుంటున్నాడు-

ఈ రంగంపాట యిలా కూడా వుంది. 'సిరిసిరి మువ్వ' ఊతపదం మామూలే!

జోడగొట్టా లోడమీదా సిరిసిరి మువ్వా
జోడుంగరా లంపానె ,,
జోడు గొట్టాలోడమీదా ,,
జోడు సవరా లంపానే ,,
అందినాయొ అందలేదో ,,
తీగజాబు లంపావె ,,
కవరుజాబు లంపావె ,,
జోడుగొట్టా లోడమీదా ,,
జోడుబొమ్మ లంపానె ,,
జోడు గొట్టాలోడమీద ,,
జోడుపెట్టెలంపానే ,,
జోడుగొట్టాలోడమీద ,,
జోడు సవరాలంపానే ,,
అందినాయొ అందలేదో ,,

తను కన్నేసిన పిల్లమీద - తను చెప్పదలుచుకున్న మాటలు ఏ పిచుకమీదో - చెట్టుమీదో పెట్టి - పాటల్లో వ్యక్తపరచడంకూడా పరిపాటి!

జాలి బొంబైలే జాలిరా ఓ బేలిజల్ల
,, అన్నలార తమ్ములార
,, అందమైన సూరులార
,, సూరుమోత బేరిమోత
,, నూగునూగు మీసగాళ్ళు
,, నూటికొక్క కాపుబిడ్డ

42)

" గోరుతో జొన్నాడదాటి
" బాకుతో బందారుదాటి
జాలిరావో బేరి జెల్ల - జాలిరా ఓ బేలిజెల్ల —

అంతరాల పడవమీద పూలు కొయ్యబోతే రాలిన పువ్వు రంగం వెళ్ళి భంగపడడం, కొమ్మమీద ఈత ముల్లు గుచ్చుకోడం చాలా పాటల్లో కనిపిస్తుంది. ఈ పడవ పాటలోనూ అదే భావం—

జంబైలేలో - జోతులంగరు
అన్నలారా తమ్ములారా
... ... ...
జోడుగుళ్ళా యీదీలోనా
జోరుసేసీ పలుకారన్నా
మిద్దెమీదా మిరపాచెట్టూ
నీళ్ళులేకా జోలిపోయే
అంతరాలా పడవామీదా
అందిపూలు కోయాబోత్తే
రాలిపూవ్వూ రంగమెళ్ళీ
భట్టు భళ్ళు తెల్లవారె
రంగామంతా భంగాపుచ్చే
మంచినీళ్ళ బావికాడా
పుట్టమీదా పాలాపిట్ట
కొట్టబోతే తేలూకుట్టె
బావగారు మంతారించే
భళ్ళు భళ్ళున తెల్లవారె
పెద్ద చెరువూ గట్లామీదా

ఎడ్లు మేపే చిన్నవాడా
ఎడ్ల కేసే పాలికేకా
నాకువస్తే నేనూరానూ!

—పడవపేరనో! లేక వన్నెకాడైన వ్యక్తిపేరో కాని భీమరాజు నుద్దేశించి నడుస్తుంది ఈ పాట!

వాడమీంద వన్నెకాడో
భీమరాజు
వాసనకి సంపెంగ వనమూ।
చేతినిండ వుంగరాలు
భీమరాజు
చెప్పరాని చక్కదనమూ।
కాయపంచలు కట్టుకోని
భీమరాజు
కమ్మని చక్కదనమూ।
కర్రచేత బట్టుకోని
భీమరాజు
కిర్రుచెప్పలు తొడుగుకోని।
కలకటేరులాగ వచ్చెను
భీమరాజు
కాకినాడ రేవులో
రేవుగట్టి ఓడఎక్కి
భీమరాజు.
రంగురంగుల బావుటాతో
భీమరాజు

రంగుగా రంగమెళ్ళె
వాడమీంద వన్నె కాడో
భీమరాజు!!

ఈ భీమరాజు రంగురింగుల మనిషిలాగున్నాడు. ఇటువంటి పదములలో వచ్చే మాండలిక పదముల నాధారం చేసుకొని ఈ పాటలు ఏ మండలానికి చెందినవో గుర్తించ వచ్చును।

పడవపాటలో ఒక విచిత్రం వినిపిస్తూంటుంది. అందరూ కలిసి లాగుతూంటారు పడవ బరువుని. అందులో ఏ ఒక్కడు లాగకున్నా ఎవరికీ తెలియదు అలువంటి వని దొంగలను దృష్టిలో పెట్టుకుని - రోషం కలిగించేలా పాడే పాటలు చాలా వున్నాయి.

హైలేసో హావ్వారి యవ్వ
హైలేసో హైలాసా।
జానాకొకొక్క ,,
శారా కొక్క ,,
పట్టుండిగట్టి ,,
బండాడిపేసు ,,
భద్రాద్రదిగో ,,
హనుమంతుడన్న ,,
పట్టుండీ జ్వాన ,,
గట్టీపట్టే హైలేసా
పట్టినవాడు ,,

పెద్దావోడూ ,,
పట్టనివాడూ ,,
చెడ్డావోడూ ,,

ఇక్కడ పట్టడం అంటే లాగడం అని అర్థం. ఈ పాటల్లో లాగనివాడిని తిడుతూండే భావ ప్రాయకేం అంత కలువుగా వుంటుంది. అటువంటివి వదిలేయాలి.

అతగాడితో చాలా కాలంగా వున్న ఆ సంబంధం ఈరోజు తన్నొదిలి ఓడెక్కి ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు - కనుపించినంతమేర కళ్ళను మైళ్ళకొద్ది పొడిగించి ఓడకేసీ - తన రాజుకేసీ చూస్తూ వాపోతుంది చిన్నది.

ఓడెళ్ళిపోతున్నది
మా రాజో
ఓడెళ్ళిపోతున్నదీ!
చెన్నపట్నం రేవుల్లోన
చెట్టపట్టా లేసుకోని
చెవిలో గుసగుసలేమో
చెప్పిపోయిన మారాజో
ఓడెళ్ళిపోతున్నదీ !
కాకినాడ యీదుల్లోన
కాటుకకన్నులుజూచి
కన్నీళ్ళుచేతతుడిచి
కావలించిన మారాజో
ఓడెళ్ళిపోతున్నదీ !

భీమారం పట్నంలోనా
పెద్దలందరుజూడ
పెద్దాపందిరిలోనా
పెళ్ళాడిన మారాజో
ఓడెళ్ళిపోతున్నదీ !
కంచాన సద్దెట్టుకుని
తెల్లానెన్నెల్లోనా
కసిగాలు గొట్టుకుంటూ
కలువరించిన మారాజో
ఓడెళ్ళిపోతున్నదీ !
అందమైన నీమోము
చందురుని చూస్తుంటే
గుండెచల్లబడతదాని
గునిశాడిన మారాజో
ఓడెళ్ళి పోతున్నదీ !!

జాలారన్న అంటే పడవసరంగనుకొంటాను. వరదతో నిండిన గోదారిమీద ప్రయాణం – ఎంతటిపో ప్రాణమంటే ఈ పల్లెపడుచుకు. "మళ్ళీ వచ్చినప్పుడు మంచిగ మాట్లాడుతా"నని ఆశకూడా చూపిస్తూందీపడుచు.

ఓ ఓ ఓ ఓ జాలారన్నా
ఏగూడా ఉయ్యారా
జాలారన్నా

పొంగి పొర్లుకొస్తాంది
జాలారన్నా
పడవాడా బెయ్యరా
జాలారన్నా
వరదానీరొస్తాంది
జాలారన్నా
వడ్డునకు జేర్చరా
జాలారన్నా
గోదారి గాలిరా
జాలారన్నా
గోలపెట్టుకొస్తాంది
జాలారన్నా
ఏటవతలమాయిల్లు
జాలారన్నా
ఎప్పుడెళ్ళి సేరుతానో
జాలారన్నా
సీకటడిపోతూంది
జాలారన్నా
పలుకరో పుల్లయ్య
జాలారన్నా
ఒంటరిగా వున్నాను
జాలారన్నా
ఒడ్డునకు జేర్చయ్య
జాలారన్నా

గోదావరి ఒడ్డూన
జాలారన్నా
మా గుడిసెలున్నాయి
జాలారన్నా
వరదొచ్చిందింకేను
జాలారన్నా
గంగపాలౌతాయి
జాలారన్నా
కనికరించి విడువరా
జాలారన్నా
మళ్ళీవచ్చినప్పుడూ
జాలారన్నా
మంచిగమాట్లాడుతాను
జాలారన్నా!

సరంగు ఈ పడుచును ఏదో అన్నట్లుగా వుంది పాట ఆఖరి చరణం చూస్తే. అందుకే 'కనికరించి విడువరా' అని ప్రతి మాలుతూంది. యిటువంటివన్నీ సర్వసాధారణాలేమో ఈ జీవితాలలో!



# 11

మనకు ఈనాడు అంటె పిండిమరలూ, ధాన్యం మిల్లులూ వచ్చాయి. నాడు విసురురాళ్ళు, రోళ్ళుకదా ఆదుకున్నవి! ప్రతి ఇంట ఒక తిరుగలి (విసురురాయి) ఒక రోలు, రోకళ్ళు వుండడం తప్పనిసరి!

ఈనాడు కాఫీగింజలకు మర, పంచదార నలగడానికి మర, పోక చెక్క-కుమరకత్తెర, ధాన్యానికి మర, పిండికి మర, పళ్ళు పిండుకోడానికి మర – ఆఖరికి మనిషి బ్రతుకే మరజీవితమైపోయింది.

తిరుగలి విసురుకొనే సమయంలో ఇద్దరుమాత్రమే అందుకు అవసరము. దంపుకు నలుగురూ అవసరము. ఈ రెండు పనులకూ ఊతంగా దంపు పదాలనీ, విసురురాతి

పదాలనీ వున్నాయి. చదువుకోడానికి ఒకేపాటా అనిపించేంత దగ్గరగా కనుపించినా—రెండు రకాలు వేరుగానేవున్నాయి—

తనే తుమ్ముకుని చిరంజీవి అనుకునేలా విసురు పదాలుంటె ఎదుటివారు తుమ్మితే ప్రక్కవారు తలమీద నీళ్ళు జల్లినట్లుగా దంపు పదాలు వుంటాయి.

ఈ దంపుపదాలు ఎన్నో కనుపిస్తాయి. వీటన్నింటినీ ఓ చిన్న బుక్కు వేయవచ్చు - కొన్నింటిని విందాం.

(1)

సువ్వా సువ్వన్నా
చుంచూ మల్లన్నా
పసువారీ సుబ్బన్నా
సూరమ్మా మొగుడూ
హాఁ - సువ్వీ!

సూరమ్మా మొగుడూకీ
మీసాలూ లేవు
కోటప్పా కొండా
వాసాలూ లేవ్రూ
హాఁ - సువ్వీ!

రాచారి దంపులకే
రాయె వెడదామూ
రాచోరీ కోడాలూ
సారె తెచ్చిందీ
హాఁ -సువ్వీ!

రాచోరీ కోడలూ
గోసాలోవుంటె
మన్నెవరు నూత్తారె
మాతల్లి కానా
హా - సువ్వీ!

తింటేను రాచోరి
సారే తినాలి
కంటేను తొలిచూలు
కొడుకును కనాలి
హా - సువ్వీ!

(2) నాచేతి రోకళ్ళు
నల్లా రోకళ్ళు
చేయించు అన్నయ్యా
చేవ రోకళ్ళు,

వేయించు అన్నయ్యా
వెండి పొన్నుల్లు

సువ్వాని నే నొక్క
పోటేసుతేనూ
చుక్కలు పిక్కటిల్లు
నూరన్న కదులు,

అన్నని నే నొక్క
పోటేసితేను

ఆకదమ్మ్రొ కదలు!!
ఆరాజు కదలు,

ముగ్గురన్నలతోడ
నే బుట్టినాను
నా నడుము మువ్వంచు
చీరగోరింది!
అయిదుగు రన్నలతోడ
నే బుట్టినాను
నా ఒళ్లు అద్దాల
రయిక కోరింది!

(3) గుమ్మడి కాయంటి
గురువొచ్చినాడు
సీకాయపంచెలతో
శిసువెళ్ళినాడు!

కాళ్ళు కడగనైతి
కాళ్ళు మ్రొక్కనైతి
వంగి దండంబెట్టి
వరమడగనైతి

నాతోటి వారెల్ల
నాను లడిగితిరి
నే నొక్కటడిగితి
ఐదవతనము!

చాలు ఐదోతనము
సంతాన బలము
కోటి ఐదోతనము
కొమరులాం బలము!

(4) సువ్వి కస్తూరిరంగ
సువ్వి కావేటిరంగ
సువ్వి రామాభిరామ
సువ్విలాలీ
ఆ సువ్వి - ఆ సువ్వి!

తుమ్మ కర్రరోలుదోసి
తూముడొడ్లు వాయ వేసి
దంచుదామా బియ్యం
దంచుదామా
ఆ సువ్వి - ఆ సువ్వి!

ఒక్క వేలు చుక్క బొట్టు
అందరికీ చాలదమ్మ
దంచుదామా బియ్యం
చెలియలందరు
ఆ సువ్వి - ఆ సువ్వి!

ఒకరి కొకరు కొప్పులోన
గుప్పెడేసి మల్లెమొగ్గలు
మగువకాంత కొప్పులోన

మల్లెజాజులు
ఆ సువ్వి - ఆ సువ్వి!

(౫)

కోడలా కోడలా
కొడుకు పెళ్ళామా
పచ్చిపాలామీద
మీగడా యేది??

వేడిపాలమీద
వెన్నలు ఏవి?
నూనెముంతలమీద
నురగలూ ఏవి??

అత్తరో ఓ అత్త
ఆరళ్ళ అత్త
పచ్చిపాలామీద
మీగడుంటుందా!

వేడిపాలామీద
వెన్నలుంటాయా
నూనె ముంతలమీద
నురగలుంటాయా!

ఇరుగు పొరుగూలార
ఓ చెలియలార
అత్తగారారళ్ళు
చిత్తగించండి
పెత్తనం లాగుతె
పేచీలు పోను!

(6) పడుచువారము మేము
పని చేయలేము
పగలు వెన్నెలగాయి
ఓ చందమామ!

ప్రొద్దు గూకిందంటె
మేముండ లేము
బుద్ధులూ చెప్పవే
భూదేవి తల్లి!

సందెల్లు గూకితే
మేముండ లేము
సంతాన మీయవే
ఓ చందమామ!

7) చిక్కుడాకులమీద
చిలుక వాలింది
అరటి యాకులమీద
హంస వాలింది!

హంసెక్కి ఓ రాజు
అమరియున్నాడు
కొబ్బరాకులమీద
గోర వాలింది!

గోరెక్కి ఓ రాజు
కోరివున్నాడు

మావిడాకులమీద
మంచు వాలింది
మంచెక్కి ఓ రాజు
పొంచియున్నాడు!
గుమ్మడాకుల మీద
గువ్వ వాలింది
గువ్వెక్కి ఓ రాజు
గూడొగ్గినాడు!
చిక్కుడాకుల మీద
చిలుక అబ్బాయి
చిలకెక్కి అమ్మాయి
చిక్కియున్నాది!
అరటిఆకుల మీద
హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి
అమరియున్నాదీ!

౮) కారాలలో కెల్ల
రెండు కారాలు
ఉప్పుకారా మొకటి
ఉపకార మొకటి
వాసాలలో కెళ్ళ
రెండు వాసాలు

రాణివాసా మొకటి
విశ్వాస మొకటి
కుంటలాలో కెల్ల
రెండు కుంటల్లు
వడ్లకుంటా ఒకటి
వైకుంఠ మొకటి!

9) తములపాకుల మీద
వడ్లెండబోసి
రా చిలుక పో చిలుక
పోటేసి పోవె!
అత్తదంచిన బియ్య
మధికసన్నాలు
కోడలు దంచిన బియ్యాం
కొత్త సూదూలు
అల్లమా రింటికి
చల్లకు బోతె
అల్లమూరీ కుక్క
భౌ మన్నాది!
నా కాళ్ళమట్టెలూ
ఘల్లుమన్నాయి
పొయ్యిలో పాము
బుస్ మన్నాది!

10) మా బావలొచ్చారు
కూరేమి కూర?
పందిట్లో సొరకాయ
బల్లి తలకాయ!

మా యన్నలొచ్చారు
కూరేమి కూర!
అడవి చిక్కుడుకాయ
అలచంద పప్పు!

11) దంపు దంచాలేను
దండెత్తలేను
దంచీనా బియ్యము
వండానేలేదు!

అమ్మకి ఒక్కర్తిని
నా తల్లికానా
పని నేర్పలేదమ్మ
పుట్టిన యింట!

అరిటాకు వంటిది
ఆడజీవితము
ముల్లొచ్చి పడినాను
ఆకూకె లోపం!

నీ అల్లుడొచ్చి
పంపమని యంటె

నా కూతురు చిన్నదీ
అని చెప్పు తల్లి!

12) నీళ్ళు యిద్దామంటె
చిల్లి చెంబాయె
చాప వేద్దామనగ
చోటు దొరకదాయె!

కోడి కోద దామంటె
గుడ్లకోడాయె
వడ్లు దంచీచూడ
విత్తనాలాయె

పీట వేయాబోవ
పిల్లడమాయె

13) రోక లేత్తాలేను రోలెత్తలేను
చామంతి కడియాల చేతెత్తలేదు
కోటకు పోటాళపారుగు నాకాళ
కంటికి రెప్పాళ శ్రీవెంకటేశ!

14) తప్పేడు బియ్యంబు
దండెంపు కూర
చాదుబాజి గోత్రంబు
తల్లి పుట్టిల్లు!

మానెడు బియ్యంబు
మంకెన్న కూర

మహారాజు గోత్రంబు
నే పుట్టినిల్లు!

15) పిండి కొట్టామాని
పిండూకోకండి
ఇరుగు పొరుగుల్లారా
ఇది ముగ్గుపిండి
సువ్వి - హా - సువ్వి!

పిండికొట్టి అల్లుడిని
పిలువ నంపితే
రానాని అల్లుడు
రచ్చ కొమ్మెక్కె
సువ్వి - హా - సువ్వి!

రానని అల్లుడు
రచ్చ కొమ్మెక్కె
పిలువనని వారి మామ
పేటా కొమ్మెక్కె
సువ్వి - హా - సువ్వి!

పిలువనని వారి మామ
పేటా కొమ్మెక్కె
వండానని వా రత్త
వంటిల్లు సొరద
సువ్వి - హా - సువ్వి!

దంపు పాటలు. సువ్వి పాటలు, దంపుపదాలు అని పిలువబడేవన్నీ ఒకటే! కాని నలుగురు దంపు సమయంలో పాడేపాటకూ, ఇద్దరు పాడేపాటకూ తేడాకలదు. కాని రెండూ దంపు పదాలే - వీటిని కొంచం తేడాతో తిరుగలివద్దా పాడ గలగడం జరుగుతుంటుందనుకొంటాను-

16) సువ్విగిరి రామలింగ
సువ్వి కస్తూరిరంగ
సువ్వి యనుచు పాడరమ్మ
సుదతు లందరు,

అంచులంచు లరగవేసి
పంచవన్నె ముగ్గువేసి
పాడి పాడిదంతురమ్మ
పణతు లందరు,

ఉల్లిపూవు జల్లెడమున
శ్యామపూవు కుందనమున
శ్యామపూవు కుందనముకు
సెరుకు రోకిళ్ళే,

బాదూాలు దంచేది
దూదీ పోకండ్లేమొ
మగువలు దంచేది
మూని రోకండ్లే!

చిన్నవడ్లు పెద్దవడ్లు
పైరైన రాజనాలు

కృష్ణా నీలాలుదంచి
కీర్తి పొందరే!

దంచి దంచి కన్యలంతా
దాహము కొనినారే
ముత్యమంత చెంబుతోన
దప్పి కందిరే!

మోవలంగి కొప్పులోన
మొగలిరేకు లంటబెట్టి
కులుకులాడి పమిట చెరగు
కుంకుమాయెనే!

అక్క చూడె చుక్కబొట్టు
అమరినట్టె యుంది
మోహనాంగి కొప్పులోన
మల్లె గుత్తులే!

అంటకుండ వండకుండ
వంట చెరకు వేరకుండ
అంటుముట్టు లేని చోట
వంట జేయరే!

భక్తితోను వంటచేసి
పళ్లెరమున తీసినారు
పద్మజాక్షుని కొలువ
పాట పాడరే!

17) రోకలి చిన్నాది
రోలూ చిన్నాది
సువ్వీ హో సువ్వీ!
నాతో దంచేది
చెలియ చిన్నాది
సువ్వీ హో సువ్వీ!
నా చేతి రోకలి
సల్లా రోకలీ
సువ్వీ హో సువ్వీ!
నే పాడినన్నాళ్లూ
రామలక్ష్మణులూ
సువ్వీ హో సువ్వీ!
పీరెక్క గుర్రాలు
నీలీ మేఘాలూ
సువ్వీ హో సువ్వీ!
రోకలికి నా
రెండూ దండాలూ
మముగన్న తల్లికీ
వేయి దండాలూ
సువ్వీ హో సువ్వీ!

ఈ దంపు పదాన్ని పరికించండి - కొంచం విసురు పాటా అనిపిస్తుంది.

45)

(18) దంపు దంచాలేను
దంపి చూడాలేను
దండెత్తి ధాన్యమూ
దంచగా లేనూ !
సువ్వి హా సువ్వి !

నిమ్మలబుగ్గపాప పుట్టినాడూ
నిమ్మతోటకు తోడి సిరెట్టినాడూ
నిలువూనా నిమ్మల్లు లేచికాయంగ
నిగనిగ పళ్లన్ని బుట్టాలు నిండ !
సువ్వి హా సువ్వి !

సంతాకు బుట్టలు
బండ్లాతో చేర్చి
సంతోషమున డబ్బు
జేబూలోకొచ్చె !
సరసాల కాతోట
సల్లన్నితోట
సంతపోయే జనపు
సంపెంగ తోట
సువ్వి హా సువ్వి !

(19) పాపమ్ము చేసుకుని
బావిలో పడితె
పైమురికి యేగాని
పాపాలు పోవు

చేటుకాలామల్రు
శంకరుడ నీకు
ఆలిమీాదా పెండ్లి
యెట్లాడినావు?

ఊరిముందర చేను
వేయబోకన్న
ఊళ్ళోన వియ్యాంబు
చేయబోకన్నా !

ఊరిముందర చేను
కాకులాపాలు
ఊళ్లోన వియ్యాంబు
కయ్యాలపాలు

చేను మంచీదాని
చెప్పబోకన్న
చెరుకన్న రాజనం
పండిన్నగాక

ఆలి మంచీదాని
అన బోకురన్నా
అదివచ్చి మనలోన
అణిగుండుదాక

అత్తింటి కోడలవు
కావుగా వున్నె
ఆజ్ఞసిగ్గులు నీకు
లేవుగా వున్నె

వీపువిండా కొంగేది
ఇరువనుస లేవె ?
మడమతిరగ బట్టేది
మాట వాసేది!

(23) ఆడదాన్ని నేను
అయిపుడితిగాని
గండ్రగొడ్డలి క్రింద
కొమ్మనైన జాలు
గొడ్రాలి బ్రతుకేల
కోటి ధనమేల
స్వారాజ్య మిచ్చినా
సవతి పోరేల ?
చూడకా ఆడేరు
చూచి ఆడేరు
కానకా ఆడేరు
కల్లలీ ప్రజలు!
పాటలు పాడితే
పలవరంటారు
పాడకుంటే జనులు
మూగ దంటారు !

పై రెండు పదాలూ ఎదుటివానికి నీతిబోధించేరీతిలో సాగుతున్నాయి. మొదటి పాటలో ఎంతనీతి, అనుభవ

ద ం పు ప దా లు

పూరిత ప్రబోధం వుందో, కొండో పాటలో ప్రజల మనసులు ఎట్లాగుంటాయో చూపుతూ, "ఆడ" బ్రతుకు కష్టం విని పిస్తుంది.

21) రాజనాల వడ్లయిన
భోజనాలయిన
రాజు పెనిమిటైతే
చింతేల దేవి
ఆడదీ పుట్టింది
అసురు పుట్టింది!
దండాన కోడలకు
దైత పుట్టింది!

ప్రేమలేని మగని
పెండ్లాడితేను!
కాపురాలకు చేటు
కాకుండ పోదు!

వెంకటేసుని కొండ
వెలుసుండ వలెను!
ఎప్పటికి పుట్టిల్లు
కలిగుండ వలెను!

పిత్తులోడ్లు దంచితే
బెత్తులయినాయి
అమ్మ నీ కుమారుళ్ళు
రాజు లైనారు

రాజులకు తగినట్లు
రంభలొచ్చారు
రంభలా కడుపునా
పిల్లలుట్టారు !

పిల్లకీ పెళ్ళోళ్ళరు
అడగొచ్చినారు
ఇద్దామ అనయ్య
ఇద్దామ వదినా ?

అనుకూలమయిన
మామ మంచివాడైన!
మాటకారైన
కాముడూ లేత్తైన
కన్య నిత్తాయి!

మాతాత పెళ్ళికీ
నే నెంతదాన్ని
తలదువ్వి బొట్టొడితె
తవ్వంతదాన్ని !
అన్నిసొమ్ములు పెడితె
అడ్డంతదాన్ని !

పూర్వకాలంలో పెళ్ళిళ్ళు ఎంత బాల్యంలో జరిగేవో ఈ పాట సాక్ష్యం చెబుతూంది - "తలదువ్వి బొట్టెడితె తవ్వంత మనిషిట, అన్ని సొమ్ములు పెడితే అడ్డంత పిల్ల"ట. బాగుంది ఉపమానం!!

ఈ విధంగా దంపుల్లూ, సువ్విపాటలూ చూపిస్తూ రావాలంటే ముందరే చెప్పినట్లు ఇదిఒక పెద్ద గ్రంథం అవుతుంది. కనుక ముఖ్యాని అనుకొన్నవి మాత్రం పరిచయం చేయడం జరిగిందని గ్రహించకోరెదను !

సరే! ఈ శ్రామికతరహా పనిపాటలలో బ్రతుకే భారమై, బరువుగా బ్రతుకేడ్చే జీవితం విడిచే ఉచ్ఛ్వాసములే శ్రామికజాతి పాటల సంపద – ప్రతిబింబం – కాదు – ప్రతిధ్వని!!

తను చేయగలిగినా లేకున్నా, మోయ గలిగినా లేకున్నా జానెడు పొట్టకోసం ఎకరాలకొద్దీ చాకిరి, పంపె ముకల ఈ గూడుకోసం బండలకొలదీ బరువు యీడ్వడం – ఆ సమయంలొ అప్రయత్నంగా ఊతంగా విడిచే 'హెయ్' అన్న పదం, 'హుং' అన్న శ్వాస; తన బ్రతుకుగోత మీద ఏవగింపుతో పలికే 'ఆరునెల్లా జన్మాఖైదు – మూడునెల్లా ముండా పోరు' అన్న ఏవాక్యాలో కలిస్తే వెలువడిన ఈ జానపద శ్రామిక గేయ స్రవంతిని ఎంతని చూపగలం! ఎన్నని వ్రాయగలం!!

"తుమ్మెదా", "చందమామా" "వెన్నెలా" పాదాంత పదములుగానే "తందానా" పదాంత పాటలునూ ఈ పనిపాటలలో కలవు. ఒక విషయం –జగంకథలలోనూ, కథలలోనూ ఈ "తందాన" పదం చాలా పీఠం వేసుకున్నది. తందాన పదానికూడా అంటారు.

ఏదేనా మాటలసందర్భంలో - ప్రతి విషయానికీ ఒప్పుకుంటూ - ఎదుకు చెప్పని వాడిని చూసి - ఏమిట్రోయ్ "తందానతాన" అనడమేనా అనడం కద్దు. కథల్లో ప్రతిపాదం చివరా "తందాన" అనడమే పైమాటకు కారణం.

చెట్టుమీద కూర్చున్న తందానా!
రాజులు కారూ కై ,,
చెట్టుమీద కూర్చున్న ,,
రాజూ లెవరూ ,,
మేడమీద కూర్చున్న ,,
రాజూ లెవరూ ,,
గట్టుమీద కూర్చున్న ,,
అల్లుళ్ళు కారుకే ,,
గట్టుమీద కూర్చున్న ,,
అల్లుళ్ళెవారు ,,
కొండమీద కూర్చున్న ,,
అల్లుళ్ళెవారు ,,

అలాగే "ఉయ్యాల" పాదాంత పనిపాటలలో ఉయ్యాలపాటలని వున్నాయి! ప్రతిమాటకూ "ఉయ్యాలా" అంటుంటారు! ఈ పాటలు చేను కలుపులకు, కోతలకు, నాట్లకు సంబంధించినవి అనుకోవచ్చును.

ఉయ్యాలా దంబాలా!
ఉయ్యాలా దంబాలా!!
కోటిపల్లి కాడ వుయ్యాలా!
గోరంటతోట ,,

కొండంత చెట్టూ ఉయ్యాలా!
గొడుగంటి చెట్టు ,,
కొమ్మలు రెండూ ,,
రెమ్మలు రెండూ ,,
వాలినాయిరా ,,
కాచినాయిరా ,,
అందినాయిరా ,,
కాయలు నిండా ,,
కాయ తింటే నే ,,
పచ్చి పులుసురా ,,
పులుసు కాదురా ,,
గోదారమ్మ ,,
కోరి పెంచెరా ,,
ఉయ్యాలా ,,
ఊగుటకేరా ,,
ఆ ఊపెవోరూ ,,
అక్కడేనురా ,,
ఆడుతారురా ,,
అమ్మోరు నక్కడ ,,
అంకమ్మ నక్కడ ,,
అలక నింపుతారు ,,
ఉయ్యాల లేసి ,,

ఊపుతారురా ఉయ్యాలా!
కోటిపల్లి కాడ ,,
గోరింట తోటా ,,
కొండంత చెట్టురా ,,
ఉయ్యాల దంబాలా!
ఉయ్యాలా దంబాలా!!

దంపు పాటలనీ, సువ్విపాటలనీ పైన చదివాము — వాటికి చాలా దగ్గరలో, కనుపించే విసురు రాతిపదముల (తిరుగలి పాటలు) ను గురించి నాలుగుముక్కలు పరిచయం చేస్తాను. ఈ విసురు రాతి పనికి యిద్దరు అవసరము — గుండ్రంగా వుండి గిరగిర తిరగడానికి ఉసులుగా వుండి-త్రిప్ప డానికి ఒక కర్రపిడి (తిరగలిపిడి) వుంటుంది. దానిని యిద్దరు చేతులుపెట్టి త్రిప్పుతూ పాడుతుంటారు!

(1) అయిపోయె అయిపోయె
అయిపోయె గౌరు
అయిపోయిన యింట్లలో
ఆడుకో గౌరూ!

సరిపోయె సరిపోయె
సరిపోయె గౌరు
సరిపోయిన యిండ్లల్లో
సరసా లాడమ్మ!

భావాలకు పదును జేరిన కత్తిగా మెరిసే ఈ విసురు రాతి పాటలు చాలా హుషారుగానే వుంటాయి.

(2) ఆదివారమునాడు
అమవాశ్యనాడు
అన్న యింటికి నేను
గిన్నె నడుగబోతే

మా వదిన శాంభవి
లేదు పొమ్మనెను
మా యన్న మంచివాడు
మళ్ళీ రమ్మనెను!

చిన్నోడికి చీటంగి
సిలుకుకుళ్ళాయి
బాలునికి పొట్లంగి
పాలుపోసె గిన్నె
నాకు నల్లచీర
నెమలి వన్నెర రవికె।

వడినిండ బియ్యము
వళ్ళో కొబ్బరి గిన్నె
పసుపు కుంకుమ యిచ్చి
పంపె మాయన్న!

(3) కలిమియ్యి బలిమియ్యి
కదిరి నరసింహా
నా చిన్నారి తమ్ములకు – సిరి
సంపద లీయవయ్య।

బిడ్డల్ని కన్నతల్లి
నీళ్ళు తేబోవ
ఆషీకలూ ఎండాయే
ఆ జలధీలోనా !

కొడుకుల్ని కన్నతల్లి
నీళ్లు తేబోగా
ఆడీకలూ అణిగాయీ
ఆ జలధీలోనా !

తోటన యెంకన్నా
తోపూ నరకంగా
తోపూ పమిటల్లూ
తొలగీ పోనాయీ !

గుట్టెక్కి యెంకన్న
కూతలెట్టంగా
గుడిసెల్లో పడుచులకూ
గుండె లల్లాడా !

(4) తూరుపు వాకిళ్ళకు
దూలాలు గావు
పడమటి విండ్లకు
పలకల్లు గావు
మా యింటి కోడండ్లకు
రోకళ్లు గావు
ధనము రాసులిచ్చె

కొండ్రి రామయ్యా
నీవైన చెప్పరాద
ఆ మూని పేరు

అమ్మారో నీకింత
విన వేడుకైతే
మూడల్లో పోయేటి
మరపళ్ళ నడుగు

మూడల్లో పొయ్యేటి
మరది సుబ్బయ్యా
నీవైన చెప్పరాద
ఆ మాని పేరు!

అమ్మారో నీకింత
విన వేడుకైతే
మైనాక్షి పక్షుల్ల
మానుల్ల నడుగు

అమ్మారో నీకింత
విన వేడుకైతే
బారాసావిటమీది
బావల్ల నడుగు

అమ్మారో నీకింత
విన వేడుకైతే
కొలువు సావిడిమీది
కొడుకుల్ల నడుగు

అమ్మరో నికింత
వినవేడుకైతే
నేలాన పండిన
పల్లేరు చెట్టు

(5) పట్టుచీరలవారు
బావకూతుళ్ళు
అంచు చీరలవారు
ఆడబిడ్డళ్లు
తోపుచీరలవారు
తోడికోడళ్లు
అందుట్లో మా లక్ష్మి
చెరుగు చీరలది
దబ్బున మాలక్ష్మి
బరిణందుకోమ్మ
ఇంత చక్కని బరిణె
ఎవరంపినారు
నీకని పెద్దేటి
అన్నంపినాడు!

(6) నల్లకొండల నడుమ
ఉతికే చాకలి
మాయన్న యేసిన
దట్టిపేరేమొ!
చింతకూట నూలమ్మ
శిరువెళ్ళ తోగరు
నంద్యాల నల్లంచు

లంజెపేటంచు
కందనోలు కరకంచు
కంది బేడంచు
ఉతకరా చాకలి
ఉల్లిపువ్వల్లె
మడసరా చాకలి
మల్లి మొగ్గల్లె
యిచ్చిరా చాకలి
అన్నవాడలికి
ఇచ్చేను వొచ్చేను
ఇల్లు నే నెరుగ
గచ్చుతో కట్టిన
గాజు స్తంభాలూ
సున్నంబు పూసిన
సురటిమిద్దిళ్లు
వేపమాని యెదురిల్లు
ఎద్దూలమిద్దె!

(7) పుణ్యావంతులమ్మ
ఈ యింటివారు
అన్నలని పిలిచితివి
తమ్ములని పిలిచితివి
నన్నేల పిలువవే
ఓ చిన్ని మరదలా,
ఏమని పిలుచుదును ఓ వెర్రి శివుడా!

నీళ్ళబాణము తొడిగి
నరలోకమేలెనే
నా పుణ్యపురుషుండు
పువ్వులా బాణంతొడిగి
కప్ప రథమెక్కి పురుషుడు
భూలోక మేలినాడని చెప్పు
వచ్చేటి పొయ్యేటిదారిగలదు
శివునికి శివపూజ
కోరినానని చెప్పు!

(8) సకియ యిల్లుజొచ్చె
యెల్ల జాలాడె
సక్కన్ని వాడమ్మ
సారంగధరుడు
ఇసుగు పొడుగమ్మలార
ఇతని పొమ్మనర
ఇసుగోరి మాటలు
వినచ్చేను
పొడుగోరిమాటలు
పొనరొచ్చిరేను
చిలుకనీళ్ళతోడి
జలకమాడేను
హంసలన్నము లొండె
ఆరగించేను

వెలదీ మంచములేయె
వెన్నెలబైట
పడతిపానుపులెయ్యో
పవ్వళించేను
ఆకుతేవె పోకతేవె
ఆడ కత్తెరతేవె
చూడ సున్నపురాయ
చుట్టియ్యో మడుపు
సన్నంగ సుట్టీయె
సగము కొరికీయె
యెంగిలెంగిలి శివుడ
మొగ్గుపట్టేవు
మనకేమి యెంగిలి
పుణ్య పురుషులకూ
విసన కర్రలతోను
విసరె ఒక జాము

ఇసిరిసిరి ఆ కాంత
స్తంభాని కొదిగ
కాంతకీ కన్నీళ్ళు
కాల్వలైపారె
వానసురవాలేదు
వరద యెక్కడిది ?

47)

అమ్మరో మనయింట్లో
వారువలెక్కడవే

నువుపోయి పరసింట్లో
పండుంటివి కోడక
ఆడునారి శోకంబు
అలువంటిదప్ప!

ఈ దంపు పదాలలో కనుపించని సందేశం, వినిపించని ధర్మ ప్రబోధం, అందులోనే వెటకారం, అంతలోనే వెక్కిరింత - అన్నీ కలుపుతే నవ్వులు - ఈ పాటలకు ధర్మకర్తలు ఆడవాళ్ళు - అందుకే ఒక విధంగా ఈ దంపు పదాలు స్త్రీల పాటల గుత్తిలోకే చెందవలసి వుంటుంది !!







# వినోదము - హాస్యము

# 12

పెళ్ళిసమయంలో, ఆటలసమయంలో, పండుగల సందర్భాలలో పాడే పాటలు వింటూంటే వినోదంతోపాటు—కడుపుబ్బ నవ్వు వస్తూంటుంది. వినోదం మానవునికి తప్పని సరి! ఉన్నవాళ్ళు సినిమాలూ, నాటకాలూ, పెద్ద ఎత్తున చూస్తే - సామాన్యుల వీధినాటకాలూ, తోలుబొమ్మలూ, గారడీలు, వీధి పగటివేషాలు, గంగిరెద్దుల గెంతులు, బుడబుక్కల ఆశీర్వచనాలు, జంగం, సాతాని పాటలు, పలుకులు, కాశీపట్నంచూడరబాబూ, మొదలగునవి చూసి - శ్రమ అనేది ఆ కాస్తసేపూమరచి అందులోనే అందం, ఆనందం, సృష్టించుకుని హాయిని అనుకుంటారు—

హాస్యపూరితం, వినోద ప్రధానం అయిన పాటలు, ప్రదర్శనాలు మన గ్రామసీమల్లో చాలా చూస్తూనే వుంటాము - వాటికి సంబంధించిన రకరకముల పాటలు చదువుదాం!

ఈ పాట హాస్యంకోసం మాత్రమే

పతివ్రతా ధర్మంబు
భక్తితో సలిపి
అతని చెంపామీద
అంటిస్తువుండు
మగనితో నీ కసలు
సరిపడకపోతే
పగదానివలె నీవు
పడబోవుతల్లీ
అత్తమామలు నీకు
ఆతక కాయుంటే
కొత్త ముగ్గులుపెట్టి
కృంగతీయితల్లి
సేవసేయించుకో
చిన్నత్తలా చేత
బావగారిని నీదు
బానిసగ చూడు
తోటికోడలిబిడ్డ
కూటికేడిస్తే

పీటకోడిచ్చుకో
ఒకబొట్టవమ్మ
అత్తవచ్చి నిన్ను
పనిచెయ్యమంటే
తలకి పట్టేసుకో
పడకేయవమ్మ

పెద్దలూ నినుచూసి
పిలువ వచ్చితే
పెద్దపెట్టున గోల
పెట్టి కేకేయవే
ఏకువలె మొత్తంగ
ఎరుగనట్టుండీ
మేకువలె బిగుసుకొని
మేలుకొనియుండు!

—ఈ నీతులుకనుక అమలులో పెడితే కాపురం చేయగలిగే మొగాడే వుండడు - అందుకే దీనిని హాస్యం అనుకుంటాం!

—పెళ్ళిళ్ళలో భోజనాలు జరిగే సమయంలో ఆడ పెళ్ళివారిని వెక్కిరిస్తూ - హాస్యంగా పాడే ఈ విందు పాట పరికించండి.

ఏలాగు భోంచేతుము
ఈ విందు మేమెలాగు
భోంచేతుము? ॥ఏ॥

విస్తర్లు వేశారు దోసెడేసి
వెడల్పు లేదండి హస్తంబు
కదులుటాకూ
జోరా! చోటులేదు ఏలాగు
భోంచేతుము . ॥ప॥

ముక్కబియ్యము వండిరీ
దానిలోకి ముద్దాపప్పే వేసిరీ
చెప్పుకుంటే సిగ్గౌతుంది
చెయ్యికడిగిన జిడ్డేలేదు ॥ప॥
కూరే వంకాయకూర
దానిలోకి మాడ్చే వచ్చడీలేదు
కలహాంబులే కానీ కారంబులు
గుచ్చెత్తిరి! ॥ప॥

పులిహోర పులుసాట
అబ్బ! చింతకాయ పులుసు
ఏకలహాంబు లేకామరి
కరివేపాకు గుచ్చెత్తిరి ॥ప॥

లడ్డు జిలేబీలు
లే పాకములో ముడ్డీ
తేలించాటా
నడ్డించే వదినగారికి
వడ్డాణ మూడిపోయె ॥ప॥

గ్రామాలలో యిప్పటికీ ఊరిమధ్యలో ఓ గెడ పాతి నాలుగు డబ్బులు అడుక్కోడానికి విద్యలు చూపే గారడీ వాళ్ళకూ, వాళ్ళు పాడేపాటలకూ ఏం కొదవలేదు - వారి నోటినుంచి వెలువడే పాటల సముదాయంలో యిదొకటి—

నా మగడు వాడకెళ్ళే
నాకు తోడు ఎవరులేరు
కోడి కూసే వేళదాకా
తోడు రారా వన్నెకాడా!
ఓ వన్నెకాడా!

చింతచెట్టూ చిగురూచూడు
చిన్నదానీ యీడూ చూడు
అద్దములో నీడా చూడూ
ఇద్దరికీ జోడూ చూడూరా!

నరసాపురము నుంచి
నలిగి నలిగి వొస్తుంటే
తాళ్ళపాలెము కాడ
తగిలిందీ జ్వరము!

చంకలోని నీళ్ళకడవ
నీడ చూచి నిండగట్టెరి
ఇద్దరికీ యిష్టమైతె
ఎవరిదేమె భయ్యామూ!

ఇంటి మొగుడికి వంటెద్దుబండీ
రంకు మొగుడికి రెండెడ్ల బండీ
మధ్య తిరిగే లాతగాడికి
దారలు త్రాగే మందుసీసా।

తల్లిపిల్ల నిడిసియాడు
సేసుకున్న భార్య నిడిసి
దొమ్మరదాని యెంటబోతే
డోలు మెడకు యేసెరా!

కల్లుత్రాగి ఒళ్ళుమరసీ
కైపుయెక్కి తిరుగబోతూ
పెళ్ళిచేసి వంపుతారూ
పెందలకడ సేలుకోరా!

నా మగడు వాడకెళ్ళె
నాకు తోడు ఎవరులేరు
కోడికూసె యేళదాకా
తోడురార వన్నెకాడా!

ఎన్ని వంకరలువున్నా అత్తారన్నప్పటికీ, కట్నంపేరు వినేసరికి లేచి నుంచుంటుందిట.

అల్లాడంటే వంకరతాడి
లేచీ నుంచుందోయ్
లేచీ నుంచుందోయ్
మూడూవంకల వంకరతాడి
సాగీ నుంచుందోయ్
సాగీ నుంచుందోయ్!

అత్తారంటె వంకరతాడికి
కట్నం కావాలోయ్
కట్నం కావాలోయ్
పిల్లా అంటే వంకరతాడికి
పెళ్ళి కావాలోయ్
పెళ్ళి కావాలోయ్!
పోనీ అంటే వంకరతాడికి
కట్నం కావాలోయ్
కట్నం కావాలోయ్!

పిల్లల మనస్సును అర్థం చేసుకోవడమే చాలాకష్టం- వారి పనులూ, పలుకులూ అన్నీ చిలిపితనం చిగురింతలు పెడ్తూనేవుంటాయి - పెద్దవారికి కోపంరావచ్చు, నాలుగు దెబ్బలు తినవలసివచ్చినా వారికి లెక్కలోకి రావు - ఏదో చిలిపితనంగా పాటలూ, పలుకులూ కుమ్మరిస్తూనే వుంటారు. ఒక్కప్పుడు నవ్వు వస్తుంది. మరొక్కప్పుడు కోపం బుస కక్కుతుంది. ఒక్కప్పుడు అబద్ధం అనిపిస్తుంది - ఆ పనులూ, ఆ పలుకులూ వింటే ముచ్చుకు!

మేష్టారు మేష్టారు
మెట్టోంకాయ్
మేష్టారి పెళ్ళాం
నీరోంకాయ్!

ఆడదికదూ మరి - కొంచం నిగారింపుగా వుండకపోతే ఎలాగ - అందుకే మేష్టారి పెళ్ళాన్ని నీరోంకాయతో సరి పోల్చాడు!

అరటాకుల కట్ట
పొయిలో పెట్ట
నిన్ను తగులపెట్ట
కోడిపుంజు రెట్ట
నీ నోట్లో పెట్ట!

ఈలాంటి చిలిపిపాటలు బాలసారస్వతంలో వేనకు వేలు!

తాతా పీతా
ముంజకాయ మూతా
కొడవలి పెట్టె కోత
నంజు నాచేత!
వాపు నీచేత!

అలాగే బ్రాహ్మడికి, కోమటికి సంబంధించింది!

బ్రాహ్మ'ప బ్రాహ్మడు
బెడ్డముక్క
బ్రాహ్మడి పెళ్ళాం
సుద్దముక్క!

కోమటి కోమటి
కొత్త బెల్లం
కొంటావా తింటావా
కొంటే డబ్బు ఖర్చు
తింటే కడుపునొప్పి!

— అందుకు కొనడు, తినడు - రెండూ కలిసివస్తాయి!

జామికాయ జామికాయ
సం తెప్పుడూ?
సన్యాసి గొల్లిగాడి
పెళ్ళెప్పుడూ?

ముసలాడి నడ్డిబాగ
ఒంగినప్పుడు
మూతిమీద మీసాలు
నెరిసినప్పుడు!

మాటుంటె పిల్లొస్తది
తాతా నీకు!

ముద్దాడితె కరుస్తుంది
తాతా నిన్ను
ఒంగుండి మొక్కవయ్య
తాతా నువ్వు!

బాగా చెప్పాడు-డబ్బుంటే ముసలాడికి పిల్ల రావడం సులువే. కానీ ముసలాడి ముద్దుకు కరుస్తుందిట పిల్ల - అదీ నిజమే మరి! ఈ సారస్వతంలో "సన్యాసిగాడు" - "గొల్లిగాడు" చాలాచోట్ల ప్రత్యక్షమౌతారు!

చింతకాయ దప్పళం
పప్పేసి కలుపటం
కంఠమెల్ల మెక్కటం
కడుపునొప్పి రావటం!

పై చరణం అక్షరాలా యదార్థం. అప్పనంగా వారి కింది కదా అని మెక్కితే - కడుపునొప్పికే దారి తీస్తుంది.

కోమటింటి కెళ్ళటం
శొంఠికొమ్ము తేవటం
అప్పుడే సానతీయటం
అరగతీసి నాకటం!

అలా కడుపునొప్పి రాగానే ఆలస్యం చేయకుండా శొంఠికొమ్ము అరగదీసి నాకమని ప్రథమచికిత్సా ప్రబోధం రెండో చరణంలో యిస్తున్నాడు - అయినా వెంటనే కడుపు నొప్పి తగ్గిందనుకోటం ఎలాగ?

చెంబు చేతబట్టటం
దొడ్డికెళ్ళి రావటం
మంచమెక్కి దొర్లటం
నిద్రపట్టి పోవటం

ఉదయాన్నే లేవటం
బడికి వెడలిపోవటం
జరిగిందంతా పంతులుకి
సాగతీసి చెప్పటం!

ఇష్టమైన భర్తకు - తదితర బంధువులకు తేడా చూపుతూంది ఒక పడుచు!

మొగుడంటె మొహమాటం
లేదూ నాకు

అత్తంటె అసయ్యం
అసలే నాకూ!

మొగుడుకైన మల్లెపువ్వుల
పక్కేస్తాను
అత్తకైన నూతిమీాద
పక్కేస్తాను!

మామకైతె నల్లేరు
పక్కేస్తాను
మొగుడుకంటె మంచి గంధం
బాగా తీస్తానూ!

ఒదినకంటె ఆవపిండి
బాగా రాస్తానూ
మరిదికైన దూలగుండ
బాగా పూస్తాను
వచ్చినవాళ్ళకు నల్లేరు
నలుగు పెడ్తాను!

హాస్యంకు సంబంధించిన పాటలలో - కొంచం మోటు సరసాలుకూడా ఎక్కువగానే వున్నాయి!

అత్త కొడుకొచ్చాడు
పంది రెయ్యండీ
పందిట్లో బావకీ
పీట వెయ్యండీ!

పీటముందర బుడ్డి
చెంబు పెట్టండీ
పీటాముందర కోడి
గుడ్డు పెట్టండీ!

కోడిగుడ్డుమీదా
కూరార బోయండి
బావకి బలుహారం
బాగా పెట్టండీ!

పళ్లేరు తెప్పించి
పక్క వెయ్యండి
నల్లేరు తెప్పించి
నలిచీ విడువండీ!

నల్లేరు చేతాను
నయము కాకుంటే
దూలగుండా తెచ్చి
దులిపి పంపండీ!

అత్తకొడకా నీకు
అందింద మరియాద?
నువ్వు తెచ్చిన కోక
మొలతిరుగ లేదు!

నువ్వు తెచ్చిన రైక
ముడికంద లేదూ!

మామకూతుర నువ్వు
చేసిన మేలూ!
దూలగుండా చేత
దులిపిండె చాలు!

ఈ పాట వినండి - పండుగ వచ్చింది ఎన్ని బియ్యం పోసి పిండివంటలు వండమంటావని అత్తగారిని కోడలు అడుగుతూంటే అత్తగారు సలహా యిస్తూంది ఎంత వింతగా వుందో!

కోడలు :- పండుగావొచ్చింది
ఓ అత్తగార!
పండుక్కి బియ్యము
ఎన్ని పోసేది?

అత్త :- వెయ్యవే నిచ్చెనా
తియ్యవే గాది
పొయ్యవే తలగీచి
తవ్వెడు బియ్యం!
ఆ బియ్యం నానేసి
పిండిగా దంచి
పిండివంటలు చేసి
అరసెల్లు వండు!
ఇరుగుపొరుగూవారి
కింతింత పెట్టు

ఇంట్లోని పిల్లలకు
కసరకా పెట్టు!
మాపటికి మామకు
మారుమూ తెట్టు
మరునాటి చల్లులకు
మద్దులకు పెట్టు
మనయింటి పాలేర్లు
మురియంగ పెట్టు!
మనయింటి మరదలకు
మనసుతో పెట్టు!

తవ్వెడుబియ్యం పిండివంటతో ఎంతమందికి పెట్టగల అత్తగారో చూడండి!

పల్లెలలో డప్పు వాయించుకుంటూ, తాడెట్టి కొట్టుకుంటూ – ఢమరుకం వాయించుతూ, పంబ మ్రోగిస్తూ, శంఖం ఊదుతూ, సన్నాయి నాలాపిస్తూ, కోతిని ఆడిస్తూ, పాలకీని మొగ్గలేయిస్తూ, గెంతుతూ, పాడుతూ రకరకాల వినోద ప్రదర్శకులు వస్తూంటారు – హాస్యం, వినోదం రెండూ అక్కడ మనకు ప్రత్యక్షం అవుతాయి. అలాటివి చూద్దాం –

ఈ పాట పంబ వాయిద్యంతో పాడేది.

పార్వతీ నోయించే
పంబ నాదంబు!
పంబ పుట్టించినాడు
రొంబ పుట్టింది!

ఆ రొంబకోసం దేవతలు గిజ గిజ గింజుకున్నారు!

ఆ పంబవోయించె
అంబరీసుండు!
ఆ పంబ వోయించె
పరచూరాముండు!
ఆ పంబ వోయించె
పద్దనాబుండు!

పార్వతీ ఆ పంబ
పరమేసుండోయించె!
పరవతా లేడెక్క
బద్దలైపోతుంటె
ఆ బద్దలైపోతుంటే!

అగ్గిదేముడి యిల్లు
బగ్గూమన్నాదా!
అగ్గిదేముడియిల్లు
బగ్గూమన్నాదా
అగ్గిదేముడియిల్లు
బగ్గుబగ్గుమంటేను!
ఆ బగ్గు బగ్గు మంటేను!
నీలాకంఠుని మేడ
కూలీ పోనాదా?
ఆ నీలకంఠుని మేడ

కూలీ పోతుంటేను
కుమారసోమకుడు
పుట్టుకొచ్చాడా ?

ఇనప్పంబ కాదు, ఇత్తడిపంబ కాదు, కంచుపంబ కాదు, కరివేణిపంబ కాదు – మరేం పంబయ్యా – తోలు పంబ !

దేవతాలందరును
తోలు పంబట్టుకొని
ఆ తోలూ పంబట్టుకొని
తో వేసినారా !

కాశీకావడి అంటూ కాశీ పటాలనూ – లోకాలను ఫలితాలను చూపిస్తూ వస్తుంటారు– ఈ ప్రదర్శన యిద్దరిపని!

కాశీకి పోయాను
రామాహరీ
కాశి తీర్థమూ తెచ్చాను
రామాహరీ!

కాశీకి పోలేదు
రామాహరీ – ఫ్రూరి
కాలువలొ నీళ్ళండి
రామాహరీ !

కాశీకి పోయాను
రామాహరీ

కాశీ విభూతి తెచ్చాను
రామాహరీ !

కాశీకి పోలేదు
రామాహరీ - వీడి
కాష్ఠంబులో బూడిదండి
రామాహరీ !

పంచేంద్రియములా
రామాహరీ - నేను
బంధించియున్నాను
రామాహరీ !

కొంచమూనమ్మినా
రామాహరీ
కొంపముంచివేస్తాడండి
రామాహరీ !

ఆలుబిడ్డలు లేరు
రామాహరీ - నేను
ఆత్మయోగీనండి
రామాహరీ !

ఆలుబిడ్డాల్లెల్ల
రామాహరీ - వీని
కాయురనున్నారు
రామాహరీ !

ఇతగాడి హడావిడి జోరుగా వుంటుంది చూసే వా ళ్ళైతే మూగేజనం చాలామంది. "పైస తమాషా" పాటయిది. నాలుగుకోళ్లూ పైసపెట్టె లోపల బొమ్మలూ, చూడడానికి అద్దం, ప్రదర్శకుని పాట, అందుకుతగ్గ తాళం - వినండి -

పైస తమాషా
చూడర బాబూ
ఏమి లాహిరిగా
నున్నది చూడు
ఏమి తమాషా
లున్నాయి చూడు
కాశీపట్నం
చూడర బాబూ!
చూడర బాబూ
అదిగదిగదిగో
కాశీపట్నం
చూడర బాబూ!!

గలగలలాడే
గంగానదిని
కన్నులకింపుగ
చూడర బాబూ
హరిశ్చంద్రుడు

సత్యంకోసం
ఆలుబిడ్డలను
అమ్మిన చోటు?
అదిగో అదిగో
విశ్వేశ్వరుడు
హారహారమను
భ క్తులచూడు ?
చూచి మోక్షం
పొందరబాబూ
కాశీపట్నం
చూడర బాబూ ! ॥పైస॥

హస్తినాపురీ
పట్నంచూడు
పాండవు లేలినా
పట్నంచూడు !
తాజమహాలును
చూడర బాబు
విజయనగర
రాయలను చూడు
బెజవాడ
దుర్గమ్మను చూడు
భద్రాద్రి రామ

దాసును చూడు
కన్నుల పండుగ
చూడర బాబు
చూచి జ్ఞానం
అందర బాబూ !! ॥పైస॥

దేశి సారస్వతంలో కురవంజి పాత్ర ప్రసిద్ధమైనది. పలుకుబడి గలిగిన జ్యోతిష్కురాలు - సోదె చెప్పడంలో అందెవేసిన ఘటం - ముక్కుకు రింగు, చెవులకు లోలకులు, రవికలేని బట్టకట్టు, కాళ్ళకు కడియాలు, చేతులకు గాజులు, చేతిలో వెండికట్లచిన్నకర్ర. బుట్టతో ప్రత్యక్షం "సోదోయమ్మ సోదె" అంటూ-

ఆ వో యమ్మ
బాగ్గెంగల సేయి!
దానధర్మపు సేయి
దండిగల సేయి

ఒకటంటే ఒకటి
రెండంటే రెండు
ఒకటీరెండూ కలిసి
సంగమించేనూ

మంధారలాయమ్మ
మల్లెలాతావి!
అందాల బాలొస్తె
సందడే లేద!

ఒచ్చి వుండారమ్మ
ఊరు చివరాకి!
శివరాత్రి శివుడికీ
జపము సేసూకో!

కొడుకు పుట్టాలాని
కోరుకో తల్లి!
ఆదివారము నాడు
అమవాశనాడు!

ఆపోశనమ్ముతో అణగిమణగుండు
కులము నిలిపేటంటి
కొడుకు గలిగేడు
కులము, బలముగలిగి

వర్ధిల్లుతల్లి

కోయవాళ్లు మొగవారుకూడా వేసవిదినాలలో గ్రామాలలో తిరుగుతూ సాముద్రికం చెబుతూంటారు. గోచీగుడ్డ పెట్టుకుని, మెడనిండా కర్రపూసల దండలు, జబ్బలకు పేముతో అలంకరణలు, చెవులకు వెండి రింగులు, కాళ్ళకూ అలంకరణలు, భుజాన అంబులపొది, చేతిలో బాణంతో యింటింటికీ వస్తూ సాముద్రికం చెబుతారు.

సేయినూస్తా రా పిల్లా
సేయిసూస్తా రా!

50)

సేతిలో బంగారు శేఖున్నది
కుళ్ళాయి కుచ్చున్నాది
కూచుండి తింటావుపిల్ల!
బాలెంత రూపుంది
బాధపడతావు పిల్ల ॥సేయి॥

ఉట్టిముంతకళ్ళువుంది
ఉసాకుగుండాది
తాగు తాగు పిల్లా
తమ్మలు తింటావుపిల్ల ॥సేయి॥

ఈరకం కోయమామలేపాడే పాటలలో మరోటి–

సీలాటి కోయమామ
మాలాంటి దేశమొస్తె
ఉట్టిమీాదపెట్టి
ఊరేగించెదము
రాయి రాయి కాగితం!

వాడీడి పుణ్యాన
అబ్బాయి పుడితేను
కోయరాజు పేరు పెట్టుకోండి
రాయిరాయి కాగితం!

పడీలు సీడీలు
ఎక్కువై కొండను
ఎనక సెక్కరాలు

వెంటబడ్డాయి
రాయిరాయి కాగితం!

దమ్మిడీ కూలోళ్లు
దగుల్బాజీ గుత్తోళ్లు
గొప్పకు రమ్మంటేను
రాయి రాయి కాగితం!

కొప్పులు దిప్పేను
ఇంటిలో తలదువ్వి
ఈధిలో కోస్తేను
బేడాకు దాని కొప్పు బేరామైంది!
రాయి రాయి కాగితం।

పైకి బిగించిగట్టిన బిళ్ళాపంచెకట్టు ముఖాన తిరుచూర్ణపు నామం, జుట్టుముడి కలిగిన కొంతమందిచుట్టూ తిరుగుతూ మధ్యలో ఎన్నో ప్రమిదలతో జ్యోతులు కలిగిన దీపపుశయ్యా ఒకటి పెట్టి పాడే ఏడుకొండలివానికి సంబంధించిన ఈ భక్తి గీతం వినండి!

"అయ్యా శావాలవాడా" అని ఒకరు కథగా చెబుతూంటె మిగిలినవారు వింతగా "గోవింద గోవింద" అని అంటూ బహు ఉషారుగా సాగుతుంది.

అయ్యా శావాలవాడా
గోవింద గోవింద।
తిరుపతి మొక్కులవాడా
గోవింద గోవింద!

నడ్డీకాసులవాడా
గోవింద గోవింద!
గాలిపీడా ధూళిపీడా
గోవిం దగోవింద !
వేపాచెట్టూమీాద
గోవింద గోవింద!
కన్నెపిల్లా కోరి
గోవింద గోవింద!
నీమీాద ప్రేమాతోడి
గోవింద గోవింద!
సిలువ్వాగుడ్లేసింది
గోవింద గోవింద!
ఆశరమ్మ బలంగాదు
గోవింద గోవింద!
గొట్టాలమ్మ గుణంకాదు
గోవింద గోవింద!
అద్దాకేతిరికాడ
గోవింద గోవింద!
సద్దూ మద్దూలేక
గోవింద గోవింద!
ఆరుపలాలావు నెయ్యా
గోవింద గోవింద!

నిలువ్రా గోరిచ్చ్నో
గోవింద గోవింద!
అయ్యా శావాలా వాడా
గోవింద గోవింద!

ఈ "గోవింద గోవింద" పాట చాలాచోట్ల వినేదే?

పాతాని జియ్యరులు తెల్లవారు సమయమున లేచి గ్రామవీథులలో చల్లగాలి పిల్ల తెమ్మెరలు వీస్తూంటే పాడే మేలుకొలుపులూ - వారి వేషం ఎర్రని అంచులతో కూడిన తెల్లపంచెలు, నామాలు, మొలకు బిగించిన ఎర్రంచు ఖండువా - ఒంటినిండా నామాల ముద్రలు, చేతిలో చిరు తలు, తలమీాద రాగిచెంబూ - కాలికి గజ్జెలు, ఆ వేషం - ఆ కీవి - ఆ పాట - చూడాలి - వినాలి?

అమ్మా సీతమ్మా మాయమ్మ
ముద్దుల గుమ్మా
అమ్మ బంగరు బొమ్మలెమ్మ? ॥అమ్మ॥

అమ్మరో యిమ్మాగ
అరుణోదయంబాయె
అమ్మాల కన్నమ్మ లెమ్మా ॥అమ్మా॥

భక్తులందరు లేచి
ప్రార్థించుచున్నారు
భక్తా పరాధీన లెమ్మా ॥అమ్మా॥

భక్తాశిఖామణి
పావణి అనుదెంచె
ముక్తిప్రదాయిని లెమ్మా ॥అమ్మా॥

బ్రహ్మాండ మలరంగ
బ్రహ్మాది సురులెల్ల
ప్రార్థించుచున్నారు లెమ్మా ॥అమ్మా॥

బ్రహ్మ రుద్రాదులు
ప్రస్తుతిసేయగ
బ్రహ్మ స్వరూపిణి లెమ్మా ॥అమ్మా॥

ప్రతి గ్రామానికి ఒక్కొక్క దేవత ప్రత్యేక ఆరాధన ఆధిపత్యం వహించి వుంటుంది - ఒక ఊరివారికి ముత్యాలమ్మ, మరో ఊరువారికి పోలేరమ్మ యిలా అనేక పేర్లతో దేవతలుంటాయి. వాటికి జాతరులు ప్రతి సంవత్సరం జరుపుతుంటారు - బలులు యివ్వడం, ఊరేగించడం, సేవలు చెయ్యడం - యిదే సమయంలో ఆ దేవత ఒక్కొక్కరికి పూనడం జరుగుతూంటుంది - అటువంటి పూనకంకు సంబంధించినదే ఈ పాట—

నరుడ, నరుడ. నరుడో౦
నో౦, నరుడా...
ఏటితల్లి
ఏటపకాధం చేశాం?
ఏందో లెతల్లి
యీా కోపము?

## వినోదము - హాస్యము

కోకలిచ్చినావా
నరుడా
కోరిక తీర్చావా
నరుడా
కోళ్లు కోసినావా
నరుడా
గారెలిచ్చినావా
నరుడా
సున్న మేసినావా
నరుడా
కుంకమిచ్చినావా
నరుడా
ఓ నరుడా!

నేదు తల్లి! నేదు!! యిప్పుడిత్తాం సెప్పు??

గనమైన భాగోతం
గట్టిగా కట్టించు
సద్దినైవేద్యాలూ
ముప్పూటా బెట్టించు
ముంగిటా దివ్వెలూ
ముచ్చటగ వెలిగించు
పందిట్లో బాజాలు
బాగుగా వాయించు
నేసాకోనసారాలతో

ఎనుబోతూ ప్రాజించు
పసుపు కుంకుమతోటి
నలుగేమో పెట్టించు
గడపా గడపాలో నాకు

గండాలు మ్రొక్కూలు
బొండాపు కాయలు
మండిగల పారాణి
దండీగ పెట్టించు
నరుడ! నరుడ!! నరుడోం!
ఓం—నరుడా!!

ఏటికూళ్ళా తల్లి
అంకమ్మ తల్లి
పండుగలు సేత్తాము
పబ్బాలు సేత్తాము
జనమంత మీా ఓళ్ళు
కాపాడుతల్లి!

నచ్చినావుర నరుడా
మెచ్చినానుర నేను!

ఊకుసుట్టోర తిరిగి
ఊళ్ళో నా కాలెడతా
మిమ్మల్ని దీవిస్తా
మాటా తప్పక నరుడ
మంచీదానను కాను

నరుడ! నరుడ!! నరుడో౯ం!!!

ఓ - నరుడా!

దేముడికి దడవకపోయినా, న్యాయానికీ, ధర్మానికీ, దడవకపోయినా యిటువంటి వార్నింగ్‌లు యివ్వగలిగిన దేవతల కేమాత్రం దడవక మానదు జనం!

పంటలు పండి యిళ్ళకు వచ్చేకాలం అది. నాలుగు డబ్బులు రైతురాజుల చేతుల్లో గలగలలాడే రోజులు అవి. దానాలూ, ధర్మాలు జోరుగా చేయించే సంక్రాంతి పుణ్య దినాలు అవి - అటువంటి మంచి సమయంలో గంగిరెద్దుల ఆటలు, సన్నాయి మేళాలూ చాలా జోరుగా వుంటాయి. ఈ సంక్రాంతి సమయంలో బసవన్న, వెంకన్నలదే రాజ్యం!

చక్కని రంగురంగుల చీరలతో, ఖండువాలతో, గంగిరెద్దును అలంకరించుకుని, కొమ్ములకు రంగులు తీర్చిదిద్ది తను నోటిలో సన్నాయి, మెడలో డోలు, చేతిలో పళ్ళెం మ్రోగించుతూ, ఎర్రని తలపాగా, నల్లని కోటు, పంచతో - బసవయ్య విద్యలు చేయిస్తూ - ఆశీర్వదిస్తూ గడవగడవకూ వస్తాడు. అదిగో వినండి - ఆ పాట!

డూ డూ డూ డూ

యెంకన్నా

డూ డూ డూ డూ

బసవన్నా!

అమ్మగారికీ

దండంపెట్టు

అయ్యాగారికీ
దండంపెట్టు!

పెబువుగారికీ
దండంపెట్టు
బాబుగారికి
దండంపెట్టు!

సీతమ్మగోరికి
దండాలెట్టు
రామయ్యగోరికి
దండాలెట్టు!

పిల్ల పాపలు
చల్లగ వుండీ
పైరు పంటలు
గాదులు నిండీ!

పచ్చగాను
పది కాలాలుందీ
దానం ధర్మం
చేత్తావుండీ!

యెండి గిట్టలు
యిస్తారంట
పైడి కొమ్ములు
కడతారంట!

పట్టు శాలువ
పైన యేసుకు
పదిమందిలో
పేరు సెప్పారు!

ఇంటి కొక్కడు
ఈరభద్రుడు
పంచ కొక్కడు
బసవేశ్వరుడు!

చల్లగ వెలసి
పెబువులు వుంటె
కళ్ళ వేడుకలు
మన కంతాను!

డూ డూ డూ డూ
యెంకన్నా
డూ డూ డూ డూ
బసవన్నా!

గంగిరెద్దు పాట, ఆట, మాట, దృశ్యం ఎంత ముచ్చటైనదో! వింత అనేది, వినోదం అనేది, హాస్యం అనేవి - ఈ మూడూ చాలా దగ్గరగానే కనుపిస్తాయి. పిల్లవాడు నడుస్తూ క్రిందపడితే వినోదంగా ముద్దెట్టుకుంటాం. పెద్దవాడు నడుస్తూ క్రిందబడితే వింతగా చూస్తాం.

కుర్రడి దగ్గరినుంచి పెద్దవాడిదాకా నమ్మకాలూ, శకునాలూ చాలా ముఖ్యమైనవి - ఎదుటివ్యక్తి మనసుకు

నొప్పి అనుపించినా – తన శకున నమ్మకం విడువని వింత మనస్తత్వం మనది. సాటివ్యక్తికి, ఎదురొస్తే ప్రయాణం సాగించము.

అటువంటి శకునశాస్త్రమునకు సంబంధించి కాకిని అడిగే ప్రశ్నయే ఈ పాట.

కాకీ కాకీ కలువల కాకీ
కొమ్మామీదా గుమ్మాకాకీ
ఇంటిమీద దంటూకాకీ
పెంటమీద నలుపు కాకీ

చెట్టుమీద చెవిటికాకీ
అంటూ సొంటూ అంగటికాకీ
పంజూ పంజానవ్వే కాకీ
సాయం సంధ్యలనవ్వును కాకీ
వేకసా లూ విప్పేకాకీ
చుట్టాలూ, పక్కాలూ
ఒస్తారంటే!
మా బావ లొస్తారంటే!

మా వాళ్ళు ఒస్తారంటే
మా యింటిమగవా రొస్తారంటే
అరిదేశంటే, పరదేశంటే
పన్నంటే, బందంటే
పాడీ పశువంటే
మంద గొడ్డంటే

సొమ్ములంటే, సొరుగంటే
పాప నీపావ లొస్తారంటు
కాకీ - ఎగిరి గంతెయ్ ,
కాకీ _ ఎగిరి గంతెయ్!!

ఇలా పైన చెప్పినవన్నీ వల్లించి, ఆఖరున కాకిని గంతెయ్యమని అడుగుతారు. గంతేసిందా - తను అనుకున్నట్లు జరుగుతుందని ఒక నమ్మకం.

రెండు త్రాచులు కలిసివుండగా చూస్తే గొప్ప అదృష్టమని చెబుతుంటారు. ఒక పాముని చూసీ చూడడంతోనే కళ్లు మూసుకొనే మనకు రెండు పాములజంట కనుపడడం కల్ల!

ఈ పాములకు సంబంధించిన జాతి ఒకటి వుంది. రకరకముల నాగులను బుట్టల్లో పెట్టుకుని నాగస్వరం ఊదుతూ బిచ్చం అడుక్కోవడం, మెడమీద పాకించుకొంటూ డబ్బులు సంపాదించడం, గారడీల్లో వింత వింతగా పడగ విప్పించి, ఆడించి, వినోదం చూపిస్తూండడం పరిపాటిఅయిన విషయమే. తెలుగు జాతికీ, నాగుమయ్యకూ చిరకాల సంబంధం, బంధుత్వం వున్నట్లుగా మనకు గోచరిస్తుంది - "నాగయ్య, నాగేశం నాగులు, నాగేశ్వరావు, నాగమ్మ, నాగి, నాగలక్ష్మి. సుబ్రహ్మణ్యం, సుబ్బారాయుడు మొదలగునవన్నీ, ఈ నాగుమయ్యమీద అభిమానంతో, భక్తితో జ్ఞాపకచిహ్నంగా ధరించుకొన్నవే. అదీకాకు, మన ప్రాచీన శిల్ప సముదాయంలోనూ గుడి, గోపురాలలోనూ, నాగచిహ్నాలు చెక్కడం ఒక ఆచారంగా కనుపించడంద్వారా కూడా-నాగు

మయ్యకు తెలుగయ్యకు దగ్గర సంబంధం చాలా వున్నట్లు కనుపిస్తుంది.

ఈ పాటల్లో వింత ఏమిటంటే – భయం గొలిపే నాగులను నిద్రబుచ్చడం, నీతులు గరపడం చూస్తాంటే వింతగానే అగుపిస్తుంది – అటువంటి పాటలలో కొన్ని చూదాం.

(1) నాగుమయ్యకు బుద్ధులు గరపడం–

పుట్టలో నాగన్న
బూచి నాగన్న
ఎండలో పడుకోకు
వెర్రి నాగన్న!

కలవారు యిళ్ళలో
గర్వంబువారు
కాలాపి జల్లేరు
కాళ్ళా జల్లేరు!

ఎంగిళ్లు యేసేసి
భంగ పుస్తారు
అటువెళ్ళి కూకోకు
చాకి రేవులకు!

చాకి రేవులోన
చేరి పడుకుంటె
సాలిపురుగని నిన్ను
సంపేరు వారు!

అటు వెళ్ళకు నాగన్న
చెరుకు తోటలకు
చెరుకు తోటల్లోన
చేరి పడుకుంటె!

నల్లచెరుకని నిన్ను
నరికేరు వారు!

అస్తమానం — రాత్రనక, పొగలనక, చేలంటా, దొడ్లంటా, తోటలంటా, తిరిగే రైతు - ఎక్కడ పురుగూ పుట్రా వుంటుందోనని భయపడేరైతే - నాగుమయ్యకు ఇటు వంటి సందేశం, సలహా యిస్తూంటే వింతకాదూ!

ఒక వేళ మనం కొడతామని బెదిరేకరిచిందో, కరవాలనో కాటేసిందో నాగుమయ్య కాటేస్తే అప్పుడూ మంత్రముతో, ప్రార్థనతో విషం పోగొట్టుకోడం చూడండి!

నాగా దిగరా
నా తండ్రి దిగరా
నాగన్న దిగరా
నాగా దిగరా!

దిగుదిగూ నాగన్న
దివ్యసుందర నాగ
నల్లచుక్కల నాగా
నా ముద్దునాగా!

నవనవ లాడేటి
నల్లచుక్కల నాగ

తళతళా లాడేటి
తెల్లచుక్కల నాగ!
పసిమి పొరలుగల
పచ్చన్ని నాగా!
కొండ చిలువలకే
కోర్కెతో రాజు
పరుగుడు పాములకు
ప్రభు వైరంజల్లి
మొగలి చెట్లపైన
మసలి తిరుగులాడి
పాలు ఆరగించు
పచ్చన్ని నాగా!
పక్కాను పదిహేను
మచ్చాలు గలవాడ
గురివింద పూసల
కళ్ళయినకలవాడ
పరికి ముళ్ళవంటి
పళ్ళుగలవాడ
నాగా దిగరా
నాగన్నా దిగరా!

పై పాటను చదువుతూంటే పాములలో రకాలు, వాటి ఆకారాలు ప్రత్యక్షమౌతున్నాయి. అవి ఎక్కడుంటాయో కూడా వినండి.

ఇల్లలికి ముగ్గెట్టి
మల్లెలు విరజల్లి
మల్లెల్లో వుండేటి
ఓ మల్లినాగ!

పిల్లలందరుగూడి
పుల్లలేరాబోతె
పుల్లల్లో వుండేటి
ఓ పుల్లనాగ!

గొల్లభామలుకూడి
చల్లలు చెయ్యంగ
చల్లకుండక్రింద
చల్లనీ నాగయ్య!

ఇవతలా యిదికొండ
అవతలా అదికొండ
నట్టనడుమనుకొండ
నల్లత్రాచయ్య!

నాగులచవితి పండుగ మనకందరకూ తెలిసిందే-నాగపూజకు సంబంధించినదే ఈ పాట-పుట్టల్లో పాలోయడం, తొర్రలో పాలోయడం, పుట్టలకు పూజలుచేసి, పాలోసి, గంధంపూసి, బొట్టెట్టి, దండాలెట్టడం నాగులచవితికి జరిగే విధానం - నాడు నాగుమయ్యను కొలిచి, పూజించి,

"నీ జోలికిరాము నాగుమయ్యా యిది యిస్తా అది యిస్తాం" అంటూ పాడే ఈ పాట పరికించండి—

పడగలెత్తకు పాము
పగవారము కాము
పడగెత్తి దూసింది
నాలుకలు రెండూ
నాలుకలు దూయకే
నీవారము నాగూ
మంచి నాగూవైతే
పంచెలెట్టేము
కోడె నాగూవైతె
కోకలెట్టేమూ!
పడగ లెత్తకు నాగు
పగవారము కాము
మాచేను పండితే
చలిమిడేసేము!
మా నువ్వు పండితే
చిమ్మిలేసేము
నాలుకలు దయ్యకే
నీవారము నాగు
మాపత్తి పండితే
పంచె లెట్టేము!
మాయావు లీనితే
పాలుపోసేము

పడగలెత్తకు నాగు
పగవారముకాము
నీపూజ చేసేము
నీకు మ్రొక్కేము!

అంటే ఈ నాగమయ్య పాటలో ఒక్కసారి నవ్వొ హాస్యం కనుపించకపోయినా నాగుకు బుద్ధులు చెప్పే పద్ధతి బట్టలు యిస్తామన్న విన్నపాలుచూస్తే వింతేమరి!

నాగులచవితికి నాగన్న
స్నానం సంధ్యల నాగన్న
పూలుపడగలు నాగన్న
మడిబట్టలతో నాగన్న

చిమ్మిలి చలిమిడి నాగన్న
పాలూ పండ్లూ నాగన్న
దివిటీ తేజున నాగన్న
ఉపవశించుచూ నాగన్న

ఉద్ధాపించుచు నాగన్న
ఊరేగొస్తాం నాగన్న
పుట్టకు వస్తాం నాగన్న
పూజలు గొనరా నాగన్న!

పళ్లు, కాయలు అమ్ముకొని తన పొట్టకు తాను సంపాదించుకోవాలనుకొనే పడుచులు చాలామంది కనుపిస్తుంటారు! బీదతనం, అలుసుతనం, ఘూర్వనం అమాయ

కత్తిపీటతో నెత్తిన బుట్టలూ, తట్టలూ పెట్టుకుని 'పళ్ళో'యని అరచుకొంటూ తిరిగే వీరిలోనూ చిలిపితనంగా కొంటెగా కావాలని పిలిచే కుర్రకాయలోనూ కనుపించే హాస్యం, వింత భావాలు, పద చమత్కారాలు వినడానికి శృంగారం, చూడడానికి వింతగానూ ఉంటాయి. అటువంటి పాట మచ్చుకు ఒక్కటి.

"గరువుకు" గోంగూరకు ఒంటరిగా వెళ్ళిన పడుచూ, పుల్లకోసం "కూపు"కు వెళ్ళిన పడుచూ, చేనుగట్టుకు పచ్చగడ్డిపరకలకు వెళ్ళే పడుచూ — ఈ పళ్ళమ్మి కోవలోకే వస్తారు. శృంగార సాహిత్యంలో వీరిది ప్రత్యేక తాంబూలం.

పళ్ళమ్మ వచ్చేను పళ్ళో
మంచి పరువుకొచ్చిన
జామిపళ్ళో! ||ప||

మగ:— పసుపైన పళ్ళైతే
కొంటాను నేను
పట్టినాక్కి సూసుకుంటాను;

ఆడది:— కొంగుసాటున కప్పివుంచాను
నేను సేతబట్టి సూడనివ్వానూ
పళ్ళు కావలెనన్న
కళ్ళతోడనె సూసి
కాళ్ళదగ్గరకొచ్చి
కానిస్తె రెండిస్త! ||ప||

మగ:- పసునైన పళ్ళెత్తే
కొంటాను నేను
పట్టి నొక్కి-నూసుకుంటాను
అరువు బేరము కాదు
అమ్మోర్నరి కేట్టాల
ఉరవజూడగనిమ్మ
ఉండు పారొస్తాను:

ఆడది:- పళ్ళమ్మవచ్చేను పళ్లూ
పళ్ళు కావలెనన్న
కళ్ళతో డసె నూసి
కాళ్ళదగ్గరకొచ్చి
కానిస్తె రెండిస్త : ||ప||

ఈ 'పళ్ళు' అమ్మి పలుకులూ, కొనే 'అబ్బి' పలుకుల కులుకులూ మధ్య భావాన్ని పరమాన్నంగా భావించి జుర్రుకోవాలెగాని యిక్కడ చెప్పడం అవసరం వుండదు.

మరొక్క పాటతో ముందుకు వెడదాము - ఈ చెల్ మోహనరంగ పాట శృంగారపరమైనదే అయినా — ఆ మాటల నీటూ, ఆ కోర్కెల గోటూ కలిపితే వినోదమూ, హాశ్యమూకూడా మనకు వినిపించడం జరుగుతుంది - వినండి.

చెల్ మోహవరంగ పాట వినని వారు ఎవరూ వుండరు- వున్నారంటే ఆశ్చర్యమే! భోగం మేళాల వారినించి - పడక గదిలోదాకా ఈ పాటకు బంధువులే! మొత్తంమీద ఈ పాట చాలా బాగుంటుంది కదూ!

* రంగారు చెట్టుమీదా
బంగారు గోరువంక
వినిపించేకతలు
విందము పదరా!
చెల్ మోహనరంగా
చివురాకూ పళ్ళెరమూలో
మివుల పండిన పండ్లు
సవరించీ మనము
ఆరగిందము పదరా
చెల్ మోహనరంగా!
బొగడపూవులు గోసి
పొందుగనే దండగుచ్చి
దండ నీ మెడకు
వేసుకు పోరా
చెల్ మోహనరంగా!
చిరి మంచుకోటలోన
గురుతైన మంచెమీద
సిరిపాట మనసునిండ
పాడుదను పదరా
చెల్ మోహనరంగా!
చెట్టు తుమ్మెదలుగూడి
గట్టి బాజాలు పాడి

---

* ఈ చెల్ మోహనపదం - రెండు, మూడు సేకరణలను ఆధారం చేసుకుని అందినంతమట్టుకు కొంచం అటూ యిటూగా యివ్వడమైనది.

అటుటు తిరుగుతు
కదులుచున్నవి కదరా
చెల్ మోహనరంగా!

కొనమావి కొమ్మలందు
గురుతైన రామచిలుక
దనములు అందిస్తు
పిలుచుచున్నాది గదరా
చెల్ మోహనరంగా!

గుబురైన చింతమీద
కబురు తెచ్చేటి చిలుక
సొగసైన గూడుకట్టెను కదరా
చెల్ మోహనరంగా!
నీవు పోయేదారిలోను
నిలువు టద్దములలోన
నీదు రూపు నిలచిపోయెను గదరా
చెల్ మోహనరంగా!

చిరునవ్వు నవ్వితేను
కురియు పువ్వులవాన
చిరునవ్వా ఆశించి
కోరియుంటిని గదరా
చెల్ మోహనరంగా!

శనివారం సంతలోన
వనిబూని సంతలోన

నిను వెదకి పరువెత్తి
పట్టుకొంటిని గదరా
చెల్ మోహానరంగా!

బొండుమల్లె పూలదండ
నిండుగా నీ మెడను వేసి
నిండారా కౌగలింతును రారా
చెల్ మోహానరంగా!

ఇక్కడ మనకు జ్ఞాపకం వచ్చే పాటలు చాలా వున్నాయి. జావళీలు, శృంగార భక్తి కీర్తనలు ఆ కోవలోకే చెందేదే ఈ "చెల్ మోహానరంగని పదాలు" - పోతే అవి భక్తితో రంగరించిన శృంగార "మార్గ" కవితలు అయితే, ప్రేమతో కలిపి పలకరించే "దేశి" కవితలు యివి!

మువ్వగోపాలుని పిలుస్తూ పాడే మువ్వగోపాల కీర్తనలలో అడుగడుగునా కనిపించే శృంగారం వింటే ఈ జానపద శృంగారం చాలా తేలికగానే కనుపిస్తుంది!

చెల్ మోహానరంగా పదమే యింకా వుంది-

"చీకటి రాత్రినాడు
కోక నల్లది కట్టుకోని
చీకట్లో కలిసిపోతిని గదరా
చెల్ మోహానరంగా!

ఊడలా మర్రి క్రిందా
మోడైన తుమ్మ చూసి
చీకట్లో ధడుసుకొంటిని గదరా
చెల్ మోహానరంగా!

పాపం! ఎంత భయమో చూడండి – ఏదో ఒక నిర్ణీత ప్రదేశం ప్రేమికులను కొండగుర్తు. అలాగే ఊడల మర్రి క్రింద చీకటివేళ కలుసుకుందాం అనుకున్నారు. మోహన రంగడు రావడం ఆలస్యమైంది. ప్రియుడుకోసం ప్రియురాలు ఇలా ఒంటరిగా ఎదురుతెన్నులు కాయడం అంత శ్రమ మరొకటి లేదనే చెప్పాలి.

గాలి వీస్తే ఆశ – పక్షి రెక్కాడిస్తే అనుమానం; కొమ్మ కదులుతే ఒళ్లు జల్లు, నీడ ఆనితే ఒళ్ళంతా చెమట– మనసంతా గల్లంతు – ఎవరో? ఏమో? అన్న భీతి – అనుమానం – ఈమెకూ ఇటువంటి పరీక్షే ఎదురైంది. ఓ తుమ్మ మోడు నీడనుచూసి దడుసుకొందిట – మరి చెల్ మోహన రంగడు దిష్టి తీయించాడో లేదో?

"గట్టుదాటి పుట్టదాటి
ఘనమైన అడవిదాటి
అన్నిదాటి అరసి తరలితిగదరా
చెల్ మోహనరంగా!

ఒంటిగా పోవద్దు వద్దని
పైటబట్టి లాగగానే
పైటజారి సిగ్గుపడితిని గదరా
చెల్ మోహనరంగా!

పొడుపు కొండలమీద
నిండైన చందమామ

నీలాగే నిలబడెనుగదరా
చెల్ మోహానరంగా!

నే నొంటిగాను పోతే
నీవు నావెంట వస్తే
నీడజూసి జడుసుకొంటినిగదరా
చెల్ మోహానరంగా!

ఈ పాటల్లో ఎంత ధైర్యం పనులలో కనుపిస్తుందో - అంత అనుమానం, భయం, (సంఘంకోరలు చూసే అయుంటుంది) కూడా కనుపిస్తుంది. నందూరివారి యెంకీ యిలా భయపడితే "దడుపూగిడుపూమాని..." అని ధైర్యం యివ్వవలసివచ్చింది అనుకుంటా!

నీవు నేనూ నిలబడితే
వచ్చిపోయే టట్టివారు
చిరునవ్వూ నవ్విపోయిరి గదరా
చెల్ మోహానరంగా!

అది ఎప్పుడూ, ఎక్కడా వున్నదే! ఓ జంటనుచూసి నోళ్ళు నొక్కుకోనేవారు కొందరైతే, మరో చిన్నారి జంటను చూసి బుగ్గలు సొట్టలు పొడుచుకొనేవారు మరికొందరు; గుసగుసలు ఒకచోట అయితే పకపకలు మరొక్కచోట; అందులోనూ తీరని కోర్కెలతో, అందని ఆశయాలతో - పోటుమితిన్న హృదయాలకు - ఇటువంటి ప్రేమజంటలను చూస్తే వెక్కిరింతలు, వేళాకోళాలు, బుగ్గలు నొక్కుకోడాలు,

(ఈర్ష్య అందాం) సహజం! అయినా ఈ అమ్మలక్కల మాట
లను పట్టించుకు కూర్చుంటే ఎలాగ చెప్పండి?

నీకు నాకు నేస్తమైతే
మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదుముగదరా
చెల్ మోహనరంగా!

నాలోని వలపుతీగ
నీలాల పేరులాగ
నీ కంఠమునే చుట్టితిగదరా
చెల్ మోహనరంగా!

నీమీద వలపుతీపి
నామీద కెక్కిపోయె
నిన్నింక విడువజాలనురా
చెల్ మోహనరంగా!

ఎన్నాళ్ళకైన గాని
చిన్న నీ మొగముజూచి
నిలవునా సొక్కిపోతినిగదరా
చెల్ మోహనరంగా!

నీకూ నీవారు లేరు
నాకూ నావారు లేరు
ఏటిఒడ్డున ఇల్లు కడదాంపదరా
చెల్ మోహనరంగా!

నీవే చంద్రుడవైతే
నేనే వెన్నెలనౌదు
భావించి వెంటనుందును పదరా
చెల్ మోహనరంగా!

పాపిష్టి గాలివాన
బెజవాడకు రాకపోతే
కష్టాలే లేకపోవునుగదరా
చెల్ మోహనరంగా!

—బెజవాడలో కొంతకాలం చెల్ మోహనునితో కూడా తిరిగినట్లుంది.

కంటికి కాటుకెట్టి
కడవా చంకానబెట్టి
కన్నీరె కడవనిండెనుగదరా
చెల్ మోహనరంగా!

నీ రూపె చూడగోరి
దారులూ గాచగా నె
పాడు శకునమా యెనుగదరా
చెల్ మోహనరంగా!

ప్రేమ అనేది హృదయంలో నాటుకోవా లేగాని, తదుపరి ఎన్ని అడ్డులు దుడ్డుకర్రలలాగా ఎదురు నిలచినా ఆగదు. అందులోనూ హృదయం యిచ్చి పుచ్చుకొనే పవిత్ర ప్రేమకు ఎదురులేదు. తను నమ్ముకున్న హృదయంకోసం ప్రాణత్యాగంకైనా వెనుకాడదు!

చూడండి - తన చెల్ మోహనరంగడిని కనులారా చూడాలని ఆశ - అందుకోసం కళ్ళల్లో వత్తులు పెట్టుకుని

దారులు గాచివుంటే - శకునం మంచిది కాలేదుట - అంటే అతగాడు రాలేదనే అనుకోవాలి.

ఏమిటో - ఈ నమ్మకాలు, శకునాలు, తను ప్రేమించిన మోహనరంగళ్ళ కోసం - క్షేమంకోసం, మంచికోసం సోదులుచూపి, ముక్కి సంతృప్తి పడడం జరుగుతుందం టేనూ ఆశ్చర్యం ఎందుకు?

నీవు నేను ఏకమైతే
నిండు చందురుడు నవ్వి
మేఘాల దూరిపోయెనుగదరా!
చెల్ మోహనరంగా!

నిన్ను జూచి నన్ను జూచి
పున్నమ చందురుడు
నవ్వి చిక్కి శల్యమాయెనుపదరా
చెల్ మోహనరంగా!

విరజాజి పూలుపూసె
ఉరవైన వనములోన
గురివింద లేరుదముపదరా
చెల్ మోహనరంగా!

పసిడి పన్నీటిలోన
మిసిమికాంతులతోడ
బంగారుచేప లున్నవిగదరా
చెల్ మోహనరంగా!

బలమైన అలలురేగి
చలియించు సాగరమున

సంగీత మూలకింతము పదరా
చెల్ మోహనరంగా!

నరులు కన్పడనిచోట
సురలు చెన్నారు పీట
అందముగా ఆడుకొందము పదరా
చెల్ మోహనరంగా!

తెలితామరాకు జండా
గలపుల రథముమీద
దేశాలు తిరుగుదాము పదరా
చెల్ మోహనరంగా!

ఇంతకన్నా ప్రియురాలు ఏం కోరుకోవాలి - హాయిగా ఆనందంగా, పూలరథంమీద దేశాలుతిరిగి - తీర్థాలుచూసి- ఏవేవో ఊహల్లో విహరించాలనే తియ్యని కోరిక - బాగుంది!

పూవుల రథముగట్టి
చిలుక గుర్రములుగట్టి
హాయివత్తము గాలివాలున రా
చెల్ మోహనరంగా!

పూలతోటి బుట్టగట్టి
బుట్టకు ముత్యాలుచుట్టి
బుట్టలోనే ఎగిరిపోదమురా
చెల్ మోహనరంగా!

అమృత ప్రవాహమైన
ఆకాశ గంగలోన

సరి గంగాలాడుదాము పదరా
చెల్ మోహానరంగా!

ఇది మరీ బాగుంది - ఆకాశం యెత్తు ఆశ - ఆకాశ గంగలోనే సరిగంగా లాడుతుందట - అంతేకాదు

నీ మొగము చందమామ
నీ కళ్ళు కలువపూలు
నీ మొగముతోటి చేర్చిపోరా
చెల్ మోహానరంగా!

నీ నోటనున్న మురళి
నా నోటనుంచి చూడు
నే నొక్క పాటపాడెద వినరా
చెల్ మోహానరంగా!

మధువూ నీ మోవితేనె
అది రానే నానియని
మతిమాలి సొక్కి-సోలితిగదరా
చెల్ మోహానరంగా!

నీవొక్క హంసవైతె
నేను మానసమగుదు
పన్నీట నిదురబుత్తునుగదరా
చెల్ మోహానరంగా!

తేట పన్నీటిలోన
నీటుగాను జలకమాడి

మధుర నీ రూపు చూపనుపదరా
చెల్ మోహనరంగా!

మధురా నీ గుండెలదరా
నిదురా కంటికిరాదు
రెండు కొండలడ్డమాయెనురా
చెల్ మోహనరంగా!

బంగారు పంజరాన
చెంగావి చిలుకలంటే
చెంగావి నీదు మోవిగదరా
చెల్ మోహనరంగా!

కస్తూరి బొట్టు పెట్టి
కలికి తురాయిగట్టి
నీవే నా రాజ వైళివిగదరా
చెల్ మోహనరంగా!

కళ్యాణ మండపమున
కనకంపు గద్దెపైన
మంగళహారతి చెప్పెదరా
చెల్ మోహనరంగా!

మొత్తంమీద జీవితంలో వుండవలసిన అన్ని కోర్కెలకు ఈ పాట ఓ లిస్టు! పాడుకోటానికి బెస్టు!!

—•—

# 13

ప్రతి గ్రామానికి ఓ స్థానిక గాథ, వీరగాథ వీరుడు కనిపిస్తారు. కులం పేరున వచ్చే చిన్న చిన్న పోరాటాలలో, లేదా జాతి అనుకుందాం, దేవుడుమీద పేచీ, భూమిమీద పేచీ మతంపేరిట కొట్లాట, స్త్రీ పేరున కక్షలు - యిలాంటి చిన్న చిన్న సమస్యలు రగులుకొని బరులూ గడులూ గీసుకుని గ్రూపులుగా చీలి పోరాటాలు సల్పుకొని వీరమరణం పొందిన ప్రాంతీయ వీరులకు పొగడుతూ, స్మరించుకుంటూ గాథలుగా అల్లుకొని పాడుకునే వీరగేయాలు, వీరగాథలు చాలా వున్నాయి.

బొబ్బిలి యుద్ధం ఏమిటి? పల్నాటివీరుల చరిత్రఏమిటి? ఆ కథలూ, పాటలూ—వీరగాథలై తెలుగునాడున ప్రతిధ్వనిస్తూ

వుంటాయి. వీరులగడ్డలో పుట్టిన పలనాడునీదెగా! వెలనాడు నీదెగా అని వీర సందేశాలు వినస్తూనేవుంటాయి.

పూర్వకాలంలో గ్రామాలను దోచుకోవడాలు ఎక్కువ — దానికి సాయం భూస్వామ్య జమీందారీ అహంకారపు చలాయింపు బలవంతపు చాకిరీ, అన్యాయంగా పన్నుల వసూలు — వీటిని ధిక్కరించి ఎదురు నిలిచి ప్రాణార్పణ గావించిన అజ్ఞాత వీరులను స్మరించుకుంటూ ఆయా గ్రామాలలో ఆయా ప్రాంతాలలో పాటలు పాడుకోవడం వింటుంటాం. తమకుఅయిష్టమయితే ఎదురుతిరిగి కత్తులు కరకరలాడించే పల్లె జీవితాలు యిష్టమైతే నెత్తినపెట్టుకు పూజిస్తుంది — అటువంటి వీరుల అజ్ఞాత గాథలు పాటలు కొన్ని చూదాం:

గుర్రాల గోపిరెడ్డి పేరు చాలా ప్రచారంలో గలది. ఇతడి చండ శాసనాలకు సహించలేని ధైర్యవంతుల గుంపు చేలగట్టున చిత్రవధచేసి పగదీర్చుకుని గోపిరెడ్డి పైశాచికత్వానికి శాశ్వతంగా స్వస్తివాచకం చెప్పారు. ఆ చండ శాసనుని ఆకారం, అహంకారం ఎలాటిదో ఈ పాట చెబుతూంది. ఎంతదుష్టుడైనా కన్నతల్లికి కొడుకేకదామారి — అందుకే తల్లి తలుచుకు తలుచుకు ఏడుస్తుంది. బాధల కోర్వలేని ప్రజ బాధతో ఏడిస్తే, కొడుకు కోసం తల్లి ఏడ్పు.

ఓ గుర్రాల గోపిరెడ్డి
దాచేపల్లికి దానమైతివా!

శేరు శేరు ఎండి మురుగులు
చేతులాకు బెట్టుకోని
కట్టవమీాదా వస్తావుంటె
కలకటేరనుకొంటేని కొడకా ||ఓ||

వయ్యారి కొడకా
బంగారు కొడకా
దాచేపల్లికి దానమైతివా ||ఓ||

ఆ ప్రక్క ఒకచేను
ఈ ప్రక్క ఒకచేను
నడుమ నాపచేను
సందున నిను నలుగురుబట్టి!

నరికిరి కొడకా వయ్యారి కొడకా
చిన్నారి కొడకా
దాచేపల్లికి దానమైతివా!

ఓ గుత్తాలం గోపిరెడ్డి
దాచేపల్లికి దానమైతివా!

—గోపిరెడ్డి ఎటువంటి అన్యాయాలు చేశాడో తెలుసుకోవాలంటే ఇటువంటి పాటవలన వీలుపడదు కథల రూపంలోవుంటే తెలుసుండేది - అయినా బలవంతమైనసర్పము చలిచీమల చేతజిక్కి చావద సుమతీ!

ఈ గుమ్పులన్నను గ్రామంలో నమ్మలేని వ్యక్తులు ద్వేషించే జనం - ప్రమాద వాతావరణం చాలా వున్నట్లుంది.

ముందార మూడుబళ్ళు
ఎనకాల ఏడుబళ్ళు
ఏబండీలో వున్నావు కొడకా
బండోడు గురువులన్నా!

తోడోళ్ళు వెంట నేరు
తమ్ముళ్ళు ఎంట నేను
పాలేళ్ళు ఎంటనేరు
ఒంటారిగాను పోకు
బండోడు గురువులన్నా!

నీజండిమీాద ఆన
నీ ఒంటమీాద ఆన
ఒంటారిగాను పోకు
తంటాలుమారి వాళ్ళు
బండోడు గురువులన్నా!

నీ వంటపొలముతోడు
నీ పాడి పశువుతోడు
ఆ పశుబలము నమ్మబోకు
పాలేళ్ళ నమ్మబోకు
బండోడు గురువులన్నా!

—పదిబళ్ళతో కూడిన జనంతో బయలుదేరిన కొడుకొని తల్చుకుని - ఏ బండిలో వున్నాడో అని బాధపడుతూ పశుబలాన్ని చూసి నమ్మకు అని వాపోతూంది.

ఇంతకీ ముందర మూడుబళ్ళు, ఎనకాల ఏడుబళ్ళతో ఎక్కడికి ఎందుకు వెళ్ళాడో తెలియరాదు.

గుర్రాల గోపిరెడ్డి జనానికి అన్యాయాలు చేస్తే మరణించాడు - నందిరెడ్డి కామపిశాచంతో బలవంతంగా చంపబడ్డాడు - చందమామలాంటివాడే నందిరెడ్డి అయినా గుణంకూడా కావాలిగా!

రాజా మా నందిరెడ్డీ
నీ కిలలో బత్తెము తీరేనా ॥రా॥

కొడుకా మా నందిరెడ్డి
మల్లుపంచె కట్టుకోని
నల్లకోటూ తొడుక్కోని
పల్లెగాడనుకొంటిరా
కొడుకా మా నందిరెడ్డీ!

కట్టమీాదా పోతావుంటే
కలకటేరనుకొంటిని కొడకా
రాజా మా నందిరెడ్డీ
నీ కిలలో బత్తెముదీరెనా!

నున్నంగా తలదువ్వి
నూగాయ జడలేసి
సందువెంట బోతావుంటే
సందమామనుకొంటిని కొడకా!

వచ్చిపొయ్యే దోవలోనా
దానిమ్మా చెట్టుక్రిందా

వెంటికుచ్చే నేలబడితే
ఏటుకే తెగనరికెనన్నా!

రాజా మా నందిరెడ్డీ
నీ కీలలో బత్తెము తీరెనా।

పూర్వకాలంలో తన కొడుకు కలక టేరంత కావాలనీ, కలక్టరులాగా వున్నాడనీ మురియడం పరిపాటు. గుర్రాల గోపిరెడ్డి, నందిరెడ్డి పాటలలో తల్లి పలికిన పలుకులు సూచిస్తున్నాయి. ఆ రోజుల్లోసంగతి కలెక్టరనుకోడం, నేడో-మంత్రులదాకా చాకచక్యంలోనే వున్నారుకదా!

మల్లన్నమీద ప్రజకు చాలా కోపం, పగవున్నట్లుంది. దానికి వారు మల్లన్నని చిత్రవధ చేయకుండా గోరీ కట్టారు.

ఓరోరి మల్లన్నా
బొమ్మనిపాటి మల్లన్నా
పాలోడై పుడితివిరా
బొమ్మనిపాటి మల్లన్నా
పగదారై పుడితివిరా
బొమ్మనిపాటి మల్లన్నా
నీతండ్రి జావంగా
నీ తల్లి జావంగా
నా సేతు లేసిరి రా
బొమ్మనిపాటి మల్లన్నా
బాడికి కట్టండూ

యల్పాటకాడు చంద్రగాడు
దుమ్మే పాడదిరా
బొమ్మనిపాటి మల్లన్నా
బోరుబోరు బాగు

డొల్లాకాసోడు కొట్టిన
కక్కాసపు రాళ్ళల్లో
సీగోరి కట్టిరిగా
బొమ్మనిపాటి మల్లన్నా!

పాటలో వచ్చే పదాలనుబట్టి సుమారుగా కాలం, మండలం నిర్ణయించుకోవచ్చును - "కక్కాసు" అన్నపదం ఇంగ్లీషు పరిపాలకులవలన వచ్చినదిగాన . ఈ సంఘటనఅప్పటిదై వుండవచ్చును. "పకోడీలు", "బత్తాయి" "లోలకులు" లాంటివి - అప వచ్చాక నేకదా పాటలకెక్కాయి.

ఈ పాట చూడండి. గ్రామాలమీద దోపిడీకి రావడం - ధైర్యవంతులు ఎదుర్కోవడం పాతకాలంలో జరుగుతూండేదని ముందరే అనుకున్నాం! అటువంటి సంఘటనే - హండేవారు (దోపిడితండా) దోపిడికి వచ్చినప్పుడు కొమ్ముబూరాతో గ్రామాన్ని మేల్కొలిపి, బలంతో పోరుకు దిగాడుట!

కోలు కోలన కోలు
కోలన్న కోలే

కోలుమాయకు శాల
నరసింహా కోలె
గుట్ట గురప్ప కొండ
గురిదప్పకుండా
పైదళము రాకుండ
పడెర నీ జండా
సైరా ఓబులురెడ్డి
నెలవన్న కాడా
నినుజూచి నాగుండె
జలుజల్లును నెరా! ||కోలు||

నీకు పూలు నీ కత్తికి పూలు
నీచేతికీ వన్న బంగారురవలు
ఎర్రది గుర్రము వెండి కళ్ళెమురా
దూకించె గుర్రాన్ని దుమ్మెల్ల రేగ
బూడిద గుర్రాము బుగడకళ్ళెమురా
బుగడ కళ్యాణికి బొండుమల్లెలురా!

విధంగా జండాలు సిగ్నల్సుగానూ, గుర్రాల తోనూ, బల్లాలతోనూ ఎదుకుతిరిగ దోపిడి విధానానికి ఎదురు నిలచి గ్రామాలను రక్షించుకున్న వీరగాథలు - వీర యువ యువకులు - తెలంగాణా రజాకార్ పోరాట సమయంలో ఎంతమందో-నాటివీరుల గాథలకు, వీరకృత్యాలకు సాక్ష్యం తెలంగాణాలోని ప్రతిగుట్ట, చెట్టూ అంటే చాలు అనుకుంటాను!

తెల్లవారిని "టపాకాయ" టపాతో గజగజ లాడించిన అల్లూరి సీతారామరాజు గాథలూ, రాళ్ళతో, కర్రలతో, కారాలతో, కరాలతో నిజాం రాక్షసత్వంమీద వీర తెలంగాణా జరిపిన మెరుపు గొరిల్లా పోరాటాలు తలుచుకుంటె వొళ్లు జలదరించే, గాథలూ. సంఘటనలూ ఎన్నో!

పౌరుష గాథలకు పుట్టిల్లు, శాంతి సహనాలకు నిలయం ఎవరినీ ఏం అనదు తెలుగు హృదయం। కాని తనకే ద్రోహం చేయతలపెట్టారా - గుండెలు తీసినబంట్లు - బుసకొట్టిన సర్పాలు, గర్జించే సింహాలు।।

తెలుగు చరిత్ర - దేశి సారస్వత శాఖను పరికిస్తే యిటువంటి వీరగాథలు చాలా చాలా దొరుకుతాయి!





# సంవాదాలు

# 14

సంవాదాలు అన్న పదంలోనే ఇద్దరిమధ్య చర్చ అని ధ్వనిస్తూంది. అయితే యివి పాటలరూపంలో - మాటలు పాడిగిన సంవాదాలు. ఈ సంవాదాలు ఎక్కువగా పౌరాణిక గాథలతోనే నడుస్తాయి. దేవదేవుల మధ్యనే - కుటుంబాల లోనే కలతలూ, అనుమానాలూ గూడుగట్టుకొని, భర్తను భార్య, భార్యను భర్త నిలవేసి- బిరిగీసి, అడగడం, హాడలు గొట్టడం, చివరకు సరేలే! అన్న పద్ధతిలో సంవాదం ముగియడం జరుగుతూంటుంది.

తలుపులు దగ్గర పాటలనేవి - అనగా పెళ్ళిళ్ళలో పెళ్ళి కొడుకునీ, పెళ్ళికూతురినీ ద్వారంవద్ద నిలిపి తలుపుదగ్గర పాటలని పాడుతూంటారు - వీటిలో కొన్ని యివి!

సంవాదాలుగా జరిగే రాయబారాలు కొన్ని "తడిక రాయబారం", "చిలుక రాయబారం", "చందమామ" రాయబారాలు కొన్ని కనుపించకనూ పోలేదు!

ఈ క్రింది సంవాదం అనుమానంతో కూడిన లక్ష్మి-విష్ణు సంవాదం! విష్ణుమూర్తిని నిలవేసి లక్ష్మి ఏమని అడుగుతూందో-ఇద్దరిమధ్యా సంవాదం ఎంత పట్టుగా జరుగుతూందో చూడండి!

కలికి కవాటము
బంధన చేసిన
కారణమేమే లక్ష్మి - నీకు
కారణ మేమే లక్ష్మి!

కారణ మేమని
అడిగెవు నీ మది
తెలియ లేద ధవళాక్షా - మరి
తెలియ లేద ధవళాక్షా?

తెలిసీ తెలియక
చెంచిత చేరితి
వంతమేలనే లక్ష్మి - నీకు
వంతమేలనే లక్ష్మి!

కొంచపు జాతని
చెంచిత సవతిని
చెంతదీరెనో సామీ - నాకు
చెంతదీరెనో సామీ!

జిలుగు పుట్టెదల
చీరలు తెస్తిని
చెంతచేరవే లక్ష్మి - నా
చెంతచేరవే లక్ష్మి!

జిలుగు పుట్టెదల
చీరలు తెస్తే
చెంచితచేరను పోవోయీ - నీవు
చెంచితచేరను పోవోయీ!

చేపట్టు చెల్వ బంగారు
రవికలు తెస్తినె
జాగుసేయకే ధవలాక్షి - నను
చేరనీయవే కమలాక్షి!

జాల్వారు బంగారు రవికలు
చెంచీత కిచ్చిన
ఏలును స్వామీ - నీ విచ్చిన
ఏలును స్వామీ!

ఇప్పపు బంతులు
ఇంపుగ తెస్తిని
ఇంపుగ యేలవె లక్ష్మి - నను
ఇంపుగ యేలవె లక్ష్మి!

ఇప్పపు బంతులు
ఇంతి చెంచితకి

56)

ఇస్తే యేలును స్వామీ - నిను
ఇస్తే యేలును స్వామీ!

మల్లెపు బంతులు
మగువరో తెస్తిని
మన్నించేలవె లక్ష్మీ - నను
మన్నించేలవె లక్ష్మీ!

మల్లెపు బంతులు
మగువ చెంచితకిస్తే
మన్నించేలును స్వామీ - నను
మన్నించేలును స్వామీ!

రవ్వలు చెక్కిన
రాగిడి తెస్తిని
రానియ్యవె ఓ లక్ష్మీ-నను
రానియ్యవె ఓ లక్ష్మీ!

రవ్వలు చెక్కిన
రాగిడి తెస్తే
చెంచీతకివ్వగదోయీ - నివు
చెంచీతకివ్వగదోయీ!!

గరిమిష్టమ్మున
గండభేరుండంబులు
గాసిబొందితెనె భామా-నేను
గాసిబొందితెనె భామా!!

గండభేరుండంబులు
గాసిబొందితే
చెంచితయేలును స్వామీ - నిను
చెంచితయేలును స్వామీ!

శరణే శ్రీహరి శరణే లక్ష్మి
శరణంటిని గైకొనవే-లక్ష్మి
శరణంటిని గైకొనవే!

కొత్తపెళ్ళికొడుకై నీవూ
వర్ధిల్లుము వసుదేవా-స్వామీ
వర్ధిల్లుము వసుదేవా!

పద్మగంధి నీ పాదములాకు
వందనములు పదివేలే-లక్ష్మి
వందనములు పదివేలే!

నవ్వుతు శ్రీలక్ష్మి వాకిలితీసెను
గడియతీసె వరలక్ష్మి-అపుడే
గడియతీసె వరలక్ష్మి!

మగువజనక తన
మగువని తోడుకొ
మందిరములకేతెంచెన్!

మహావిష్ణువుకే భార్యచేతిలో అంతపని జరిగితే సామాన్యులసంగతికేమిటి చెప్పండి?

గారి ఎక్కడికో బయలుదేరింది చెలికత్తెలుచూసి ఎక్కడికని అడుగుతున్నారు. గారికీ, చెలికత్తెలకూమధ్య జరిగే ఈ సంవాదం ఎంత యింపుగా, సొంపుగా వుందో వినండి:-

ఘల్లు ఘల్లున పాద
గజ్జెలందెలు మ్రోయ
కలహంసా నడకాల
కలికీ ఎక్కడికే?

జడలోనూ గంగాను
ధరియించుకొన్నట్టి
జగము లేలే సాంబ
శివుని సన్నిధికే!

బొడ్డూమల్లెలు జాజి
దండాలు మెడనిండ
అందామెరిగిన జగ
దాంబా ఎక్కడికే!

అందాము విభూతి
అలగూ గంధాము
నలచీన నీల
కంఠేను సన్నిధికే!

తళతళ మనురత్న
తాటంకములు మెరయ
పసిడీ మండలముల
ఫణతీ ఎక్కడికే,

కలియుగ జన్మము
గల శివుడైనట్టి

గురువైన శంభు
శంకరునీ సన్నిధికే!

హెచ్చుపాపటా బొట్టూ
రత్నా కిరీటమ్మూ
ఏమమ్మా కరుణా
కటాక్షి ఎక్కడికే?

కడుపెద్ద రుద్రాక్ష
మెడలో హారముదాల్చి
నందీనెక్కేడు జగ
న్నీను సన్నిధికే!

ముఖమున చిరునవ్వు
కల ఎరుపు కుంకుమ
రేఖా వెలిసెడు లోక
మాతా ఎక్కడికే??

కంఠాన కాల
కూటమ్ము ధరియించుచు
మండలా మేలే జగ
న్నీసూ సన్నిధికే!

చెంగావి చీరలూ
చెంగూన జారంగ
రంగైన నవమోహ
నాంగీ ఎక్కడికే?

చంద్రుని శిరసూన
ధరియించుకొన్నట్టి
మండలమేలే
నందీనూ సన్నిధికే!

సన్నంపు నడుమూపై
శిళ్ళాలా ఒడ్డాణం
మెరిసేటి బంగారు
బొమ్మా ఎక్కడికే?

కన్నులు మూడూ
భుజంబులారూ
అంబాలుగల అర్ధ
నారీసు సన్నిధీకే!

అభయ హస్తములచే
కరకంకణముక్రాజ
వరమూ లిచ్చేటివారు
గాగీ ఎక్కడికే ?

—శివుడు అక్కడక్కడా తిరిగి యింటికి వచ్చాడు. తలుపులు వేసున్నాయి - పిలుస్తున్నాడు. తలుపవతల పార్వతి నుంచుని ఏమంటుందో వినండి

శివభక్తులకే దయగలవాడను
శివుడందురు నాపేరూ - సాంబ
శివుడందురు నా పేరూ!

శివనామంబులు సకలెందుల జెల్లును
చేరికతో వుండవోయీ - శివ
చేరికతో వుండవోయీ!

వడిగినలందిన కుంతనలోనగెటి
ఉరవతి దరుడనె గౌరి - నే
ఉరవతి దరుడనె గౌరి!

ఉరవతిధరుడవైతె యేలాయెను
వడలుకడకు పోవోయీ - శివ
వడలుకడకు పోవోయీ!

బలానరాముడు బలసతినడిగిన
బలదిందుడనే గౌరీ - నే
బలదిందుడనే గౌరీ!

బలదిందుడవైతే యేలాయెను
భక్తులిళ్ళకు పోవోయీ - శివ
భక్తులిళ్ళకు పోవోయీ!

కొమరుగ గంగని జటలోనించుకు
కొమరజంగాన్నె గౌరీ-నే
కొమరజంగాన్నె గౌరీ!

కొమరజంగమైతేమాయెను
కొమరులిండ్లకు పోవోయీ - శివ
కొమరులిండ్లకు పోవోయీ!

కాశిలోపల మోతుములోనగెటి
గంగాధరుడనె గౌరీ - నే
గంగాధరుడనె గౌరీ!

వాళికిమేలాగై తిరిగేమీరు
వార్నాసివై వుండవోయీ — శివ
వార్నాసివై వుండవోయీ!

పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్ళగానే యివి తేలేదు, అవి తేలేదు అని కోడలిని వేపుకుతినడం చాలాచోట్ల వింటుంటాం. వింతకాదు, విడ్డూర్యమూకాదు అలవాటైపోయింది. సుభద్రకూ అత్తవారింట అటువంటి సమస్యే ఎదురౌతుంది. సుభద్రను అర్జనుడు ఏమని అడుగుతున్నాడో వినండి.

పున్నెంబునాడైన
బూరెలొండుకోసీ
పుణ్యాడ రమ్మని
పిలచిర మీవాళ్ళు!

అమవాస్య నాడైన
అట్లువండుకోనీ
అల్లుడా రమ్మనీ
పిలచిరా మీవాళు ?

అని భార్యసుభద్రను దెప్పిపొడుస్తుంటే తను సమాధానం యిస్తూంది :

మావాళ్ళూ పేదవాళ్లూ
మాకేమి కలదు?
పెట్టగల పెద్దింటి
పెళ్ళాడితానూ

అచ్చటలు ముచ్చటలు
అన్నీ మూ తేరూ!
భార్య మాటలకు సహించ లేక పోయాడు పార్ధుడు.
అనగావిని పార్ధుండు
అతి కోపమునను!
ఎడమ మీాసందువ్వి
పాంకోడుతో తన్నె!
అప్పుడు సుభద్ర ఏంచేసిందనుకొన్నారు ?
మువ్వలా ముద్దృడ్డి
చంకా బెట్టుకొని,
పున్నమా చంద్రుడ్ని
వెంటా బెట్టుకుని
వెళ్ళెనే సుభద్ర
అన్నవాడలకూ!
చెల్లెలు సుభద్ర నడిచి తనవద్దకు రావడం గమనించిన
అన్నకు ఆశ్చర్యం కాక మరేమిటి ?
ఏనుగులు వుండంగ
గుర్రా లుండంగా!
పల్లకీ లుండంగ
బానిస లుండంగ!
కాలీ నడకనురాను
కారణం బేమిా ?

అన్నతో సుభద్ర చెప్పుకుంటూంది.

అన్నారో వింటీవ
అన్నారో నీవు!
ఎన్ని మాటలు నేను
పడతి కావస్తి!
.....................
.....................

అర్జనుడు తనను అన్నమాటలు పూస గుచ్చినట్లు అన్నకు చెప్పింది.

అటకమీా దున్నాయి
అంచు బిందెల్లూ
ఇదిగోనే చెల్లెలా
నీకు హారణమ్ము
మండాలో వున్నాయి
పాడి ఆవుల్లు
ఇదిగోనె చెల్లెలా
నీకు హారణమ్ము!

పసుపు కుంకుమ నీకూ
పళ్లాలా పోస్తి!
ఇదిగోనే చెల్లెలా
నీకు హారణమ్ము!
గౌరవమున నీవూ
కలిసి మెలిసుండూ!

పార్వతీ మాటాకూ
జవదాట కమ్మ !

ఈ క్రింది సంవాదం శ్రీ కృష్ణుడికి – రుక్మిణికి సంబంధించి నడుస్తుంది.

చక్కని మిక్కిలి రుక్మిణి
వాకిట సరసములాడెనె భామా !
తను సరసము లాడెనె భామా!

చిటపట చినుకులు కురిసెను
దుప్పటి తడిసెను
తలుపు తియ్యవే భామా – నీవు
తలుపు తియ్యవే భామా !

మెడలోనున్న ముచ్చపు
హారము ఎవరికిచ్చి నావోయీ – నీవు
ఎవరికిచ్చినా వోయి ?

గొల్లది ఒకసతి పెండ్లికిబోతే
కోరితే యిస్తినె భామా !

శంఖు చక్రములు
చదరక గంధపు
రేఖ లున్నవేమోయీ ?

ఏమే భామా నమ్మకుం టెనూ
బాముసైన బట్టేనే – నే
బాముసైన బట్టేనే !

లక్ష్మి - నరశింహస్వామికి సంబంధిచిన సంవాదం యిది:

తరుణీ నేను రాగా జూచీ
తలుపులూ మూసున్న విధమూ
అరదుగా నీ మదికి తోచేనా
ఓ లక్ష్మిదేవీ!
అతివనీకూ అలుక ఏలానే?

గాయకూడ నీ వగలు
కానవచ్చె నీ తలాలు నేడూ
మాయసుద్దు లెన్నదావోయీ
ఓ నరశింహా!
మమ్ము రవ్వ లేల చేశావూ!

దుష్ట విగ్రహాముతోనూ
దోరుకోని వేటాడితే
దుష్ట విగ్రహామూ యెనే
ఓ లక్ష్మిదేవి!
సృష్టి పాలింప నే వస్తినే!

వేటబోయేననుచు బోయి
నీటుమీరా నీవందూయే
బోటులాకూడుకూ వస్తివి
ఓ నరశింహా,
బొంకులూ నాతోటి బొంకేవు!

కాముకో నీరాజు వేటా
లాడబోయే నాచోటునా
భామాముఖము నే నెరుగానే
ఓ లక్ష్మిదేవి !
పడగవేటా లాడి వస్తీన !

నిద్రపోయేటి వేళాలో
సద్దుసేయా వచ్చినావురా
ఓ నరశింహా !
బుద్ధులెట్లా నీకు తోచెరా !

కోమలాంగి శ్రీ గురుడాద్రీ
శ్రీ నారశింహుడనే నేనూ
కోరినిన్ను కూడవస్తీనే
ఓ లక్ష్మిదేవి !
చేరనిచ్చితలుపూ తియ్యవే !

అందమలర నీ వెందుందూ
ఏ సుందరూలా నెరుగాననుచూ
గంధమేలా కలిగేరా జాణా
ఓ నారశింహా !
కల్కి ఎవతో నీకు పూసేరా !

తప్పాడి పొదలలోనూ
తరచు వేటలాడబోతే
పుష్పొడ నామీదరాలేనే

ఓ లక్ష్మిదేవి,
పూసినట్టే గంధమాయెనే!
సుద్దులూపల్కేవు చాల
పరమాత్మపై యింగారు చాలు
వాసంతమేలా కలిగేనాజాణా
ఓ నారశింహా
వనితయెవరో నీకు పూసేరా!

పూచినామృదులాతరులా
పూలసరులా శృంగారములు
చూచివస్తామనుచు పోతినే
ఓ లక్ష్మిదేవి!
సొంపుతేటే రసమూచిందేనే!
ప్రాకటముగా చెంచూవనితా
భామకూడే నా వాకిటా
నాకు దత్తమియ్యారా స్వామీ
ఓ నారశింహా
వాకిలి నే తీసేనుగానీ!

తరుణినేను (శ్రీ) రూపాము
దాల్చియున్నా వాడ్ని కనుకా
అరుదుగా నీమదికి తోచేనే
ఓ లక్ష్మిదేవి
అతివనీవూ అలుకమానావే!
పద్దూలుపల్కేవు చాలా
పరమాత్మా మీవద్దనున్నా

ముద్దుగుమ్మా ఎవతె రాజాణా
ఓ నారశింహా!
మొరసి మొరసి నిన్నే చూసేరా!

నన్ను తాంగీ నీవిప్పుడూ
సఖియాలా గుర్తెరుగానసుచు
నిన్నుముట్టి బాసా చేసేనా
ఓ లక్ష్మిదేవి!
మమకూలినే నెరుగానే!

వాసుదేవా మీాయనాతో
బాసాలు చేసెదానంటే
వాసవాదులెల్ల నమ్మరూ
ఓ నారశింహా!
దాసులైనవారూ నవ్వేరూ!

భాసురాము రామాగుణమా
బాసాలు చేసేదానంటే
వారుమమ్మెందుకు నమ్మారే
ఓ లక్ష్మిదేవి!
వారుమమ్మెందుకు నమ్మారే!

కంజనాభా మీారూనాతో
షమకించి మాటలాడేరూ
ముంజేతి కంకణమే మెరసేరా
ఓ నారశింహా!
మరచిచూడా అద్దమేలరా?

గజరాజ శింహాములా నేనూ
షునమూగనే వేటాడితే
సురలునాకూ మురయుచు నిపుడు
ఓ లక్ష్మి దేవి!
సొంపుతో కంకణము కట్టేరూ!

సారసాక్షా నీవందూరూ
సఖియూ నీ గూడియుండాకా
సన్నిధీకే ఏలా వ స్త్రీరీ
ఓ నారశింహా!
సరసమూ నీతో ఏలరా?

అండ జాగమన నా
దండీ తప్పులాకు నీకు
ఒక్క దండమునీకు పెట్టేనే
ఓ లక్ష్మిదేవి!
దండము నేరమూ మమ్మేలూ!

చిత్తజాజాణా చెన్నూ మీారగానీ
నిత్య కొత్త పెళ్ళికొడుకై వుండరా
ఓ నారశింహా!
కోరి పుత్రూలనూ ఎత్తారా!!

అలాగే సత్యభామా - శ్రీకృష్ణుల సంవాదం!

వాకిలి తీయుగదే వారిజ
ముఖి కోమలాంగి నాపై

కోపము సేయక కోరివచ్చిన
వాడనే వాకిలి వేగ, ॥వాకి॥

మాటిమాటికిని మారము
సేయక మురహార
హోహోరా మోహనకారా, ॥వాకి॥

పారిజాతమ్ములు పణతినీకిస్తును
పంతగించక తీయుమా
వాకిలి వేగ! ॥వాకి॥

సత్యభామతో గూడి సరసమ్ము
లాడాగా సరసుడ లేచిరార
వాకిలి తియ్యను! ॥వాకి॥

సుదతులందరిలోనూ
సుందరాంగీవానీ
వలచివచ్చినవాడానే
చెలియరో వేగ! ॥వాకి॥

దోసిలొగ్గితినమ్మ
దోషాము లెంచక దానూడాను
దయను చూడుమా
దయతోడ చెలియా! ॥వాకి॥

ఇది ఇద్దరు స్త్రీలు - సామాన్యులుకాదు—"లక్ష్మి-గౌరి దేవిలమధ్య జరిగే సంవాదం

58)

సాధారణంగా స్త్రీలమనస్తత్వమే అంత అనుకుంటాను తనవాడుగొప్ప! తను అందగత్తె!! దానికి నిదర్శనంగా ఈ సంవాదం సాగేతీరు చూడండి:

గౌరిదేవి నీశంభుదేవునకు
గళమున నలుపేమమ్మా?
నారీమణి నీ విష్ణుదేముడూ
నలుపుకాదటే కొమ్మా?
ఏమిలేక నీ కాంతుడు జగమున
ఎద్దునెక్కెనేకొమ్మ ?
పంతముతో నీ కాంతుడు
పసులకాసెనే కొమ్మా!
అద్దులేక నీ వల్లభుడూ
సుఖయాడరూప మేమమ్మా ?
ముద్దుగమ్మ నీ మురహారి పెనిమిటి
మోహినికాదుటె కొమ్మా!
పంకజాక్షి నీ శంఖరికరము
జింకవున్న దేమమ్మా
పంతముతో వనవాసము కేగి
జింకనువేసెనె కొమ్మా!
చింతలే నీ క.కాంతుడు బ్రహ్మను
శిరసుత్రుంచె నే మమ్మా?
పంతముతో రావణబ్రహ్మను
పదితలలు త్రుంచెనే కొమ్మా!

విశాలాక్షి నీ విభుని మాయలా
జంగముకుల మేమమ్మా?
పాలు పెరుగులమ్మగను గొల్లవారి
కులముగాదుటే కొమ్మా?
పార్వతిదేవి నీ విభునికి
నిలువున పాములున్న వేమమ్మా?
పార్వతిదేవి వైదేహి పలికిన
పంతము వినరమ్మా?
విన్నవారికే విష్ణులోకమూ
కైలాసముకాదటే కొమ్మ !!

పైన పరిచయం చేసిన సంవాదాలు అన్నీ, అవతారాల్లో, రూపాల్లో పరిచయం చేయబడినవి – సామాన్యంగా భార్యా భర్తలమధ్య మూతి ముసుపులూ, మాట పట్టింపులూ వస్తుంటాయి. అప్పుడు ఏ ఒకరూ తగ్గరు! తగ్గితే ఎలాగ చులకన అయిపోదూ! అందుకు ఏ చిలుకమీాదో, పిచుకమీాదో, లేదా తడికమీాదో, తట్టమీాదో–పిల్లమీాదో, పిల్లిమీాదో–పెట్టి ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం కద్దు. అటువంటి సంవాదాలలో తడికమ్మ, మధ్యగా నిలచిన ఒక సంవాదాన్ని పరిచయం చేస్తాను–వినండి.

కొర్రకూర తెచ్చాను
గోంగూర తెచ్చాను
వండమని చెప్పవే – తడికమ్మా!
వండాను చెప్పవే – తడికమ్మా!!

కొఱ్ఱకూర తెస్తేను
గోంగూర తెస్తేను
వండనని చెప్పవే – తడికమ్మా!
వండానని చెప్పవే – తడికమ్మా!!

తాటిపండు తెచ్చాను
బుఱ్ఱగుజ్జు తెచ్చాను
వండమని చెప్పవే – తడికమ్మా!
వండామని చెప్పవే – తడికమ్మా!!

తాటిపండు తెస్తేను
బుఱ్ఱగుంజు తెస్తేను
వండనని చెప్పవే – తడికమ్మా!
వండానని చెప్పవే – తడికమ్మా!!

కొత్తబియ్యం తెచ్చాను
కొత్తకుండ తెచ్చాను
వండమని చెప్పవే – తడికమ్మా!
వండామని చెప్పవే – తడికమ్మా!!

కొత్తబియ్యం తెస్తేను
కొత్తకుండ తెస్తేను
వండనని చెప్పవే – తడికమ్మా!
వండానని చెప్పవే – తడికమ్మా!!

నులకమంచం తెచ్చాను
కంబళీ తెచ్చాను

వెయ్యమని చెప్పవే - తడికమ్మా !
వెయ్యామని చెప్పవే - తడికమ్మా ॥

నులక మంచం తెస్తేను
కంబళీ తెస్తేను
రమ్మాని చెప్పవే - తడికమ్మా!
రమ్మనీ చెప్పవే - తడికమ్మా ॥

తడిక మధ్యవర్తిత్వం వహించవలసిన ఘట్టాలు చాలా వున్నాయి! తడిక సంబోధనతో మరో పాట :

వంకాయ వండాను
వరికూడు వార్చాను
తినమనీ చెప్పవే
తడికా! తడికా॥

వగలాడి మాటలకు
ఒళ్ళంత మండింది
వద్దనీ చెప్పవే
తడికా! తడికా॥

పట్టుచీర తెచ్చాను
పెట్టెలో పెట్టాను
కట్టమని చెప్పవే
తడికా! తడికా॥

చీరకంచులు లేవు
చుట్టూచెంగులు లేవు

వద్దనీ చెప్పవే
తడికా! తడికా!!

సంతలోకి వెళ్ళి
సరిగంచు చీరను
అద్దాల రవికను
అతివ తెచ్చేద కట్టుకోవే !!

ఈ విధంగా మధ్యన అలుగులు వస్తే తడికతోనో, గోడతోనో మాట్లాడుతూ, పనులు ముగించుకోవడం వరి పాటి - అది కాస్తసేపేలెండి - తర్వాత తడికను వదిలి - యిద్దరూ ఒకటవక మానరు !

పైన తెలిపిన తడికసంవాదాలుతోపాటు బావను మాటల్లో ఎంత గమ్మత్తు చేస్తూందో ఈ సంవాదంలో చూడండి- యిటువంటి పాటలు చాలా సరదాగా వుంటాయి.

ఒకరికి చేతూలిచ్చాన్
ఒకరికి కాళ్ళానిచ్చాన్
ఒకరినీ చేతబట్టి
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!

ఎవరికి చేతులిచ్చావ్
ఎవరికి కాళ్ళనిచ్చావ్
ఎవరినీ చేతాబట్టి
కూకున్నావే పిల్లా!
కూకున్నావే ?

గాజులకీచేతూ లిచ్చాన్
కడియాలకి కాళ్ళ నిచ్చాన్
డబ్బుల్ని చేతాబట్టి
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!
ఒకరీనీ నానా వేశాన్
ఒకరీనీ చితకాగొట్టాన్
ఒకరీనీ చుట్టచుట్టి
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!
ఎవరీని నానా వేశావ్
ఎవరీని చితకాగొట్టావ్
ఎవరీని చుట్టాచుట్టి
కూకున్నావే పిల్లా!
కూకున్నావే?
సున్నాన్ని నానవేశాన్
వక్కల్ని చితుకాకొట్టాన్
ఆకుల్ని చుట్టాచుట్టి
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!
ఒకరీని కట్టివేశాన్
ఒకరీని వదిలీవేశాన్
ఒకరీని చేతాబట్టి
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!

ఎవరీని కట్టివేశావ్
ఎవరీని వదిలివేశావ్
ఎవరీని చేతాబట్టి
కూకున్నావే ఓసీ!
కూకున్నావే?

ఆవుల్నీ కట్టివేశాన్
దూడల్నీ వదిలివేశాన్
చెంబూనీ చేతాబట్టీ
కూకున్నానోయ్ బావా!
కూకున్నానోయ్!

పిల్ల చమత్కారం చూడండి - బావను మాటల్లో తాలింపువేసి ఉడికించి - వేపించి - ఆఖరున పకపక నవ్వులు కురిపిస్తుంది.

సంసారంలో జీవిత నాటకరంగంలో - అసంతృప్తి, లోటు - బాధ, ఆలోచనలు-సమశ్యలు - ఏవో వుంటూనే వున్నా - ఆకాస్తలోనే - ఏదోఒక సంతృప్తి కల్పించుకుని, ఆ సంతృప్తినే మధురానుబూతిగా తలచుకు, మలచుకు-ఆనందంలో మునగడం అవసరం.

కట్టుకున్న భార్య, లేదా ప్రేమికురాలు - వేడెక్కిన హృదయాలకు - చల్లని పానీయంలా - నాలుగు మాటలు పలుకరించి - ఓ ఓలిపి చూపు పారేసి - ఓ కొంటె పలుకు విసురుతే - ఆ ఆనందానికి హద్దెక్కడ? మేరఏది??.





# అప్పగింతలు

పెంచి పెద్దదాన్ని చేసి, ఓయింటి దానిగా చేసి, అయ్యకుయిచ్చి పెళ్ళిచేయడం పెళ్ళిలో ఆఖరున పెళ్ళికూతుర్ని మొగపెళ్ళివారికి "అప్పగింత" పెడుతూ పాడే పాటలనే అప్పగింతల పాటలు అని పిలుస్తారు.

ఈ అప్పగింతల సమయంలో పిల్ల తల్లి, తండ్రి పడే బాధ అక్షరాలలో వ్యక్తపరచడం చాలాకష్టం. ఆ దృశ్యం చూడాలి. వారి కళ్ళల్లో, ముఖంలో, హృదయంలో, ఆ ఒక్క నిముషంలోనూ పడే బాధ అంతాయింతా కాదు— చూసేవారికే తాము ఓ చెల్లిని, లేదా ఓ బంధువుని దూరంగా పంపుతున్నామే అన్న బాధ కలుగుతుంది. అప్పగింతల సమయంలో కళ్ళు చెమ్మగిల్లక మానవు.

తను తల్లి కనుక ఆలశ్యంగా లేచినా కసరదు. ఏదేనా కావాలన్నా తనతో కూతురు చెప్పి – నాన్న చేత కొను పించుకొంటుంది. తను ఏ పాలచెంబునో, నేతి గిన్నెనో తెలియక పారబోసినా పొరపాటు, పిల్లలు అంతే అని కన్నతల్లి సరిపెట్టుకుంటుంది. ఆకలేస్తే అన్నముపంపి ఏద్దైనా కొనిపించుకు తింటుంది. పొరపాటుచేస్తే కసిరేతల్లే కౌగలించుకుంటుంది. అవసరసమయాలలో హద్దులుపెట్టి స్త్రీ కట్టుబొట్లు నేర్పుతూనే – కట్టూ-బొట్టూ, మాటా – పాటా నడక నడవడిక, వంటా, వార్పూ నేర్పుతుంది. కాదంటే కసిరినా కోపం లేని కల్లెర, ద్వేషంలేని ఆర్డర్! కాని పరాయి గడపలో, కొత్తవారిమధ్య ఏం అంటారో, ఏం అనుకుంటుందో? – తొమ్మిది నెలలు మోసి కనిపెంచిన మాతృహృదయం అలా అనుకోడం తప్పదు. ఆడది అన్నాక నేడు కాకపోతే రేపైనా పరాయి యింట కాపురం చేయాలి. అయినా కని పెంచి, పెట్టి, దిద్దిన చిన్నారిని అత్తవారింటికి పంపుతూ కంట నీరెట్టకుండా వుండడం కష్టమే!!

శకుంతలను అత్తవారింటికి పంపుతూ కణ్వుడు అంటున్నాడు :

"పొరుగిండ్ల నిరుగిండ్ల
బ్రొద్దు వోకలకైన
బలుమారు నరగుట
పాడికాదు"—

ఈ అప్పగింత ఆప్యాయతకు మారు రూపం – బాధ్యతకు ప్రతిధ్వని॥

ఈ రోజులలో ప్రేమ వివాహాలు, రిజిస్ట్రేషన్ వివాహాలు ఎక్కువ అయినా – అమ్మాయి తల్లి తనకూతురును గురించి అలా అనుకోకుండా వుండలేదు. అందుకే తల్లికి అంత ప్రత్యేకపు హోదా సమాజంలో, సంఘంలో! ప్రపంచంలో!!

వదినారో నా పుత్రి
ఇది వప్పగింత!
పదిలంబుగా దీని
బాగా చూడమ్మా ॥వ॥

పాలు కాచగలేదు
బాలా మా వదినారో
భాగ్యంబు తానీవె
బాగా చూడమ్మరో ॥వ॥

నేకోతానే రాదు
నెలతసుమి వదినరో
నేర్పుగ చెప్పుకో
నెలత మీా సుతను ॥వ॥

ఆకలైనాగాని
అన్నమడగని బాల
దాని నంపిన నేను
తాళాలేనమ్మారో ॥వ॥

ఎదురింటి భాగ్యమే
ఏమిసేయును తల్లి

ఎన్నగ అత్తింట
పుట్టినింటికి నీవు
కీర్తిగా మెలగుమా ॥ప॥

మరో రచన వినండి:—

పూజిత మగుచున్నది
బూజమ్మ బంతి
భోజనాలందారూ
పొందూగా జేసే
దశరథులు తమరంత
కడు సంభ్రమపడుచు
జనకునకు జెప్పెనే
సీతాపయనమ్మ!

ఇంతలో జనకుండు
కంది ఒడికట్టెయో
బొమ్మ ఒడిగట్టె
తెల్లన్ని ముత్యాలు
దేవికీ కట్టే!

నెయ్యి కాచ నేరదూ
నెలతసుమి ఒదినా
నేర్పుగ జెప్పూ
సీతామీదమ్మా
పాలుగాచ నేరదు
పడతి సుమి ఒదినా

భాగ్యములు నీవేన
బాగుగా చూడు
బుద్దెరుగదు మంకు
బుద్ధిలేగాని
బుద్ధి వచ్చినదాక
దిద్దుకోవమ్మా!

పాలలో చెయిముంచి
భూమిసుతదెచ్చి
కౌసల్య చేతిలో
చెయివప్పగించె
శ్రీరాములు సీతా
పయనమై రాగా
మేలు శకునములాయె
వాడా లోపలను

కోటివేల దివిటీలు
కోమరొప్ప వెలుగ
కోమరుడీ గృహా
ప్రవేశంబులాయె
వేవేల దివిటీలు
వేడుకతో వెలుగ
రాముడీ గృహా
ప్రవేశంబులాయె!

పైన పరిచయం చేసిన ఈ అప్పగింతలపాట సీతా రామ కళ్యాణ వైభవానికి సంబంధించినది.

ఈ అప్పగింత ఎంతగా హృదయాన్ని హత్తుకొనేలా వుందో పరికించండి.

మా యమ్మ కామేశ్వరి
పోయీ రావమ్మా
పోయీ మీ అత్తింటా
బుద్ధి కలిగుండూ! ॥మా॥

గడపపై కూర్చుండి
జడవిప్పబోకూ
కూర్చున్నప్పుడే తల్లి
కురులుదులపాబోకు! ॥మా॥

వెండీ మట్టెలకాలు
ఎత్తినడువకుమా
నడిచినప్పుడు తల్లి
చేయూచకమ్మా ॥మా॥

ముగవార్ని చూచియో
మగువా నవబోకూ
తగవూలాడేచోటా
తల ఎత్తకమ్మా ॥మా॥

పతికంటె ముందులేచి
పనులెల్ల దీర్చి
పతిపాదముల సేవ
భక్తితో సేయుమా! ॥మా॥

పైన పరిచయంచేసిన "అప్పగింత" లాంటిదే ఈ పాటకూడా.

మా యమ్మ లక్ష్మీదేవి
పోయి రావమ్మా!

పోయి నీ అత్తింటి
బుద్ధిగలిగుండూ
ఎవ్వారేమాడిన
ఎదురాడకమ్మా

వీధీ నిలుచుండీ తల
విప్పీ ముడువకుమీ
మాటలెన్నన్నాను
మాటాడకమ్మా

పలుమారు మామీద
ప్రేమాలుంచకుమా!

ఆకలున్నా గాని
అని అడుగబోకు
మాటాకీ పదహారు
నాటకు డతడు

అతసి కాదని పూలు
ముడవబోకమ్మా!

అంటూ పెళ్ళిచేసిన కూతురుని అప్పగిస్తుంది తల్లి, తను అంతదాకా ఆడుకున్న చెల్లెల్ని, తమ్ముణ్ణీ పిలిచి తన ఆట వస్తువులు అప్పగిస్తోంది అక్క!

బొమ్మరిళ్ళున్నాయి
బొమ్మలున్నాయి
నేను ఆడేటి సాల లున్నాయి!
నా మారుగా మీరు
ఆడుకోరమ్మా!

పోయినా అత్తింటికి
పోయి వస్తాను
దీవించు అన్నల్లు
దీవించు అక్కా!

మాయమ్మా లక్ష్మదేవి
పోయీ రావమ్మా!



# 16

వేలు కొలవడం అనే పద్ధతి, నమ్మకం, ఆచారం మనలో చాలా నమ్మకమైన ప్రధానవిషయం. ఎవరిని మేలు కొలుపడం? ఎందుకు మేలుకొలుపడం? ఎవరు ఎవరిని ఎందుకు మేలుకొలుపడం - తమ మేలుకోసం యింకొకరని మేలుకోమని ప్రార్థించడం, ప్రజలకోసం మేలుకోమని మేలుకొలుపులు పాడి లేపడం-బాగుంది! దేముడిని, గుడిలో విగ్రహాన్ని తెల్లవారుజామున మేలుకొలుపులు పాడి లేపుతారు - అంతదాకా అది ఒక నమ్మిక, ఆచారం అనుకుందాం. కాని శ్రీమన్నారాయణుడు అందరినీ, లోకాన్నే లేపుతాడు. తన కిరణ ప్రసారాలద్వారా. కాని అతనినీ మేలుకొలిపి హుషారుగా వుండమంటోంది - స్త్రీ హృదయం!!

ఆడవాళ్ళూ, వారి ఆచారాలు, నమ్మకాలు, వారి నోములు, వ్రతాలు, పూజలు, పునస్కారాలు, పాటలు, చూస్తూంటే - మన నాగరికతకు స్త్రీ వాఙ్మయం ఒక నిఘంటువా అనిపిస్తుంది!

అమ్మ సీతమ్మా మా యమ్మా
ముద్దులగుమ్మా
అమ్మ బంగరుబొమ్మ లెమ్మా! ॥అ॥

అమ్మలో యిమ్మాగ
అరుణోదయంబాయె
అమ్మల కన్నమ్మ లెమ్మా! ॥అ॥

భక్తులందరు లేచి
ప్రార్థించుచున్నారు
భక్తాపరాధీన లెమ్మా! ॥అ॥

భక్త శిఖామణి
పావణి అరుదెంచె
ముక్తిప్రదాయినీ లెమ్మా! ॥అ॥

బ్రహ్మాండ మలరంగ
బ్రహ్మాది సురలెల్ల
ప్రార్థింపుచున్నారు లెమ్మా! ॥అ॥

బ్రహ్మ రుద్రాదులు
ప్రస్తుతి సేయంగ
బ్రహ్మ స్వరూపిణీ లెమ్మా! ॥అ॥

మేలుకొలుపుల నడక, శైలి, అందలి అర్థం చూడండి:

మేలుకో సుగుణాల
వాలా జానకిలోలా
భక్త పరిపాలనా
మేలుకో! ॥మే॥

వాలాయముగ మమ్ము
పాలించు వేళాయే
ఓ వైకుంఠవాసూడా
మేలుకో! ॥మే॥

తీరైన కస్తూరి
తిలకంబు జారిందీ
తీర్చిదిదావలె
మేలుకో! ॥మే॥

భేరి మృదంగీ
వీణాది రవమూలు
భోరూ కొలుపసాగె
మేలుకో! ॥మే॥

అత్రివశిష్టాది మునులు
మీా కృపగోరి
పాత్రులై వున్నారు
మేలుకో! ॥మే॥

పారిజాతా కుసుమా
మాలికా చేబట్టీ

నారదా మునీ వచ్చె
మేలుకో! ॥ మే॥

ఇది మేలుకొలుపే పాట, యిదో వరుస!

జాజిపూల జలకమాడి
పాలవెల్లి పాలకెక్కి
అత్తయింట నడుగుపెట్టి
మొగుడు రాగ మొగముదాచి
ఎందు కింత సిగ్గుపడుదు
వేల నీకు యింత సిగ్గు?
తాడిచెట్టు తలనుదన్ని
తాత నీడ తరిగిపోయె

నిదురలెమ్మ నిమ్మకాయ
కళ్ళువిప్పి కందపిలక
త్వరగ లెమ్మ తల్లిగాదె
చిలుకవచ్చి చెట్టుమీద
పిలుచుచుండె పిల్ల నిన్ను
వేగలెమ్మ వెన్న యిదిగో!

పాడుకోడానికి అంత యిదిగా వుండదు యిది - మేలుకొలుపులు అనగానే భూపాళరాగంలో గొంతెత్తి పాడుతుంటేనే వినాలి - అందలి సంగీత సుధారసాన్ని ఆస్వాదించాలి!



# 17

లాలిపాటల కమ్మదనం, జోలపాటల సొగసు, ఉయ్యాల ఊపుల హాయి తెలియని వారుండరు - జీవితంలో ప్రథమ ఘట్టం - వీటితో నే ప్రారంభం! లాలిపాట-విని హాయిగా నిద్రించే పాపలకు అందలి కమ్మదనం, తియ్యదనం బాగా తెలుసు-వారు చెప్పలేకున్నా - ఆనందం అనుభవించగలరు! చెట్టుక్రింద ఏ కొమ్మకో చీరకట్టి అందులో పాపడ్ని ఊపుతూ పాడినా, పెద్ద మేడలో పట్టు ఉయ్యాలలో ఊపినా బాలలకు ఏం తెలియదు - ఇద్దరూ వినేది లాలిపాటనే, ఊగేది ఉయ్యాలలోనే-హాయిగా నిదురించేందుకే! ఒక్కొక్కప్పుడు ఈ జోల, ఊయల పాటలను వింటుంటే పెద్దవాళ్ళకే కునికి పాట్లు వస్తాయి - అటువంటివి ఎన్నో పాటలు వున్నాయి.

చూడండి వీటినే ఇంగ్లీషులో "లల్లబీ" లంటారు, హిందీ భాషలో వీటిని—"లోరియా" లంటారు!

లాలి(శ్రీ) జనలోల
లీలా వినోదా
లాలి ద్వారకపురీ
బాల గోపాలా!

తొలుత బ్రహ్మాండంబు
తొట్టిగా వేసి
నాలుగూ వేదములు
గొలుసు లమరించీ।
బలువైన ఫణిరాజు
పాన్పు లమరించీ।
చిత్రమగు యేటి
దూలములు వేసి। ॥లాలి॥

అందముగ జాంబవతి
చందనము పుయ్యా।
పొందుగా కాళింది
పూవు లందియ్యా।
మందయానయు రాధ
మనపులందియ్యా।
ఇందుమతి లక్షణా
వింజామరెయ్యా। ॥లాలి॥

చుట్టుగోపస్త్రీలు
తొట్టె నూచంగా
కోటరంగారాజు
కోర్కెలొసగంగా ||లాలి||

మరో జోల పాట:—

జోజో ముద్దులబాలా
జోజో పరమసుశీలా
జోజో భారతపుత్రీ
జోజో పావనగాత్రీ ||జో||

చిన్నమోమూ చిన్నబోవా
కన్నులూ చెదరి ఏడవనేల
కన్నతల్లి కారణమేమొ
కన్నులు మూయవె కనకపు బొమ్మా ||జో||

దంతపు టుయ్యాలలోను
ధగధగ మెరిసేటి పానుపుపైనా
చింతలేకా నిదురబోవా
ఇంత యగడమేలతండ్రీ ||జో||

పాలుత్రాగినా డేవాడూ
పాడవలయును సీతాచరిత
కన్నతల్లీ కారణమేమే
కరములెత్తె ఆడవెతల్లి ||జో||

ఈ నిదురపాటను వినండి:

నిదురాపోడమ్మా
మం రామయ్యా!
బెదిరీనాడమ్మా
నిదురపోడమ్మా!
మదవాతీ తానెంతో
నిదురబుచ్చిన గాని
బెదరీ బెదరీ చూచు! ॥ని॥

లోలాక్షిరో పశి
బాలాలతో గూడి
ఆడూకోబోగా నే
గాలీ సోకినదేమో! ॥ని॥

మచ్చికతో నెంతో
గ్రుచ్చీ కౌగలించి
చిచ్చుకొట్టి నా కన్నులు
విచ్చి విచ్చి చూచు ॥ని॥

కలలోనా యూవది
తలలా వాడూ వచ్చి
ఎదుటా నిలచీనటుల
పలుకారింపసాగె ॥ని॥

కరదూషణాదులకే
కా దురవస్థలను చెంది
పరమపురుషులు చూసి
పరితాపామొందేను! ॥ని॥

హేతువా దెలసీయూ
భూతావైద్యుని పిలిచి
నాతీరతూ రేకు చేతాగట్టిస గాని
గట్టిగా మనము పశిష్టుని
పిలిపించి దిష్టివిభూతైనా
నుదుట పెట్టాగానే ॥ని॥
వచ్చీపసుప్రాసున్నం
తెచ్చీవసంతంచేసి
ఎర్రనీనీళ్ళుపోసినాగాని ॥ని॥
మేలుకోడాని కే
యూరకుండాడూ
వాలాయముగ
వేంకటచలపతి! ।ని।

పౌరాణిక విషయాలతో కూడి నడుస్తూండడంకూడా పీటిల్లో మనం వింటుంటాం।

కృష్ణుని సంభోదిస్తూ పాడే పాటయిది:

లాలీబాల కృష్ణాలాలీ
లాలీయనుచు బంగారుయ్యాల నీకువేసిరి
వయ్యారముగాను గొల్ల
తొయ్యాలెల్లనూ చేదారయ్యాకృష్ణయ్యా
ముద్దులయ్యా నెయ్యాములార ।లా।
నీటుగల తొట్టి బాలుండాటమాని నిదురపోర
సాటిలేనిమాట నేలా
కోటిరత్నాలామూట। ।లా।

తెల్లవార గొల్లపిల్లలెల్ల
నిన్నల్లు కోనచు
నుల్లమొల్ల సిల్లానటూ
నెల్లాసనింతుగానీ |లా|
లేచి, సదుపోవాకున్నా
బూచివారాలొచ్చినిను
దోచుకొనిబోదూరు
నే నోచిన నోములపంట |లా|

భామాలే మొదలే లేసుల
మీమదినికోరి నార
రామల లాములను
ప్రేమదీర పెండ్లిచేయు! |లా|

ఈ 'లాలి'ని పరికించండి:

బాలగోపాల రార
ఉయ్యాల లూగ। |బాల|
బాలగోపాలను రార
పాలూవెన్నార గించా
నీలావర్ణుడ రార
కాళింగ మర్దనుడ! |బాల|

బంగారు తొట్టెలోనూ
చెంగావి మొత్తా వేసి
శృంగారించెదను రార
ఓహోరి కృష్ణా! |బాల|

గొల్లావారిళ్ళలోనూ
కుండా పెరుగారగించి
దండితనము సేయకురా ।బాల।

అండజానా రక్షక
పుండరీకాక్ష వరదా
పుళ్ళు పాలూ పెరుగు
మన యిళ్ళనే కలవు దేవా! ।బాల।

మంగళ వీణా
వాయిద్య సంగీతమ్ములే
పాడుచు పొంచు తొట్టెలోను
రంగయ్య నిదురపోరా ।బాల।



# 18

వేదాంతపరం, తత్త్వప్రబోధ పూరితం అయిన పాటలు చాలా రూపాలలో వున్నాయి. 'తుమ్మెదా' అన్న సంబోధనతో నడిచిన వేదాంతపర పాటలు విన్నాము. 'నరుడా' అన్న సంబోధనతో 'చిలుకా' అన్న సంబోధనతో, 'కూనలమ్మ' సంబోధనతో "ఒరే ఒరే", "నిజం నిజం", "మనసా". సంబోధనలతో వేదాంత పరంగా ఎన్నో పాటలు మనకు వినిపిస్తూనే వున్నాయి.

తెలుగునాడున ఎందరో యోగిపుంగవులు జన్మించి ఎన్నో తత్త్వాలను ప్రబోధించారు. అవిచాలా ప్రచారంలో వున్నవే!

అసలు మన తెలుగుసీమలను పరికిస్తే గ్రామానికో 'సిద్దప్ప', నగరానికో 'బ్రహ్మం' వున్నారా అనిపిస్తూంటుంది.

పేరుతో కొందరు, అజ్ఞాతంగా మరికొందరు, ఎదుటి వ్యక్తిమీద పెట్టి మరికొందరు, కాకిమీదా, చిలుకమీదా, చెట్టుమీదా, పుట్టమీదా, తుమ్మెదమీదా అలా ఎన్నో రచనలు వెలువడినాయి!

ఈ తత్త్వాలను చదువుతూంటే - వింటూంటే మనం కూడా వయసు మళ్ళి, జీవితంమీద విరక్తి చెంది, ఆ దివ్య ప్రబోధపు పొలిమేరల్లో అడుగేసి సిద్ధప్ప శిష్యులుగానో, బ్రహ్మంగారి శిష్యులుగానో అయి మనకు తెలియకుండానే - మనలోంచి ఒక్కసారి 'వేదాంతం' పెల్లుబికి పొంగిపోతూంటుంది - మనుషున్ని అంతగా అవి ఆకర్షించి ఆకట్టుకుంటాయి.

ఈ మాటలు ఎంతవరకూ నిజం అన్నది ఈ క్రింది పాటలను పరికించడంద్వారా పరిశీలిద్దాం:

మూన్నాళ్ళ ముచ్చటకు
మురిసేవు తుళ్ళేవు
ముందుగతి కానవే - చిలుకా
రామచిలుకా! ||మూ||

ఏనాడో ఏ తీరో
ఎవరు చెప్పాగలరు!
ముందుగతి కానవే - చిలుకా
రామచిలుకా! ||మూ||

ఊరికీ ఉత్తరాన
ఊడలా చెట్లలోనా

ఉండాది నీ యిల్లు - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

యీ యిల్లు యీ దొడ్డి
యిల్లాలు పిల్లలూ
ఏది శాశ్వతమమ్మ - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

శత్రులే పుత్రులూ
ఋణపోళ్ళు చుట్టాలు
భార్య మెడకూ లంకె - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

నీ మేలు నీ మంచి
నీ వరము కానుకో
నీకు ఎవ్వరు లేరు - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

యిల్లు యిల్లన్నావు
యిల్లు నాదన్నావు
యింటిలో ఏముంది - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

కట్టులే సుట్టాలు
బట్టలే బంధువులు
పై బట్టరాముడే - చిలుకా
రామచిలుకా! ॥మూ॥

అగేలా మరో తత్త్వం చూద్దాం:

తెలిసీ తెలియక నీవు
చెడిపోకే మనసా – నీ
తలపు రామునిపైనా
నిలుపావె మనసా! ।తె।

ఆరుమూటిని కూడి
కోరాకే మనసా – నీ
వాడూ మూఢై పోకు
అయ్యయ్యో మనసా! ।తె।

సిరి సంపదలూ చూసి
మరువాకె మనసా!
ఇది తెరచాటు బొమ్మలాట
తెలువే ఓ మనసా! ।తె।

ఆలి బిడ్డల చూసీ
అతి మోహావడకే – నీ
కన్ని జన్మములా
వారేరీ మనసా! ।తె।

పర భామలా పేతూ
పడబోకే మనసా – నీ
పరలోకాయము బాధ
పడలేవె ఓ మనసా! ।తె।

ఉన్నవారిని చూసి
ఉబ్బాకే ఓ మనసా

పర తత్త్వ మార్గంబూ
గనుగొనవే ఓ మనసా! ।తె।

అలాగే 'కూనలమ్మ' పదాలని తత్త్వ పూరితమైనవి చూడాం. ఈ "కూనాలమ్మ పదాలు"కు "కూనిరాగాల"కూ సంబంధం ఏమిటో?

ఈ కూనలమ్మ పోతరాజు భార్యకూడా! ఈ 'కూనాలమ్మ' పదం, శబ్దం చాలా-చోట్ల వినిపిస్తూంటుంది.

అన్న మిచ్చినవాని
నాలి నిచ్చినవాని
నపహాసించు : హాని
ఓ కూనలమ్మా!

ఆడితప్పినవాని
నాలి నేలనివాని
నాదరించుట హాని
ఓ కూనలమ్మా!

భీష్ముడను భవశాలి
భీముడే బలశాలి
కర్ణుడే గుణశాలి
ఓ కూనలమ్మా!

దుర్యోధనుడు భోగి
ధర్మ రాజొక జోగి
అర్జునుండే యోగి
ఓ కూనలమ్మా!

కవితా రసపుజల్లు
ఖడ్గాల గలగల్లు
కరణాలకే చెల్లు
ఓ కూనలమ్మా!
కాపువాడే రెడ్డి
గరిక పోచే గడ్డి
కానకుంటే గృడ్డి
ఓ కూనలమ్మా!
మగని మాటకు మాట
కెదురు బల్కెడి బోటి
మృత్యుదేవత సాటి
ఓ కూనలమ్మా
జపతపంబులకన్న
చదువు సాములకన్న
ఉపకారమే మిన్న
ఓ కూనలమ్మ!!

చాలాకాలం క్రిందటే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ "బాలభాష"లో ఈ "కూనాలమ్మ పదాల"ను యిచ్చారు. ఈ పాట యింకా వున్నట్లు తోస్తుంది.

ఓ కోడలమ్మ!
ఓ కోడలమ్మ!!
అదరగొట్టేవాని
హద్దుమీరేవాని
ఆదరించుట మోసమన్నా!

ఆడి తప్పినవాని
ఆలి మరచినవాని
ఆదరించుట మోసమన్నా!!

ఇలాంటి చరణాలు అక్కడక్కడా "కూనాలమ్మ" మాదిరిగానే "ఓ కోడలమ్మ" సంభోదనగా వినిపిస్తాయి ॥

"యాగంటి" పదాలు కొన్ని వున్నాయి. "ఏగంటి లింగా" అని సంబోధించినవిలాంటివి. ఈ క్రింది చిలుక ప్రబోధంలో "యాగంటి గురుపాదములు చేరి..." అన్నది గమనార్హం.

చెలగి చెప్పెద బుద్ధి
చేకొనీ వినునీవు
చింతమీదా నుండు – చిలుకా!
కులముతో వైరంబు
కోరగాదు మిక్కిలీ
గూడు వెళ్ళకయుండు – చిలుకా!
పట్టుబడలేని యాపదలకై
కెమ్మోవి పండ్లకీ రాకుమీ – చిలుకా!
పట్టముట్టగరాని బట్టబైటను తేనె
పండువున్నది చూడు – చిలుకా!

గురువైన యాగంటి
గురుపాదములు చేరి
గిరిగడుచియమీాది – చిలుకా!

సిరులు మాయని తెలిసి
జీవగుణమది యెరిగి
చిగురు చేతలంబోకు — చిలుకా!!

"బేట్రాయి సామిదేముడా" అని, "పేట్రాయి సామిదేముడా" అని కూడా వినబడే ఈ పాటలు అవతారములను గురించిన వర్ణన. దీనిని తూర్పుగోదావరిజిల్లా ప్రాంతాలలో సంపాదించినదని గుర్తు. రెండురకాలుగా కనుపించే ఈ పాటలును రెంటినీ పరికిద్దాము:

పేట్రాయి సామిదేముడా
మమ్మేలి నోడ
పేట్రాయి సామిదేముడా!

కాటమీరాయుడా
కదిరి నరసిమ్ముడా
సిరైన యాటకాడ
నిన్ను గోరి నమ్మినోడ ॥పేట్రా॥

చేప కడుపున చేరి
పుడితివి రాకాసి గాని
కోపమూని
కోరి కొడితివి

ఆ పెన్నిటిలోన
బలసి గ్రక్కున దూరి
బాపనోళ్ళ సదువులెల్ల
బెమ్మదేవుడి కొచ్చినోడ ॥పేట్రా॥

తాబేలై తాను
పుట్టగా ఆ నీళ్ళకాడ
దేవాసురులెల్ల సూడగా

తావు సూపి కొండ క్రింద
దూరగానె సిల్కినపుడు
చావులేని వెన్నమందు
దేవర్ల కిచ్చినోడ ॥పేట్రా॥

అందగాడ వపుడులేవయా
గోపాల గోవింద
రచ్చింప రావయా

వందిలోన సేసుకోని
పంటభూమి నెత్తి క్రింద
సిందర సిందర సేసినట్టి
సందమామ నీవె కావ ।పేట్రా॥

నారసిమ్మ నిన్నె నమ్మితి
నీ నాటనే
కోరితి నీ పాదమే గతి ॥పేట్రా॥

ఘోర కొలువు కంబాన
సేరిపెమలాడు గాసి
కోరమీసమైన
శత్రుగుండెలగల జీల్చినోడ ।పేట్రా।

బుడుత పాపనయ్యావైతివి
ఆ చక్రవర్తి

నడిగి భూమి
తెలుసుకొంటివి!
పొడుగు కాళ్ళోడవై
అడుగువానిమీద బెట్టి
తడవులేక లోకమెల్ల
పుడికొక్కని తిరిగినోడ ।పేట్రా।
రెండుపదులు ఒక్క మారుతో
ఆ దొర్ల నెల్ల చెండాడి
తారపరసుతో
చండకోలబట్టి
కోదండరామసామి కాద
చెండుకోల సేనుకోని
కొండకప్పు డేగినోడ ।పేట్రా।
రామదేవ రచ్చింపరా
మా కెల్ల భూమిలోన
బుద్ధి సెప్పరా!
ఏమి తప్పు సేసినోడ
సామినాయప్ప బుద్ధి
నీ మనసు చల్లదనము
మా మీదా నూపరోరి ।పేట్రా।
దేవక్కదేవి కొడుకురా మాకెల్ల
దేవుడై నిల్చినావురా
ఆవుల మేపుకోని
ఆడోళ్ళ గూడుకోని

తావు బాగ సేసికోని
తకిడి చికిడి సేసినోడ |పేట్రా|
వేదాల నమ్మరాదనీ, చాత్రముల
వాధాలు బాగులేదనీ
బోధాలు సేసుకోని
బుద్ధులు సెప్పాకొన్న
నాద వినోదనయ్యా
నల్లనయ్యా నీవె కావ ||పేట్రా|
కలికి నా దొరవు
నీవెరా నాతోడ
పలుకవేమి
బాలకృష్ణుడా!
సిల్లగట్టు పురమునందు
చిన్నిగోపాలుడై
పిల్లనగ్రోవి వట్టుకోని
పేటపేట తిరిగినోడ
పేట్రాయి సామిదేవుడా
మమ్మేలినోడ
పేట్రాయి సామిదేవుడా!!

దీనిలాగే సాగి, యిదే వర్ణనతో కూడిన రెండవపాట కూడా పరికిద్దాం :

బేట్రాయి సామిదేవుడా
నన్నేలినాడా
బేట్రాయి సామిదేవుడా!!

కాటామరాయుడా
కదలి నారసింహుడా
నీవైన వేటగాడా
నిన్నే నమ్మియుంటినయ్యా ||బేట్రా||

చేపకడుపు చేరిపుట్టగా
రాకాసివాని
కోపమూన చేతబట్టగా
ఓపినీవు నీళ్ళలోన
వచ్చినీవు వెతికి వెతికి
బాపనోళ్ళ చదువులన్ని
బెమ్మదేవుడ కిచ్చినోడ ||బేట్రా||

తాబేలై తానుపుట్టగా
ఆ నీళ్ళకాడ
దేవరాక్షసులెల్ల కూడగా
తోవచేసి కొండక్రింద
దూరగానె చిలికిచిలికి
పావనంబైన యెన్న
దేవర్ల కిచ్చినోడ ! |బేట్రా|

అందగాడవౌదు లేవయ్యా
గోవింద గోపాల
రక్షింపరావయ్యా
పందిలోనచేరి కోరి

పట్టి చేత ఎత్తిభూమి
చిందుబిందు చేసినట్టి
సందమూమ నీవెగదరా! ॥ బేట్రా ॥

నారసింహా నిన్నెనమ్మితీ
ఏనాటికైన మీా పాదమేగతి
ఓరి నీవు స్థంభాన
వచ్చి ప్రహ్లాదుగాచి
కోరమీాసమెల్ల దువ్వి
గుండెచల్లన చేసినోడ! । బేట్రా ।

బుడతపాపనయ్యా వైతివీ
ఆ చక్రవర్తి
అడుగుభూమి నేలుకొంటివీ!
పొడుగుకాళ్ళవాడవై
అడుగు వానిమీాదపెట్టి
తడవులేక లోకమెల్ల
మడవచేత తొక్కినోడ! । బేట్రా ।

రెండుపాదల నొక్కసారిగా
ఆ పాదలనెల్ల చెండాడి దేడుపట్టగా
వెండికోత భమిడికోత
దండకాలు చేతబట్టి
దొడ్డసామి నీవు నా
కొండకివ్వడొచ్చినోడ! । బేట్రా ।

రామదేవర రక్షించరా
ఈ జగతిలోన మాకెల్లరికి
బుద్ధిచెప్పరా !
ఏమితప్పు చేసినామొ
సామి నా అప్పజూడ
నీవంటి చల్లదనం మామీద
నుండజూపు |బేట్రా|

దేవకీదేవి కొడుకువై
ఈ జగతిలోన దేవుడవై
నీవు బుట్టితీ
ఆవులనూ కాచుకుంటు
ఆడోళ్ళను చూచుకుంటు
టక్కుటిక్కు చేసినోడ! బేట్రా|

వేదాలూ నమ్మరాదయా
ఆ శాస్త్రాలూ బోధాలూ
బాగులేవయ్యా!
వేదాలు చదువుకొంటు
సుద్దాలు చెప్పుకొంటు
నాదా వినోదుడవైన
నల్లనయ్య నీవె గదర ||బేట్రా||

కలిగినా దొరవు నీవయా
నన్నింక రక్షించరా
బాలకృష్ణయ్యా

పుల్లంగంటి పురమునాను
చిన్నా గోపాలుడవై
పిల్లంగోరు చేతబట్టి
పేట పేట తిరిగి గోడ ॥బేటా॥

వడ్డెకులమునందు బుట్టితీ
నీ విచ్చినట్టి మట్టిబుట్ట
చేతబట్టితీ!
ఊరు ఊరు తిరుగుకుంటు
ఉన్నోళ్ళని చూసుకుంటు
నీవూ నే నన్న మాట
నిక్కముగా తెల్పు సామి ॥బేటా॥

"వడ్డెకులమునందు బుట్టితీ, నీ విచ్చినట్టి మట్టిబుట్ట చేతబట్టితీ" అన్న చరణం ఆధారంగా ఈ పాటను మట్టి త్రవ్వే ఉప్పర్లు, వడ్డెవారు పాడతారని అనుకోందాం.

పంచేంద్రియాలతో నిర్మాణమైన ఈ పడవపాట వినండి, చుక్కాని బ్రహ్మాదిట, ఎందరో దేవతలు ఎక్కారుట. ఖర్మలకు ప్రతిధ్వనిగా తెరచాప ఆడుతూందిట. సత్యమనే జ్యోతి వెలుగుతూంటే పయనిస్తూంది. కాలమనే కింకరులు లాగుతూండే పడవట – చూడండి :

పడవెళ్ళిపోతున్నదీ
ఓ భక్తులార!
పడవెళ్ళిపోతున్నది!!
బానురముగ సంసార
భవజలధిలోనుండి ॥పడ॥

దీనిలో గొప్ప ప్రభువుండె
గానారేమి
పంచభూతాములందు
పంచి వేసినా కపడవ
గాంచగనె నైదు
గదులతో కూడున్న ॥పద॥

పాల్నెయ్యి పెరుగులతో
మేల్ మేల్ మెరుగులతో
వాలాయముగా నెన్నో
వన్నెలూ కల్గియుండ
కాలా మను కింకరులు
కనిపెట్టి ఈడ్చుచుండ ॥పద॥

చంద్ర సూర్య్యలాదిగా
ఇంద్రాదు లెక్కిరిగా
ముందుగా గణపతీ
ముక్కోటి దేవతలు
ఎందరో ఎక్కినారు
ఇది ఏమి చోద్యమో ।పద।

చుక్కాని బ్రహ్మాదండీ
పడవకూ మిథ్య ఉక్కు
స్తంభముగానుండీ
గ్రక్కునను వైమానుగట్టీ
తెరచాపగుడ్డ పెక్కు

ఖర్మాత్రైమాను
పెనుగాలి వీచుచుండ ।పద।

సత్య మైనట్టి
జ్యోతి సొంపుగా వెల్గుచుండ
అబ్బబ్బ! తీర్చుకొని
ఔరౌరా యనుచుండె ।పద।

మోహా జలధిలో
పడుపుచూ మునిగీ
పోకుండా బాహుబలము
ననూచుచూ
ఆహా! విజ్ఞాన విరతి
యని కళాసులు గూడ
సాహసమున హరిని పాడి
సోహమును గెలు చేయ ।పద।

ఆంధ్రదేశంలో భక్త రామదాసు పేరు వినని వారు ఉండరు. అలాగే ఎడ్ల రామదాసు పేరూ ఏదో సమయంలో వినకుండా వుండరు. ఈ క్రింది పాట ఎడ్ల రామదాసుదే వినండి!

ఈశ్వరా పరమేశ్వరా
జగదీశ్వరా కరుణించరా!
శాశ్వతుడవని వేడితిని
విశ్వాస ముంచర ఈశ్వరా!
ముందు జేసిన పూర్వకృతములు
ఇంక బాపుము ఈశ్వరా!

పొందుగా మీ పాదపద్మను
జెందియుంటిని ఈశ్వరా!
కపట విద్యలు నేర్చి పొట్ట
గడుపుచుంటిని ఈశ్వరా!
నెపము లెన్నక నన్ను
నీకృప నేలుమీ పరమేశ్వరా!
ఆరుగురు శత్రువులు నాపై
క్రూరమొందిరి ఈశ్వరా!
పరమమంత్రముచేత శత్రువుల
నణచవలె పరమేశ్వరా!
తొమ్మిదీద్వారముల కొంపిది
నమ్మనేటికి ఈశ్వరా!
బొమ్మలాట పాలుచేసి
బ్రోవకుంటివి ఈశ్వరా!
మూడుగుణములు విడువజాలక
మోసపోతిని ఈశ్వరా!
వేడ్కతో నీ మాయదాట
నుపాయమేదో ఈశ్వరా!
చంక దుడ్డెమ కింకరులకు
జంకనేరను ఈశ్వరా!
అంకమందున జేర్చి సద్గురు
శంకదీర్చర ఈశ్వరా!!

ఈ "కృష్ణయజుర్వేదం" అన్న తత్వం కూడా శరీరంతో పోల్చి పాడినదే. ఈ పాటలో చాలా ఇంగ్లీషుపదాలు

దొర్లాయి. దీనినిబట్టి ఈ పాట ఈ మధ్యలో ఇంగ్లీషు సంపర్కం వున్నవారిద్వారా వెలువడివుంటుంది అనుకుంటాను—"గుమాస్తా" - "సూపర్నెంటు" - "లాకు" - పదాలు గమనార్హములు:

కృష్ణయతండ్రీ
ఓ కృష్ణయతండ్రి!
నా కష్టములు తీర్చవయ్యా
కృష్ణయతండ్రీ!!

ఘోరమైన సంసార
సముద్రమూ
నీనామమనే నావమీాద
నే దాటెదా! ॥కృష్ణ॥

రాగలోభ మోహామనే కళాసులు
పడవ లాగివేయుచున్నారయ్యా
కృష్ణయతండ్రీ! ॥కృష్ణ॥

బుద్ధియనే గుమాస్తా
కృష్ణయతండ్రీ!
చుక్కాని బట్టి త్రిప్పుచుండె
కృష్ణయతండ్రీ! ॥కృష్ణ॥

జ్ఞానమనే సూపర్నెంటు
కృష్ణయతండ్రీ!
లాకుచక్ర మేయుచుండెనయ్యా
కృష్ణయతండ్రీ! ॥కృష్ణ॥

మనసుయనే త్రాడుబట్టి
కృష్ణయతండ్రీ!
తెరచాప పట్టి లేవనెత్తి
కృష్ణయతండ్రీ ||కృష్ణ||
ఏటిలోనా నీరులేదు
కృష్ణయతండ్రీ!
చాలింపుమయ్యా పడవబాట
కృష్ణయతండ్రీ! ||కృష్ణ||
పడవ మునిగిపోకముందె
కృష్ణయతండ్రీ!
పరమపదవిలోన చేర్చవయ్యా
కృష్ణయతండ్రీ!! ||కృష్ణ||

ఇదీ తత్త్వమే గమనించండి:

బ్రహ్మమేదో తెలుపరయా
బ్రహ్మజ్ఞులారా
భ్రాంతిలేకా జీవునికీ
ఖర్మరహితమైన మోక్ష
గతిని పోయేటందు కిప్పుడు ||బ్రహ్మ||
యజ్ఞక్రతువులంట
యోగ యోగములు సమముగ చేసి
భావము మీరా కోరిగినందుకు ||బ్రహ్మ||
రేపుమాపు సంధ్యా వార్చి
రేచించీ ఓంకారమందూ
ఆహుతి మరగినందుకు ||బ్రహ్మ||

ప్రొద్దెరిగి పొద్దున్న
లేచి పొద్దు చెప్పి
పంచాంగము న్యాయము
మీం రెరిగినందుకు ॥బ్రహ్మ॥

మరొకటి :-

మాయా కాయమురా
మమతలలో
పడి చెడితివిగదరా ॥మా॥

అడియాసలతో పడుచేగానీ
కట్టుకుపోయే దేమిటిరా జీవా ॥మా॥

కట్టెబొగ్గులో కాలేటప్పుడు
గవ్వరాదురా నీ వెంబడినీ
ఏటికి నీ యారాటంబింకా ॥మా॥

ఎప్పుడో ఏమో ఎరుగ్గమురా
త్వరపడరా కడతేరెడు
గతి కనుగొనరా జీవా ॥మా॥

ఈ తత్త్వంలో నీతి, ప్రబోధంకూడా వుంది:-

నాదబ్రహ్మానందయోగి వీడు
వేదాంతసారము వినిచే బైరాగి
రాజసంబు దుఃఖదమురా ఘన
రాజయోగమార్గమే సౌఖ్యమురా ॥నాద॥

65)

చిత్తశుద్ధి కలిగియుండు భక్తి
జేరి సద్గురు నీవు సేవించుచుండు ॥నాద॥

మత్తత్వము లేక యుండు – స
మస్తమింద్రజాలమంచూరకుండు
పెద్దల నిందించవలదు ఒరులు
పీడించినా నీవు భీతిల్ల వలదూ ॥నాద॥

వణిత లేకున్న దుఃఖమురా – కాని
వణిత గల్గెనేని వంగదుఃఖమురా
ధనము లేకున్న దుఃఖమురా – చాల
ధనము గల్గెనేని దాచదుఃఖమురా ॥నాద॥

పచ్చికుండవంటి మేను – ఇది
చచ్చుగాక ఆత్మ చావ దెన్నడును
విచ్చికుండ వ్రక్కలైనా – లోన
హెచ్చియున్న బయలు విచ్చి రెండౌన ॥నాద॥

తల బ్రద్దలు కొట్టుకొన్నా అర్థం కాని – భావంలో భాషలో – ఈ తత్త్వాలు వున్నాయి. కొన్ని కొన్ని తత్త్వాలు ఒకే మాదిరిగా వున్నట్లు వున్నా కొంచం కొంచం తేడా కనుపిస్తుంది.

చిలుకాను పెంచాను
యెదముద్దూ లాడేను
కనుసైగ లేదయ్యో చిలుకా!
మూణ్ణాళ్ళ ముచ్చటకు
మురిసేవు దిరిసేవు
ముందు గతి కానవే చిలుకా!

కుక్కి మంచంమీద
కూలబడిపోతేను
దిక్కెవ్వరే నీకు చిలుకా!

ఇల్లు యిల్లనియేవు
ఇల్లు నాదనియేవు
నీ యిల్లు ఎక్కడే చిలుకా!

ఊరికీ ఉత్తరాన
సమాధిపురములో
కట్టె యిల్లున్నదే చిలుకా!

కట్టలే చుట్టాలు
కట్టెలే బంధువులు
కన్న తల్లెవరే చిలుకా!

నువు కాలిపోయేదాక
కావలుందురు గాని
వెంట నెవరూ రారు చిలుకా!

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ కలిసి చేసిన యంత్రమే మనిషి. తొమ్మిది దర్వాజాలు (నవరంధ్రములు గలది) తో తయారయింది.

విష్ణు, ఈశ్వర, బ్రహ్మ ముగ్గురూ
అన్నదమ్ములంట!
ఈ భూదేవి ఆకాశవాణికీ
వీరె కర్తలంట!

వారి మహిమతో చేసిరీ ఒక
మట్టిబొమ్మనంట
ఈ తోమ్మిది కిటుకుల దర్వాజాలా
మాటలాడుకుంట |విష్ణు|
వస్తావట్టిదె పోతావట్టిదె
ధర్మము తన వెంట
సాంబశివుడు నిను పిలువనంపినడు
జల్దిగ రమ్మంట |విష్ణు|
చేతిలో బెల్లం ఉన్నంతసేపే
కాకి బలగమంట
చేతిలో బెల్లం సరిపోయినాక
ఎవరు రారు వెంట |విష్ణు|
ఇంటి ముంగిటా పిల్ల మేకలు
ఇల్లు బలగమంట
ఏడ్చేవారు మరి ఆర్చేవారు
ఎవరు రారు వెంట |విష్ణు|
తోలినాడు యములోళ్ళనైన తను
గుంజుకు రమ్మంటా
యములోళ్ళంతా చుట్టు నిలచినరు
తాళ్లూ తెమ్మంటా! |విష్ణు|
చిన్న పెద్దలూ కూర్చున్నారు
చింతలు పడుకుంట
నీళ్ళుబోసి కూర్చుండబెట్టినరు
మాయ బొమ్మనంట! |విష్ణు|

పువ్వులదండలు వేసినారయ్యా
మాయ బొమ్మకంట
దింపుడు కల్లము
కాడ దింపినరు
మాయ బొమ్మనంట! ।విష్ణు।

సొమ్ము సమస్తము తీసుకున్నరూ
పోతరు వారంత
గురువు పోస్తాడూ
శంఖు తీర్థమూ
ముక్తిఫలము కంటా! ।విష్ణు।

మంట్లో మన్ను కలిపినారు ఈ
మాయ బొమ్మనంటా
ధన ధాన్యంబులు
ఎవరి పదార్థము
ధర్మమె తన వెంట
చేసిన పుణ్యము పాపకర్మములె
వచ్చును తన వెంట! ।విష్ణు।

పైన చదివిన తత్త్వంలో "చేతిలో బెల్లం ఉన్నంత సేపే కాకి బలగమంట, చేతిలో బెల్లం సరిపోయినాక ఎవరు రారు వెంట" - అన్న చరణం వేరే పాటలోంచి యిందు లోకి వచ్చిందా అని నా అనుమానం. ఆ చరణంతో కూడిన వేరొక పాటకూడా వుంది - ఆ పాటను పరికించండి:

చేతిలో బెల్లం
వున్నంతసేపే
కాకి బలగమంతా
ఆ సేతిలో బెల్లం!
అయిపోగానే
ఎవరు రారు వెంటా! ॥సేతి॥

ఒంట్లో సత్తువ వున్నంతసేపే
ఉంది నీకు జంటా!
ఆ ఒంట్లో సత్తువ సన్నగిల్లుతే
ఎవరు రారు వెంట! ॥సేతి॥

పెమిదలో నూనె వున్నంతసేపే
దివ్వె వెలుగులంతా!
ఆ పెమిదలో నూనె అయిపోగానె
దీపమారునంటా! ॥సేతి॥

ధన ధాన్యాలూ
భోగ భాగ్యములు
తూణిక సుఖములంట
సెర్లో చేపలు సెల్లిపోగనే
కొంగ లోలకంటా- ॥సేతి॥

ఎంతటి యాదార్థసత్యాన్ని ప్రభోధించాడో యీ తత్త్వంలో! ఇంతకంటే జీవితానికి వినిపించవలసిన మేలుకొలుపులు ఏం కావాలి చెప్పండి?

బ్రతికుండగా నువ్వు చేసేపనులకు తరువాత శిక్ష అనుభవించవలసిందీ నువ్వు, తెలుసుండీ తప్పులు చేసి పరలోకంలో బాధలు పడకు. మంచి మార్గం కనుగొని బ్రతుకు అంటూ రేపటి విషయాన్ని నేడే సూచిస్తోంది ఈ తత్త్వం:

తెలిసీ తెలియక నీవు
చెడిపోకే మనసా
నీ తలపూ రామునిపైనా
నిలుపవే మనసా!

ఆరూ మూటినికూడి
కులకాకే మనసా
నీ వారూ మూడైపోకు
అయ్యోయ్యో మనసా! ॥ తె॥

సిరిసంపదలు చూసి
మరువాకె మనసా
ఇది తెరచాటూ బొమ్మలాట
తెరువావే ఓ మనసా! ॥ తె॥

ఆలీ బిడ్డల చూసి
అతి మోహపడకే
నీ కన్నీ జన్మమూల
వారేగీ ఓ మనసా! ॥ తె॥

వర భామాలాపేక్షా
పడబోకే ఓ మనసా

నీ పరలోకా యమబాధా
పడతేవే ఓ మనసా! ।తె।

ఉన్నవారిని చూసి
ఉబ్బాకే ఓ మనసా
పరతత్వ మార్గంబూ
గనుగొనవే ఓ మనసా! ।తె।

ఎన్ని చేసినా చివరకు శాశ్వతం అనేది ఏదీ లేదుట -
చూడండి ఈ తత్త్వం యిస్తూన్న ప్రబోధం:-

ఒట్టిదీ మాయాశరీరం
గుట్టు తెలుసుకోనరయా
బట్ట బయలైనట్టి శాశ్వత
బ్రహ్మమును గనుగోనరయా! ।ఒట్టి।

ఉన్నదేదో లేనిదేదో
ఊహా తెలుసూకోనరయా
కన్నతల్లీ తండ్రి గురువులా
కరుణ చూడారేమయా! ।ఒట్టి।

ఎన్ని విద్యలు ఎన్ని ప్రజ్ఞలు
ఎన్ని నేర్చిన నేమయా
కల్ల సంసారంబులంబడి
కాసు వీసము రాదయా! ।ఒట్టి।

ఎల్ల బాంధవు లన్నదమ్ములు
ఎందరుండిన నేమయా

తల్లి పోయేనాడు ఎవ్వరు
తనకు సాయము రారయా! ॥ఒట్టి॥

వేరులేనీ చెట్టుకీ ఒక
పేరు లేనీ పండయా
పండుగన్నా వారి కిది
ప్రేమ దీరిపోనయా! ॥ఒట్టి॥

మరొక తత్త్వం - చిలుకని సంబోధించి ప్రబోధిస్తూంది.

చిలుకా పలుకదాయె
ఎవరు ఏమన్నారె నిన్నూ
గూటిలోనా రామచిలుకా
గురుని పాదం చెందెరా! ॥చి॥

చిలుకా పలుకదాయె
ఎవరు ఏమన్నారె నిన్ను ॥చి॥

అందమైన యిల్లురా యిది
బృందావనముండే స్థలమురా
బృందావనములో తిరుగు
చుండే రామచిలుకరా ॥చి॥

హరిచేతిలోనే ఒత్తి నలిపి
ప్రమిదలోనే నూనెపోసి
ప్రమిదచుట్టూ తిరుగుచుండే
రామచిలుకా! ॥చి॥

చిలుకా మోసమాయె
ఎవరు ఏమన్నారు నిన్ను
బద్దలల్లిన గూడురా యిది
బ్రహ్మ చేసిన మాయరా
మాయలోనే తిరుగుచుండె
రామచిలుకా!! ॥చి॥

ఈ తత్త్వమును పరికించండి—దీనిని ముంగండలో ఒక పండు ముదుసలివద్ద సంపాదించాను. ఇందలి వేదాంతధోరణి సరిగా అర్థం చేసుకోవడం కష్టం.

చిట్టిబొమ్మల పెండ్లి
చేసే సూజ్ఞానాంబ
చిత్రాము చూడరమ్మా!
ఘటములోపల పంచ
భూతముల బొమ్మలుచేసి
హితముగా ప్రమతో త్తముతో
వియ్యా మొంద
బూటకమనే బొంది
బొమ్మరిల్లుగ జేసి
పృథ్వితత్త్వము
పెండ్లరుగుగచేసి
దారిగా ఆకాశం
పందిరిగా చేసి
పుండరీకముల

అలివేణి కుండలుచేసి
తలుకు ఆశాజ్యోతి
తాళీబొట్టుగచేసి
ఫలబిందుజలము
వాసంతముగ జేసి
బలుసత్యశౌచము
భాషికంబులచేసి
చెలగి అణువులనెల్ల
శేషబియ్యముచేసి
సుగుణ సద్గుణము
కర్పూర గంధముచేసి
శృతులా విశ్వాసముల
వింజామరముచేసి
పరగ ఓంకారము
ప్రణవవాద్యముచేసి
ప్రియభక్తియనే రెండు
పేరంటాండ్రుగచేసి
కామక్రోధములను
కంకణంబులుచేసి
తనివి ప్రాణికి కన్యాదానముచేసి
పనిబూని సద్గురుని
పారోహితుని జేసి
తనదు సంతోషము
తాంబూలముగ జేసి

ఇలను చిల్లమూరి
యీాసూనెన్నగజేసి
పాపాబంధము లెడబాపగజేసి
వాసీగ పుద్దూరి
పురము వాసముచేసి
ఎలమ వెంకట్రాయు
నేలినా సుజ్ఞానాంబ !!

తుమ్మెద, ప్రభాత, చందమామ మొదలగు పదములను పాల్కురికి సోమనాథుడు (క్రీస్తుశకం పన్నెండు వందలు) పేర్కొని వున్నాడు. చివర 'తుమ్మెద' అని వాడడంబట్టి ఈ పదములకు 'తుమ్మెద' పదములు అని నామం వచ్చివుంటుంది. తుమ్మెద పదములలో అన్నీ వేదాంత పరమైనవి కావు - కాని ఈ క్రింది తుమ్మెదపదం వేదాంత పరంగానే నడుస్తుంది!

శివశివ అనమేలు తుమ్మెదా!
శివయంటేను వినమేలు ,,
శివుని భక్తులాకు ,,
శరణన్న మేలే ,,
శ్రీకంఠుడను పువ్వు ,,
మూడులోకమ్ము లాయెను ,,
సాకారమైయ్యుండు ,,
పర మేకాంతమున జూడ ,,
శివశివయనవే ,,

శివుడసగ వినమేలు తుమ్మెదా!
శివుని భక్తులాకు ,,
శివ శరణన్నమేలే ,,
ముట్టీముట్టని పువ్వు ,,
ముట్టింది జగమెల్ల ,,
ముట్టి చూడా వేల ,,
అది ముట్టిపాయాలేవె ,,
యవ్వాన మంచావ ,,
బహు పువ్వాల వాసన ,,
క్రొవ్వి నీవెరుగావె ,,
నీకు నెవ్వి నేరములేదు ,,
ఆరురేకుల పువ్వు ,,
అవి మీరిన వాసన ,,
వేరుసేయక నీవు ,,
శివు జేరి భజియించావె ,,
మేలు ఎరిగినీవు ,,
కేళి చరించావె ,,
ఏడుగురు రాజులు ,,
నీకు జూడబండ్లజోడు ,,
ఆశగోసి వేసి ,,
మోసపోకుమంటి ,,
రాశికెక్కుమంటి ,,
అష్టదళముమీద ,,
పెట్టి చెరించావె ,,

కష్టము నెరుగావె తుమ్మెదా!
స్రష్టవై యుండావె ”
తొమ్మిది వాకిళ్ళు ”
నీవు నమ్మి చరించావు ”
ముమ్మూల కోణాల ”
నీవు నెమ్మది నుండావె ”
పదిపదే నింటను ”
వెండి పదునొండు తావులను ”
మెదలాక నిల్చినా ”
నిన్ను కదిలించగలరటే ”
ఎనసితోటా పువ్వు ”
నీ వెనయమానలేక ”
దాని చేజిక్కిన ”
తోట వానిచేబడుదువు ”
నింగి నేలవేయ ”
గంగగాసు లేనినాడు ”
పొంగుచును నోరుబోడ ”
వేయి భంగుల నటియించు ”
వేయి రేకుల పువ్వు ”
అది వెలుగును జగమెల్ల ”
సద్దురు నడుగావె ”
పువ్వు సద్యజూపునీకు ”
గురునకూ హారునకూ ”
అంతరువు లేదేమి ”

గురుపాద పద్మాలు తమ్మొదా!
నిన్ను దర్శించుమంటిని ,,
శివ శివ అన మేలు ,,
శివయంటేను విన మేలు ,,

ఈ పాటను వినండి: "నేజూచినానె బ్రహ్మము నాలో" అన్న దానినిబట్టి బ్రహ్మంగారి దర్శనముగా చెప్ప వలసి యుంటుంది.

నే జూచినానె బ్రహ్మము నాలో
నే జూచినానె సద్గురు నాలో
నే జూచి నానె!
నే జూచినానమ్మ
నెలతరో తారక
రాజయోగమునందు
రంజిలు నాగురుని ॥నేజూ॥
కన్నుల నడుమాను
సన్నంపుదిడ్డినా
తిన్నాగ వెలిగేటి
పున్నమ చంద్రుని ॥నేజూ॥
ఫాలభాగమునందు
నీలజ్యోతుల నడుమ
ఓలలాడుచునున్న
పరలింగమూర్తిని ॥నేజూ॥
చూపుల లోపల
పాపల నడుమను

వ్యాపించి వెలిగెటి
ఆ పరంజ్యోతిని ॥నేజూ॥

చతురాగ్రమునందు
పశ్చిమ వీధిని
నిక్షేపమై వెలుగు
సాక్షీభూతిని నాలో ॥నేజూ॥

చందమామకు నడుమ
కుండలా కృతియని
ఆనందముగ నేడు
హరి హాతులూరయ్యా ॥నేజూ॥

అలాగే "చిలుక" ప్రబోధంతో మరో తత్త్వం.

మూర్ణాళ్ళ బులుపులకు
మురిసేవు భ్రమసేవు
ముందుగతికానవే – చిలుకా!

ఆరు పటములలోన
హంస మేడల్లోన
ఆటలాడే రామ – చిలుకా!

ఆటలేలా మనకు
పాటలేలా మనకు
మాటదెల్పా రామ – చిలుకా!

తొమ్మిదీ వాకిళ్ళు
ఈ తోలు కోటకు
దిమ్మదిరుగూ రామ – చిలుకా!

తలుపుదీస్తే పిల్లి
పొంచివేస్తున్నాది
తప్పించుకో రామ — చిలుకా!

సిద్దప్పగురుని నామ ప్రబోధంతో వెలువడిన ఈ తత్త్వం పరికించండి.

బాల చిన్నది గోలరా
కడు ముదిమి యవనము లేదురా!
నీలమేఘా మధ్యమందొక
మెరుపువలె మెరసేనురా ॥ బా॥

తొమ్మిదీ దరవాజులమరిన
మేడగది నున్నాదిరా
నమ్మకముగలబంటు
లాఘ్వగ కావలీ పెట్టిందిరా ॥ బా॥

సత్తుసిత్తుల తెలివితో
తను సిత్తమున యున్నాదిరా
తప్పకా తను కొలుచుబత్తుల
ఒప్పగా బ్రోసేదిరా ॥ బా॥

నిశ్చయముగ సిద్దయ్యగురునీ
వద్దగూసున్నాదిరా
ముద్దుగా గొలసేటిబత్తుల
ఒప్పుగా చూసేనురా ॥ బా॥

ఏనాటినుంచో మనం వింటూవస్తూన్న ఎన్నో "జానపద గేయాలు" నేడు సినిమాలలో కొంచం మార్పులూ

కూర్పులతో, వరుసల తేడాతో వినబడి అన్నింటికంటే యివే ఎక్కువగా ప్రజాదరణ పొందడం చూస్తున్నాం. ట్యూన్సను తీసుకున్నా, పాటలను పరికించినా వాటి వెనుక ఈ జానపద గేయాల ప్రభావం - బలం చాలావుంది. పేరుపేరున ఏ యే సినిమాలలో ఏ యే జానపద గేయాలు ఏరూపంలో - ఏ వరుసలో యివ్వబడిందో వ్రాయాలంటే అంతు అనేది వుండదు.

ఈ 'ఒకే ఒకే' పాటలాంటి వరుసలూ ఎన్నో మనం విన్నవే.

చిల్లర రాళ్ళకు
మ్రొక్కుచునుంటే
చిత్తము చెడిపోను
ఒకే ఒకే!

చిత్తమునందున
చిన్మయరూపుని
చూచుచునుండుట
సకే సకే!

ఒక్కపొద్దులని
యెండుచునుంటే
ఒకరుగ చెడుదువు
ఒకే ఒకే!

ఏకమైనయా
వైభవమూర్తిని

చూచుచునుండుట
సరే సరే!

నీళ్ళలో మునిగి
గొణుగుచుయుంటే
నిలకడ చెడునుర
ఒరే ఒరే!

నీళ్ళలోవుండే
నిర్మలజ్యోతిని
చూచుచునుండుట
సరే సరే!

బాధగురువుల
పంచనుచేరితే
భావము చెడునుర
ఒరే ఒరే!

భావమందునా
బ్రహ్మశాంతినీ
చూచుచునుండుట
సరే సరే!

భూములు అడవులు
తిరుగుచునుంటే
బుద్ధులు చెడునుర
ఒరే ఒరే!

బుద్ధిలోవుండే
పున్నమచంద్రుని
చూచుచునుండుట
సరే సరే!

ఈ పాట తత్త్వప్రధానమైనది - ఆడవాళ్ళు పాడేది :

నూరిపోసే మందుకాదు
నూరువరహాలిస్తెరాదు
కరుణాగురుని కరుణచేతను
ఘడియలో కడతేరెమందు ||నూ||

కనలేరు, కొనలేరు, తినలేరు
యీ మందుకనుగొని తిన్నవారికి
ఘడియలో కడతేరెమందు ||నూ||

అక్కలూ చెల్లెండ్రు గురువును
అందరూ భావించు
మందు పెక్కుగలరు
తిన్నవారికి తక్కువేమిం
లేదు మందు ||నూ||

జ్ఞాన ముక్తి విరాగములను
పానము సరియించుమందు
తాను నేనని వాదబేధము
కలడం బందించెమందు ||నూ||

ఎరుక మరుపు లేనిపక్షము
ఎప్పుడుం సదికేళిమందు

తిరిగి జనన మరణ మనియేటి
తరణము తపించుమందు ॥నూ॥

అందుయిందు సందులేకను
అందమైనది ఈ మందు
నందశైలాద్రి నివాసుని
నమ్మితే కడతేరుమంగా ॥నూ॥

ఈ తత్త్వమును వినండి. 'చందమామ' పరంగా సాగింది.

చందమామ చందమామ చందమామ
ఈ సంధి తెలిపే జ్ఞానులెవరే ,,
జంటనాగస్వరములూది ,,
పాముని పాదు పెకలించాలి ,,
తొమ్మిది వాకిళ్ళుమూసి ,,
పాముని పట్టవలెను ,,
కాయమనే పుట్టలోను ,,
మాయగానె మెలగియుండు ,,
భక్తియనే కట్టుకట్టి ,,
యుక్తిచేత పట్టవలెను ,,
దేహిదేహములసందు ,,
తెలియకుండ చుట్టుకొంది ,,
ఆ జపమంత్ర ధ్యానముచేత ,,
అఖండకళలతో వెలుగుచుండు ,,
పాముపట్టే యోగి ఎవరె ,,
అతనిపేరే సిద్ధగురుడె ,,

ఈ పాట - తత్త్వమే కలికాల మహిమను గురించి చెబుతూన్నది:

నీరు పోసిన చెట్టు
నిర్మూలమౌతుంది!
పడిన చెట్టు
ప్రబలానికొస్తాది!
యుగము జగము
తల్లడిల్లుతాయిరా!
చిత్రాట లాడేరు
శివపూజ మరచేరు!
చింతగుంటాజోరు
లమ్మ్యారురా!

మీసాలు లేనోడు
దేశాము లేలాడు!
దేశమెల్లా ఒక్క
కరువు వచ్చిందిరా!
తాటిచెట్టుమీద
తాబేలు పుడతాది!
తల్లక్రిందులకాల
మొచ్చిందిరా!

ఆరేళ్ళవానికి
మూడూండ్లవాడైన
అరువుచెప్పేకాల
మొచ్చిందిరా!

చేతికిచ్చిన రూక
ఎగవేసి దిగమ్రింగి
బాయాడి బాసలు
చేస్తారురా!
రాచూరుదగ్గరా
రాతిబస వున్నాడు!
రంకెలేసే కాల
మొస్తుందిరా!

ఈకాలమొచ్చింది
దురుకాలమొస్తుంది!
దుష్టులకెల్లనూ
దుర్బుద్ధి పుడతాది!
అత్తలకు సేలలు
కోడలకు మంచాలు!
కొడుకు తల్లినికొట్టు
కాల మొస్తుందిరా!

ఆలు చెప్పినమాట
అరటిపండౌతాది!
తల్లి చెప్పినమాట
త్రాచుపాపౌతాది!

బాగానే చెప్పాడు - కలికాలంలో జరుగుతూన్న సత్యాన్ని.

ఇది 'దూదేకుల సిద్ధయ్య'గారి తత్త్వం! చూడండి - ఎంత చక్కని సందేశం యిస్తున్నారో! కులంను గురించి ఎంత బాగా చెబుతున్నారో పఠించండి.

కులం, గోత్రం, జాతి - వీటిని నమ్ముకుని మోసగించుకోని, విసిగి వేసారే - లోకులూ, కాకులూ అడిగే ప్రశ్నలకు సమాధానం ఏమిటి? వినండి సిద్ధప్పగారి సమాధానం :

"ఏ కులమని నను
వివరమడిగితే
ఏమని దెల్పుదు
లోకులకూ!
లోకులకూ
పలుగాకులకూ!
దుర్మార్గులకూ
ఈ దుష్టులకూ!

పాలభాగమున
ఏలలు బాడుచు
భావముకన్నది
నా కులము!

ఇంటిలోపలను
ఇల్లుగట్టుకొని
మంటలోపల
రాట్నం పెట్టుకు

కంటిలోపల
కదురుపెట్టుకు
ముక్కులోపల
యేకు పెట్టుకు
చెవులో బారా
చేతికిదీసుకు
నారాయణయను
వరము తీసుకుని
అష్టాక్షరియను
తడిక వేసుకొని
పంచాక్షరియను
పంచదీసుకొని
తధిమి తధిమి
గబదెబ గబదెబ
ఏకినకులమె
మా కులము!

ఏకిన ఏకులు
పేకిన పిండెలు
లోకమంత నొక
పాకము చేసుకు
ఏకినకులమే
మాకులము!

68)

రొమ్మున లక్ష్మి
చీరగట్టుకొని
చక్కగ సిరి
పావడ దొడిగి
ఆనందమైన
వీరబ్రహ్మ
శాల్వ కప్పుకొని
నిండియున్నదే
నా కులము!
ఒంటరిగాదె
నా కులము!

ఏకులమని నను
వివరమడిగితే
యేమని దెల్పుదు
లోకులకూ?

తత్వాలలో ఓ గంటపాటు గడిపాము – మనలో మన మాట – జీవితంమీద రోత, జాతకంమీద అసంతృప్తి, భవిష్యత్తుమీద నిరుత్సాహం, సంసారంఅంటే వెగటు, ఆ! ఏముందిలేఅన్న విసుపు!

అలాఅనిపించికొంచంఆలోచన కేసి పరుగెత్తిస్తుందిమన సుని-తత్వాలలోవున్న ప్రబోధాల మహత్తు అటువంటిది! మరెన్నితత్త్వాలు యింకాదాగివున్న యోకదా ఈస్రవంతిలో!!



# మంగళం

## 19

అది మహాస్రవంతి, ఆ స్రవంతిలో నురగలతో వెండిలా వచ్చే తరంగాలలో - ఎంత నిండుతనం - ఆ నిండుతనంలో ఎంత గడుసుతనం - ఎంత లోతు, ఎన్ని ఊహలు, మరెన్ని ఆశయాలు, అనుభూతులు, సందేశాలు - సందోహాలు - సంతోషాలు!

ఈ జానపద వాఙ్మయస్రవంతిని ఎంతగా చూడదలచుకున్నా ఆ గభీరత కేసి అలా చూస్తూ - ఆఁ! ఎంత నిండుతనం అన్న ఊహాజగత్తులో నిలబడి పోతాము!

ఒక విషయమా, రెండు విషయాలా! జీవితం అంటే ఏమిటో అక్షరాలలో పాటల మాటల గుత్తులలో ఇమిడి ఘోషిస్తుంది.

ఉలిక్కిపడ్డ కోడి కొక్కొరోకో అనడం తడవుగా మేల్కొంటుంది లోకం - చిరుగంటల లేగల 'అంబా' అనే అరవులు, రైతు, కూలిజనం పనిపాటలకోసం ఉరుకులు- మేలుకొలుపులు!

అలా అలా గంటలు - కాలం, సూర్యోదయం, ఎండలు, వర్షాలు, గాలులు, షాలాలు, మిల్లులు, గృహాలు, పెద్దలు, పిన్నలు, పాపలు, పనులు, పొలాలు, ఊహాలు, ఉత్సాహాలు - గంతులు!

మరెన్నో — సాయంసమయం పక్షుల కిలకిలా రవాలు, రేకులువిచ్చిన సన్నజాజులు, సంపెంగలు, మల్లెల పడుచుతనపు కోర్కెల సువాసనధూపంలో గుబాళింపులు!

సూర్యునికి విశ్రాంతిసమయం - కూలిజనం పాటల హోరులో ఇంటికి నడకలు, రెక్కలపక్షుల గూటికి ఎగురులు!

కోర్కెల కూనిరాగాలు, ప్రేమల పల్లవిగీతాలు, కొంటెతనపు సింగిరి గీతాలు - ఎంత గమ్మత్తు!

"ఉంగ"తో జీవితం ప్రారంభించి ఎన్నో మజిలీలు - మైలురాళ్ళని దాటుకుంటూ ప్రయాణం చేసి-పసితనం, బాల్యం యువకత్వం, యౌవ్వనం, సంసారం, బాధ్యతలు, పెద్దరికం; చుట్టూ కొడుకులు కోడళ్ళు, మనుమలు మునిమనుమలు, ఒడుగులూ పెళ్ళిళ్ళు, పేరంటాలు, నోములు వ్రతాలు, పూజలు పునస్కారాలు, గుడులు గోపురాలు, దేవుళ్ళ దయ్యాలు!

ప్రయాణంలో ఎన్నో అనుభవాలు- అనుభవాలకు ప్రతిరూపాలు జానపదగీతాలు-ప్రాచీన సంస్కృతీ విభాగాలకు భాండాగారాలు!!

ఏముంది జీవితం? అన్న ప్రశ్న! ఆ ప్రశ్నలో ప్రతి ధ్వనించే తత్వాలతో ఈ వాఙ్మయానికి మంగళం!

"మధురకవితలు" అని ఈ పుస్తకానికి నామకరణం చేసి - ఇందులో వరుసగా వివిధశీర్షికలలో ఆ యా పాటల లోని ఇంపుసొంపులను, విలువలను. భావాలను పరిచయం చేయడం జరిగింది.

ఎన్నో గేయాల, పదాల, సంకలనాలను పరిశీలన చేసి ముచ్చాలహారంగా - జానపదకవితల సమాహార గ్రంథంగా వెలువరించడానికి ప్రయత్నంచేశాను.

అందరూ సరదాగా - సునాయాసంగా చదువు కోవాలి - చదవాలి! ఇదే నా తాపత్రయం - అందుకే ఈ ప్రయత్నం!!

జయమంగళం

శుభమంగళం।



"మధుర కవితలు" రచనకు నాకు సహాకారమైన గ్రంథాలు, వ్యాసాలు ఇవి:

బసవపురాణము: పాల్కురికి సోమనాథుడు.

పండితారాధ్య చరిత్ర : ,,

తిరస్కృతాంధ్ర వాఙ్మయము : పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి.

బాలభాష - వ్యాసాలు: వేటూరి ప్రభాకరశాస్త్రి.

ద్విపదభారతం : కొమ్మనమంచి జోగయ్యశర్మ.

తెలుగుజానపద వాఙ్మయము: బి. రామరాజు.

యక్షగానాలు : యస్వి. జోగారావు.

జంగం కథాతత్వం : ఉకుమళ్ళ కామేశ్వరరావు.

స్త్రీలపాటలు : జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి.

యేలలు : నిడదవోలు వేంకటరావు.

దేశి సారస్వతరీతులు కోరాడ రామకృష్ణయ్య.

| | |
|---|---|
| ప్రజావాఙ్మయము : | చింతా దీక్షితులు. |
| ఆంధ్రుల సాంఘికచరిత్ర : | సురవరం ప్రతాపరెడ్డి. |
| కవిత్వ తత్త్వవివేచన | విద్వాన్ విశ్వం. |
| కవిత్వం-వీధినాటకాలు- | 'పరిశోధన' పత్రిక. |
| జాను తెనుగు : | వడ్లమూడి గోపాలకృష్ణయ్య. |
| వీధినాటకములు : | తిరుమల రామచంద్ర. |
| సలహాలు : | గొడవర్తి శ్రీరామమూర్తి |

పై గ్రంథ రచయితలకు, వ్యాసకర్తలకు నా వందనాలు.



